





# మహిళలు

## జీవిత చరిత్ర,ధర్మాలు

# అబలా సచ్చరిత్ర రత్నమాల- 1 , 2





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# అబలాసచ్చరిత్రరత్నమాల

ప్రథమ సంపుటము

శ్రీమతి భండారు అచ్చమాంబ ప్రణీతము

ఎస్. వి. కృష్ణ & కో వారిచే

ప్రకటితము

౧౯౧౩



వెల ౧-౦-౦

# విషయసూచిక







# ఛాయా పటములు

భండారు - అచ్చమాంబ

అహల్యాబాయి హోళకరు

రఖమాబాయి కేళోకర్

తోరుదత్తు

భగవతీ దేవి

# ప్రకాశకుల పీఠిక

ఈ గ్రంథపు మూడవ కూర్పును ఆంధ్రలోకమునకు సమర్పించు భాగ్యము మా కబ్బినందులకు మేమెంతయుసంతసించుచున్నాము. రెండుకూర్పుల ప్రతులు బహుకాలముక్రిందటనే కర్చు డుటచేత చదువరులకీ పొత్తము దొరకుటయే దుర్లభమైయుండినది. అట్లగుట మేమొక తడవ ఈ విషయమై మామిత్రులగు శ్రీ గుత్తి లక్ష్మణరావు ఎం. ఏ. గారితో ప్రసంగింప వారు దయామ సుత్తి ఈ మూడవకూర్పును ముద్రించుకొన మాకనుజ్ఞ ఇచ్చిరి. వారికి మేమెంతయు కృతజ్ఞులము.

గ్రంథకర్త్రిగారు మూడుభాగములుగ నీగ్రంథమును వ్రాయందలంచి ఐతిహాసికస్త్రీలచరిత్రములను మొదటిభాగమున వ్రాసి ముగించిరి. రెండవభాగమున వైదిక, పౌరాణిక, బౌద్ధస్త్రీల చరిత్రముల వ్రాయనుద్యమించి కొంతవ్రాసి సావిత్రీ పత్రికాముఖమున వెలువరచిరి. కాని తాము పూనిన పనిని సంపూర్తిచేయుటకు దైవమువారికి నాయువులియ్యకపోయె. అందుచే వారిరెండవభాగము అసమగ్రముగనున్నది. ఈయసమగ్ర భాగమును, తాము వ్రాసిన భండారు అచ్చమాంబగారి జీవితచరిత్రమును మాప్రచురణమున ప్రకటించుకొనుటకు శ్రీమతి పులుగుర్తి లక్ష్మీనరసమాంబగారు మిక్కిలి దయతో ననుమతి నిచ్చియున్నారు. వారికి మాహృదయపూర్వక నమస్కృతులనర్పించుచున్నాము.

కుసుమంబోవుచు కూరారు రుచియడుగనేల ? ఈ సుప్రసిద్ధగ్రంథమును జదువరుల ముందిడితిమి. చదివి యానంద మనుభవించుటవారిపని. గ్రంథగుణములు మా చెప్పిడి మాటలతో వర్ణించుచుండుట చదువరుల కాలమ్మును వ్యర్థపుచ్చుటయగు కాదే?

ఛాయా పటములను సంపాదించుట మిక్కిలి కష్టతమ మైనది. మా ప్రార్థన నంగీకరించి తమతల్లి శ్రీమతి సౌభాగ్యవతి రఖమాబాయి కేళ్కర్ గారి ఛాయాపటము నిప్పించిన శ్రీమతి సౌభాగ్యవతి కమలాకర్ గారికిని, గ్రంథకర్త్రిగారి కునూ బంపిన ఆంధ్రపత్రిక కాధికృతులగు శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుగారికిని మా కృతజ్ఞతా వందనముల నందించుచున్నాము. ఈ రత్నమాల రెండవ సంపుటము ముద్రణమగుచున్నది. గ్రంథకర్త్రిగారి సదుద్దేశ్యమును సాధ్యమైనంతవఱకు నెఱవేర్పదలంచి వారనుగ్రహముగా రచించిన రెండవ భాగమును పూర్తి జేయించి ముద్రింప నున్నాము. కాన భాషాభిమానులను ముఖ్యముగా స్త్రీ విద్యాభిమానులను మాకు దగినంత ప్రోత్సాహ మియ్యంబరిపరిప్రార్థితులు.

చింతాద్రిపేట,
౧- -౧౩

ఇట్లు,
ప్రకాశకులు.

# పీఠిక

ప్రపంచమునందలి జనులకుఁ బరమేశ్వరుఁడు సదా మేలే కలుగఁ జేయు ననియు, అట్లయినను నొకప్పు డతఁడు సేయు మేలు మనకు దుఃఖ రూపముగాఁ గానుపించుటవలన మన మాదయానిధిని నిష్కరుణుఁడని నిందించెద మనియు, నట్లు నిందించుట మిక్కిలి యజ్ఞానమనియుఁ, దత్త్వము విచారించినయెడల నదియు మనకు మేలని తోఁచుననియు, సుజ్ఞులు చెప్పెదరు. ప్రస్తుత మీగ్రంథరచనకుఁ గలిగినకారణమువలనను నీసంగతియే నిజమని తేలుచున్నది. నాకు దైవవశంబునఁ బుత్రపుత్రికాశోకము సంభవించె అందువలన నేను సంతానహీననై గడువ దుర్ఘటమగు సంతానదుఃఖములో నుండఁగా నొకనాఁడు నాసహోదరుఁ డొకప్రసంగవశమున విఖ్యాతవైయాకరణకేసరియగు నాగోజీభట్టకృతమగు నీక్రింది శ్లోకమును జదివెను.—

"శబ్దేందుశేఖరః పుత్రో మంజూషా మమకన్యకా."

'శబ్దేందుశేఖర' మనుగ్రంథము నాపుత్రుఁడును, 'మంజూష' యను గ్రంథము నాపుత్రికయు నని యీశ్లోకమునకు నర్థము. నాగోజీభట్టునకును బుత్రపుత్రికా వియోగము సంభవింపఁగా నశ్వరదేహధారులగు పుత్రపుత్రికలు పోయినను దద్గ్రంథరూపమయిన పుత్రపుత్రికలు శాశ్వతముగా నుందురని యావిద్వాంసుఁడు మనస్సమాధానము చేసికొనియెను. ఈశ్లోకార్థము వినినప్పటినుండియు గ్రంథరచన చేయవలయునని యిచ్ఛ నాకుఁ గలిగెను. నాగోజీభట్టుగారికిఁగల విద్యలో లక్షాంశమైనను నాకు లేకపోయినను గ్రంథములవలనఁ వారికిఁ గలిగిన మనస్సమాధానమే నాకుఁ గలుగ వలయునని పిచ్చియిచ్ఛఁ గలదాననై యీగ్రంథమును దిన్నతిన్నఁగా వ్రాయఁదొడఁగితిని. అందువలన నాదుఃఖము కొంతతగ్గి నాప్రయత్నము బాలాసచ్చరిత్రరత్నమాలా రూపముగాఁ బ్రతిఫలించినది. ఇందువలన నేను సంతానహీననుగాక సంతానవతినే యైతినని కొంత సంతసించుచున్నదాన.

అబలాసచ్చరిత్రరత్నమాలయొక్క యీప్రథమభాగమున నైతిహాసిక* (చరిత్రకాలపు) హిందూసుందరులయొక్క చరిత్రములు వ్రాయఁబడియున్నవి. కాశ్మీరు, పంజాబు, రాజపుతానా, గుజరాత్, బంగాళా, మహారాష్ట్రదేశము, ఆంధ్రదేశము మొదలయిన హిందూదేశాంతర్గతములయిన సకలదేశముల చరిత్రమును శోధించి సాధ్యమైనంతవఱకు హిందూదేశముయొక్క ప్రతిభాగములోని పూఁబోండ్ల సచ్చరిత్రంబులిందు గ్రుచ్చ యత్నించినాను. అయినను నాయజ్ఞానమువలన ననేక హిందూసతుల చరిత్రంబులిందు రాకయుండవచ్చును అటుల నిందురాని యేసతీచరితంబైన నున్నయెడల నది యెవరైన నాకుఁ దెలిపిన దానిఁ గృతజ్ఞతాపూర్వకముగా నందుకొని యీగ్రంథముయొక్క రెండవకూర్పునందుఁ జేర్పఁగలను.

ఈగ్రంథమును వ్రాయుటలో నాకుఁగల యుద్దేశముల నుపోద్ఘాతములో వివరించినందున మరల నిచట పునర్వివరణము సేయనొల్ల.

ఈగ్రంథమును వ్రాయుటకు హిందీభాష, మహారాష్ట్రభాషలలోని గ్రంథంబులే ముఖ్యాధారములని మొదలనే వ్రాసియుంటిని. మహారాష్ట్రభాషయందలి ప్రాతబఖరీలును, నితిహాసములును, చరిత్రగ్రంథములును, అనేక మాసపత్రికలును, వారపత్రికలును కొన్ని యితరపుస్తకములును నీగ్రంథరచనకు మూలాధారము లయ్యెను. కుమారీ [illegible] మొదలగువారి చరిత్రములకు హిందీభాషయందలి 'భారతభగిని' యను మాసపత్రికయును, ధనలక్ష్మి మొదలగువారి చరిత్రమునకు 'సతీమండల' మను గుజరాతీగ్రంథమును భవానీదేవి చరిత్రమునకు 'నారీరత్నమాల' యను బంగాళీగ్రంథమును, రుద్రమదేవి చరిత్రమునకు 'ఏకశిలానగరవృత్తాంతము' మొదలగు తెలుఁగువ్రాఁత గ్రంథములును, మొల్ల మొదలగువారి చరిత్రములకు 'ఆంధ్రకవులచరిత్రము' మరికొన్నిసమయములలో 'సతీహితబోధిని' 'జనానాపత్రిక' యను నాకుఁ గాల

---

* ఉపోద్ఘాతంబులో 'నైతిహాసికకాల మనఁగా వేయిసంవత్సరములనుండి నేఁటివఱకు జరిగినకాల' మని వ్రాసితిని కాని యదనంతరము క్రీస్తు శకమునకు మూఁడు నాలుగువందలసంవత్సరముల పూర్వపువారగు బౌద్ధస్త్రీల చరిత్రములు సహితము దొరకెను. కావున నైతిహాసిక కాలమనఁగా దేశముయొక్క విశ్వసనీయచరిత్రము మన కెన్నిసంవత్సరముల క్రిందటినుండి దొరకునో అప్పటినుండి వచ్చుకాలమని తెలిసికొనవలయును.

సహాయంబులయ్యెను. కాన నే నాగ్రంథకర్తల కందఱకును కృతజ్ఞతాపూర్వకముగా ననేకవందనములు చేయుచున్నాను. నాకు నింగ్లీషు రాకపోయినను మహారాష్ట్రభాషలో నింగ్లీషునందలి యుత్తమోత్తమగ్రంథములు భాషాంతరీకరింపఁబడినందువలన వాని సహాయముచే నింగ్లీషులోని యనేకకల్పనలను నేను గ్రహించితిని. స్వభాషాభివృద్ధియందు మహారాష్ట్రులు మహాదక్షులైయున్నారు. మిల్లు, స్పెన్సరు, లబకు మొదలయిన యింగ్లీషు గ్రంథకారులందఱును మహారాష్ట్రపుస్తులలో నగుపడుచున్నారు. ఇది యాంధ్రులకే నెంతయు ననుకరణీయము. ఇట్లు ఇంగ్లీషు నేర్చుకొను పరిశ్రమలేకయే యింగ్లీషుభాషలోని యుత్తమగ్రంథముల జ్ఞానము నాకొసంగి యీగ్రంథము వ్రాయుటకు నన్ను సమర్థను జేసినందుకు విశేషముగా మహారాష్ట్రభాషను గొనియాడవలయును

ఈగ్రంథము వ్రాయుటకు నాకుఁ బ్రత్యక్షపరోక్షసహాయము చేసినవారిలోఁ బ్రప్రథమమున నాభర్తగారిని చెప్పవలయును. ఏలయన వారు స్త్రీవిద్యాభిమానులై యుండకుండినయెడల, నీచరిత్రగ్రంథము వ్రాయుటకు నన్నుఁ బ్రోత్సాహపఱచి స్వాతంత్ర్యమొసఁగి యుండనియెడల, నీగ్రంథమే నిర్మాణమయి యుండకపోవునుగదా? నాకు సహాయముచేసినవారిలో రెండవవాఁడు నాతమ్ముఁడును కె. వి. లక్ష్మణరావు ఎం. ఏ. మహారాష్ట్రమున పిలువఁబడు కొమర్రాజు లక్ష్మణరావుగారు ఎం.ఏ. ప్రప్రథమమున నన్నుగ్రంథము వ్రాయుటకుఁ బురికొల్పినది యీతఁడే. ఈతఁడు చరిత్రములు వ్రాయుపద్ధతి నాకు నేర్పుచుండుటకుఁ గావలసినసాధనములను సేకరించి నాకిచ్చి, ఆంగ్లేయభాషయందును సంస్కృతభాషయందునుగల కొన్ని చరిత్రములను మహారాష్ట్రభాషలో భాషాంతరీకరించి నాకు ననేకరీతులఁ దోడుపడియెను. ఇట్టిభ్రాతను బుట్టించిన నాకొసంగిన కాపరమేశ్వరుని ననేకవిధముల స్తుతియించి వారికిని వారికిను పూర్ణాయువును, యశమును దయచేయుమని [illegible] సిధని నెల్లప్పుడుఁ బ్రార్థించుచున్నాను. ఇట్లే మనదేశమునందలి స్త్రీలందఱకును వారివారి పతులును, వారివారి సహోదరులును సహాయులగుచుండినచో మనదేశము శీఘ్రకాలములోనే స్త్రీవిద్యాభివృద్ధి గలదయి మరల గార్గి, మైత్రేయి మొదలయిన బ్రహ్మవాదినులను అహల్యాబాయి, భవాని మొదలయిన రాజ్యధురంధరలను గారికా, మొల్లలవంటి కవయిత్రులను జిజాబాయి, ఖడ్గతిక్కనతల్లి భార్యలవంటి శూరమాతలను బత్నులను గలదియై

సర్వదేశములవారికిని బూర్వకాలమునలెనే మనదేశము వందనీయము గాఁ గలదనుటకు సందియము లేదు.

అల్పబుద్ధినగు నాచే రచియింపఁబడిన యీగ్రంథమును దిరస్కరింపక మ-రా-రా-రావుబహద్దరు కందుకూరివీరేశలింగము పంతులవారు తమ 'చింతామణి' పత్రికలో బ్రచురించినందుకు వారికిఁ గృతజ్ఞతాపూర్వకముగా వందనము లాచరించెదను.

" ఈపీఠిక ముగించుటకుఁ బూర్వము ప్రస్తుత మీయార్యావర్తంబునఁ దమగ్రంథరచనచే స్త్రీవిద్యాభివృద్ధికిఁ దగుసాధనంబులఁ గల్పించుచున్న సోదరీమణు లందఱిని నభినందించుట యావశ్యకము. ఈవిద్వత్ స్త్రీలందఱును సంవత్సరమున కొక్కసారి యొకచోటఁగూడి యావిదుషీపరిషదమునందు స్త్రీ విద్యాభ్యుదయములను గుఱించి ముచ్చటించినయెడల నఖిల స్త్రీజాతికి నమితలాభము గలుగఁగలదు. కాని యిట్టివిదుషీపరిషద మేర్పడు లక్షణంబు లేమియుఁ బ్రస్తుతము లేనందున నీస్త్రీలలో నొక్కరికొక్కరి నామధేయంబులైనఁ దెలిసియుండిన నది స్నేహంబునకుఁ గారణంబగునని తలఁచి వారి నామంబులను, రచితగ్రంథంబుల సంగ్రహావర్ణనమును నిందుఁ బొందుపఱిచెద —

ఉత్తరహిందూదేశమునందు:—౧. శ్రీమతిహారదేవియను నామె 'భారత భగిని' యనుపత్రికను స్త్రీలకొఱకు హిందీభాషలో మాసమున కొకసారి ప్రచురపఱచుచున్నది. ఈమె నివాసస్థలము పూర్వము అలహాబాదు (ప్రయాగ) అయినను ప్రస్తుత మీమె లాహోరులోనుండును. ఈమె తనకు లాభమెంతమాత్రమును లేకపోయినను సఖుల హితమునకయి యీపత్రికారత్నంబును పండ్రెండుసంవత్సరములనుండి విడువక నడుపుచున్నది.

బంగాలీదేశమునందు:—౧ శ్రీమతి సరళాదేవి బి.,ఏ. గారు —'భారతి' యను బంగాలీ మాసపత్రికకుఁ గర్త్రులు. ఈమె పట్టపరీక్షలోనం దేరి నూఱు పుటలుగల యీమాసపత్రికను గడువుతప్పక ప్రకటించుచున్నది. ఇంత పెద్దమాసపత్రిక గ్రమముతప్పక అచ్చువేసి విద్వాంసులందఱుఁ జూచి 'అబ్బబ్బా! బళిబళి!' యనఁ బ్రచురపఱచుచున్న యీవిద్వాంసురాలిని నెంతయుఁ గొనియాడవలసి యున్నది.

మహారాష్ట్రదేశమునందు:—౧ పండితరమాబాయి:— ఈసరస్వతీ బిరు

ఖ్యాత ప్రఖ్యాతయే. ఈమెవిద్యలు గాంచి నవద్వీపస్థ లీమెకు
పండిత 'సరస్వతి' యను పదవులనిచ్చిరి. ఈమె సంస్కృతమున నొకకా
వ్యము రచియించెను. మహారాష్ట్రమున 'స్త్రీధర్మనీతి' 'అమెరికాదేశ ప్రవా
సము' అను గ్రంథముల రచియించెను. ఇందుఁ బ్రథమగ్రంథము గృహిణుల
కత్యంతావశ్యకము; రెండవగ్రంథములో అమెరికాదేశములోని స్త్రీలయభి
వృద్ధి యనినభాగ మత్యంతాహ్లాదకరంబుగా నున్నది.

౨. కాశీబాయి కానిట్కరను నామె యైగువందల పుటలుగల
ఆనందీబాయి చరిత్రమును మహారాష్ట్రభాషయందు విస్తృతముగా వ్రాసినది.
ఈచరిత్రను గొప్పగొప్ప విద్వాంసులును వేయినోళ్ళఁ గొనియాడియున్నారు.
ఈమెయే 'రంగరావ'ను వచనప్రబంధము నొకదానిని వ్రాసెను. ఈప్రబం
ధము సహితము పండితులచేత మెప్పొందినదియే. ప్రస్తుతమీమె 'వెన్నెల
లోని ముచ్చటలు' అను రమ్యకథలను 'వివిధజ్ఞానవిస్తార' మను మాసపత్రికలో
వ్రాయుచున్నది.

౩. శ్రీమతి రుక్మిణీబాయి సంవార్కర్:—ఈయువతి మహారాష్ట్రభా
షలో స్త్రీలకత్యంతావశ్యకమైన యల్లిక పనినిగుఱించిన పుస్తకము సుంద
రములగు పటములతో రచించెను. ఈగ్రంథమువలన ననేక స్త్రీలు
గురువులేకయే గలబందులను, సాయితాబాలును, టోపీలను, రుమాళ్లు
మొదలగునవి యల్లుటలో సులభముగా నేర్చికొని యల్లుచున్నారు.

౪. శ్రీమతి జానకీబాయి:—ఈమె కరుంధువాడ సంస్థానా
ధీశ్వరుని భార్య. మహారాష్ట్రమునందు బహుసరసవంతముగాఁ గవిత్వము
జెప్పెను. ఈమె కవిత్వము భక్తిరసపూర్ణముగాను, యమకాదిశబ్దాలంకార
భూయిష్ఠముగాను నుండి, మహారాష్ట్ర కవులలోనగు మోరోపంతు కవి
త్వముతో సమానముగా నుండును.

మహారాంధ్రదేశంబున:—౧. శ్రీమతి పులుగుర్త లక్ష్మీనృసింహాంబగారు
మహిళాకళాబోధిని యను కావ్యంబు రచియించినారు. ఇక్కావ్యంబు
నందు విద్యామహిమ బహురమ్యముగా వర్ణింపఁబడియున్నది. ఈగ్రంథము
ముద్రితముగాఁ బంపినందుకు వారికి వందనంబు నాచరించుచున్నాను.

౨. శ్రీమతి కోటికలపూడి సీతమ్మగారు:—ఈమె లేడీజేన్ గ్రేయను
నాంగ్లస్త్రీ చరిత్రమును బద్యకావ్యముగా రచియించెను. ఇయ్యది ద్రాక్షా
పాకమునం దగియున్నది. ఈకవయిత్రి హిందూదేశమునందలి నారీరత్నము

లలో నొక స్త్రీనిఁ గావ్యనాయికగాఁ దీసికొని కావ్యము రచియించినఁ
యెడల నదిహిందువులకు విశేషప్రియమగునని నాయభిప్రాయము.

3. కమలా సత్యనాథన్:— ఈమె పట్టపరీక్షలోఁ దేఱి మిగుల విద్యా
వతియని పేరొందె. ఈవిదుషి చెన్నపట్టణములోనుండి యింగ్లీషుపత్రికలలో
శకుంతల మొదలయిన హిందూసుందరుల చరిత్రంబులు వ్రాయుచుండును
కాని వానిం జదువునంత యింగ్లీషుభాషాజ్ఞానము నాకు లేనందున వానిఁ
గుఱించి యధికము వ్రాయఁజాల.

౪. గుండు అచ్చమాంబగారు:— శ్రీకాళహస్తీశ్వర కల్యాణోత్సవము,
గౌరీశంకరపూజావిధానము, శ్రీరామేశ్వరయాత్రాచరిత్ర యను గ్రంథములఁ
నీమె వ్రాసెను. ఈమె గ్రంథములోని శబ్దసౌష్టవము, స్వభావోక్తులు, భక్తి
రసము వర్ణనీయములు.

గ్రంథకర్తృత్వముగల యువతు లింకను ననేకు లీహిందూదేశంబునం
దచ్చటచ్చట నుండవచ్చునుగాని వారియందఱి నామము లిచ్చట నుడువనం
దుకుఁ గారణంబు నాయజ్ఞానమే కాని వారియప్రసిద్ధి కాదు.

ఈభాగమునందలి స్త్రీలపటములు సంపాదించుటకుఁ జాలప్రయత్నము
చేసితిని. కాని వారిలో ననేకులపటములే వ్రాయఁబడనందునను, కొందఱి
కాలమున పటములు వ్రాయు నాచారమే లేనందునను నాయిచ్ఛపూర్తిగా
నెఱవేఱినది కాదు. కాని నాయదృష్టవశమునఁ గొన్ని పటములు మాత్రము దొర
కినవి. కాన వాని నీపుస్తకములోఁ జదువరుల కిచ్చుటకుఁ గొంత సంతసింపు
చున్నదాన.

పచమఱి.
మధ్యపరగణాలు.
౨౭ - ౨ - ౧౯౦౧.

భండారు - అచ్చమాంబ.





భండారు అచ్చమాంబ

(ఈ పటమునకుఁ గావలసిన దిమ్మ నంపిన 'హిందూసుందరీ' పత్రికాధిపతు లెడ మే మెంతయుఁ గృతజ్ఞులము.)

శ్రీమతి, భండారు

# అచ్చమాంబగారి జీవితచరిత్ర*

---

పగలుకడుఁ నభోమణి, కపాలిశిరోమణి రే, జగంబుఁదా
రగపడునంతకుఁ వెలుఁగు నట్లుగఁ జేయుదురంతెకాని యీ
జగతికిమాటు జెందియు నజస్రము నప్రతిమాన తేజముఁ
దగఁగలిగింతురిట్టి వనితామణు లేకద! దైవసృష్టిలోఁ!!

అప్రతీకాశపాతివ్రత్యము, ఉదాత్తవైదుష్యము, అనుపమానస్వదేశ ప్రీతి, అనిర్వచనీయస్వజాత్యభిమానము, అనూనదీనవత్సలత, నిర్ణిద్ర సత్కార్యాచరణము, నిరంతర సచ్చింత, అసమాన క్షమ, మున్నుఁగాఁగల సుగుణ గణంబు లొకటికిమించి యొకటి తనయందు వాసముచేయుచుండ హిందూ దేశమునకు నాయికమణియన విరాజిల్లిన యీపరవర్తినీమణిచరితం బనుకరణీయంబును, ఆహ్లాద దాయకంబునునై యొప్పుచున్నది.

మహారాజ్ఞులు, పతివ్రతాతిలకములు, శూరనాయికామణులు విదుషీరత్నములు, పరిశుద్ధప్రవర్తనలు, స్వదేశాభిమానమాననీయలు, మొదలగు ననేక సతీరత్నముల సచ్చరిత్రములు బుధజన సంస్తవనీయంబులుగా విరచించి మించిన యీవిదుషీమణి చరితం బెంతటి మాహాత్మ్య సంభృతంబుగాక పోవును!

కృష్ణామండలములోని మునగాల సంస్థానమునకుఁ గ్రీ. శ. 1880 సం॥ ప్రాంతములవఱకు దివాన్‌గిరీచేసిన ఆర్వేల నియోగివంశజులగు కొమఱ్ఱాజు వేంకటప్పయ్య పంతులుగారు శ్రీమతి అచ్చమాంబగారి జనకులు. ఈమహానీయుండు కేవలాధికారైశ్వర్యములచేత నేకాక పరోపకారపరాయణత, క్షమ, గాంభీర్యము, బుద్ధికౌశలము, మున్నగు గుణగణములచే మిక్కిలి సత్కీర్తిఁగాంచెను. ఆధ్యాత్మిక విషయజ్ఞుఁడు, సాధ్వీగుణభాసితయునగు గంగమాంబయను విజ్ఞానవతి యీయన సహధర్మచారిణి. గుణనిధియగు నీమిథున

---

* శ్రీమతి సా. పులుగుర్తి. లక్ష్మీనరసమాంబగారిచేఁ బ్రకటింపఁబడు సావిత్రీ, పత్త్రికనుండి స్వీకరింపఁబడినది.

మునకు సముద్రునకు లక్ష్మీకళానిధులవలెఁ క్రీ. శ. 1874 సం॥ న
కుమారీమణియు, నాపిమ్మట నొక కుమారరత్నము నుదయించిరి. ఈయిరువుర
లో నగ్రజయే మన యచ్చమాంబగారు. అచ్చమాంబగారి జన్మస్థానము మాత్ర
ము మన దేశాచారము ననుసరించి ఆమెతల్లి పుట్టినింటివారప్పుడు వాసము
చేయుచున్న నందిగామయయ్యెను. ఈనందిగామయను గ్రామము కృష్ణా
మండలములోనిదే. ఈమె మాతామహుల నివాసస్థల మూతాలూకాలోని కం
చెలయను గ్రామమైనప్పటికి నీమె మాతామహు లప్పుడచ్చటి జమీందారుల
పనిమీఁద నచ్చటనుండుట తటస్థించినందున నీమె జనన స్థలమదియయ్యెను.

మల్లెపువ్వు పుట్టినతోడనే వాసింప మొదలుపెట్టినయట్లు మన యచ్చ
మాంబగారు కడుబాల్యమునాటనుండియు మిక్కిలిగా క్షమాగుణంబు, అనుకర
ణాశక్తి దీనవత్సలత మున్నగాఁగల సుగుణసంఘంబులఁ బొడసూపుచుండెను. పె
ద్దవారు చేయుచుండెడు చాతుర్యములగు ననేకకార్యములను శ్రద్ధగా గ్రహిం
చుచుఁ జాకచక్యముతోఁ దానుగూడ నట్టి పెద్దపనులఁ జేయుటకీమె
బాల్యమందే ప్రయత్నించుచుండెడిదఁట. చెలులతో నాటలాడెడు వేళలం
దుఁగాని యితరసమయములయందుగాని సాధారణముగాఁ దన కెట్టిబాధ కలి
గను దాను లోలోన సహించుచునే యుండెడిదిగాని పెద్దవారితోఁ జెప్పి
బేలవడి వాపోవుట యీమె యెఱుఁగదు. ఇందుకొక చిన్న దృష్టాంతముఁ
జెప్పెదను. ఈమె యైదారు సంవత్సరముల పిల్లగానుండినప్పుడొక
నాఁడీమెను బెద్దతేలొకటి కుట్టెను. అనేకమంది పెద్దవారు సైతము
వృశ్చికస్పర్శ తగులఁగానే యోర్వఁజాలక గుట్టుచెడి రోదనముచేయుచుఁ
జుట్టుపట్టులవారిని బోగుచేతురుకదా! అట్టితేలు నొవ్వఁబొడిచినను నాబాలి
కాశిరోమణి కిమ్మనక యాబాధనంతను లోలోన నణఁచుకొనుచు వారు తమం
తవచ్చి తెలిసికొనునంతకు నింటిలోని పెద్దవారికైనను దెలియనీయకుండెను.
మఱియు నీమెకుఁ జిన్నతనమున నాటపాటలు మున్నగువానికిఁ దల్లిదండ్రాదు
లిచ్చుచుండెడి సొమ్ము తనస్వంతమునకుఁ గర్చుపెట్టక సదా దీనులకు బీదలకు
నిచ్చుచుండెడిదఁట. ఇత్యాది సుగుణపుంజము లీమెతోఁ జిన్ననాటనుండియు
వర్ధిల్లుచున్నవి. గనుకనే తనజీవితకాలమందీమె యనేక విద్యలయందారితేరి
గర్భశోకాదులకు సహించి దీనజనులను గన్నబిడ్డలట్లు గారవించుట మున్నగు
వానియందెంతయు ఘనతను బొందఁగల్గెను!

అచ్చమాంబగారి కాఱేండ్ల యీడువచ్చునప్పటికే అనఁగాఁ క్రీ. శ. 1880 సం॥న పితృవియోగ దుఃఖము తటస్థించెను. వేంకటప్పయ్యగారు మృతులైన పిదప గంగమాంబగారు తమకుమారితెను, కొమారుని వెంటఁబెట్టుకొని యప్పుడు నైజామురాజ్యములోని దేవరకొండయను గ్రామమున నుద్యోగము చేయుచున్న తన సవతికుమారుఁడగు శంకరరావుగారి యొద్దకేగెను. వీరచటనున్న కాలములో మధ్యపరగణాలలో నుద్యోగమందున్న గంగమాంబగారి అన్నగారగు భం. మాధవరావుగారికిఁ బ్రథమ కళత్రవియోగము కలుగఁగా శంకరరావుగారచ్చమాంబగారిని మాధవరావుగారి కిచ్చి వివాహము చేసిరి. అదిమొదలు తమయంత్యదశవఱకును అచ్చమాంబగారు మధ్యపరగణాలలోనే యుండిరి.

ఇదిమొదలీమె జీవితకాలమందలి ప్రతినిమిషమును దోడి సోదరీలోకమునకు సన్మార్గబోధకముగా నొప్పుచున్నదని చెప్పవచ్చును. భగవంతుఁడీమెను లోకమునకు సన్మార్గదీపికగా నుద్దేశించి సృజించెననుటకు సందేహము లేదు. "చిన్ననాఁడు మావాండ్రు నాకుఁ జదువు చెప్పింపలేదమ్మా! నాకిఁకఁ జదువెట్లావచ్చిన" నితలంచుచును కొందఱు వెఱ్ఱిసోదరీమణుల తలంపులు కాలుగారి పడి నాకీయూరచ్చిరాదనుకొనుటను బోలియుండునవి యని అచ్చమాంబగారు తన విద్యాభ్యాసముయొక్క యుదాహరణమువలన నిరూపించుచున్నది. అచ్చమాంబగారికి పదియేఁడుల యీడువచ్చి వివాహమై భర్తతో మధ్యపరగణాలకుఁ బోవువఱకును విద్యయననేమో తెలియదు. ఇదియే యీమె విద్యాభ్యాసమున కారంభ సమయము. ఇప్పుడైనను బడికిఁబోయిగాని, పెద్దవారింటి యొద్ద చెప్పించుటచేఁగాని విద్య నభ్యసించుట కాదు. చివరకిదెట్లు ఫలించినట్లు ఫలించునుగాని, మనవారు జ్ఞానసంపాదనమునకని కాకపోయిన నుదరపోషణార్థమని తలంచి యయిదేఁడుల యీడు వచ్చునప్పటికి మగపిల్లలకు మాత్రము శ్రద్ధగా విద్యాభ్యాసము చేయింపఁ బ్రారంభించెదరను నాచారమిప్పటికిని యున్నదిగదా! అచ్చమాంబగారి తమ్ముఁడగు లక్ష్మణరావుగారికి పెద్దలు శ్రద్ధగా విద్యాభ్యాసము చేయించుచుండిరి. తమ్ముఁడు చదువుకొనుచుండు సమయములందు అచ్చమాంబగారు తమ్మునియొద్దఁగూర్చుండి యాయనతోఁ దానుగూడ సహజాభిలాషతో విద్య నభ్యసింప మొదలుపెట్టెను. అప్పుడు తనతమ్ముఁడభ్యసించుచున్న తెలుగు, హిందీ, భాషలను తమ్మునితో సమానముగా నేర్చు

ము నంతకంతకుఁ దమ్ముఁడు చనువుపాఠముల నాతనికంటె ముందుగానే వల్లిం
చుచు నిట్లఖండమైన తెల్వితోఁ గొంతకాల మారెండు విద్యల నభ్యసించెను.
తదనంతరము లక్ష్మణరావు గారింగ్లీషుభాషాభ్యాసమునకై నాగపురమునకుఁ
బోవలసినవారైరి. తనకు విద్యాభ్యాసమునఁ దోడైన తనతోడు తనను వీడి యిత
రస్థలమునకేగఁగానే తానొంటరియైనపట్టికి నీమె స్వయంకృషి చే విద్యాభ్యా
సము చేయుచుండెను. మఱియుఁ దామప్పుడున్న మధ్యపరగణాలలోనిదైన
మహారాష్ట్రభాషనుగూడఁ గృషిచేసి యభ్యసించుచు దానిలోఁగూడఁదగు
సాహిత్యజ్ఞానము సంపాదించెను. అచ్చమాంబగారి సహజన్ముఁడై స్త్రీవిద్యాభి
మానియు సుగుణశోభితుండునైన లక్ష్మణరావుగారు మాత్రము తామున్నాలు సెల
వులలోఁ దన యక్కగారి యొద్ద నేయుండి తత్పరతతో నామెకు విద్యాభ్యాస
మున సాహాయ్యము చేయుచుండెను. ఇట్లు సుగుణవంతుఁడైన తమునిసాహా
య్యమున అచ్చమాంబగారు, తెలుఁగు, హిందీ, మహారాష్ట్రము, బంగాళము,
గూర్జరము అను నైదుభాషలయందుఁ బాండిత్యము సంపాదించెను. సంస్కృ
తమునందును స్వల్పముగా నీమెకుఁ బరిచయముకలదు. ఇందలి మొదటి మూఁడు
భాషలయందు సమానమగు విశేష పాండిత్య మీమెకుండెను. గుణనిధియగు
తమునిసాహాయ్యమున నచ్చమాంబగారింతియకాదింక యనేకఘనకార్యము
లాచరింపఁగల్గెను. మన హిందూదేశపు సోదరీమణులిట్టి సోదరవర్యు నాటికిఁ
బదుగురైనను గలిగిన నింతలో మన దేశము యథాస్థితికి రాదా? ఇంకేమికావ
లయును? ఇచ్చువారికిని బుచ్చుకొనువారికిని దగునిధనంబగు నిట్టి విద్యాధనం
బవ్యాజప్రేమముతోఁ దమ సోదరీతతి కొసంగు సోదరులే నిజముగు సోదరులు.
కాని యేడాదికి నాల్గుసారులింటికిఁ దీసికొనివచ్చి నశ్వరధనంబులను నాల్గు
నాగెలు నాల్గుచీరెలుమాత్రము పెట్టి కన్నులు తుడుచు సోదరులు సోదరులా?
లోకములోని సోదరులు తమ సోదరీమణులయెడల శ్రీమతి అచ్చమాంబగారి
సహోదరు ననుకరింతురుగాక!

ఇట్లచ్చమాంబగారు పెద్దలయొక్క ప్రేరణగాని, పాఠశాలకుఁ బో
వుటఁగాని, తనకు సంభవింపక పోయినను స్వయంకృషి చే నన్ని భాషలయం
దింతటి సామర్థ్యము సంపాదించుటయేకాక అప్పుడు పైఁబడిన సంసారభా
రము చక్కఁగ వహించుచు, పూలుఅల్లికలు, దారపుఅల్లికలు, మొదలగు ననేక
ములగు నల్లికపనులయందును, గృహపనులయందును, గృహిణీభూషణములగు

“అబలాసచ్చరిత్ర రత్నమాల” రచనకుఁ గడంగిరఁట. తన “అబలాసచ్చరిత్ర రత్నమాల” ప్రథమభాగముయొక్క పీఠికకు మొదట “ప్రపంచకమునందలి జనులకుఁ బరమేశ్వరుఁడు సదా మేలే కలుగఁజేయుననియు, అట్లైనను నొకప్పుడొకఁడు చేయు మేలు మనకు దుఃఖకారణముగాఁ గాన్పించుటవలన మనమా దయానిధిని నిష్కారణముగ నిందించెదమనియు, నట్లునిందించుట మిక్కిలి యజ్ఞానమనియుఁ దద్విషయము విచారించినయెడల నీకీడు మన మేలేయని తోఁచు ననియు సూక్ష్మముగ చెప్పెను. ప్రస్తుతగ్రంథరచనకుఁ గల్గిన కారణములవలన నీసంగతి నిజమని తేలుచున్నది.” అని యీవిజ్ఞానవతి వ్రాసియున్నది. ఈయబలాసచ్చరిత్ర రత్నమాలయొక్క మొదటిభాగము 1901 సం॥లోఁ బూర్తిగాఁ బ్రకటింపఁబడి యెను. ఈరత్నమాల, ఐతిహాసికకాలములోని యుత్తమస్త్రీల చరిత్రములతో మొదటిభాగమును, జైన, పౌరాణిక, బౌద్ధస్త్రీల చారిత్రములతో రెండవభాగమును, ఇంగ్లాండు మొదలగు పరదేశములలోని స్త్రీల చరిత్రలతో మూడవభాగమును ఇట్లు మూడుభాగములుగా నచ్చమాంబగారు వ్రాయఁదలఁచిరి. మొదటిభాగము ముగియఁగనే రెండవభాగము వ్రాయ మొదలుపెట్టిరి గాని యేగ్రంథము వ్రాసినను బూర్తిగా సంగతులు గనుఁగొని వ్రాయవలయుననియు వ్రాసిన సంగతులు విశ్వాసార్హములుగా నుండవలయు ననియు నీమె యుద్దేశము. కావున నీమె యేవేదవాక్యము నుదహరించినను, ఏపురాణశ్లోకము నుదహరించినను బ్రత్యక్షముగా నాయావేదములయందు నాయాపురాణములయందుఁ జూడనిది వ్రాయునది కాదు. ఒక్కొక వేద వాక్యము సంపాదించుటకు కెన్నియో నెలలు పట్టుచుండెను. ఈమె 1903 సం॥నఁ బుణ్యక్షేత్రాదుల సేవించుటకును దన సఖుల దర్శించుటకును గృష్ణా, గోదావరీ మండలములు మున్నగు తావులకు వెడలినప్పుడు కాశీక్షేత్రములోఁ బ్రత్యేకముగాఁ గొన్ని నాళ్లు నిలచి వేదకాలపు స్త్రీలను గురించి కొందఱు శాస్త్రులతో ముచ్చటించి కొన్నిసంగతులను దెలిసికొనెను. తానుదహరింపఁ దలఁచుకొనిన మంత్రముల నిజానిజములఁ గనుఁగొనుటకు ఋగ్వేదసంహిత దొరకక కొంతకాలము వేచియుండి తుదకెంతయుఁ గర్చుపెట్టి హైదరాబాదునుండి ఋక్సంహిత బదులు తెప్పించుకొనెను. అదియుఁ గాక రెండు సంవత్సరములలో నీమెభర్తకు ఆయాతావులకు మార్పు గల్గినందున నీమెకు సావకాశము దొరకకుండెను. ఇట్టి కారణములచే నీభాగము నెమ్మదిగా

వ్రాయఁ దటస్థించి మొదటిభాగమునకు దీనికి నాల్గేండ్లు వ్యవధియయ్యెను. ఇట్లు క్రమపడి సోదరీలోకమున కమూల్యభూషణంబుగా నీగ్రంథరాజమును సమకూర్చుచుండ నదియైనను బూర్తిగానీక యింతలో నీదేశముయొక్క దౌర్భాగ్యదేవత మృత్యుదేవతాకారమునఁ దనకు గన్నెఱ్ఱగాఁ దేజరిల్లుచున్న యీనారీమణిని మ్రింగివేసెను. అబలాసచ్చరిత్ర రత్నమాల రెండవభాగమున వైదిక స్త్రీల చరిత్రములును పౌరాణిక స్త్రీలలో ద్రౌపది, సీత ఈరెండుచరిత్రలును మాత్రము ముగిసినవి. ఈసతీరత్నము తానీలోకమునకు గొప్ప యాపదను సంఘటించి పరలోకమున కేగునప్పు డసంపూర్తిగా నుంచిపోయిన గ్రంథములు, ఇపుడు సావిత్రియందుఁ బ్రకటింపఁబడుచున్న “అబలాసచ్చరిత్ర రత్నమాల” రెండవభాగముగాక మఱి రెండుగలవు. 1 క్రోషాఅల్లిక 2 ఊలుఅల్లిక. మొదటిది హిందూసుందరీ పత్త్రికకొఱకును రెండవది సరస్వతీపత్త్రికకును వ్రాయఁబడుచుండెను. ఈగ్రంథము లారంభించుటకుఁ బూర్వమందువ్రాసెనో పరమందు వ్రాసెనోగాని యీమె రచించినది వేఱొక శతకంబుగూడ నున్నది. ఈమె గ్రంథరచనయందు బద్యరచన యిదియొక్కటియే కానఁబడుచున్నది. సోదరీమణుల యుపయోగార్థము ప్రకటింపఁబడుచుండెడి పత్త్రికలకీమె నీతిదాయకములు నాహ్లాదకరములు నగు ననేకాంశములను వ్రాయుచుండెడిది.

ఈమెకుఁగల స్వజాత్యభిమానము చెప్పనశక్యముకానిది. ఈమె తనజాతిపై నిష్కారణముగా ద్వేషులగువారు మోపెడినిందలను గూకటివేళ్లతో బెల్లగించి స్త్రీజాతికిఁగల సహజ సద్గుణవితానమును సోదాహరణముగాఁ బ్రతిపాదింపఁ గంకణముఁ గట్టుకొనెను. ఈప్రతిజ్ఞ ‘యబలాసచ్చరిత్ర రత్నమాలా’ రచనారూపముగా నెఱవేర్చుకొనెను. అబలాసచ్చరిత్ర రత్నమాల రచించుటకుఁ దనకుఁగల ముఖ్యోద్దేశములను దద్గ్రంథముయొక్క యుపోద్ఘాతములో నీమె మూడుభాగములుగా విభజించి వ్రాసినది. వానిని సంగ్రహముగా నిటఁ జేర్కొనియెద. 1 సామాన్యముగా స్త్రీలకు మందబుద్ధి సహజభీరుత్వము మున్నగు నీచగుణముల నారోపించెడివారి యారోపణములు పక్షపాతజన్యములనియు, స్త్రీలు గాంభీర్యము, సూక్ష్మబుద్ధి మున్నగాఁగల సుగుణములను సహజముగాఁ గలవారనియు నుదాహరణపూర్వకముగా స్థాపించుట. 2. స్త్రీలు చదువుకొనుటవలన ననేకదుర్గుణములను బొందుదురనెడివారి

వాదము శశవిషాణ న్యాయమును బోలుననియు స్త్రీలు విద్యావతులైన యెడల ననేకములగు లాభములను బొందుటయే యప్రతిహతమైన సత్యమనియు రూఢిపరుచుట. 3. తన సోదరీలోకమునకు సుబోధకమును సన్మార్గబోధకమును జ్ఞానదాయకంబునుగా నేదేని యొక గ్రంథమును రచించి యొసఁగుట. ఇంత స్వజాత్యభిమాన మీమె హృద్వీధిని బ్రవహించుచున్నది గనుకనే తారచించిన రత్నమాలలో ననకాశము చిక్కినప్పుడెల్లఁ దన స్వజాతిపై మోపఁబడిన నిందలను దన సహజక్షమను వదలి శూరకత్తిని ఖండించుచు వచ్చినది. ఇట్టి స్వజాత్యభిమానమానినియు నింతలో దైవము గొని పోవుటకీ స్త్రీలోకమెంత మంద భాగ్యము కలదో కదా!

రెండుపన్యాసములు నొక యెల్లమ్మకథ యొక పుల్లమ్మకథ చదువుపాటి వారైనంతనే పెద్దవారందఱు నేమియుఁ దెలియని మూర్ఖపిశాచులనియు నితరులందఱు సమపాటివారు కారనియు విజ్ఞుఁడగు నిప్పటి కొందఱివలెఁ గాక యీసాధ్వి తల్లిగారు మొదలైన పెద్దలను దోడివారలకు నెల్లప్పుడుఁ గడుగూర్చుచుండెడిది. వీరికుటుంబము పూజనీయమగు నార్యమతము నందత్యంతాభిమానముకలది. అచ్చమాంబగారు తీరిక సమయములందు బూజనీయములగు భారత, భాగవత, రామాయణాది గ్రంథములును, విజ్ఞానప్రదంబులగు తత్త్వసంబంధములగు గ్రంథములును శ్రద్ధగాఁజదివి తల్లిమొదలైన పెద్దలకుఁ జెప్పుచుండెడిది అచ్చమాంబగారు తనప్రాణముకంటె నధికముగాఁ జూచుకొనుచున్న తనసవతికూఁతును దైవవశమున భర్తను గోలుపోఁగా నామెకుఁ దత్పరతతోఁ బావన బ్రహ్మచర్యమును బోధించి జ్ఞానాభివృద్ధియు విద్యాభివృద్ధియుఁ జక్కఁగాఁ గలుగఁజేసినది. ఈమె 1903 సం॥ కుటుంబ సహితముగ దేశాటనము చేసినపుడాయా తావులయందలి సోదరీమణులకు నైకమత్యము, సత్కాలక్షేపముచేఁ దోడి సోదరీజనిని బాగుచేసి తాము బాగుపడెడి విధానము మున్నగు ధర్మములను బోధించుచు వచ్చినది.

ఎట్టివిపరీతపు స్వభావము కలవారినైనను దన సౌజన్యముచేఁ దన కనుకూలముగా ద్రిప్పికొను చాతుర్యమీమెకుఁ జక్కఁగ సాధ్యమైయుండెను. ఇందుకు గొప్పయుదాహరణ మీమెభర్తయే. ఆయన తొలుత మిక్కిలి కోపమును స్త్రీలను గారాగృహమువంటి ఘోషాలోనుంచిఁగాని పాతివ్రత్య రక్షణము జరుగనేరదను నూహను గలిగియుండెడివారు. ఆయన

యిచ్చిననుసరించి యీసాధ్వి మొట్టమొదట కారాగృహమువంటి ఘోషా ననుభవించి తన సౌజన్యమువలనను, అనుపమేయ ప్రవర్తన చాతుర్యమువల నను బతిని శాంతస్వభావునిజేసి స్త్రీలకువిద్యయు, నుచిత స్వాతంత్ర్యమును సామాజోద్ధారణకు మూలాధారములని నాయనకుఁ దోఁచునట్లుచేసెను.

ఈమె పాతివ్రత్యానుష్ఠానము వర్ణనాతీతము. ఈమె జగత్పూజ్యము గా రచించిన 'అబలాసచ్చరిత్ర రత్నమాల', యందలి పతివ్రతామణులగు వీర మతి, మీరాబాయి, కొమర్రాజు జోగమాంబ, మున్నగువారి చరిత్రముల వ్రా యుచో వారి యుత్కృష్ట పాతివ్రత్యభాగములు వర్ణించునప్పుడీమె యుత్సా హము మూర్తీభవించి యాయాస్థలములయందుఁ దాండవకేళి సల్పుచున్నట్లుం డును. ఒక్క కొంగిని మైనను సరిగానిండని కొమర్రాజు జోగమాంబగారి చరి త్రయొక్క పాతివ్రత్య విషయముకొఱకే తన రత్నమాలయందుఁ జేర్చి యీ సతి తన పాతివ్రత్యాభిమానము నగపఱచినది. ఈయమ 'అబలాసచ్చరిత్ర రత్న మాల' గన్నవారికె దానియందలి యంకిత మామె సతీత్వవిశేషములఁ జెప్పకయే చెప్పుచుండును. ఈసతి సద్గుణసమితియందలి మాకుంగల యభిమానముచే దాని నిట మరలఁ బ్రచురించుచున్నాము. "ఎవరి పరిపూర్ణ కటాక్షంబుచే నాకీగ్రంథము వ్రాయునంతటి శక్తియు, స్వాతంత్ర్యంబును గలిగెనో, నాశ రీరమునందలి చర్మంబుచేఁ బాదరక్షల నిర్మించి జన్మజన్మంబునందుఁ బాదంబు లనుఁ దొడిగినను నెవరిఋణంబుదీర నేను ఋణవిముక్తురాలనగుట యసంభవ మో యెవరు నాకు దేవాధిదేవునికంటె నధికతరముఁడైన దేవుండో యట్టి నాప్రి యభర్తయగు మ॥రా॥ శ్రీ॥ కొండూరు మాధవరావుగారి దివ్యపాదపద్మములకు నీగ్రంథము సమర్పించి యంకితం బొనర్చుచున్నదానను." అని పాతివ్రత సతీ ధర్మయైన యీధన్య యమృతరసముతో నిట్లు వ్రాసియున్నది. ఈవిషయము లలో నీసాధ్వి వ్రాసిన వ్రాఁతకాక ప్రత్యక్షానుభవములుగూడ నాపుణ్యవశము న నాకుఁగన లభించెను. ఈమె భర్తృపుత్రికాసహితయై మాగృహంబున నొకసమయమున గొన్ని దినంబులుండినను ధన్యను గావించినది. ఈసతి మా యింటనున్న సుదినంబులలో నొకదినంబున మధ్యాహ్నమందలమును భో జనములుచేసి వాకిటఁ గూర్చుంటిమి. అనాఁడెప్పటియట్లు నేనీ సతీమణియొ ద్దఁ గూర్చుండి తాంబూలము నొసఁగఁగోరుచు వక్కలామెచేతనిడి యాకులు మడిచి యిచ్చుచుంటిని. ఇట్లు నేనిచ్చు వక్కలును, ఆకుమడుపులుగూడఁ

వైకొని చేయి నింపుచుండెనేకాని యచటివారందఱు దాంబూలములను వైకొనుట పూర్తియైనను దానుమాత్ర మట్లేయుండెను. అదికని తాంబూలము వైకొనుఁడని నేనొకటి రెండుసారు లడిగితినికాని అట్లె వైకొందునని నాకు నెమ్మదిగా నుత్తరువు చెప్పుచు నేను మఱియొకసారి యడిగినపుడు చిన్ని నగవువైకొనుచు నూరకుండెను. అప్పటి మాయిరువురి స్థితిని జూచుచు మా యొద్దఁ గూర్చున్న మీనాక్షమ్మగారు (అచ్చమాంబగారి సవతికూఁతురు) మేము గూర్చున్న వాకిలితలుపించుకఁదీసి మావారు కూర్చుండి మాటలాడుచున్న వాకిలివంకఁ జూచివచ్చి మాతండ్రిగారింకనుఁ దాంబూలము వేసికొన లేదు. వారు వేసికొనినఁగాని యీమె వేసికొనదని చెప్పెను. అందుకు ముందే మావారు తమ భోజనములుకాఁగానే తాంబూలపు పళ్లెరము వైకొనినవారైనప్పటికిని అచ్చమాంబగారి భర్తగారు నాఁడుజరుగుచున్న ప్రసంగావసరములోఁ దాంబూలమును స్వీకరింప నట్లాలస్యముచేసిరి. పతిభక్తి తప్పనియట్టి నాసాధ్వీమతల్లి యీసంగతి గ్రహించుటచే నట్లొనరించెను. సర్వకాల సర్వావస్థలయందును విధేయునిగా నిట్టి సతి పతిని సేవించుట నేను కొన్ని నాళ్లవఱకు గన్నులారఁ గాంచుచు బూర్వ సతీమతల్లులగు సీతాంగనాదులఁ గాంచుచున్నట్లానంద నీరధి నోలలాడితిని. ఈయుత్తమ సతి వలన పతివ్రతాధర్మము లిట్లు నియతిఁగాఁ బాలింపఁబడినవి. పరపురుషులున్న తావునుండి దూరముగాఁ దొలఁగి పోవుటయేకాని తనకేదియైన నవసరమున్నను నఁటపించుకనేనైనను నీసతి నిలుచునది కాదు. తగినంతపని వచ్చిన యెడలఁ దలవంచుకొని సోదరులతో భాషించుచున్నట్లును, సంగ్రహముగాను భాషించి వెడలిపోవుచుండెడిది. ఆహా! యిట్టి నారీరత్నములేకదా అన్యస్త్రీసంతతి లోని వారమును గౌరవ బిరుదమును మన స్త్రీలోకమునకు నిల్పువారు!

ఈమెయందు స్వదేశప్రీతి మెండుగా వాసముచేయుచుండెను. ఈ గుణమింత జాజ్వల్యముగా బహుకొలఁది పురుషులలో నుండును. స్వదేశ వేషభాషలను మాని పరదేశ వేషభాషల నాదరించువారీ నారీమణికి హృదయ శల్యములవలెఁ దోఁచుచుండురు. చదువుకొనినకొలఁది స్వదేశాభిమాన మధికమగుచుండవలెనని యీమె తనచెలులకు శ్రద్ధతో బోధించుచుండెడిది. ఈయమ తన "అబలాసచ్చరిత్ర రత్నమాల" లో నొక విదుషీచారిత్రమును వ్రాయుచు నాచరిత్రనాయికకుఁగల స్వదేశప్రీతి నిట్లు కొనియాడియున్నది:

"కొందఱు పురుషులుగాని, స్త్రీలుగాని తమదేశమును వదలి పరదేశమున కేగినపిమ్మట దమ దేశాచారములను విడిచి యాదేశాచారములనే స్వీకరింతురు. కాని మాచరిత్రనాయిక యట్లుగాక పాతాళలోకమున కరిగియుఁ దన దేశాచారములను మఱువక యాదేశపువారికిని వానిని నేర్పెను! ఆమె తన స్నేహితురాండ్రకును కొన్యోంటరు నింటివారికిని మహారాష్ట్ర స్త్రీలవలె జడలువేసి చీరలు కట్టించుచుండెను! తానున్యూజరసీ పట్టణమున కేగుటకు ముందు తన స్నేహితురాండ్ర కందఱకును మహారాష్ట్రపద్ధతి ననుసరించి విందుచేసెను. ఆ దినమామె తానే తనదేశపు పక్వాన్నములు వండి భోజనములకుఁ గూర్చుండుటకుఁ బీటలువేసి తినుటకు విస్తరులును దొప్పలును గుట్టి మహారాష్ట్రదేశాచారప్రకారము సకల పదార్థములును వడ్డించి విందారగింప వచ్చిన యువతులకు మహారాష్ట్ర స్త్రీలవలెఁ జీరలు, గాజులు, గుంకుము మొదలైన వలంకరించి చేతితో భోజనముచేయు విధమంతయు వారికిఁ దెల్పి తానును వారితోఁ గూర్చుండి భోజనముచేసెను''.

చూచితిరా యీమె స్వదేశాభిమానము! ఈస్వదేశభక్తి పరాయణ యొకచో శ్రీమతి కొటికలపూడి సీతమ్మగారి లేడీ జేంగ్రేయను గ్రంథమును గూర్చి "యీకవయిత్రి హిందూదేశమునందలి నారీరత్నములలో నొక స్త్రీని గావ్యనాయికగాఁ దీసికొని కావ్యము రచించినయెడల నది హిందువులకు విశేష ప్రియమగునని నాయభిప్రాయము'' అని వ్రాసియున్నది ఈమె స్వదేశములోఁ జేసిన వస్తువులనేగాని సాధ్యమైనంతవఱకుఁ బరదేశములోఁ జేసిన వస్తువులను వాడుకొనఁగూడదని యిటీవల వ్రతము ధరించెను. ఈవ్రతము నీమె దినదినమును దృఢముగాఁ బాలించుచుండెను. తనకట్టకడపటి వ్యాధిలోఁ గాళ్లకు ఉన్ని మేజోళ్లను దొడఁగవలసినదని డాక్టర్లు చెప్పఁగా బాజారునుండి మేజోళ్లు తెప్పించిరి. అంతివ్యాధిలోఁగూడ నానారీమణి యా మేజోళ్లమీఁద గుర్తులుచూచి "ఛీ యివి స్వదేశములోఁ జేసినవి కావు" అని వానిని బారవైచి స్వదేశములోఁజేసిన వానినపుడు తెప్పించి తొడుగుకొనెను. ఆహా! ఏమి యీ స్వదేశాభిమానము! ఇట్టి స్వదేశాభిమాన మాననీయను గోల్పోయిన మనదేశముయొక్క దౌర్భాగ్యమింతయని చెప్పఁ దరమగునా!

బీదల దుఃఖమునుజూచి చింతన నొందుట దుఃఖమునుగుట యీమె నైసర్గిక గుణము. సాధ్యమైనంతవఱకుఁ దన ధనము బీదలకుపయోగపరచుట యీమెకు వెన్నతోఁ బెట్టిన విద్యగాఁ బలువురు లింతకుమున్నె యెఱుఁగుదురు. అయినను సర్వజనానుకరణీయమైన యీమెకుఁగల యీగుణము యొక్క ప్రచారము నిచట మఱికొంచెము వివరింపెదను. వరుసగా ననేక పర్యాయములు రొట్టెలును పప్పును వండించి గ్రామములోని బీదలకు, అనాథలకుఁ దనయెదుట భోజనము పెట్టించి వాండ్లు తిని సంతసించుటఁ జూచి తాను సంతసించుచుండెడిది. తనకుఁ గుమారుఁడు పుట్టినపుడితరవిధములగు నుత్సవములు మొదలైనవానికై ధనము వ్యయముచేయక, యది కరువుకాలమైనందున నాధనమంతయు నసంఖ్యాకులగు బీదలకు ననాథులకుఁ గొన్ని దినములవఱకు నన్నము పెట్టించుటయందు వ్యయపరచెను. తన్నాశ్రయించుకొనియున్న బీదవాండ్ల కన్యకలను దాను స్వయముగా సంబంధములు విచారించి తన ధనముపెట్టి ధర్మవివాహములు చేయుచు నావిద్యాలవారు పెట్టెడి బాధలన్నిఁటికిఁ దాఁ దలయొగ్గి యనుభవించుచుండెడిది. ఈమె కడుపునఁ బుట్టినసంతానము లేక పోయినను, యీమెయింట నెల్లప్పుడు నైదారుగురు పిల్లవాండ్రకు విద్యాదానము దొరకుచుండెడిది. ఈపిల్లలసందఱి నెల్లవిధములఁ గడుపునఁబుట్టినవారివలెనే చూచుచున్నందునఁ జెలియనివా రాపిల్లలందఱు నామెసంతానమునియే భావించుచుండిరి. అట్టిపిల్లలలోఁ గొందఱామె బంధువులును మఱికొందఱు పరాయివారును గాయున్నను వారిని వీరిని నొక్కకంటఁ గాంచి యాదరించుచుండెడిది. వారికెన్ని యంగీలో వీరికన్ని యంగీలు, వారికెన్ని టోపీలో వీరికన్ని టోపీలు! "అయంనిజః పరోవేతి గణనా లఘుచేతసాం। ఉదారచరితానాంతు వసుధైవకుటుంబకం॥" అనినమాటయీమెయెడలనే సార్థకమైనది. ఒకపారి యొకయూరినుండి మఱియొకయూరికీమె భర్తగారికి బదిలియై పోవుచు మార్గస్థులకొఱకేర్పడిన యొకసత్రమున విడిసిరి. ఆసత్రమును గనిపెట్టుకొనియుండు కూలివాని గుడిసె యచ్చటకుఁ గొంతదూరముననుండెను. అచ్చట నెవతెయో యాఁడుది దుఃఖపడుచున్నటుల శబ్దమువిని యచ్చమాంబగారాగుడిసెకు స్వయముగావెళ్లి వాండ్లకష్టములను విచారించి యాస్త్రీకి నీళ్లాట ప్రొద్దులైనందున ఖర్చునకుఁ గొంతసొమ్మిచ్చి వారి నోదార్చెను.

అదియుఁగాక యాకూలివాని జీతము హెచ్చుచేయుటకై తన పెనిమిటి ద్వారా యత్నముచేసి వానిజీతము కొంత హెచ్చునటులఁ జేసెను. ఇటీవల కొంతకాలమునుండి బిలాస్పూరులో ప్లేగుఉన్నందున నూరుబైట గుడారములు వేసికొని కాపురముచేయుచుండిరి. డిశంబరునెలలో వీరు కాంగ్రెస్ నిమిత్తమైన బొంబాయి వెళ్లుటకు సిద్ధముచేసికొని బయలుదేరఁబోగా నొక సేవకునిభార్య నిండుప్రొద్దులదియైనందున నొప్పులు పడఁజొచ్చెను. అపుడు ప్రయాణమాపి యచ్చమాంబగారు దానికి స్వయముగా మంత్రసానితనముచేసి. పురుడు పోసెను. పిల్లకు బొడ్డుకోసి నీళ్లు పోయించి యప్పుడు ఉన్ని అంగీలు తల్లి తొడిగించి తల్లికిఁగావలసిన మందులు వగైరాలు సిద్ధముచేసి పదిరోజులకు సరిపడు సామానులు వాండ్లకమర్చి రెండవరోజున బయలుదేరి బొంబాయి వెళ్లిరి. బొంబాయినుండి తిరిగి వచ్చినతరువాత నీగుడారములోనే యచ్చమాంబగారు కీర్తిశేషులైరి. 1898 వ, సంవత్సరము కఱవులో నీమెభర్తగారు క్షామశాల (ఫ్యామిన్ క్యాంపు) పై నధికారిగా నుండిరి. అక్కడ నొకానొక తల్లిదండ్రులు నిర్దయులై రెండునెలల తమకుమారుని విడచి వెళ్లిరి. ఆపిల్లవానిని పెంచువారెవరును లేనందున మిషనరీల కిచ్చివేయవలయునని యధికారులు నిర్ణయింపఁగా దీనావనయగు అచ్చమాంబగారా సమాచారమువిని యాపిల్లవానిని దాఁ బెంచెదననియు బరధర్మకుల కియ్యనక్కరలేదనియు నధికారులకుఁ దెలిపి యాపిల్లనిదెచ్చి యెంతయు వాత్సల్యముతోఁ బెంచుచుండెను. ఆకరువులోనే యింకనొక 10 యేడుల పిల్లవాఁడు వాని యనాథయగు తల్లియుఁ జెల్లెలు నుత్తరదేశమునుండి వచ్చి బిచ్చమెత్తుకొనుచు జీవించుచుండిరి. దీనబాంధవియగు నచ్చమాంబగారు ఆపిల్లవాని తెల్విచూచి వానిని బిచ్చమెత్తుకొనవలదని చెప్పి యింటనుంచుకొని యన్నివ్రయ ప్రయాసములకోర్చి విద్య నేర్పెను వాని తల్లి కొక యావునుగొనియిచ్చి దీని పాలమ్ముకొని జీవనముచేయుమని త్రోవచూపెను. ఆహా! ఏమి యీదీనదయాళుత్వము! దీనజనులకును అనాథులకును తల్లి పోయినదే! 1904 డిశంబరు నెలలో బొంబాయికివెళ్లి యచ్చటి ఎగ్జిబిషను మహిళాపరిషదము, మున్నగునవన్నియు వీక్షించి 1 వ జనవరి నటనుండి బయలుదేరి బిలాస్పురమువచ్చి యానెల 8 వ తేదీ మొదలు 18 వ తేదీ వఱకు నఖండమైన జ్వరముచేఁ బీడింపఁబడి యీయద్వితీయ, సాధ్వీమణి

18 తేదీ పగలు 11 ఘంటలకు బుద్బుదప్రాయమైన ప్రకృతిదేహమును చాలించి శాశ్వత కీర్తికాయమును బొందినది. ఈసతి యీలోకమును విడుచు నప్పుడు నీవు చదివిన వేదాంతము నుపయోగపరచుకొని దుఃఖము నడచి వేయుము అని తల్లిగారికిని దగురీతి నితరులకును బోధించి తన ప్రాణసమానుఁడగు సోదరుని బిలిచి తాను బెంచుచున్న పసివాఁడగు దీనబాలునికి విద్యాబుద్ధులు చెప్పించుటకు శ్రద్ధవహింపుమని చెప్పెను. ఈమె వియోగదుఃఖమగ్నులగు నీమెభర్త తల్లి సోదరుఁడు మున్నగువారికందఱకు నీమె మృతజీవయను విషయమునుత్కృష్టము జ్ఞప్తికిఁ దెచ్చుచు దుఃఖోపశమనము ననశ్వాంతియు భగవంతుఁడు కటాక్షించుఁగాక !

ఉ. హా ! వరవర్ణినిపద్మముఖి ! హా ! విదుషీమణి !! హా ! సపూజ్య !! హా !
పావని !!! జీవయాత్రగడుపంగలపద్ధతి నిస్వార్థికిన్
నైవశమాచరించుపనికై ధరియించినయష్టికాయమున్
బోవిడి కీర్తికాయము బొందితె ! నీపనిదీగనేకటా !!!

తే. సాధ్వి ! యార్యోక్తులను శిరసావహించి
నిగుణాతిశయత " సుకృతీగతాయు "
వనెడు నార్యోక్తిసార్థకంబును నొనర్చి
ధరఁబ్రదర్శింప నిట్టులఁ దలఁచితమ్మ !

సీ. నీదుపాతివ్రత్యనిష్ఠాఫలంబు నీ నయదైవతారాధనాఫలంబు
అతివ ! నీపుణ్యతీర్థాటనాఫలము నీయఖిలసద్ధర్మక్రియాఫలంబు
కతన దివ్యముసతీకాంక్షితంబును నైన పుణ్యాంగనామృతిఁ బొందగల్గి
శ్రీమన్మహాశాంకరీ సన్నిధానంబుఁ గాంచిన ధన్యవీవంచు నిన్ను

గూర్చియీరీతివిలపింపఁ గూడదంచుఁ
బెద్దలెన్నెన్ని భంగుల బుద్ధి తెల్ప
యనునయించిన నీవియోగార్ణవంబు
నీదశోక్యంబె ? మాబోంట్లకేది తెఱవు !.!!

మ. తతచేలాంచలమున్ శరీరలతనంతన్ గప్పికొంచున్ బ్రస
న్నతచేఁ గుంకుముబొట్టుచేఁ దనరి గన్నన్ బూజ్యపూర్వాంగనా
పరితతిన్ జ్ఞప్తికిఁ దెచ్చునెమ్మొగమునొప్పన్ సుంతపైకెత్తి నీ
పతివాత్సల్యముతోఁడ మమ్ముగనుచున్నట్లె సదాతోఁచెడిన్
మృతజీవావళిఁ జేరితే యకట !! మమ్మీమాపదన్ ద్రోచితే !

మ. అకటా !!! దైవమ ! నీకు నేఁగతిని జేయూడెన్ సతీలోకనా
యిక రత్నంబును ద్రుంచివేయఁ గట ! నిన్నేమందు మాదేశపున్
సుకృతంబాఁగతినుండె! దేవ ! కరుణాస్తోకా! యజస్రంబు న
య్యకలంకాత్మకు నాత్మసౌఖ్యమిడవే యధ్యాత్మ తేజోనిధీ !



Madras : The Guardian Press, Mount Road

# ఉపోద్ఘాతము

అబలాసచ్చరిత్ర రత్నమాల యను పేరిట ఉదాత్తము లైన స్త్రీలచరిత్రములు వ్రాయఁదలఁచినాను. ఈచరిత్రములు వ్రాయుటయందు నాముఖ్యోద్దేశము లే వనఁగా:—

(౧) స్త్రీలు అబల లనియు, బుద్ధిహీన లనియు, వివేక శూన్య లనియు, సకల దుర్గుణములకు నివాసస్థల మనియుఁ గొందఱు నిందింతురు. స్త్రీలపయిని మోపఁబడిన యీదోషా రోపణము లన్నియు నబద్ధము లనియు, స్త్రీలలో నత్యంత శౌర్య ధైర్యవతులును, అసామాన్యవిద్యావిభూషితలును, జ్ఞాన వతులును, రాజ్యకార్యధురంధరత్వము గలవారును, స్వదేశాభి మానినులును, సకలసద్గుణవిభూషితలును, బూర్వముండిరనియు నిప్పు డున్నవా రనియు స్థాపించుట నామొదటి యుద్దేశము. ఇంతియ కాదు. స్త్రీలయొక్క స్వాభావికప్రవృత్తి సద్గుణముల వైపున కే కాని దుర్గుణముల వైపునకుఁ గాదనియు సిద్ధాంతీకరించుట నాప్రథమోద్దేశములలోని యుద్దేశమే.

(౨) స్త్రీలకు విద్య నేర్పినయెడలను, వారికి స్వాతంత్ర్య మొసఁగినయెడలను, వారు చెడిపోవుదు రనియుఁ బతుల నవమా నించెద రనియుఁ గుటుంబసౌఖ్యమును నాశముచేసెద రనియు గొందఱు మహానుభావులు శంకించెదరు. ఈయారోపణము లన్నియు నిరర్థకము లనియు, స్త్రీవిద్య దురాచారప్రతీకారాన్ను

కూల మగునేకాని దురాచారప్రవృత్త్యనుకూలము గానేరదని యు, స్త్రీవిద్యాస్వాతంత్ర్యములవలన మన దేశమునకు లాభమే గాని నష్టము గలుగనేరదనియు, స్త్రీవిద్య యత్యంతావశ్యకం బనియు, సోదాహరణపూర్వకముగా నిరూపించుట నాద్వితీయో ద్దేశము.

(3) ఆంధ్రదేశములోని భగినీగణములకు మనోరంజకము గను, ఉపదేశకరముగను ఉండుపుస్తకము నొకదానిని రచిం చుట నాతృతీయోద్దేశము. వట్టియుపదేశ గ్రంథములవలనను, కేవలకల్పనాకథలవలనను జేసినయుపదేశమునకంటె నిజమైన చరి త్రంబులవలనఁ జేసిన యుపదేశము అధిక ఫలప్రదం బగునని యందఱికిఁ దెలిసిన విషయమే. కాన నిజములైన యీ స్త్రీల చరిత్రములవలన నాంధ్రసోదరీమణులకుఁ బాతివ్రత్యము, స్వదేశా భిమానము, స్త్రీవిద్య మొదలయినవాని గుఱించి కొంత విన్న వించుకొనవలయు నని నామూలోద్దేశము.

నేను వ్రాసెడి యీచరిత్రములలో ననేకములు మహారాష్ట్ర భాషనుండియు, హిందీభాషనుండియు నాంధ్రీకరింపఁబడును. కనుక నీచరిత్రములయందలి యుత్తమభాగములకయి యాయాభాషల లోని గ్రంథకర్తలను మెచ్చవలయునేగాని నన్ను శ్లాఘింప వలసినపని యెంతమాత్రమును లేదు.

ఇట్టిరత్నమాలలు మూఁడు గ్రుచ్చి జనులకు సమర్పింపవలయు నని నేఁ దలఁచితిని. అవి యేవి యనిన:—

(౧) అబలాసచ్చరిత్ర రత్నమాలయొక్క మొదటిభాగము— ఇందు హిందూదేశమునందుఁ బుట్టిన వైదికపౌరాణిక స్త్రీలచరిత్రము

లుండును. ఐతిహాసిక కాల మనఁగా వేయిసంవత్సరములనుండి నేఁటివఱకు జరిగిన కాలము. ఈభాగమునందు పద్మావతి, సంయుక్త మొదలయిన ప్రాచీన స్త్రీలు మొదలుకొని, ఆనందీబాయి మొదలయిన యర్వాచీన స్త్రీలవఱకు నయిన యుత్తమ స్త్రీల చరిత్రములు రాఁగలవు.

(౨) రెండవభాగము—ఇందు వైదిక పౌరాణిక బౌద్ధస్త్రీల యొక్క చరిత్రములు రాఁగలవు. వైదికస్త్రీలనఁగా వేదమందు వర్ణింపఁబడిన గార్గి, మైత్రేయి మొదలైనస్త్రీలు. పౌరాణిక స్త్రీలనఁగా పురాణాదులలో వర్ణింపఁబడిన పార్వతి, సీత, తార, దమయంతి, ద్రౌపది మొదలయినస్త్రీలు.

(3) మూఁడవభాగము—ఇందు ఇంగ్లండు మొదలయిన పరదేశములలోని స్త్రీల చరిత్రము లుండఁగలవు.

కాలమానమునుబట్టి చూడఁగా రెండవభాగములోని వైదిక పౌరాణిక స్త్రీలు మొదటిభాగమునందును, మొదటిభాగమునందలి యైతిహాసిక స్త్రీలు రెండవభాగమునందును రానలసి యుండును. కాని ప్రస్తుతము రెండవభాగము వ్రాయుటకై కావలయు సాధనములు నాయొద్ద లేనందునను, ఆ సాధనములు సమకూరువఱకు నైతిహాసిక స్త్రీచరిత్రములను ఆపుట యోగ్యమని తోఁచనందునను వైదిక పౌరాణిక స్త్రీలను రెండవభాగమునందుఁ జేర్చెదను. ఇది యొక గొప్పదోషముగాదు గనుక చదువరులు మన్నింతురుగాక!

మొదటిభాగమునందలి చరిత్రము లన్నియు నాయొద్ద నొకసారి గూడనందమునఁ జరిత్రములు కాలక్రమముగా వ్రాయుటకు

వీలు గలుగదు. ఏయేచరిత్రము నా కెప్పుడెప్పుడు దొరకునో యాయాచరిత్ర మప్పుడప్పుడు వ్రాయఁబడును. చరిత్రాధ్యయనము మన ముఖ్యోద్దేశముగాని, పరీక్షలకుఁ జదువువారివలె కాలక్రమానుగతమైన చరిత్రములను జదువుట మన యుద్దేశము కానందున నీచిన్న దోషమును గూడ చదువర్లు మన్నింతురుగాక!

మొదటిభాగమునందు రాఁగల రాణీభవానిగారియొక్కయు, రాణీసువర్ణమయిగారియొక్కయు చరిత్రములలోని కొన్ని భాగములు జనానాపత్రికయందుఁ బ్రచురింపఁబడినవి. ఆ భాగములు గూడ నిందుఁ జేర్పఁబడినవని యెఱుఁగునది.

భండారు - అచ్చమాంబ

# అబలాసచ్చరిత్రరత్నమాల

## ప్రథమ భాగము

---

### ౧. రాణీభవాని

* "గుణాః పూజాస్థానం గుణిషు నచ లింగం నచ వయః."—భవభూతి.

ఉత్తరహిందూస్థానమునందుఁ బూర్వము రాజకార్యధురంధరత్వమును వహించిన నారీమణులలో రాణీభవాని ప్రముఖురాలని చెప్పుటకు సందేహము లేదు. ఈమె బంగాళాదేశమందలి రాజశాయిపరగణాలోని ఛాతీ మను గ్రామమునం దుండు ఆత్మారాంచౌధరి యనుగృహస్థుని కూఁతురు. ఈమె వార్ధకమునం దీమెను జూచిన వారిప్పటికిని (క్రీ. శ. ౧౮౯౮) బంగాళమునందుఁ గలరని చెప్పెదరు. ఈమెతండ్రి మిక్కిలి ధనవంతుఁడు కాకపోయినను, ఈమె యసమానసౌందర్యమును, అనుపమేయసద్గుణములను జూచి, నాటూరు సంస్థానాధిపతి యగు రాజరామజీవనుగా రీమెను తమ కుమారునికి వివాహము చేసిరి.

ఈమె చిన్నతనమునందే విద్య నేర్చుకొనినదని కొందఱు వ్రాసియున్నారు. కాని యేయేవిద్య యెంతెంతవఱకు నేర్చినదో తెలియదు. అయినను తరువాత నీమె చూపిన బుద్ధికౌశలమును

---

* సద్గుణములే పూజనీయములు ; కాని వయస్సును, లింగమును (ఆఁడుతనము మగతనములును) పూజనీయములు కావు.

బట్టి విచారింపఁగాఁ జిన్నతనమునం దీమె చాలవఱకు విద్య నేర్చిన దనియే తోఁచుచున్నది. దైవభక్తి, ధర్మబుద్ధి, కార్యనిర్వాహకత్వము నను నీగుణత్రయం బీవనితయందుఁ జిన్ననాఁటినుండియు వాసము చేయుచుండెను. పెనిమిటి రాజ్యము చేయుచుండినప్పుడును, పతి మరణానంతరము తనకు సర్వాధికారము సంప్రాప్తమయినప్పుడును, ఈ లలన తనసుగుణములచేఁ బ్రజల నందఱిని రంజింపఁ జేసెను. కావుననే, యీమెకీర్తి యజరామరముగ నున్నది.

ఈమె పరిపాలించిన నాటూరుసంస్థానమును సంపాదించుటలో వీరి పూర్వికుఁడైన రామజీవనురాయ్‌గారు చూపిన ధైర్యచాతుర్యములు బహువర్ణనీయములు ; గావున రాణీభవానిగారు చెందిన యమితకీర్తికి మూలకారణమయిన యాయైశ్వర్యప్రాప్తిని గుఱించి యిచ్చట సంగ్రహముగ వ్రాసెదను.

కామదేవుఁడను బ్రాహ్మణునకు రఘునందన రామజీవనులను నిరువురు పుత్రులుండిరి. వారు దర్పనారాయణుఁడను చిన్న జమీన్‌దారునియొద్ద నుద్యోగములు చేయుచుండిరి. రఘునందనుఁడు మిక్కిలి సూక్ష్మబుద్ధి గలవాఁడు; రామజీవనుఁడును తెలివి గలవాఁడే. కాని రఘునందనుని యంతటివాఁడని చెప్పుటకు వీలులేదు. ఆ జమీన్‌దారుఁడు రఘునందనుని బుద్ధికుశలతకు సంతసించి, ముర్షిదాబాదు నవాబుయొక్క దర్బారులో నతనిని తనవకీలుగా నేర్పఱచెను. తదనంతర మాదర్బారులోని వారందఱాతని చాతుర్యమును జూచి యతనిని మిక్కిలి సన్మానించుచుండిరి. ఆ దర్బారులోని దివానునకును నితఁడెంతో ప్రియుఁడయ్యెను.

ఖతని సచ్ఛీలమును జూచి యా దివాను తనచేతి ముద్రసయితమీతనియొద్ద నుంచుట కిచ్చుచుండెను.

ఈ సమయమునందు ముర్షిదాబాదు నవాబునకుఁ జాలద్రవ్యము కావలసినందున, సర్కారు బొక్కసములోని ధనమంతయు నా నవాబు వ్యయపఱచెను. కావున ఢిల్లీబాదుషా తన్ను రాజ్యభ్రష్టుని జేయునని యతనికి భీతి గలిగెను. వ్యయపఱచిన ధనమెచ్చటినుండి యయినఁ దెచ్చి బొక్కసము నించుటకు వీలులేనందున నబద్ధపు లెక్కలు వ్రాసి ఢిల్లీకిఁ బంప నిశ్చయించిరి. కాని యిట్టి నీతిమాలిన పనిఁ జేయుట మంచిది గాదని తలఁచి రఘునందనుఁడు, తాను ఢిల్లీకి వెళ్లి యబద్ధపు లెక్కలు లేకయె ఢిల్లీశ్వరుని సమాధానపఱచెదనని నవాబుతోఁ జెప్పెనఁట. అందుకు నవాబు సంతసించి యతనిని ఢిల్లీకిఁ బంపెనఁట. అప్పు డాతఁడు తన వక్తృత్వవైభవముచే ఢిల్లీశ్వరుని సమాధానపఱచి ముర్షిదాబాదుకు వచ్చెనఁట. అప్పటినుండి నవాబు రఘునందనునికి గొప్ప గొప్ప యధికారముల నిచ్చి, తుద కితనికిఁ దనదివాన్‌గిరి యిచ్చి 'రాయ' యనుఁ బిరుదు నొసఁగెను. ఇంతియ కాదు. పేరుమాత్రము నవాబుది; రాజ్యమంతయు నితని దేయని చెప్పుటకు సందియము లేనంత యధికార మీతనికి సంప్రాప్తమాయెను. ఇట్లు పూర్ణాధికారములోనున్న సమయమం దాతఁడు, తన తమ్ముఁడయిన రామజీవనునికి రమారమి రెండుకోట్ల జమీన్‌దారి యిప్పించెను. తదనంతరము కొన్నిదినములలోనే రామజీవనునకు 'రాజా' యను పదవి నవాబువలనఁ బ్రాప్తమాయెను. ఇప్పటివఱకీ బిరుదు వీరివంశస్థు లనుభవించుచున్నారు.

రాజారామజీవనున కిరువురుపుత్రులు గలిగిరి. వారిలో నొకఁడు బాల్యావస్థయందే గతించెను. రెండవవానిపేరు రామకాంతుఁడు. తండ్రి గతించిన పిమ్మట, ఈయన రాజ్యమున కధిపతియయ్యి 'రాజా' యను పదవిని పొందెను. ఈ రామకాంతుని భార్యయే, మనచరిత్రనాయిక యగు రాణీభవాని. వివాహసమయమున రామకాంతునికి ౧౮ సంవత్సరములును, భవానిగారికి ౧౫ సంవత్సరములును వయస్సు. భార్యాభర్త లిరువురికి నొండొరుల యెడ ప్రేమానురాగము లెక్కువగ నుండినను త్వరలోనే కార్యవిషయములందు వీరికి బహుకష్టములు ప్రాప్తించెను.

రాజారామజీవనుని కాలమునం దతనియొద్ద దయారామను బుద్ధికౌశలముగల యొక మంత్రియుండెను. రామజీవనుఁ డితనిని కుమారునివలెఁ బ్రేమించుచుండువాఁడు. రామకాంతుఁ డతనిని 'అన్నా' యని పిలుచుచుండును. మృతిసమయమునందు రామజీవనుఁడు, ప్రతికార్యమునందు దయారాముని సమ్మతిచొప్పున తనకొమారుఁడు నడువ వలయునని బోధించి మఱి ప్రాణములు విడిచెను. చిన్నతనమునందే గొప్ప సంస్థానమున కధికారము లభించినందున రామకాంతుఁడు గర్వపడి, రాజకార్య వ్యవహారములయందు మనసుపెట్టక, స్వేచ్ఛానుసారముగా వర్తించి రాజ్యమును పాడుచేయసాగెను. చేతఁజిక్కిన ధనరాసులన్నియు హేయసుఖములకొఱకు వ్యయపఱచెను. ఇదంతయుఁ జూచి దయారాముఁ డనేకపర్యాయములు రామకాంతునికి బుద్ధిచెప్పెనుగాని యాగర్విష్ఠుఁ డాతనిమాటలు లెక్కసేయక మీఁదు మిక్కిలి యాతని నిల్లు వెడలఁ గొట్టించెను.

నాటూరునుండి యిట్లు వెడలఁగొట్టఁబడిన దయారాముఁడు రామకాంతునియం మిక్కిలి ద్వేషము వహించి, యచ్చటినుండి బయలుదేరి ముర్షిదాబాదుకు వెళ్లెను. అప్పుడచ్చట రాజ్యముఁ జేయుచున్న నవాబుపేరు అలీవర్దీఖాన్. అచ్చటికి వెళ్ళిన తరువాత దయారాము నవాబు కొలువుకూటమునకుఁ బ్రతిదినము వెళ్లుచుండెను. కొన్నిదినముల కాతఁడు తనబుద్ధికౌశలముచే నవాబు ప్రేమ సంపాదించెను. దయారా మొకనాఁడు నవాబు సమీపమునకుఁ జని "దేవరవారి ధనమంతయు రామకాంతుఁడు వృథా వ్యయపఱచుచున్నాఁడు; సొత్తంతయు నపహరించి రాజద్రోహముచేయఁ దలఁచి యున్నాఁడు" అని చెప్పెను. అప్పటి నవాబులు విచారశూన్యులు; సారాసార విచారములోఁ బనిచేయువారు కారయిరి. ఒక్కశబ్దముతో నొకనిని లక్షాధీశుని గాను, ఇంకొకనిని భిక్షాధీశునిగాను జేయుచుండిరి. కాన దయా రాముని మాటలు విన్నతోడనే, యీమాట సత్యమా యసత్య మాయని విచారణచేయక, రామకాంతుని ధనమెల్లఁ గొల్ల గొట్టుటకును, అతనిఁ బదచ్యుతుని జేసి యతని పెదతండ్రి కుమారునికి రాజ్యమిచ్చుటకునయి, నవాబు తనసైన్యములను బంపెను. నవాబుయొక్క యాజ్ఞప్రకారము దయారాము సైన్య ములతో వెళ్ళి రామకాంతుని ధనభాండాగారములోనికిఁ జొచ్చి ధనమంతయుఁ గొల్లగొట్టసాగెను. కోటలోనికి సైన్యములు చొచ్చినప్పుడు రామకాంతుఁ డంతఃపురములో భార్యాసమేతుఁ డయి యుండెనఁట.

నవాబు సైన్యములు దండెత్తివచ్చిన సమాచారము విని,

వాని నెదురించుట కసమర్థుఁడగుటచే రామకాంతుఁడు వజ్రతా డితునివలె నేమియుఁదోఁపక నిశ్చేష్టితుఁడై యుండెను. అతఁ డిట్లింకఁ గొన్నినిమిషము లుండియుండినయెడల, శత్రువులాతని చెరఁ బెట్టియేయుందురు. కాని కుశాగ్రబుద్ధిగల యాతనిభార్య యగు భవాని, ప్రసంగావధానము గలది గనుక, భర్తభయమును దుఃఖమును శాంతింపఁజేసి, మోయఁగలిగిన నగలను చేతఁ బుచ్చుకొని భర్తయుఁ దానును ఎవరికిఁ దెలియకుండ పట్టణము నుండి వెడలిపోయిరి. చిన్నతనమునుండియు భవాని కలలోనైనను కష్టము లెఱుఁగని శ్రీమంతురాలు; పల్లకిలోనుండి కాలుక్రిందఁ బెట్టుటయైన నెఱుఁగని భాగ్యశాలి. ఇట్టిలేమ కీకష్టము ప్రాప్తించి నప్పు డామె యెనిమిదిమాసములు గర్భవతిగానుండెను. ఇన్ని కష్టములు ప్రాప్తించినను పతిప్రాణములు దక్కినను సంతోష ముతో నామె ధైర్యముగా నడువసాగెను. వీరిట్లు మిగులప్రయా సముతో నడచి పద్మానదీతీరముచేరి యచ్చట నొకయోడవాని నాశ్రయించి, నదిదాఁటి మూర్షిదాబాదుచేరి, యచ్చట బీదవా రివలె నొక చిన్నగృహమున నుండిరి. అక్కడికిఁ బోయిన తరు వాత, రామకాంతునకుఁ దనపూర్వపు దురాచారమునకయి పరితాపముగలిగి, బుద్ధికౌశలముగల తనభార్యచెప్పిన చొప్పున నిఁక నడచుకొనుటకు సమ్మతించెను. భవాని తన్ను పెంపుడు కన్యగా భావింపవలసినదని చెప్పి, యనేకయుక్తులతో నవాబు యొక్క బొక్కసధారుఁడగు జగత్సేటనువానిని తనభర్తకు వశునిఁజేసెను. తననగలలోఁ గొన్నిటిని నమ్మి యా ధనముచే నవాబుయుద్యోగస్థులఁ గొందఱిని తనభర్తపక్షము నవలంబింపఁ

జేసెను. తనకుఁ బూర్వము మంత్రిగనుండి, పిమ్మట తమ్ముని దరికిఁ దెచ్చిన దయారాముని బిలువనంపించి, అతని పాదములకు పెనిమిటిచే మ్రొక్కించి, తప్పులన్నియు క్షమింపుమని వేఁడుకొనెను. ఇట్లు ప్రార్థింపఁగా, దయారాముని మనసు కఱఁగి, యతఁడు తిరిగి రామకాంతునికి రాజ్యమిప్పించెదనని ప్రతిజ్ఞ చేసెను. తరువాత రాణిగారు తనయొడలి నగలన్నియు నేఁబది వేల రూపాయీలకమ్మి దయారాముచే సాధనమంతయు లంచము లిప్పించి, నవాబునొద్దనుండు నధికారులనందఱిని వశపఱచుకొనెను. ఇట్లు వీరిపక్ష మవలంబించిన రాజకీయోద్యోగస్థులును, దయారాముఁడును, జగత్సేటునుగూడి, యెట్లో నవాబు మనసు త్రిప్పి మఱల రామకాంతునకు రాజ్యమిప్పించిరి. ఇట్లు పోయినరాజ్యము మఱల సంపాదించుటయందు రాణీభవానిగారు చూపిన యసామాన్యబుద్ధి కౌశలమును, అనుపమేయ పతిభక్తియుఁజూచి 'స్త్రీబుద్ధి ప్రళయంకరీ' యన్నమాట సర్వదా యసత్యమనియే చెప్పవలసి యున్నది. రాజ్యము తిరుగ సంప్రాప్తమయినపిదప ౧౯ సంవత్సరములు రామకాంతుఁడు, తన భార్యామణియొక్కయు, మంత్రిపుంగవునియొక్కయు ననుమతి ప్రకారము సుఖముగా రాజ్యముఁ జేసి, మృతినొందెను. పతిమరణకాలమున భవాని ३४ సంవత్సరముల ప్రాయము గలదై యుండెను.

రామకాంతుని రాజ్యము పోయినప్పుడు రాణీభవాని గర్భవతిగా నుండెనని వెనుక వ్రాసియుంటిమిగదా. ఆమెకుఁ గొద్ది కాలమునకుఁ బుత్రుఁడు గలిగెను. తదనంతరమింకొక

కుమారుఁడు పుట్టెను. కాని యీయిరువురు పుత్రులును బాల్యమునందే గతించిరి. తరువాత నామెకు 'తార' యను కూఁతురు మాత్రమే కలిగెను. తార చిన్నతనమునందే వితంతువయినందునఁ దల్లియొద్దనే యుండుచుండెను.

భర్త మరణానంతరము భవాని సింహాసనమెక్కెను. ఆసమయమున బంగాళా దేశమునకు సురాజద్దౌలా యను తురుష్కప్రభువు నవాబుగ నుండెను. హిందూదేశ చరిత్రముఁ జదివినవారికి సురాజద్దౌలాయొక్క దుశ్చేష్టలు బాగుగఁ దెలియును. ఇతఁడు వ్యభిచారాది దుష్కర్మలకయి తన ధనమంతయు వ్యయపఱచి తనచేతిక్రింది మండలాధిపతులయొద్దనుండి, బలాత్కారముగా ధనము స్వీకరించుచుండెను. ధన మీయనివారిని మిగుల బాధపెట్టుచుండెడివాఁడు, పరస్త్రీల నక్రమముగఁ జెరపెట్టుట కీదుష్టుఁడు వెనుకదీయువాఁడు కాఁడు. న్యాయమనుమాట యీయన రాజ్యమున నౌషధమున కయినను గానరాక పోయెను. తన రాజ్యమున కిట్టి దుష్టునివలన నెన్నఁడయిన ముప్పు రాఁగలదని యెంచి, రాణీభవాని తన సైన్యములఁ జక్కపెట్టుటకు నారంభించెను. సైన్యములోని భటులసంఖ్య హెచ్చించి, యుద్ధమున కసమర్థులగు భటులను తీసివేసి, సమర్థులయినవారిని జేర్చి, తానే సైన్యాధిపత్యమును స్వీకరించి సైన్యములోని యోధులచే వేడుక యుద్ధములుచేయించి, సేనలను బలపఱచెను. ఇటులు చేసినది గావుననే యీక్రింద వివరింపఁబడు కష్టమునుండి తనరాజ్యమును నీమె తప్పించుకొనఁ గలిగినది. ఆకష్టమేదియనఁగా:—

రాణిగారి కొమార్తెయును గతభర్తృకయును అగుతార,

బంగాళా దేశమునం దంతట విఖ్యాతిఁగాంచిన సౌందర్యవంతు రాలు. ఈమె చక్కఁదనము సంగతివిని, నవాబునకీ మెను చెఱఁ బెట్టవలెనను దుర్బుద్ధి కలిగెను. తారను తనకీయుమని, యాతఁడు భవానిగారికి వర్తమానము పంపఁగా నామె యత్యంత క్రోధా న్వితురాలయి, వచ్చిన దూతను మిగుల నవమానపఱచి పంపి వేసెను. ఇందుపయి నవాబు క్రోధావేశపరవశుఁడయి నా టూరు రాజ్యమంతయుఁ బాడుచేసి తారా భవానులను జెరఁబెట్టి తెండని, తనసైన్యములఁ బంపెను. ఇట్లు జరుగునని రాణీగారి కదివఱకే తెలిసియుండెనుగాన, ఆపె పట్టణపు త్రోవలన్నియు మూయించి, తానే సైన్యాధిపత్యమును వహించి, తనసైన్యముల వెంటఁదీసికొని రాజధానియొక్క బహిర్ద్వారము దగ్గఱ నవాబు సైన్యముల నెదుర్కొనెను. ఇచ్చట నొక ఘోరయుద్ధము జరిగి, తురుష్కులు అందు సంపూర్ణముగా నోడిపోయిరి. అనేకులైన తురు కలు నవాబుయొద్దకు పాఱిపోయిరి. ఈసంగతి యితరరాజులకుఁ దెలిసినతోడనే వారు నవాబు సైన్యముల ననేకబాధలు పెట్ట నారిరి.

ఇట్లు బంగాళా దేశములోని మండలాధిపతుల కంతఱకి నవాబు దుష్టుఁడని తోఁచినందువలన వారందఱును అతనిని రాజ్య పదచ్యుతునిగఁ జేయుటకయి నిశ్చయించుట కొకనాఁడు జగత్సే ఠుగారి గృహమునందు సభచేసిరి. కృష్ణఘురు సంస్థానాధిపతి యగు రాజాకృష్ణ చంద్రరాయలును, డెక్కాసంస్థానాధిపతి యగు రాజరాజ బల్లవులును, పాట్నాయను నామాంతరముగల పాటలీపుత్ర సంస్థానాధిపతియగు రాజరాయదుర్లవులును, నా

టూరురాజ్యమున కధికారిణియయిన రాణీభవానిగారును, ఆసభ యందలి ప్రముఖులయి యుండిరి. ఆసభయందు క్రింద వ్రాసిన ప్రకారము సంభాషణలు జరిగినవని యొక యితిహాసకారుఁడు వ్రాసియున్నాఁడు:—

జగత్సేటు—సురాజద్దౌలాను పదచ్యుతునిఁ జేసి మీర్జాఫరనువానిని నవాబుఁ జేయుట ఉత్తమము. ఎందుకనఁగా హిందూరాజులు చెప్పినట్లు నడుచుకొనియెద ననియుఁ, బ్రజలకు హితమగునట్లు రాజ్యముఁ జేసెదననియు నాతఁడు ప్రతిజ్ఞఁ జేసియున్నాఁడు. ఇప్పుడు మనము నవాబును జేయఁదలఁచిన మీర్జాఫరు, నవాబుయొక్క సైన్యాధిపతి గనుక తురకలసైన్యము లన్నియు నతఁడు చెప్పినటులు వినఁగలవు. కాన రక్తపాతము లేకయే మీర్జాఫరును నవాబుఁ జేయవచ్చును.

రాణీభవాని—బంగాళాదేశపు సింహాసనముపయి, తురుష్కుని నుంచక, హిందూరాజునే యుంచఁ గూడదా ? పోయిన స్వాతంత్ర్యమును మఱల సంపాదించుకొనుటకు యోగ్యమయిన సమయ మిదియేయని నాతాత్పర్యము.

రాజాకృష్ణచంద్రుఁడు—రాణిగారు ! తమరు చెప్పినమాట యోగ్యముగానే యున్నది. ఎందుకనఁగా, స్వాతంత్ర్యమందఱికిఁ బ్రియమే. కాని మన మనేక సంవత్సరములనుండి పరతంత్రులమయి యున్నాము. మన కీర్తి నష్టమయి యున్నది. పరరాష్ట్రములను ధిక్కరించి స్వసంరక్షణము చేసికొనుటకు మన మసమర్థులము. మనలో నైకమత్యము లేదు. పరస్పర ద్వేషము లనేకము లుగలవు. కనుక హిందూనవాబు నేర్పఱిచినయెడల, మనలో

మనము కలహించి, యొకరి నొకరము సంహరించుకొనుట సంభ
వించును. ఇట్లు మనయంతః కలహములఁజూచి మరాటావారు
మనపయి దండెత్తివచ్చి మనలను దిరిగి పరతంత్రులను జేసెదరు.
మరాటావారిని మన మెఱుఁగము. వారు బహు క్రూరులని విం
దుము. మనము తురుష్కులతోఁ గలసిమెలసి యున్నాము. వారి
స్వభావము మనకు బాగుగఁ దెలియును. కనుక వారే మనకు
రాజులుగ నుండుటమేలు.

రాణీభవాని—మీరు చెప్పినమాట గ్రాహ్యమే. కాని
రాజ్యారూఢుఁడయినపిమ్మట, సురాజద్దౌలావలెనే, మీర్జాఫరు
క్రౌర్యము నవలంబించిన పక్షమున మనమేమి చేయఁగలము?

రాజారాజబల్లవులు—అందునుగూర్చించి మే మిదివఱకే విచా
రణచేసి యున్నాము. మీర్జాఫరును మనచేతిలో నుంచుకొనుటకు
నింగ్లీషువారి సహాయ మడుగఁ దలఁచితిమి. వారు బహుబలవం
తులు; కేవలము వర్తకులు. రాజ్యము చేయవలయునను కోరిక
వారికిఁ గలుగనేరదు. వర్తకమునందు విశేషలాభము గలుగు
నట్టులు గొన్నిషరతులు వారికి వ్రాసియిచ్చిన పక్షమున, వారు
మన కత్యానందముతో సతతము సహాయము చేయుచుందురు.
వారిసహాయముచే నెల్లప్పుడు నవాబు మనకు లోఁబడియుండు
నట్టులు చేయవచ్చును.

జగత్సేటు—ఇదియునుఁగాక కలకత్తానగరములోనికంపెనీవారి
దుకాణమును సురాజద్దౌలా కాల్చియున్నాఁడు. కాన కంపెనీ
వారు సురాజద్దౌలాను ఓడించుటకు యత్నించుచున్నారు. కనుక
నిప్పుడు క్రొత్తగా సింహాసనస్థుఁ డగు నవాబు వారికి స్నేహితుఁ

డుగా నున్నపక్షమున వారతనికి చాల సహాయముఁ జేసి కృత
జ్ఞులయి యుందురు. వారితో సఖ్యముఁ జేయనిపక్షమున రాజ్య
మునకుఁ బ్రారంభము కాఁగానే, క్రొత్తనవాబునకు వారితో
యుద్ధము చేయవలసి వచ్చును.

రాజరాయద్దుర్లభులు—ఇంగ్లీషువారు దక్షిణములోని నవా
బును పరాజితుని జేసిరి. కాన వారితో సఖ్యమే చేయవలెను ;
వైరము వలదు.

రాణీభవాని—నేను స్త్రీనైనందువలనఁ దమ కిట్టి రాజకీయ
వ్యవహారములలో నాలోచన చెప్పుటకు సమర్థురాలను కాను.
అయినను, నాస్వల్పబుద్ధికిఁ దోఁచినది జెప్పెద వినుఁడు. ఇంగ్లీషువా
రిప్పుడు వర్తకులుగా నున్నను, మనము వారి సహాయముం గోరి
చేతికి మనజుట్టు నిచ్చినప్పు డీమహారాజ్యమును జూచి వారికి
రాజ్యాభిలాష గలుఁగక మానదు. అప్పుడు మనగతి యేమి ?
మరాఠావారి గుణధర్మములను గుఱించి మనకుఁ గొద్దిగనైనను
దెలియును. కానిఁ వీరివిషయమయి బొత్తుగ మన కేమియుఁ
దెలియదు. కాన తురుష్కుని రాజ్యభ్రష్టునిఁ జేయుటకును,
పరదేశస్థులయిన కంపెనీవారిని దీనులవలె సహాయంబడుగుటకును,
నేను సమ్మతింపఁజాలను.

ఇట్లిచ్చటఁ జాలసేపువఱకు వాదవివాదము జరిగి తుద కితర
రాజుల బలవంతముచే రాణీభవాని, ఇంగ్లీషువారి సహాయముఁ
బుచ్చుకొని మీర్జాఫరును రాజ్యముపయి నుంచుటకు సమ్మతించి
యిట్లనియె. "మహారాజులారా ! మీరందఱు సమ్మతించి, నిశ్చ
యించిన మాటకు విరుద్ధముగా నడుచుట నాకు శక్యముగాదు.

కనుక మీమాట నాకు సమ్మతమే. ఈమార్పువలన తురక
వారికిఁ గల సర్వాధికార మింగ్లీషువారి కిచ్చుచున్నాము. తురు
ష్కుని రాజ్యమునుండి తొలఁగించి, హిందూదేశమున హిందూ
రాజును స్థాపించునంత శక్తియు, దేశాభిమానమును, ఐకమత్య
మును, మనకు లేనపుడును, మనదేశస్థులయిన మరాఁటవారిని
మనము నమ్మఁజాలనపుడును, మనము మనరాష్ట్రము పరాయిల
చేత నొప్పగించుటయే బహుయోగ్యముగా నున్నది. వీరే మనకు
హితకర్త లగుదురుగాత." ఇట్లందఱును నిశ్చయించి వారివారి
సంస్థానములకు వెళ్ళిరి. తరువాత ౧౭౫౭ వ సంవత్సరమున జరగిన
ప్లాసీయుద్ధమునందు కంపెనీవారును, మీర్జాఫరునుగూడి సురాజ
ద్దౌలాను ఓడించిన సంగతి చరిత్రజ్ఞుల కందఱికిని దెలిసినదే.

ఇప్పుడు నేను వర్ణించిన కాలము హిందూదేశముయొక్క
చరిత్రములోని యొకముఖ్యభాగమయి యున్నది. తురకలరాజ్య
ముయొక్క క్షయమునకును, ఇంగ్లీషు ప్రభువులయొక్క యభ్యు
దయమునకును, ఇది సంధికాలమని చెప్పవచ్చును. ప్రభుత్వము
లిట్లు చేతులక్రిందు లయ్యెడి కాలముయొక్క మాహాత్మ్య మప్పుడు,
రాణీభవానిగారు దప్ప నితరు లెవరును గ్రహించినవారు కారని
పైని వ్రాయఁబడిన సంభాషణలవలనఁ జదువరులు గ్రహించియే
యుందురు. రాణిగారి సంభాషణలవలన వారికిఁ గల యనుపమే
యస్వదేశాభిమానము వెల్లడియగుచున్నది. రాణిగారు చేసిన
రాజకీయ భవిష్యత్తులన్నియుఁ దప్పక నిజమ యినవని చూచి
రాణిగారి రాజనీతి నిపుణత్వమునకును, వ్యవహారమునందుఁ గల
దీర్ఘదృష్టికిని, మానవ స్వభావముయొక్క యథార్థజ్ఞానమునకును,

విశేషవిఖ్యాతిఁ జెందినదిగాదు. అయిన నామె సాధారణముగా దానధర్మములను జేయుచునే యుండెను. దేవాలయములఁ గట్టించుట, చెఱువులు బావులు మొదలయిన జలప్రదేశములఁ ద్రవ్వించుట, అన్నసత్రములు స్థాపించుట, బీదబ్రాహ్మణుల కేమి బ్రాహ్మణేతరుల కేమి వివాహాదులు చేయించుట మొదలయిన భూతదయాప్రేరితములగు సత్కృత్యము లప్పటినుండియే, రాణిగారు చేయుచుండిరి.

ఆమెకు దైవభక్తి విశేషముగాఁ గలిగియుండెను. ఏవస్తువు నయిన నీశ్వరునికి సమర్పింపక యామె యనుభవించుట లేదు. ఒకనాఁ డామె పెనిమిటి యిరువదియయిదువేల రూపాయలకు రెండు చంద్రహారములఁ గొనెను. వానిలో నొకటి కాళికాదేవి కనియు, మఱియొకటి తనభార్యకనియు నాయన నిశ్చయించుకొనెను. వానిలో నొకటి బహు సౌందర్యయుతముగాను, మఱియొకటి సాధారణముగాను, ఉండెను. వానిలో నుత్తమమయినది తనభార్య కియ్యవలయునని తలఁచి, రాజుగారు వానిని రాణిగారికిఁ జూపఁగా నుత్తమమయినది కాళికాదేవి కిచ్చెదననినామె చెప్పెను. అంతమీఁద రాజుగారు తన యభిప్రాయమును దెలుపఁగా "మీ కిష్టమైన హారము మీరు సమర్పింపవచ్చును, నా కిష్టమైనదానిని నేను సమర్పించెదను, ఇట్లయిన నిరువురి కోర్కెలు నీడేరును" అని రాణిగారు చెప్పిరి. అదేప్రకారము రెండు హారములును దేవికి సమర్పించిరి! ఇట్లామె యకల్మషదైవభక్తిని జూపు దృష్టాంతంబు లనేకంబులు గలవు. కాని గ్రంథవిస్తరభీతిచే నిచ్చట వ్రాయుటలేదు.

తనకుఁ గుమారులు లేకపోయినను, తనకూఁతురగు తారకుఁ గుమారుఁడు గలిగిన పక్షమున వానికిఁ బట్టముకట్టి తాను గంగా తీరముననుండి, దానధర్మములఁ జేయుచు, ఈశ్వరుని ధ్యానము చేసికొనుచు నుండవలెనని యీమెకుఁ దాత్పర్యముండెను. ఇట్టి యోచనగలదయి, తార కొకమంచివరుని దెచ్చి పెండ్లి చేసెను గాని, "తా నొకటిదలఁచిన దైవ మొకటితలఁచు" నను సామెత చొప్పున నామె యల్లుఁడు మృతినొందెను. అల్లుని మరణము వలన రాణిగారి కత్యంత దుఃఖమును అపరిమితమయిన నిరుత్సాహమును గలిగెను. కొన్నిదినములవఱకును వితంతుపుత్రికను జూచినప్పు డెల్ల నామెకు మిగుల దుఃఖము గలిగి చిత్తభ్రమ గలుగుచుండెనఁట. నవాబగు సురాజుద్దౌలా, రాణిగారి కొమార్తెను చెఱఁబట్టఁ దలఁచి, సైన్యములఁ బంపెననియు, వానిని రాణిగా రోడించిరనియు వెనుక వ్రాసియున్నాను. ఆయుద్ధ మీవితంతువగు తారకొఱకే జరిగినదని చదువరు లిదివఱకే గ్రహించియుందురు. ఈయుద్ధము జరిగినప్పటినుండియు రాణిగారు తార నెప్పుడు తనవెంటనే యుంచుకొని బహు జాగరూకతతోఁ గాపాడుచుండిరి.

అల్లుని చావుతో రాణిగారియాశ లన్నియు నిరాశ లాయెను. రాజ్యమునకు తగువారసుదారు లెవరును లేనందువలన, రాణిగారు సంపత్తినంతను లోకహితార్థమయి వ్యయపఱుచుటకు నిశ్చయించిరి. ఇట్లు నిశ్చయించిన పిదప నామె చేసిన దానధర్మము లింతంతని చెప్ప నలవిలేదు. వానిని విన్నవారు ఆనందాశ్చర్యములఁ బొందక మానరు. ఈమెకన్న నధిక శ్రీమంతులగు రాజు

లనేకులు గలరు; కాని యీమెచేసిన దానము లనేకములు గొప్ప గొప్ప చక్రవర్తులకు శోభించునట్టివి.

ప్రతిసంవత్సర మీమె ౨౫ వేల రూపాయలు చిల్లరదానధర్మములయందు వ్యయపఱుచుచుండెను. గంగాతీరముననుండి వేదాధ్యయనముచేయు బ్రాహ్మణోత్తములకును, యోగాభ్యాసము చేయుయోగులకును, అతిథులకును, అభ్యాగతులకును, అన్నము పెట్టుటకయి యీమె యనేక సత్రములను గంగాతీరమున స్థాపించి యున్నది. సంస్కృత విద్యాధ్యయనమును, వేదాధ్యయనమును, శాస్త్రాధ్యయనమును జేయు విద్యార్థులకు విద్యార్థి వేతనార్థమై సంవత్సరమునకు నిరువదియైదువేల రూపాయీలు ముట్టునట్లీమె యేర్పాటు చేసినది. ఆకట్టుపాటు యిప్పటివఱకు నడచుచున్నదని చెప్పెదరు. అనేక గీర్వాణపాఠశాలలు స్థాపించి, వానిపై గొప్ప పండితులను గురువులుగా నేర్పఱచి, విద్యార్థులకు పాఠశాలలోనే యన్నము పెట్టునటు లేర్పాటులం జేసి, శాస్త్రములందుం బ్రవీణులగు విద్యార్థులకు వారివారి ప్రవీణతప్రకారము పారితోషికముల నిచ్చునటులు నియమంబులు చేసెను. తాను నేర్పఱచిన సత్కృత్యంబులు తన మరణానంతరము నిర్విఘ్నముగా జరుగవలెనని, రాణిగారు ఈస్టు ఇండియా కంపనీవారికిం గొన్ని లక్షల రూపాయీలిచ్చి వానివడ్డీవలన నీపాఠశాలలు సతతము జరుగునటులు నిబంధనము చేసిరి. కనుక నిప్పటికి బంగాళా దేశములో వీరికి ననేకాశీర్వచనముల నిచ్చుచు ననేకవిద్యార్థులు సంస్కృత విద్యామృతమును పానము చేయుచున్నారు. ఈమె భూదానము లనేకము చేసినది; అనేకులయిన బీదకాంపుల సిస్తులువదలి

పెట్టినది. ఇందుచే నీమె రాజ్యమున బీదలందఱు సుఖముగానుండిరి.

కాశీ, గయ, రాజశాహి, బడానగర్ మొదలయిన పట్టణ ములయం దీమె గొప్పగొప్ప దేవాలయములను సత్రములను గట్టించినది. వీనిలోఁ గాశీక్షేత్రములోని దేవాలయము బహు రమ్యమైనది. దీనిలోని విశ్వేశ్వరుఁడు, దండపాణి, దుర్గ, తార, రాధాకృష్ణుల విగ్రహములు కడుసొంపుగానున్నవి. అత్యంత సుం దరములైన శివలింగంబు లిం దనేకంబులు గలవు. దేవాలయమం తయు శ్రేష్ఠమైన నల్లని రాతితోఁ గట్టఁబడినది. ఇదే రీతిని నామె యనేకఘట్టముల రాతితోఁ గట్టించెను. అనేక ధర్మశాలల స్థాపిం చెను. కాశీయం దేడువందల గృహములఁగట్టించి యిహసౌఖ్య ములవదలి కాశీవాసముఁ జేయవచ్చిన యనాథలను వానియం దుంచి భోజనముఁబెట్టి వారి మరణానంతర ముత్తరక్రియలను గూడ యథావిధిగాఁ జేయించుచుండెను. పంచక్రోశముచుట్టు నీమెధర్మగృహములు, బావులు మొదలైనవి యనేకములు కలవు. కాశీక్షేత్రమునం దీమె సహాయమువలన నాలుగువేల ప్రజ బ్రతుకుచుండెను !

రాణిగారు మనుష్యులయందేగాక పశుపక్షి క్రిమికీటకాదు లగు సమస్త ప్రాణులందును కరుణగలదియై వర్తించుచుండిరి. తన రాజ్యమునం దెచ్చటను గోమహిషాదులఁ వధ కాఁ గూడదని యామె నిబంధనఁ జేసెను. ఈనిబంధన నుల్లంఘించువారికి ఘోర శిక్షవిధించెను. పక్షులకొఱకు దొడ్డిలో ననేక ధాన్యములు వెద చల్లించి, వానికొఱకై వచ్చిన పక్షిసమూహమును దూరమునఁ జూచి యిట్టి చక్కనిపక్షుల నుత్పన్నముచేసిన సర్వేశ్వరుని

యదృచ్ఛాశక్తి ప్రేమాదులకు నానందించుచుండెను. చీమలకుఁ బంచదార, చేపలకు రొట్టెముక్కలు, మార్జాలములకు క్షీరాన్నము మొదలగు భక్ష్యములనిప్పించి, యవి సుఖించుచుండుటఁ జూచి భవానిగారు మనమునందు మిగుల సంతోషించుచుండురు. ఇట్లీమె కారుణ్యామృత ప్రవాహము ఎల్లప్రాణుల యెడలను, సమానముగఁ బ్రవహించుచుండెను.

ఈమె కాశీయాత్రకు బయలుదేరినపుడు ఈమె వెంట నెనిమిది ఓడలు వెడలినవఁట. భక్ష్యపదార్థములు నింపబడి వలమీఁద వెళ్ళినవఁట ! ఇట్లపరిమితాన్న దానము చేసినందు వలన లోకు లీమెయన్నపూర్ణయొక్క యపరావతారమని నెంచుచుండిరి.

రాణీభవానిగారి రాజ్యమునం దనాథులగు రోగులకౌషధంబు లిప్పించుటకునై యనేకౌషధాలయంబులు కట్టింపఁబడినవి. ఇప్పటివలె నప్పుడు డాక్టర్లును, ఆసుపత్రులును లేకపోయినను, హిందూ వైద్యశాస్త్రమునందుఁ బ్రవీణులగు భిషగ్వర్యులనేకులు, రాణీగారివలన గొప్ప వేతనములఁ గొనుచు వైద్యశాలలయందు బీదలకౌషధంబు లిచ్చుచుండిరి. రోగి, వైద్యశాల లోనికివచ్చి బాగై వెళ్లువఱకును వానికిఁ గావలయు పథ్యపానములును, ఔషధంబులును, ఉపచారంబులును మొదలైన వన్నియు యథావిధిగా జరుపుటకు రాణీగా రనేక సేవకుల నేర్పఱచిరి. ఆహా ! ఈమె భూతకారుణ్యము నెంతని కొనియాడెదను. ఇట్టి విశ్వకుటుంబినిని వేయినోళ్ళఁ గొనియాడినను జాలదు.

రాణీగారు సకల లోకులచే సత్కరింపఁ బడుచుండిరి. కేవ

లము హిందువులకేగాక తురుష్కులకుఁ గూడ నీమె పూజ్యురా లాయెను. ఒకానొక సమయమున రాణిగారు గయలోఁ బిండ మువేయుటకునై వెళ్ళినప్పుడు అచ్చట రాజు తనకై దులకుల రూపాయీ లిచ్చినఁగాని పిండదానము చేయ నియ్యనని చెప్పెను. రాణిగారీసంగతి మూర్షిదాబాదు నవాబునకుఁ దెలుపఁగా నాతఁడు గయాధీశ్వరుని పదచ్యుతుని జేయుటకై శత్రుణామే సైన్యములఁబంపెను. ఈసంగతివిని యారాజుభయమొంది రాణి గారి శరణుచొచ్చెను. శరణాగతుని రక్షింపవలెనని రాణిగారు తిరిగి నవాబునకు సమాధానముచెప్పి యారాజును రక్షించెను. కొన్నిదినముల కారాజు నవాబు కియ్యవలసిన కప్పమీయనందునఁ గారాగృహవాసుఁడయ్యెను. అప్పుడును రాణీభవానిగారు రద్దు ముండి యతనిని బంధిఖానానుండి విడిపించిరి.

"క. ఉపకారికి నుపకారము
విపరీతముగాదు సేయ* వివరింపంగా
నపకారికి నుపకారము
నెపమెన్నక చేయువాఁడు* నేర్పరిసుమతీ."

యని మనము చిన్నతనమునందుఁ జదివిన యీ యమూల్యమైన నీతిపద్యమునకు రాణిగారు లక్ష్యభూతలని చెప్పుటకు సందేహ ములేదు. కారాగృహ విముక్తుఁడైన యారాజు రాణిగారి యొద్దకువెళ్ళి, మిక్కిలి కృతజ్ఞుఁడై, తలపాగాతీసి, రాణిగారి పాదములపైనుంచి "అపకారముఁజేసిన నాకుఁ బ్రాణదానము నిచ్చిన మీవంటి పరోపకారుల నెచ్చటఁగానను" అని విన్నవించి, సెలవు పుచ్చుకొని తనరాజ్యమున కేగెను. తరువాత నెల్లప్పుడును

ఆరాజు రాణిగారి యాజ్ఞప్రకారమే ప్రవర్తించుచుండెను.

నాటూరులో గంగలేనందున రాణిగారు తమ రాజధానిని అచ్చటనుండి తీసి ముర్షిదాబాదుకొద్ద గంగాతీరముననున్న బడానగరమను గ్రామమునందు స్థాపించిరి. ఈమె రానపుడు బడానగర మొక చిన్న గ్రామముగా నుండెను; గాని యీమె యచ్చటికి వచ్చినతరువాత నానగరము కడుగొప్పదై బడానగరము, అనఁగా, గొప్పనగరమన్న పేరును సార్థకపఱచెను.

ఇఁక నీమె దినచర్యనుగుఱించి కొంతవ్రాసెదను. ఈమె దినచర్య బహురమ్యముగాను, అనుకరణీయముగాను ఉన్నది. ప్రాతఃకాలమందు నాలుగు గంటలకే లేచి, ఈశ్వరస్తుతిఁ జేసి, నాగడాలు వేయించికొని గంగానదికిఁ బోయి స్నానముచేసివచ్చి, పుష్పములనుగోసి, గృహదేవతను బూజించునఁట. ఇంతలో సూర్యోదయము కాఁగానే గంగాతీరమునకుఁబోయి దేవతలఁ బూజించి, బాటసారులకు దానధర్మములుచేసి, పురాణశ్రవణముఁ జేయును. మధ్యాహ్న కాలమప్పుడు భోజనానంతరమున రాజవేషము వేసికొని రాజసభకుఁ బోవును. అచ్చటి యుద్యోగస్థులకు వారు చేయవలసిన పనులు నియమించి, వారుచేసిన పనులఁజూచి, తాను సభలో స్వయముగఁ జేయవలసిన పనులను నిర్వహించి, తిరుగఁ బురాణశ్రవణమునకుఁ బోవును. సాయంకాలమప్పుడు తిరిగి దేవతాదర్శనము చేసికొని ముఖ్యమంత్రి సభకుఁబోయి, ప్రజల విన్నపములు, వ్యాజ్యములు మొదలైనవి విని, తీర్పులుచెప్పి, యిలుసేరి, దేవునిప్రార్థించి నిదురించును. భవానిగారొకపూటయే భుజించుచుండిరని చెప్పెదరు. గాణీభ

వానిగారి కాలము, అప్పటి సంఘస్థితి, దృఢమైన ధర్మవిశ్వాస ములు, మొదలైనవానిని విచారించిచూడఁగా, రాణీభవానిగారి దినచర్య, అప్పటికాలములో నుత్తమోత్తమమైనదనియే యెవ రికైన నొప్పుకొనవలసియుండును.

ఇట్లు పతిభక్తి, రాజ్యకర్తృత్వము, శౌర్యము, ధైర్యము, స్వదేశాభిమానము, భూతదయ, ఈశ్వరభక్తి మొదలైన యుత్తమోత్తమ సుగుణసంపదలకు వాసస్థానమైన రాణీభవాని గారు ౧౮ [illegible] వ సంవత్సరమున, అనఁగా డెబ్బదితొమ్మిదిసంవత్స రముల ప్రాయమున స్వర్గస్థులైరి. వీరి మరణమునకయి లక్షలకొ లఁది ప్రజలు దుఃఖించిరని వేఱుగ వ్రాయవలయునా?

భవానిగారు ఒడ్డుపొడుగు గలిగి, మిగుల సుందరముగ నుం డిరి. చనిపోవువఱకు నీమె శక్తితగ్గలేదఁట. తుదవఱకు నీమె స్వయముగా వంటచేసికొని భుజించుచుండెనఁట.

ఈమె రామకృష్ణుఁడను బ్రాహ్మణబాలుని గొని వాని శై శవమునుండి పెంచుచుండెను. తుదకు వానికే రాజ్యముగట్టి మృతినొందెను. కాని రాజారామకృష్ణుఁడు సాధువృత్తిగలవాఁ డగుటచే నిప్పుడు వీరిరాజ్య మొకచిన్న జమీందారియై యున్నది.



# అహల్యాబాయి హెూళ్కరు



* "ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబకం."

ఈ యద్వితీయమైన సాధ్వీమణి చరిత్రము, మనోరంజక మయ్యును హృదయ ద్రావక మైనట్టియు, ననుకంపనీయ మయ్యును అనుకరణీయమైనట్టియు, వీరరసవిరహిత మయ్యును శాంతిరస పరిప్లుతమైనట్టియు మూడంకముల నాటకమని చెప్పవచ్చును! ఈనాటకముయొక్క చాలభాగము దుఃఖరూపమైన యంధకారముతో వ్యాప్తమై యున్నను, అహల్యాబాయిగారి యొక్క సద్గుణములను చంద్ర కిరణములచే ప్రకాశితమైనందున రమ్యముగానే యుండును. ఈమూడంకము లెవ్వియనఁగా:— (౧) అహల్యాబాయిగారి జన్మమును బాల్యమును. (౨) ఆమె సంసార సుఖము (౩) ఆమె వైధవ్యమును రాజ్యము చేయుటయు. ఈమూడంకములలోని సంగతులను విడివిడిగా విచారించెదము.

(౧) <u>జన్మమును బాల్యమును</u>—బొంబాయి ప్రాంతమునందలి అహమదు నగరమను తాలూకాలో పాథరణీయను చిన్న గ్రామము గలదు. ఈగ్రామమునందుఁ బూర్వము, ఆనందరావు సిందేయన నొక మరాఠాగృహస్థుఁడు వాసము చేయుచుండెను. ఈతఁడాగ్రామమునందుఁ బెద్దమనుష్యుఁడన్ని పేరు

* ఔదార్యముగలవారికి విశ్వమంతయు, స్వకుటుంబమే.

వడసెను. ఈతఁడు ధనవంతుఁడు గానందునఁ బొలములు దున్నుకొని జీవనముఁ జేయుచుండెను. ఇతని భార్యయు స్వభావమునందితనిని బోలియుండెను. ఈ సత్వగుణ ప్రధానులైన దంపతులకు ౧౭౩౫ వ సంవత్సరమున నొక కన్యారత్నము కలిగెను. ఈకన్యకు వారు అహల్యయని నామధేయమిడిరి. ఈమెయే చరిత్రనాయికయగు అహల్యాబాయి. ఈమె తరువాతఁజూపిన యసమాన సద్గుణములనుబట్టి, యీమె సామాన్యస్త్రీకాదనియు, నవతార స్త్రీయనియు మహారాష్ట్రగ్రంథకర్త లనేకులు 'దేవీ అహల్యాబాయి' యని సంబోధించియున్నారు. ఈమె జగదంబయొక్క యవతారమని యిట్లొక కథ చెప్పెదరు. అనేక దినములవఱకు నానందరావునకు సంతానమే లేక పోయెనఁట. అప్పుడొక్కనాఁ డాయనభార్య చింతాక్రాంతురాలయియుండ వారిగృహమున కొకబైరాగి వచ్చెనఁట. ఆమెచింతయొక్క కారణమును విచారించి, "మీరు కొల్హాపురమునకు వెళ్లి, అచ్చటి జగదంబను సేవించినపక్షమున మీకు సంతానము గలుగును" అనిచెప్పి వెళ్లిపోయెనఁట.

మన యాంధ్రదేశమునందు బెజవాడ కనకదుర్గ యెటులు ప్రఖ్యాతిని జెందియున్నదో యటులె మహారాష్ట్రదేశమునందు, కొల్హాపురములోని జగదంబ బహు విఖ్యాతయయి యున్నది. బైరాగి చెప్పినప్రకారము ఆనందరావును, అతని భార్యయు కొల్హాపురమునకుఁజని యచ్చట జగదంబను సంవత్సరమువఱకుఁ బూజించుచుండిరఁట. ఒకసంవత్సరముకాఁగానే జగదంబ యానందరావుకు స్వప్నమందుఁ గనఁబడి "నీవు సంవత్సరమునుండి దృఢభక్తితోఁ జే

సిన సేవచే సంతుష్టురాల నైతిని. ఇఁక నీవు నీగ్రామమునకు వెళ్ళ వచ్చును. నీయిచ్ఛ దీర్చుటకై నేనే నీయుదరమున జన్మించెదను" అని పలికెనఁట. ఆనందరావున కిట్టిస్వప్నము కలిగినప్పుడే యాతని భార్యకుఁగూడ నిట్టివంటి స్వప్నమే కలిగెనఁట! తరువాతఁ గొద్ది దినములలోనే వారికి జగదంబయొక్క యంశమున నహల్యాబాయి పుట్టెనఁట! ఇటులహల్యాబాయి దేవతాంశసంభూతయని స్థాపించుట కనేక కథలను జెప్పెదరు. ఇవియన్నియు నిజము గాకున్నను వీనివలన నహల్యయందుఁ గల దేవతలకు శోభించు సద్గుణసమూహములును, లోకులకు నామెయందుఁ గల యమితపూజ్యభావమును వ్యక్తమగుచున్నవి.

అహల్య మైదుసంవత్సరముల దైనతరువాత నామెయందు నామె తరువాతఁజూపిన సద్గుణములయొక్క యంకురములు గనిపింపఁ దొడఁగెను. తనతో నాడుకొనుటకు వచ్చెడి యిరుగుపొరుగు పిల్లలను బహు ప్రేమించుచుండెను. ఆమెకుఁ దినుట కెవరయిన నేపదార్థము నిచ్చినను, అందులభాగము తన స్నేహితురాండ్రకిచ్చిగాని తాను భుజింపకుండెను. ప్రతిపదార్థమునందు పరమేశ్వరునిగా భావించి, దానిని పూజించుట యీమెకుఁ బ్రియమైన యాటలలో నొకటిగా నుండెను. ఇంత చిన్నవయస్సునందుఁ గూడ నీమెకు సత్యమునందు విశేషభక్తియుండెను. ఆమె ఎప్పుడును నసత్యమాడునది కాదు; ఎవ్వరైన స్నేహితురాలు అసత్యము చెప్పినపక్షమున నహల్యాబాయి యామెతో మాటలాడుట మానివేయుచుండెను.

ఆగ్రామమునం దొకచిన్నబడి యుండెను. ఆబడి యిప్పటి

స్కూళ్ళవంటిది గాక మనదేశములోఁ బొట్టపోసికొనుటకయి
కొందఱు బీదబ్రాహ్మణులు చిన్నచిన్న కుగ్రామములలో స్థాపిం
చునట్టి బడిగానుండెను. కాని పాపభీరువగునట్టియు, స్వకర్మనిష్ఠుఁ
డగునట్టియు, నీశ్వరభక్తిపరాయణుఁడగునట్టియు నొకబీదబ్రా
హ్మణుఁ డాబడిలో పంతులుగా నుండెను. ఆయనకుఁ బిల్లలవలన
నమావాస్యకు పూర్ణిమకు డబ్బులు తప్ప మఱేమియు దొరకుట
లేకపోయినను, పేష్వాగారిసంస్థానమునుండి నెల కైదు రూపా
యిలు దొరకుచుండెనఁట. ఆపంతులవారికిని అహల్యా తండ్రి
యగు ఆనందరావునకును అత్యంతవిహితము గలిగెను. ఆపంతు
లకు సంతానము లేనందువలన నాయన తన స్నేహితునికూఁతు
రగు అహల్యనే తనకూఁతురుగాఁ జూచుచుండెను. అహల్యయు
పంతులవారియొద్దనే యెప్పుడును పెరుగుచుండెను. ఆమె కాయన
తనశిష్యులతోఁ జదువుటయు వ్రాయుటయు నేర్పెను; అనేక గ్రం
థములలోని సద్బోధ నీమెకుఁ గఱపెను. ఇతఁడు చెప్పు భారత
భాగవతాది గ్రంథములలోనికథ లన్నియు నహల్య సావధాన
మతియై వినుచుండెనఁట. సీతాదేవి వనవాసము, ద్రౌపదీదేవి
యజ్ఞాతవాసము, దమయంతీదేవి కష్టములు, సావిత్రీదేవి విప
త్తులు, వారిపాతివ్రత్యము మొదలైన సాధ్వీస్త్రీలవృత్తాంతములు
మహాప్రేమతో వినుచుండెను. ఇట్టికథలను మఱలమఱలఁ జెప్పు
మని పంతులను వేఁడుచుండెను. చిన్నతనమునందు విద్య నేర్చి
యిట్టిసాధ్వీమణుల కష్టములన్నియు విని యున్నదిగనుకనే, తరు
వాతఁ దనమీఁదికి వచ్చిన యాపదల నన్నిఁటిని ధైర్యముతో
**సహించుటకు సమర్థురా లాయెనని చెప్పుటకు సందేహములేదు.**

చిన్నతనమునం దీమె నేర్చుకొనిన విద్యాప్రభావముచేతనే, తరువాత వచ్చిన కష్టసమయములయందు సద్గ్రంథములు చదువుకొని మనోదుఃఖమును శమింపఁజేసికొని, తనకర్తవ్యములను జేయఁగలిగినది. ఇందువలన రెండుసంగతులు స్పష్టమగుచున్నవి. ఒకటి యేమనఁగా, అహల్యాబాయిగారి కాలమునందును స్త్రీవిద్య యుండెను. రెండవ దేమనఁగా, స్త్రీలు విద్య నేర్చినయెడల వారికి నెప్పుడును ఆవిద్య లాభప్రదమే యగునుగాని నష్టప్రదము కాదు.

ఇట్లు ప్రవృద్ధమానయగు అహల్య తొమ్మిదిసంవత్సరములది కాఁగానే యామె వివాహము చేయుటకయి యామెతండ్రి వరుని వెతకసాగెను. కాని యానందరావు బీద వాఁడగుటచే నాతని కొమార్తెకు మంచిసంబంధము త్వరగా దొరకకపోయెను. కాని సుయోగమువలన దొరకక దొరకక యొకగొప్పసంబంధము దొరకెను. ఆవిధ మెట్లనిన:—

ఆసమయమున బాలాజీ బాజీరావు పూనాపట్టణమందు పేష్వాగా నుండెను. ఆయనతమ్ముఁడు రఘునాథరావు మల్హారరావుహోళకరను సర్దారును, అతని కుమారుఁడగు ఖండేరావును వెంబడి దీసికొని ఉత్తరహిందూస్థానమునకు యుద్ధార్థమయి వెళ్లి, శత్రువులను జయించి తిరిగి పూనాపట్టణము వెళ్ళునప్పుడు పాథరడిగ్రామములో బసచేసిరి. ఆనందరావుగారి యింటియెదుట నొకగొప్ప హనుమంతుని దేవాలయముండెను. పేష్వా లాగ్రామమునకు వచ్చినప్పు డెల్ల నాదేవాలయమునందే దిగుచుండిరి. కనుక నీపర్యాయముగూడ రఘునాథరావుగా రిచ్చటనే దిగిరి.

ఆరోజు బడిపంతులు పిల్లల కందఱకు సెలవిచ్చి, తాను రఘునాథ రావుగారియొద్దకి వెళ్ళి, గుడిలోన ముచ్చట లాడుచుండెను. ఒక నిమిషమయిన గురువును విడిచి నిలువని యహల్య యప్పుడు గురువుకొద్దకి వచ్చి కూర్చుండెను. శృంగారప్రబంధంబులయందుఁ గవులు వర్ణించిన స్త్రీలవలె అహల్య చంద్రముఖి గాకపోయినను, ఆమె ముఖముపై స్వాభావిక రాజప్రభ యుండుటవలన నామె చూచువారికి బహురమ్యముగా నుండెను. ఈమెను జూచి రఘునాథరావు పంతులను ఈమె యెవరని యడిగెను. అప్పుడాపంతు లీమె వృత్తాంతమును జెప్పి యీమె సుగుణసంపదలను మిగులఁ గొనియాడెను. అంతట ఖండేరావున కీమె యోగ్య మయినభార్య యని నిశ్చయించి రఘునాథరావుగారు ఖండేరావు తండ్రియయిన మల్హారరావుగారి యనుమతియడిగి, ఆయన సమ్మతి పుచ్చుకొని యానందరావును బిలిపించి, ముహూర్తము నిశ్చయించి సుముహూర్తమున నహల్యాఖండేరావులకు వివాహము చేసిరి. ఇట్లు బీదవానికూఁతు రయిన అహల్య యొక మండలాధీశ్వరుని భార్యయాయెను. కనుక మనమును ఇఁక నీమెను అహల్యయను సామాన్యనామముతో వాడక, అహల్యాబాయి యన్న గౌరవ నామముతోనే వాడుదము. ఇట్లు అహల్యాబాయి చరిత్రరూపమయిన నాటకములోని ప్రథమాంకము సమాప్తమాయెను. ఐనను రెండవయంకములోనికిఁ బోవకమునుపు, అహల్యాబాయిగారి భర్తయయిన ఖండేరావుగారి వంశమును గుఱించి కొంతవ్రాయుట యప్రాసంగికము కానేరదని, యిచ్చట సంగ్రహముగ వ్రాసెదను.

పూనాపట్టణముకొద్ద హోళను చిన్నపల్లె యుండెను. అచ్చటనొక ఖండూజీ యను గొల్లవాఁడు కాపుర ముండెను. అతనికి మల్హారీ యని యొక కుమారుఁడు గలిగెను. కుమారుఁడు చిన్నవాఁడుగ నుండఁగానే ఖండూజీ మృతుఁ డయ్యెను. తండ్రిచనిపోయినతరువాత మల్హారీ తన మేనమామగారి యింట్లో పెరుగుచుండెను. అచ్చట నీతఁడు మామగారి పశువులను మేపుచు కాలక్షేపము చేయుచుండెనఁట. పశువులను మేపుచుండినను చిన్నతనమునం దనేకపర్యాయములు, మల్హారీయొక్క సాహసము, శౌర్యము, ఆజ్ఞాధారకత్వము మొదలయిన గుణము లతనిమామగారికిఁ గానిపించెను. అప్పుడతఁడు తనయల్లుని పశువులు గాయవలదని చెప్పి, యతనికొఱకు, సేనాపతిదాభాడేయను సైన్యాధిపతియొక్క సైన్యమునందు చిన్నబంటుపని సంపాదించి యిచ్చెను. అప్పటినుండి మల్హారీయొక్క శౌర్యము గానుపింపసాగెను. ఎంతధైర్యము గలిగినను, ఎంతశౌర్యము గలిగినను, ఈగుణములను జూపించుటకు యోగ్యమయిన ప్రసంగము లేనియెడల నీగుణములు ప్రసిద్ధికి రానేరవు. మల్హారీ సైన్యమునందుఁ బ్రవేశించినప్పుడు పూనాపేష్వాకును, ఢిల్లిబాదుషహాకును, యుద్ధము జరుగుచుండెను. కొద్దిగ శౌర్యముఁ జూపినందున శిలేదారను అధికార మిచ్చి మల్హారీని ఈ యుద్ధమునకుఁ బంపిరి. యుద్ధమునందు మల్హారీ తనశౌర్యమును, చాతుర్యమును, కౌశలమును జూపినందున నతనికి నైదువందల గుఱ్ఱపుబంట్లపై నధికారము దొరికెను. తరువాత మాళవప్రాంతమునం దీతఁడు ధాయబహాదరను ఢిల్లీశ్వరుని సైన్యాధిపతిని ఘలిచెను. ఇందునకు మెచ్చి

బాజీరావు పేష్వాగా రితనికి మాళవప్రాంత మిచ్చి, సుబేదార్ మల్హారరావు హోళకరు అన్న బిరుదునొసంగిరి. ఇట్లు హోళను కుగ్రామమునందుఁ బుట్టి మల్హారీగొల్లవాఁడు, తనశౌర్యధైర్య ములచే నిందూరు సంస్థానమునకు రాజై మల్హారీరావు హోళ కరను బిరుదును సంపాదించుకొనెను; తన జన్మభూమి యయిన హోళగ్రామమును ఇతిహాసమునందు నజరామరముఁ జేసెను. ఈయనభార్య పేరు గౌతమాబాయి. వీరికి ఖండేరావను కుమా రుఁడు గలిగెను. ఇతఁడే యహల్యాబాయి పెనిమిటి. ఈతఁడు చిన్నతనమునుండియు సబలుఁడై, తండ్రివలెనే శౌర్యధైర్యసా హసములు గలవాఁడని విఖ్యాతుఁ డయ్యెను.

(౨) <u>అహల్యాబాయిగారి సంసారసుఖము</u> —ఇసుకమయమై, ప్రచండమార్తాండ కిరణములచేఁ దప్తమై, భయంకరమై యొప్పు నిర్జనప్రదేశమునందు నడుగు లెండవడిఁబురపురఁ బొక్క మధ్యా హ్నసమయమునఁ బ్రవాసము చేయు బాటసారికిఁ ద్రోవలో విస్తీర్ణమైన యామ్రవృక్షసమూహముయొక్క దట్టమైన ఛాయ యుఁ జల్లని జలాశయమును గానుపించినయెడల నెంతయానంద మగునో యంతయానందము, దుఃఖపరంపరలతో వ్యాప్తమై యీచరిత్రాత్మక మయిన నాటకమును జూచువారికి 'సంసారసుఖ' మను రెండవయంక మియ్యఁగలదు. అహల్యాబాయిగారి వివాహ మయినప్పటినుండి పదిసంవత్సరములవఱకు జరిగినకాల మామె జీవితములోని యత్యంత సుఖకరమయిన కాలమని చెప్పవచ్చును. అహల్యాబాయిగారి వివాహ మయినప్పటినుండియు నామె విశేష ముగా నత్తవారింటనే యుండెను. ఆమె చిన్నప్పటినుండియు

బీదవారియింటఁ బెరిగినదైనను విద్యయు, స్వాభావిక చతురతయు గలదిగావున, నత్తవారిల్లుప్రవేశించినతోడనే రాజయువతులకు శోభించెడి సుగుణము లన్నియు నేర్చుకొనెను. ఇఁక గృహమునం దలి బాంధవులతోడ నీమె యెట్లు వర్తించుచుండెనో చూతము.

మొదటినుండియు నీమె మామగారగు మల్హారరావు ఈమెను బహుప్రేమించు చుండెను. ఈమెయు నతనికి సేవచేసి, యతని యాజ్ఞఁ దప్పక వినుచు, దినదిన మాతనికృపను అధికముగా సం పాదించుచుండెను. ఈమెసుగుణసంపదలను జూచి యింటిలోని వారందఱికంటెను ఈమెను మామగా రధికముగాఁ జూచువాఁ డు. ఈమె గృహమునకు వచ్చిననాటినుండియు ననేకయుద్ధముల యందు జయము సంప్రాప్తమైనందున మల్హారరావు తనకోడలిని జయశ్రీయొక్క యపరావతారమని యెంచుచుండెను. ఏయుద్ధ మునకు వెడలినను మొదల నహల్యాబాయియాజ్ఞఁ బుచ్చుకొని, యామెవిజయము దొఱకునని చెప్పినయెడల యుద్ధమునకు వెళ్లును. ఇట్లు వినయాదిసద్గుణములతో నహల్యాబాయి మామ గారి పూర్ణకృపను బొందెను.

ఈమె యత్తగారగు గౌతమాబాయి గృహకృత్యముల యందు బహుదక్షురాలైనను, చాలకోపముగలది. వివాహము కాఁగానే సూక్ష్మబుద్ధిగల యహల్య, అత్తగారియొక్క కోపస్వ భావమును గుర్తెఱిఁగి, యామెకుఁ గోపమురాకుండునటులు వర్తిం చుచుండెను. ఎందులగుఱించియు నత్తగారికి నెదురు మాటలాడి నదికాదు. ఎల్లప్పుడును అత్తగారి యిచ్ఛప్రకారము నడుచుచు, అత్తగారి సద్గుణములనన్నిటిని గ్రహించుచు, నామెచేత నెల్ల

ప్పుడును ఆశీర్వచనములనే పడయుచుండెను. ఇంతచిన్నవయ
స్సునం దిట్లుప్రవర్తించుట కెంతవిద్యాబుద్ధులు కావలయునో
చదువరులే యోచింపఁగలరు.

అహల్యాబాయి కిద్దఱాఁడుబిడ్డలుండిరి. వారిరువురును ఖండే
రావుకంటెను పెద్దవారే. ఖండేరావుగారి పెద్దక్కగారి పేరు
హారకుబాయి; చిన్న యక్కగారి పేరు ఉదాబాయి. వీరిని
అహల్యాబాయి సొంతయక్కలవలెఁ జూచుచుండెను; ఇందు
వలన వారును మఱదలిపై నత్యంతానురాగముతో నుండిరి. ఖండే
రావుగారి వివాహము గాకమునుపే వీరి వివాహమైనందున
నహల్య వచ్చినతరువాత వీరు బహుశా యత్తవారియింటనే
యుండుచువచ్చిరి. ఐనను అహల్యాబాయి వారి నప్పుడప్పుడు
పిలిపించి, చాలరోజులవఱకుఁ దనయొద్దనే యుంచుకొని, వారికిఁ
దాను నేర్చినవిద్యను నేర్పును; తాను విన్న కథలన్నియు వారికిఁ
జెప్పును. ఇట్లు వీరు మువ్వురును నిష్కపటమైన ప్రేమతో నక్క
చెల్లెండ్రవలె వర్తించుచుండిరి.

అహల్యాబాయిగారికి సేవచేయుటకయి యనేకదాస దాసీ
లుండినను వారినెన్నఁడును ఆమె యెంతమాత్రము బాధపెట్టినది
కాదు. వారి నెన్నఁడైనను తిట్టియెఱుఁగదు. అందఱిని బహుద
యతోఁ జూచుచుండెను. తనకు నత్తగారును మామగారును
ఇచ్చిన ధన మామె తన సేవకుల యక్కఱలు దీర్చుటయందు
వ్యయపఱచుచుండెను. బీదవారి సంతోషమునుజూచి తానును
సంతోషపడుచుండెను. ఈసద్గుణము చేతనే తరువాత నహల్యా
బాయి విశేషకీర్తిని జెందెను.

దేవునియందు నహల్యాబాయి కత్యంతభక్తి యుండెను. చిన్ననాటి యీసద్గుణ మామెను ఐశ్వర్యకాలములోను విడిచి పదికాదు. అత్తగారు మామగారు చేసెడి పూజలకంటెను ఈమె యధికపూజలును, జపములును జేయుచుండెను. ఈభక్త్యాతిరేకమునకై యీమెను ఇంటివారందఱును పరిహసించెడివారట.

వివాహమైన తరువాత నైదుసంవత్సరముల కామె వ్యక్తురాలు ఆయెను. అంతవఱకు మన యాచారముల ననుసరించి భార్యాభర్తలకు పరస్పర సంభాషణ లేకుండుటవలన నప్పటివఱకు నహల్యాబాయి పెనిమిటియందుఁ దనకుఁగల యనురాగమును జూపలేకపోయెను. కాని తల్లిదండ్రులవలనఁ దన భార్యయందుఁ గల యలౌకిక సద్గుణములను వినుచుండినందున, ఖండేరావునకుఁ దన భార్యయం దతనికే యత్యంతానురాగము గలిగెను. ఇట్లు భార్యాభర్తలేకమైన తరువాత నహల్యాబాయి తన భర్తతో నెట్లు వర్తించెనో చూతము.

చిన్నప్పుడామె గురువునొద్ద వినిన సీత, ద్రౌపది, దమయంతి మొదలైన సాధ్వీమణుల చరిత్రంబులు మనస్సున స్మరణముగా నుంచుకొని యాసాధ్వీమణులవలెఁ బతిసేవ చేయవలయునని నిశ్చయించెను; ఆప్రకారమే చేయుచుండెను. పతియే పరమదైవతమని నమ్మి, యతని సేవయందును, అతని యాజ్ఞను శిరసావహించుటయందును, ఆయనను సదా సంతోషపెట్టుటయందును సదా మనోవాక్కాయములతో తత్పరురాలై యుండెను. పెనిమిటికంటె వెనుక నిదురించుట, ఆయనకన్న మొదలమేల్కనుట మొదలైన ధర్మములన్నియుఁ దప్పక నెరవేర్చుచుండెను.

ప్రతిదినము ప్రాతఃకాలమున ఖండేరావు వేటాడుటకు వెళ్ళి మధ్యాహ్నమునకు వచ్చుచుండెను. అప్పటివఱకు నహల్యాబాయి యెవరెంత చెప్పినను, భోజనము చేయునదికాదు. ఖండేరావింటి యొద్ద లేనప్పుడెల్లను, పెనిమిటి గ్రామాంతరమునకు వెళ్ళినప్పుడు, స్త్రీలు పాలింపవలసిన నియమములన్నియు నీమె పాలించుచుండెనఁట. ఇట్టి యకృత్రిమ ప్రేమగలభార్యను, ఖండేరా వత్యంతాదర బుద్ధితోను, అనుపమేయ ప్రేమతోను జూచుచుండెనని వేఱుగ వ్రాయవలెనా?

ఈ సుశీలముగల దంపతు లొండొరులపై నధికానురాగముతో దినములు గడపుచుండ రెండుసంవత్సరములకు వీరికి మాలీరావను కుమారుఁడు గలిగెను. తరువాత మూఁడు సంవత్సరములకు నొక కన్యారత్నము పుట్టెను. ఈమెపేరు ముంచాబాయి. ఈమెతల్లివలెనే సాధారణరూపవతి; గాని తల్లివలెనే సద్గుణసంపన్నయయ్యెను.

ఇట్లు అత్తమామల సంపూర్ణకటాక్షము, భర్తయొక్క యమితానురాగము, ఆఁడుబిడ్డలప్రేమ, సేవకజనుల భక్తి, కన్యాపుత్రుల బాలలీలలు, అపరిమితైశ్వర్యము మొదలైన సుఖసాధనము లేకీభవించి తన్నుఁగొలువ, అహల్యాబాయి కొన్ని సంవత్సరములు సౌఖ్య సముద్రములో మునిఁగియుండెను.

చదువరులారా! చరిత్రనాటకముయొక్క సౌఖ్యపూరితమైన రెండవయంకము సమాప్తమయినది. ఇఁక మూఁడవయంకముఁ జూచుటకు సిద్ధముగండు.

(3) అహల్యాబాయిగారి వైధవ్యమును, ఆమె రాజ్యము చేయుటయు—ఇంతవఱకు మనోరంజకమైన వర్ణనమువినిన చదువరు లీక దుఃఖపరంపరలతో వ్యాప్తమైయున్న వర్ణనమువినుటకు ధైర్యము నవలంబించి సిద్ధముకావలెను. ఈ మూఁడవయంకము నందు నహల్యాబాయిగారి కష్టము లనేకములు వర్ణింపఁబడినను, ఏసత్కృత్యములచేత నామెకీర్తి యజరామరమయినదో యాసత్కృత్యములుగూడ వర్ణింపఁబడును గనుక నీయంకము శుభాశుభవర్ణనలతో నిండియుండును.

పైని వ్రాసినప్రకార మహల్యాబాయి పరమసౌఖ్యంబు లనుభవించుచుండఁగా నన్ని యైహికసౌఖ్యములు క్షణభంగురంబులై నాశమును జెందినట్లు, ఆమె సౌఖ్యమును క్షణభంగురమాయెను. అట్టి సౌఖ్యములో నామె బహుదినములుండినపక్షమున నామె కీర్తి వెలువడదని కాఁబోలు నీశ్వరుఁ డామెపైఁ గష్టములఁ బంపెను. ఆమె మామగారగు మల్హారరావునకుఁ దురుష్కులతో యుద్ధము సంభవింపఁగా సమరప్రియుఁడగు ఖండేరా వత్యంతోత్సాహముతోఁ దండ్రినిగూడి యుద్ధమునకు వెడలెను. అతఁడు శత్రువులను బట్టుకొన బ్రయత్నించునంతలో శత్రుసైన్యము నుండి యొక గుండాకస్మికముగా వచ్చి యతని మస్తకమునకుఁ దగిలినందున నతఁడు మృతిఁ జెందెను. ఇటులు దన సౌభాగ్యము నష్టమయినదని వినఁగానే, పతివ్రతాతిలకమగు అహల్యాబాయి, సౌభాగ్యహీనయై యుండనొల్లక, ప్రాణసమానుఁడగు పతిని నెడఁబాయ నిచ్ఛలేక సహగమనమునకు సిద్ధమయ్యెను. పుత్రమరణాంబగ్నియై తనహృదయము నిదివఱకే కాల్చుచుండఁగా మల్హార

రావమాల్యాబాయి సహగమనమునకు సిద్ధమయినదన్న మాట వినఁగానే యత్యంత దుఃఖితుఁడై యామెయొద్దకువచ్చి యిట్లనియె. "అమ్మా నాయందు దయ లేక ఖండూ (ఇది ఖండేరావుముద్దు పేరు) నన్ను విడిచివెళ్ళినాఁడు. ఇఁక నీవును వెళ్లఁదలఁచితివా? ఈ ముసలివానిపై నీకుఁ గరుణలేదా? చనిపోయిన దహల్యాయనియు, నీవే నాకుమారుఁడగు ఖండూయనియు ననుకొనియెదను. ఇంత నిష్ఠురతనువహించి నన్నును, పిల్లలను విడిచిపోకుమా" ఇట్లనేకరీతులఁ గోడలిని వేడుకొనియు, నామెకు ననేకసమాధానములు చెప్పియు, నామెను సహగమనముఁ జేయకుండఁ జేసెను. ఇటులహల్యాబాయి లోకోపకారముచేయుచు వైధవ్యదశయందే కాలముగడుపుటకు నిశ్చయించెను. హిందూస్త్రీల వైధవ్యమంతటి ఘోరనరకము వేఱొకటిలేదని సకలజనములకుఁ దెలిసినవిషయమే. ఇట్టి హిందూవైధవ్యమను అనుపమేయ నరకకూపములో మునిఁగియు నహల్యాబాయి, ఈశ్వరభక్తి మొదలైనసాధనములచే మహాధైర్యముతో కాలముగడుపుచుండెను. కాని యీయామె యెంతెంత ధైర్యము నవలంబించుచుండెనో యంతంత యధికదుఃఖము లామెకు రాసాగెను. ఇట్టి కష్టము లామెపైఁ దెచ్చినందునకు మనమీశ్వరుని నిందింపఁగూడదు. ఇట్టికష్టము లామెకు సంప్రాప్తము కాకుండిన యెడల నానారీమణి ప్రభావమడఁగియుండి, ఆర్యస్త్రీలమగు మాకు, మాలోన నిట్టి నారీరత్న ముద్భవిల్లి మమ్ములనందఱిని పవిత్రలనుగఁ జేసెనను గర్వమున కవకాశము లేక యుండుననియు, విద్యనేర్చిన స్త్రీలు కష్ట సమయముననను సన్మార్గమును వదలక మహాధైర్యముతో నుందు

రనియు, సిద్ధాంతీకరించుటకు, ఈశ్వరుఁ డీకష్టము లహల్యాబా యికిఁ దెచ్చెను. కాఁబట్టి యాసర్వేశ్వరుని మనము పొగడవల సియే యుండును.

పతివిరహ దుఃఖము కొంచె మారుచుండు నంతలో, నామెను సహగమనమునుండి త్రిప్పి పుత్రభావముతోఁ జూచుకొనుచున్న యామె మామగారగు మల్హారరావుగారు గతించిరి. ఐనను ఆమె ధైర్యశీల గనుకఁ జిన్ననాఁడు చదివిన విద్యాప్రభావముచే సద్గ్రంథములను జదువుకొనుచు దుఃఖనివారణముఁ జేసికొనుచుండెను. ఈసంగతులన్నియు ౧౭౬౬ వ సంవత్సరప్రాంతమున జరిగినవి. అనఁగా నామె కప్పటికి నిరువది మూడుసంవత్సరముల వయస్సుండెను. మామగారు చనిపోయిన పిమ్మట నాలుమాసములకు నామె కుమారుఁడగు మాలేరావు గతించెను. ఈ మాలేరావు వలన నామెకు నెంతమాత్రము సుఖము లేకయుండెను. ఎందుకనఁగా నితఁడు బహుదుర్మార్గుఁడు. ఇతఁడు దుర్మార్గుఁడై నందువలన నీయనకు రాజ్యమీయఁగూడదని పలువురు చెప్పిరి. కాని పేష్వా గారియాజ్ఞచేత నితనికే రాజ్యము దొరికెను. కాని యితఁడు బహుదుర్మార్గవృత్తితో నడుచుచుండెను. అహల్యాబాయి బ్రాహ్మణులయం దధికాదరముగలదై వర్తించుచుండునని యెఱిఁగి వారినే యతఁడు విశేషబాధలు పెట్టసాగెను. బ్రాహ్మణులకు వస్త్రదానము చేయుమని తల్లిగారు చెప్పినయెడల బ్రాహ్మణులను బిలిపించి, వస్త్రములలో తేళ్లనుంచి వారికి నిచ్చుచుండెను. సువర్ణదానము చేసెదనని చెంబులలో నాణెములుంచి, వానిలో పురుగులనుబెట్టి బ్రాహ్మణులకు నిచ్చెడివాఁడఁట! ఇట్లు బ్రాహ్మ

ణులనేమి, యితరజనులనేమి నిష్కారణముగా బాధపెట్టుచుం డెను. ఇటులు మాలేరావు సర్వభూతములయందు మిక్కిలి దయగల యహల్యాబాయిగారి కత్యంత దుఃఖకారకుఁడగుచుం డెను. ఇట్టి దుష్టుఁ డీలోకమునందుండినయెడల తనభక్తురాలగు అహల్యాబాయికి నత్యంత దుఃఖమగునని కాంబోలును పరమేశ్వ రుఁడు వానిని త్వరలోనే యిహలోకమునుండి తీసికొనిపోయెను. తన కుమారుఁ డత్యంత దుర్మార్గుఁడని తలఁచి యహల్యాబాయి యా తనిని ఏనుఁగులచేతను గుఱ్ఱములచేతను ద్రొక్కించి చంపెనని వదంతిగలదు. కాని యీవదంతికి నితిహాసమునం దాధారమే మియులేదు. అహల్యాబాయిగారి న్యాయప్రియతను జూపుటకై యెవరో యిట్టికథను గల్పించినారు. ఇందు విషయమై మాల్కా ముదొరగా రిట్లు వ్రాసియున్నారు. "మాలేరావు మరణసంబం ధమైన వదంతి కొందఱాంగ్లేయులు విని నమ్మిరి. కాని నే నంతతో నూరకుండక యహల్యాబాయి యందిట్టి కళంకము గలదా, లేదా యని యత్యంత సూక్ష్మరీతిగా విచారణచేసితిని. ఆమెయందు నెంతమాత్రము దోషము లేదని స్పష్టమయినది." ఈప్రకారము గా నన్యదేశస్థుఁడగు గ్రంథకారుని సాక్ష్యముండఁగ నహల్యా బాయి నిర్దోషురాలని వేఱుగ చెప్పనక్కఱలేదుగదా. కొడుకును జంపిన వదంతి నిజమైనను అది యహల్యాబాయి గారికి భూషణ ప్రదమేగాని దూషణప్రదముగాదు. జనకంటకుఁడగు వానిని వధియించుట రాజులకు ధర్మము. అట్టిజనకంటకుఁడు సొంత కు మారుఁడైనను, పుత్రప్రేమవదలి జనులహితముకొఱకు వానిని వధియించుట యధిక భూషణాస్పదము.

ఏది యెట్లయినను మాలేరావు గతించుటవలన దేశమునకు బహు మేలైనదనుటకు సందేహములేదు. అటులుగాక యతఁడు జీవించియున్న యెడల తద్దేశీయుల కనేక కష్టములు గలిగి దేశ మంతయుఁ బాడయియుండును. అహల్యాబాయిగారి సద్గుణ పుంజము వెలువడుట సంభవింపకపోవును. మాలేరావు మృతుఁడైనతోడనే రాజ్య మెవరిపేరిట నడుపవలయునో యని విచారణకుఁ బ్రారంభమాయెను. పూనాలోని పేష్వాలు వీరికిఁ బ్రభువులుగనుక వారి కీవర్తమానము దెలియఁజేసిరి. అప్పుడు మాధవరావుగారు పేష్వాగానుండిరి; అధికారమంతయు రఘునాథరావుగారి చేతిలోనుండెను. మాధవరా వెప్పుడును న్యాయమార్గప్రవర్తకుఁడై యన్యాయార్జనమునం దిచ్ఛలేక యుండెను. రఘునాథరావు మంచివాఁడేగాని యొకానొకప్పు డాయన పిచ్చివానివలె మూర్ఖకృత్యంబులు చేయుచుండెను. మాలేరావుకాలము చేసినప్పుడు, గంగాధర యశవంతు, అహల్యాబాయికి దివానుగా నుండెను. ఆయన యహల్యాబాయి కిట్లుపదేశించెను. "మీ సగోత్రీకుఁడగు కుఱ్ఱవాని నెవరినైనను దత్తతఁదీసికొని వాని కీరాజ్యము సమర్పింపుఁడు. వాఁడు పెద్దవాఁడగువఱకు నేను రాజ్యమును జూచెదను. మీరు మీ కొఱకు కొన్నిగ్రామములు పుచ్చుకొని విడిగా నుండవలసినది. మీ రాఁడువారగుటచే మీచేత రాజ్యముచేయుట కానేరదు." ఈమాటలకు నహల్యాబాయి సమ్మతింపక తానే రాజ్యము చేసెదనని గంగాధర యశవంతుతోఁ జెప్పెను. స్త్రీయై యిట్లు స్వబుద్ధితోనే రాజ్యముఁ జేయఁదలంపఁగాఁ జూచి గంగాధరునకుఁ గోపము వచ్చి, యేదైన నుపాయము పన్ని యామె

నవమానపఱుపవలెనని యతఁడు దలఁచెను. ఇట్లుతలఁచి "హోళ్
కరువారి రాజ్యమున కిప్పుడు వారసుదారు లెవరు లేనందున ఈ
రాజ్యము మీ రనాయాసముగాఁ బుచ్చుకొనవచ్చును." అని
రఘునాథరావుకు వ్రాసిపంపెను. రఘునాథ రావదివఱకే స్వతంత్ర
రాజ్యము కావలయునని కోరుచున్నవాఁడుగనుక, గంగాధర పంతు
గారి పత్రికను జూచినతోడనే సైన్యసమేతుఁడయి మాళవదేశ
ముపై దండయాత్రకు వెడలెను. ఈసంగతియంతయు దుఃఖమ
గ్నయగు అహల్యాబాయిగారికిఁ దెలుపఁగానే యామె ధైర్యమవ
లంబించి, భోసలా, గాయకవాడ్, దాభాడే మొదలగు రాజుల
కందఱకును గుప్తముగా నిట్లు వ్రాసిపంపెను. "కైలాసవాసులగు
మల్హారరావు సుబేదారుగారు శ్రీమంతులకొఱకు (శ్రీమంతులని
పేష్వాలకు బిరుదు) ననేక కష్టముల ననుభవించి వారిరాజ్యమును
స్థిరపఱచిరి. అట్టి సేవకుని మరణానంతర మతనివంశస్థులమగు మము
లను రక్షించి మాచే సేవ చేయించుకొనుట శ్రీమంతులకు ధర్మము.
అటులు సేయక వారు మావద్దఁ గల యల్పధనమున కాశపడి,
మారాజ్యమును గొనుటకు వచ్చుచున్నారు. నేఁడు మారాజ్య
ముపై దండెత్తి వచ్చినటులు రేపు మీరాజ్యముపైకి రాఁగలరు.
కనుక నాకు సహాయముగా మీరు సైన్యములను బంపవలెను."
ఇట్లీమె యుత్తరములు పంపఁగానే సంస్థానాధిపతు లందఱు తమ
సైన్యముల నామెకు సహాయముగాఁ బంపి, తాము సహాయ
మునకు వచ్చెదమని వాగ్దానములు చేసిరి. ఇంతలో నహల్యా
బాయి మాధవరావు పేష్వాయొద్దకు రాఘోబా దురుద్దేశము
లను దెలుపుటకయి యొకచారుని బంపెను. అందుపై నాతఁడు

“నీరాజ్యమును గుఱించి యెవ్వరేని పాపబుద్ధి దలఁచినయెడల వారినిఁ దప్పక దండింపుము” అని ప్రత్యుత్తరముఁ బంపెను. తరువాత శత్రువుల మనమున భయంబుఁ బుట్టించుటకునై యహల్యాబాయి యొక గొప్పరాజసభ చేసి యందున దానిట్లు భాషించెను “నేను అబలనని దలఁపఁదగదు. నేను భుజముపై బొంగుపెట్టుకొని (అనగా శస్త్రముఁ బుచ్చుకొనక యొక చిన్న కట్టెను దీసికొని యని యర్థము) యుద్ధమునకు బయలు దేఱినపక్షమున శ్రీమంతుల రాజ్యశ్రీకి మోసము రాకమానదు. ఈరాజ్యమును మాపూర్వు లఖండశౌర్యముచే సంపాదించిరేకాని, ఆటపాటలవలన సంపాదింపలేదు. కనుకఁ బ్రభువులగువారు మావలన యోగ్యమైనసేవ చేయించుకొనవలయునేగాని, యాశగొట్టు బ్రాహ్మణులు (అనఁగా పేష్వాలు) ధనాశచే మారాజ్యమును దీసికొనియెదమనిన అటులు గానేరదని వారు దృఢముగా నెఱుఁగవలయును !” ఆహా ! ఏమి యీయుగ్రమైనస్వాభిమానము గల క్షాత్రతేజపు పలుకులు ! మహారాష్ట్రభాషయందీపలుకులు బహు వీరరసపూరితములయి యున్నవి. కాని యంత వీరరసముతో నాంధ్రమునందు భాషాంతరీకరించుటకు వీలులేదని చింతిల్లవలసి యున్నది. ఈవాక్యములు కొద్దిదినముల లోనే దేశమంతయు వ్యాపించి, రాఘోబా దాదాగారికిని శ్రుతములయ్యెను. కాని గంగాధరపంతుగారి ప్రోత్సాహము వలన రాఘోబాగారీమాటలను లక్ష్యపెట్టినవారుకారు. రాఘోబా యేఁబదివేల సైన్యముతోఁ దనరాజ్యమును సమీపించినాఁడని విని యహల్యాబాయి యతని కిట్లు వర్తమానమం

పెను. "స్త్రీతో యుద్ధముఁ జేయుట ధర్మముగాదు. అందువలన మీ కపకీర్తియేగాని కీర్తి గలుగనేరదు. మీతో యుద్ధముఁ జేయుటకయి నేనును గొప్ప సైన్యమును సిద్ధముచేసి యుంచి నాను. ఈయుద్ధమందు మీరు ఓడిపోయినపక్షమున మీకు తల వంపులు కాఁగలవు. మీరు గెలిచినను, స్త్రీని నోడించె ననిన యపకీర్తియే గాని, మీకుఁ గలుగు లాభములేదు." ఇట్టివర్త మానము విని, రాఘోబా సిగ్గుపడి, అపజయము గలుగునేమో యని తలఁచి యహల్యాబాయిగారిని పుత్రమరణమునకై యాద రించుటకు వచ్చుచున్నానేగాని, రాజ్యమును దీసికొనుటకు వచ్చుచుండ లేదని వర్తమానమంపి, సైన్యమంతయు వెనుకనే యుంచి, పరిమితజనులతో నిందూరుకు వెళ్లి, యహల్యాబా యిని నాదరించి పూనాకు వెళ్ళెను. ఈప్రకార మహల్యాబా యి, భర్తృశ్వశురపుత్రమరణశోకమువలన మిక్కిలి చింత పాలై యుండియుఁ దన దుఃఖము నడఁచి యనేకోపాయముల నాలోచించి రాఘోబావంటి యసమానశూరునిసహితము ఏమి యపాయము చేయక వెళ్లునట్టులు చేయుటవలన నాపె శౌర్యధై ర్యసాహసాది గుణము లసమానము లయినవి యని చెప్పుటకు సందేహము లేదు.

ఇట్లు రాజ్యమునకు సంపూర్ణాధికారము ప్రాప్తమైన తరు వాత ౧౭౬౬-వ సంవత్సరమునుండి ౧౭౯౫-వ సంవత్సరమువఱకు, ముప్పదిసంవత్సరము లహల్యాబాయి రాజ్యముచేసెను. ఈముప్ప దిసంవత్సరములలోనే యహల్యాబాయి ఆచంద్రార్కము శా శ్వతముగానుండు కీర్తిని సంపాదించుకొనెను. ఆమె తనకు దూర

పుబాంధవుఁడగు తుకోజీరా వనువానిని తనమంత్రిగా నేర్పఱచు కొనెను. దండె త్తిపోవుట, సైన్యములను గూర్చుట, రాజ్యమును చోరభయమునుండి కాపాడుట మొదలయిన యుద్ధసంబంధము లైన పనులన్నియు నితఁడు చూచుచుండెను. రాజ్యములోని కడ మసంగతు లన్నియు నహల్యాబాయిగారు చూచుచుండెను. తుకోజీ, యహల్యాబాయిగారిని సొంతతల్లివలె జూచుచుండెను. అహల్యాబాయిగారును అతనియం దధికవిశ్వాసము గలిగి వర్తిం చుచుండిరి. ముప్పదిసంవత్సరములవఱ కిద్దఱును రాజ్యము చేసిరి; గాని యంతకాలములో నొకనాడైనను, తుకోజీ యహల్యాబా యిగారి యాజ్ఞను ఉల్లంఘించిన వాఁడుకాఁడు; అహల్యాబాయి యు నతని నొకమాట యైనను అనినదికాదు.

<u>అహల్యాబాయిదినచర్య.</u>—ఈమె యత్యంత నియమితముగాఁ బనులఁ జేయుచుండెను. సోమరితనము అనుమాట యామె స్వ ప్నమునం దైనను లేకపోయెను. ఆమె ప్రతికార్యమును, నియమిం చుకొనిన సమయమునకే తప్పక చేయుచుండెను; గనుక నామె దలఁచిన పనులన్నియుఁ దప్పక సిద్ధించుచుండెను. ఈమె ప్రతిది నము సూర్యోదయమునకుఁ బూర్వమె నిదురమేల్కొని, నిత్యక ర్మలను నిర్వర్తించుకొని, స్నానముఁ జేసి, సొంతముగా దేవతా ర్చనముఁ జేయును. పిదపఁ బురాణశ్రవణము చేసి, బ్రాహ్మణుల కును, బీదలకును దానధర్మము చేయుచుండెను. తరువాత భోజ నముఁ జేయును. వీరిజాతియందు మాంసాహారము చేయుటకు నభ్యంతరము లేకపోయినను, ఈమెమాత్ర మెన్నఁడును మాంస మును దిన్నదికాదు. భోజనానంతరము కొద్దిగా వామకుక్షి చేసి,

రెండుగంటలకు రాజసభకు వెళ్లును. అచ్చటికి వెళ్ళి వసూలు మొదలయినలెక్కలు స్వయముగాఁ జూచి, ప్రజల కలహములను నాపి సూర్యాస్తమయమువఱకు నింటికి వచ్చును. సాయంకాలము మఱల దేవపూజఁ జేసి, రాజ్యసంబంధమైన మిగిలిన కార్యములనుజక్కపఱచి రాత్రి రమారమి పదునొకొండుగంటల కామె నిదురించుచుండెను.* అబాధితముగా నిట్టిక్రమము ఆమె మరణకాలమువరకును జరుగుచుండెను. పండుగలు, ఉపవాసములు, వ్రతములు మొదలైన విశేషదినములు వచ్చినప్పుడుమాత్రము, అహల్యాబాయి దినమంతయు వ్రతములోనె గడుపుచుండెను. సకలనియమములు కేవల బ్రాహ్మణస్త్రీవలె జరుపుచుండెను. ఆమె రంగుబట్టల నెన్నఁడును గట్టినదికాదు. ఎల్లప్పుడును స్వచ్ఛమైన తెల్లవస్త్రముచే ధరించుచుండెను. పతి మరణానంతరము భూషణముల నెన్నఁడును ధరించునదికాదు. హిందూశాస్త్రమునందుఁ గల వైధవ్యధర్మముల నన్నిఁటిని దప్పక పాలించుచుండెను. ఇట్టినియమము లన్నియు రమారమి (౩౦) సంవత్సరములు తప్పక నడిపెను.

<u>ఆమెదానధర్మములు</u>-అహల్యాబాయిగారి కీర్తి యీదేశము నంతటను వ్యాపించుటకు ముఖ్యకారణ మామెధర్మబుద్ధియే. ఆమె నామము వినఁగానే యమితానంద భరితులయి మహారాష్ట్రులందఱు ఆమె కనేకాశీర్వచనముల నిచ్చుచున్నారు; ఈమె సామాన్యమైన మానవకోటిలోనిదైనను ఈమెను 'దేవి అహల్యా' యన్న నామముతో సంబోధించుచున్నారు. ఇందుకుఁ గారణ మామె ధర్మబుద్ధియే. ఈమెను స్తుతియించుట పావనకారక మనియు,

నీమెను దలంచినందువలన పాపములు నాశమగుననియు, ననేక మహారాష్ట్రీయులు దలంతురు. ఇందున కీమె ధర్మబుద్ధియే కారణము. ఈమె చిహ్నమేమైనను లేని క్షేత్ర మేదియు నీభరత ఖండమునందు లేదని చెప్పవచ్చును. భరతఖండము క్షేత్రముల యొక్కయు తీర్థములయొక్కయు పుట్టినయిల్లు. ముప్పదిమూడు కోట్ల దేవతలను బూజించెడి హిందువుల దేశమునం దసంఖ్య క్షేత్రము లుండుట యొక విచిత్రముకాదు. ఈక్షేత్రములలో నహల్యాబాయి శాశ్వతదానములను జేసియున్నది. కనుక నీమె కీర్తి విస్తరించినది. క్రొత్త దేవాలయములఁ గట్టించుట, జీర్ణ దేవాలయముల నుద్ధరించుట, అన్నసత్రములు వేయించుట, దేవతలకు శాశ్వతగంగాభిషేకము జరుగునట్లు నేర్పాటుచేయుట మొదలయిన యామెయిచ్చిన ధర్మకృత్యము లనేకములు చేసినది. క్షేత్రములలో నీమెపేరిట ధర్మకృత్యము లనేకములు జరుగుచున్నవి. కేవలము క్షేత్ర బ్రాహ్మణులకే యామె దానము చేయుచుండిన దికాదు. 'ఆత్మ' యను శబ్దమునువిడిచి 'విశ్వమ'ను శబ్దమును ధరించి, స్వకుటుంబమును మఱచి విశ్వమునే కుటుంబముగనెంచి, స్వబాలకులయందలి యనురాగమును తగ్గించి విశ్వములోని సమస్తప్రాణికోట్లను తమ బాలకులుగానే గ్రహించి, ఆత్మవిషయక దుఃఖమున కేడ్వక విశ్వవిషయక దుఃఖమునకై యశ్రుబిందువులు రాల్చుచు, జగమువలనఁ దమకుఁగలిగెడి మానావమానములను లక్ష్యపెట్టక యాజగత్తుయొక్క హితార్థమే జన్మము వ్యయపఱచు విశ్వకుటుంబులయిన మహాత్ములలోనిది యహల్యాబాయియైనందున నామె శూద్రులకు, చండాలులకు, పశువు

లకు, పక్షులకు సదా హితమే చేయుచుండెను ! మృతిఁజెందిన పుత్రాదులకొఱకు దుఃఖము గలిగినపు డామె తనకుఁదానే యిట్లుపదేశించుకొనును. "చనిపోయిన కుమారుఁ డొక్కఁడే గాక, నీదుఃఖమునకు, నీయుద్వేగమునకు, నీప్రేమకు, నీచింతకుఁ బాత్రులైన సుతసంఘ మీవిశ్వమునం దసంఖ్యముగలదు. ఈజగమునం దెందఱి దుఃఖమును నివారించిన, నెందఱిని సుఖులను జేసిన, నెందఱిని లాలించిన, నెందఱిని పాలించిన వారందఱు నీకుఁ గుమారులే. కనుక నీవు వ్యక్తివిషయమైన శోకమును విడువుము. ఇటులుచేసిన దుఃఖితుల దుఃఖమును బంచుకొనుటకు, సుఖుల సుఖమునువృద్ధిఁజేయుటకు ననంతావసరము లెల్లప్పుడునుదొఱకును." ఇట్లు యోజించి యహల్యాబాయి విశ్వముయొక్క దుఃఖమును మాన్పుటయందు నాత్మదుఃఖమును మఱచుచుండెను. అనేకాన్నసత్రములను స్థాపించి ప్రతిదినమును సర్వజాతులవారికి ననంతముగా నన్నదానము చేయుచుండెను. కాఁపువారు పక్షులను పొలములలోనికి రానియ్యక ఱాళ్లురువ్వెదరని చూచి, కరుణించి, తన డబ్బుపెట్టి పండినపొలములుకొని పక్షులకొఱకు విడుచుచుండెను! కాఁపులు తమయెడ్లను బహుబాధపెట్టెదరని చూచి మిక్కిలి జాలిపడి యహల్యాబాయిచే నియమించిన సేవకులు, కాఁపులు దున్నునప్పుడు వారినాగళ్లనుఆపి, యెడ్లనువిప్పి వానికి మేతయు నీళ్లును బెట్టుచుందురు. మల్హారరావుగారు మరణముఁ జెందినప్పుడు నాలుగుకోట్ల రూపాయలు భాండాగారము నందుండెను. ఇదియునుగాక యహల్యాబాయిగారి సొంతవ్యయమునకై నాలుగులక్షల యగ్రహారము విడిగా నుండెను. ఈ ధనమంతయు నేర్పుతో

నహల్యాబాయి యట్టి ధర్మకృత్యములకై వ్యయపఱచుచుండెను.

ఆమె యుగ్రశాసనము—అహల్యాబాయి మహాధార్మికయు, సర్వభూతములయందు దయగలదియు నయినప్పటికి, నామె యుగ్రశాసనగా నుండెను. ఆమె న్యాయబుద్ధియు, సత్యపరాయణతయు మిక్కిలియుగ్రముగానుండినవి. ఆమె సేవకులలో నెవ్వరైన నొకతప్పు చేసినయెడల దయదలఁపక వారికి ఘోరశిక్ష విధించుచుండెను. ఆమె రాజ్యమునందు నర్మదానదీతీరమునందలి గోండువారు ప్రజలకు నపాయముఁ జేయుచుండిరి. వారికి నామె మొదట తిన్నగా బుద్ధిచెప్పెనుగాని వారు విననందున వారలలో ననేకులకుఁ బ్రాణాంతశిక్షవిధించెను. తిండికిలేదని బందిపోటులలోఁ జేరువారికి నామె యుపజీవనమునకు సాధనములఁ జూపుచుండెను. వారికి బంజరుభూములను బీళ్లను గూరకయిచ్చి దున్నుకొని బ్రతుకుఁడని చెప్పెను. ఇఁక నెన్నడును బందిపోటులలోఁ గూడమని వారిచే బాసచేయించుకొనును. వారు వచనమును తప్పినయెడల వారికి ఘోరశిక్ష విధించును. కనుక నామె రాజ్యమునందు నన్యాయముచేయుటకు లోకులు భయపడుచుండిరి. పెక్కులేల. ఒకానొకసమయమునఁ దుకోజీ సైన్యసమేతుండై యుండినప్పుడేదో యొకతప్పు చేసెనఁట. ఈమాటవినఁగానే యహల్యాబాయి యది నిజమాయని విచారించి, నిజమని తెలిసికొని, "రాజధానియందు సైన్యముతో మీరుండిన యెడలఁ బ్రజలకు మిగుల బాధగలుగును; గనుక నిందూరువదలి మీరుసైన్యము నింకొకచోటికిఁ దీసికొనిపొండు" అని తుకోజీకి యాజ్ఞచేసెను. ఈయాజ్ఞ నతఁడు శిరసావహించి తనతప్పునకు క్షమాపణ యడుగుకొనెను. తుకోజీరా

వుచేసిన యపరాధ మేమనఁగా—ఇందూరిపట్టణములోని దేవీ
చందను గొప్పసాహుకారు. అపుత్రకుఁడై మృతిఁజెందెను. అతని
ధనమునకు వారసుదారుఁ డెవఁడును లేనందువలన నతని సొత్తం
తయు తుకోజీ జప్తుచేసి సర్కారు బొక్కసములోనికిఁ జేర్చెను.
ఈసంగతి యహల్యాబాయిగారికిఁ దెలిసినతోడనే యామె దేవీ
చందుభార్యను బిలిపించి, యామెమగని సొత్తంతయు నామె
కప్పగించి కుమారుని బెంచుకొని సొత్తు ననుభవింపుమని
చెప్పెను! ఆహా! ఏమియీయామె యౌదార్యమును, న్యాయబుద్ధియు!
ఆమె రాజ్యమునందున్న మాండలికరాజు లనేకు లామెకుఁ గప్ప
ముల నిచ్చుచుండిరి. కాని యీయామె స్త్రీయైనను, విధవయైనను,
ఈమెను ధిక్కరించునంత ధైర్య మెవరికిని లేకపోయెను. ఈమె
యుగ్రశాసనమునుజూచి "ఈమెకుఁ ద్వరగా కప్పమియ్యనియెడల
నీమె యేమిచేయును" అన్నవిచార మెవరికి వచ్చినదికాదు. ఒకసారి
ఉదేఫురారుయొక్క రాణా యీయామె నివారించిన వినక రామపురా
యనుగ్రామమును దీసికొనుటకు సిద్ధుఁడయ్యెను. ఆసమయమున
తుకాజీరావు దక్షిణమున యుద్ధముఁ జేయుచుండెను; కాన అహ
ల్యాబాయివద్ద నంతగా సైన్యము లేకపోయెను. ఐననుభయపడక
అహల్యాబాయి, కొంతసైన్యంబిచ్చి శరీఫభాయీ యనువానిని
ఉదేపూరురాణాపైకిఁ బంపెను. అప్పుడా రాణా పరాభవమును
బొంది యహల్యాబాయికి శరణుచొచ్చెను. ఆమె యతనిని క్షమిం
చెను. ముప్పదిసంవత్సరముల వఱకు నీమెరాజ్యముఁ జేసెను; గాని
అంతకాల మీయామెతో నెవరును తగవులాడినవారుకారు. మహాదజీ
శిందేవంటి రాజకుశలుఁడును, రణశూరుఁడును ఈమెను సదా

సన్మానించుచుండెను. స్వరాజ్యమునం దేమి, పరరాజ్యమునం దేమి యీమెకు బహుమాన్యతయుండెను. ఈమె రాజ్యములోని యధికారులందఱును ఈమెకుఁ జాల భయపడుచుండిరి. భేమదాసను నొకసాహుకారీమె రాజ్యమున, నపుత్రకుఁడై చనిపోయెను. కమావీస్దారను అధికారి యీసాహుకారు భార్యను లంచమడిగెను. ఆమె లంచమీయనందున నాయధికారి 'నీధనమంతయు జప్తుచేసెద'నని యామెను భయపెట్టెను. ఈసంగతి తెలిసినతోడనే యహల్యాబాయి యాయధికారిని అధికారమునుండి తొలఁగించెను. భేమదాసుభార్యకు దత్తపుత్రుని దీసికొనుట కనుజ్ఞనొసఁగెను. అత్యుగ్రశాసనము, న్యాయబుద్ధి, భూతదయ మొదలైన పరస్పర విరుద్ధాభాసంబులైన సద్గుణంబులను గ్రహించుట రాజుల కత్యావశ్యకంబని వేఱఁగఁ జెప్పవలెనా?

ఆమె స్వభావము—ఇదివఱకు వ్రాసిన వర్ణనవలన నీమె స్వభావమిట్టిదని సహజముగా తేటపడును. కాని యొకటిరెండు గుణములు వర్ణించుట యిదివఱకుఁ బడనందున నిప్పుడు వర్ణించెద. స్త్రీలు సాధారణముగా స్తోత్రప్రియులు. ఈదుర్గుణము స్త్రీలయందే యుండునని కాదు. సామాన్యముగా సర్వజనులును స్తోత్రప్రియులే. అహల్యాబాయిగారియం దీదోషము లేశమైనను లేకయుండెను. ఇందుకుఁ గొన్ని నిదర్శనములు గలవు. ఒకానొక సమయమునం దొక కవి యీమెపై నొక కావ్యమువ్రాసి బహుమతిఁ బొందుటకై యాకావ్యమును దీసికొని యహల్యాబాయి వద్దకివెళ్లెను. అప్పుడామె యాకావ్యమును నదిలోఁ బడవైచి యాకవితో నిట్లనియె: "ఓకవివర్యా! అల్పజ్ఞురాలనగు నన్ను

స్తుతించినందున లాభమేమి? సర్వజ్ఞుఁడయిన యీశ్వరుని స్తుతిం
పుమా." ఇట్లుచెప్పి యతనిని పంపివేసెను! ఈమెకుఁ బరధన
మునం దాశలేకుండెనని స్థాపించెడి రెండు ఉదాహరణము లిది
వఱకే యియ్యఁబడినవి. ఇంకొక యుదాహరణము వినుఁడు.
తాపీదాసు బనారసుదాసు అను నిద్దరన్నదమ్ములు పుత్రులులేకయే
గతప్రాణులైరి. వారికి నాలుగులక్షల రూపాయీల సొత్తుండెను.
తాపీదాసుని భార్యయగు మహేశ్వరి యహల్యాబాయిగారి
వద్దికివచ్చి "అమ్మా! తమరాజ్యమునందుండి తమ యనుగ్రహ
మువలన నాభర్తయు, మఱఁదియు సంపాదించినట్టి యీయైశ్వ
ర్యము తమదే. కనుక దీనిని స్వీకరింపుఁడు" అని పలికెను.
అప్పు డహల్యాబాయి మహేశ్వరిని జూచి యిట్లనియె "నీభర్త
యొక్కయు, మఱఁదియొక్కయు ధనము నీదేగాని నాదిగాదు.
నీకక్కఱలేని యెడల నీపెనిమిటి పేరుండునటుల నేమయిన గొప్ప
కార్య మీధనముతోఁ జేయుము." ఆమాటవిని మహేశ్వరి పెని
మిటిపేరట గొప్ప దేవాలయమును, ఏటివద్ద ఘట్టమునుగట్టిం
చెనఁట! ఇట్లింటికివచ్చు ధనమును నిరపేక్ష బుద్ధితోఁ ద్రిప్పిన ధన్యా
త్మురాలి నెంతగొనియాడినను కొఱఁతయే. ద్వాపర యుగము
నందలి యుధిష్ఠిరుని నిస్పృహతను గుఱించి యొక కథ చెప్పెదరు.
ఆర్కాటు పట్టణమును జయించినప్పుడు, క్లైవను ఇంగ్లీషు సైన్యా
ధిపతి, తనవద్ద దాచనిచ్చినసొమ్ము ఎవరిది వారి కిచ్చెనఁట. ఈ
స్వల్పమైన ఔదార్యమునకై యింగ్లీషు గ్రంథకారులతనిపై సదా
స్తుతిరూపమయిన వృష్టిఁ జేయుచున్నారు. కాని యివియన్నియు
నహల్యాబాయిగారి యౌదార్యము ముందట క్షుల్లకౌదార్య

ములేయని చెప్పవచ్చును! స్త్రీయయ్యును, గొల్లజాతియ య్యును, ఇంత సదాచారసంపన్నతను, ఇంతశ్రేష్ఠతను, ఇంత యధికారమును సంపాదించిన యహల్యాబాయిని నారీరత్నమని యేల చెప్పఁగూడదు. ఈమె స్వభావమునందు శాంతతయు, సౌమ్యతయు, విశేషముగా నుండెను. గర్వం బీమెను ఎప్పుడును స్పృశించినదికాదు. కపటమనుమాటయీమె యెఱుఁగనే యె ఱుఁగదు; దంభ మింతైనను ఈమెయందు లేదు అసత్యభా షణ మెన్నడును జేసినదికాదు. దురాచారమను మాటయు, కాలముయొక్క దురుపయోగమన్నమాటయు నామె స్వప్నమం దైనను ఎఱుఁగదు. ఈసాధ్వీమణియొక్క యేయే సద్గుణములను అధికముగా వర్ణింపవలయునో నాకుఁ దెలియకున్నది. సర్వసద్గు ణములకు వాసస్థానమయిన యహల్యాబాయియం దీసద్గుణమ ధికముగా నుండెననియు నీసద్గుణమల్పముగా నుండెననియుఁ జెప్పు టకు వీలులేదు.

ఈవర్ణన యంతయు నతిశయోక్తియని కొందరు అనుకొనవ చ్చును. అతిశయోక్తులతోఁ గావ్యమును నింపుట మనదేశము లోని కవులకు స్వాభావిక ధర్మమయినందున నిట్లనుకొనుట యొక యాశ్చర్యముగాదు. కాని నేను వర్ణించిన దానిలో నతిశ యోక్తి యేమియులేదనియు, సత్యమే నిండియున్నదనియుఁ జూపుటకుఁ బరదేశీయులగ్రంథములోని ప్రమాణముల నిచ్చెదను. మాల్కము దొరవారు తమయితిహాసమునం దిట్లు వ్రాసినారు. “అహల్యాబాయితో వైరముఁ జేయుటయు, పనివచ్చునప్పు డామెకు సహాయము చేయకపోవుటయు, గోహత్యతో. సమాన

ములైన పాపములని సకల మహారాష్ట్ర రాజులు దలఁచుచుం డిరి." "సకల జనులును ఆమెయందు సమానముగాఁ బూజ్యభా వము నుంచుచుండిరి. పేష్వా వా రామె నెట్లు సన్మానించుచుం డిరో యటులనే హైదరాబాదు నైజామువారును, మయిసూ రులోని టిప్పు సుల్తానును సన్మానించుచుండిరి. హిందువులవలెనే తురుష్కులును ఈమె దీర్ఘాయుర్వంతురాలు గావలెననియు నీమె రాజ్యము వృద్ధిఁ జెందవలెననియు నీశ్వరుని ప్రార్థించుచుండిరి." "స్త్రీయయ్యును ఈమెయందు దురభిమానములేక యుండెను. స్వధర్మమునం దీమెకు విశేషముగా మహాభక్తియున్నను పరధ ర్మీయులను బాధపెట్టవలయునన్న యిచ్ఛ యీమెకు లేదు. ధర్మమునందును, పరమార్థ విచారమందును ఆమె సదా నిమగ్న రాలై యున్నను, ప్రజాకల్యాణము విషయమయి యెన్నడును నిర్లక్ష్యము చేసినదికాదు. అత్యంత దక్షతతోను, కర్తృత్వ శక్తితోను, ఆమె రాజ్యము నడిపెను.

నిష్కాపట్యమును, దీనతయు, మానవునియం దుండఁగలుగు నంత నీతియు, సదసద్విచారశక్తియు నామెయందు వాసము చేయుచుండినవి. ఇట్లు తనయందు దోషము లేకపోయినను పరుల యందుఁగల స్వాభావికదోషములను ఆమె క్షమించుచుండెను." "అహల్యాబాయినిగుఱించి లోకు లతిశయోక్తులు పలికెదరని దలఁచి, నే నామెవిషయమయి సూక్ష్మరీతిగా విచారించితిని; వేరు వేరుజనుల నడిగితిని. వారందఱును, ఆమెనామము వినఁగానే ఎక్కువగా స్తుతించుచుండిరి; ఆమె నామముపై నాశీర్వచన వర్షములు గురిపించుచుండిరి. లోకులయొక్క యీపూజ్య బుద్ధి

యోగ్యమైనది కాదనుటకు నాకొక యాధారమైనను దొఱకినది కాదు. ఎంతెంత యధికముగా విచారించితినో యంతంత యెక్కువ కుతూహలము గలుగునట్టి సంగతులే తెలియుచుండెను." "లోకులీమె నామమునకు సాధువులకుఁ దగిన సన్మాన మిచ్చుచున్నారు; వారీమెను దేవత యనియెదరు. ఈమె సద్గుణములవిషయమై యెంతదో సూక్ష్మదృష్టితో విచారించినను, పృథ్విపై నేటివఱకుఁ బుట్టిన యత్యంతపవిత్రులైనట్టియు, దూరవిచారము గలిగినట్టియు ప్రభువులలో నీమె యొకతయని చెప్పకతప్పదు." "నిజముగా నహల్యాబాయి యొక యద్వితీయ స్త్రీ". మాల్కము దొరగా రిట్లు అహల్యాబాయిగారి చరిత్రముకొఱకు ననేకతుల శోధించినవాఁడఁగా నతని కామెయం దధిక పూజ్యభావము గలిగి యతఁడు పైనిచెప్పినప్రకార మహల్యాబాయిగారినిగుఱించి వ్రాసి యున్నాఁడు. ఇంత నిష్పక్షపాతముగల సాక్ష్య ముండఁగా నహల్యాబాయి యద్వితీయ స్త్రీయే యని చెప్పుటకేల సందేహింపవలెను ?

కన్యావిరహము—అహల్యాబాయిగారికి మంచాబాయి యనుకూఁతు రుండెనని వెనుకనే వ్రాసియుంటిని. ఈమెకే ముక్తాబాయి యని నామాంతరము. ఈమెకు వివాహముచేసి యహల్యాబాయి యల్లుని నింటనే యుంచుకొనెను. ఈయల్లుఁడు చాలరోజులవఱకు బ్రతికి, యహల్యాబాయిగారి మరణమునకుఁ గొన్నిరోజులు పూర్వము మరణమొందెను. తోడనే ముక్తాబాయి సహగమనమునకు సిద్ధమాయెను. అప్పు డహల్యాబాయి తనకొమార్తెను సహగమనము చేయవలదని, నయభయము

లతోఁ జెప్పి చూచెనుగాని యందువలన నెంతమాత్రము ప్రయోజనము లేకపోయెను. తల్లిమాటవినక ముక్తాబాయి భర్తతో సహగమనము చేసెను.

ఇట్లు కూఁతురును అల్లుఁడును మృతిఁజెందఁగా నహల్యాబాయిగారికిఁ బ్రబల మనోరోగము ప్రాప్తించెను. వార్ధక్యము, రాజ్యముచేసెడి శ్రమ, వ్రత నియమములు, ఉపవాసములు, కన్యామరణదుఃఖము మొదలయినవన్నియు నేకీభవించి, యామెను దినదినము క్షీణదశకుఁ దేసాగెను. తుదకామెకు నొకరుగ్ణత సంభవించి, పుణ్యశ్లోకయగు అహల్యాబాయి ౧౭౯౫ వ సంవత్సరమున నిహలోకమును విడిచెను.

న్యాయముగాఁ బ్రజాపరిపాలనముఁ జేసినందువలన మృతజీవులని విఖ్యాతిని బడసిన భోజరాజు, అశోకనృపతి, అకబరుబాదుషహా, పీటరుదిగ్రేటు మొదలయిన రాజపుంగవులతో నహల్యాబాయి సమానమైనదని చెప్పుటకు సందేహములేదు. అహల్యాబాయిగారియందుఁ గల సుగుణములలో నొక్కొకటి గలరాజు లెక్కడనో నూటికి కోటికి నొక్కఁడుగాని కానఁబడకున్నారు. కనుక పురుషులకంటె స్త్రీలు నీతి తక్కువ వారనుట కేవలము పక్షపాతముగాదా? సకలమానవకోటికి లలామభూతయయిన యహల్యాబాయి స్త్రీయైయుండ, 'అనృతం సాహసం మాయా మూర్ఖత్వ మతిలోభ' తేత్యాది దుర్గుణములు స్త్రీలకు స్వాభావికములని చెప్పుట ఘోరపాతకమునకు హేతువు గాదా?

---

# రాణీగౌరీలక్ష్మీబాయి

* "అహాహ మహాతాం నిస్సీమానశ్చరిత్ర విభూతయః"

ఈప్రపంచమునం దనేకప్రతిబంధము లుండునని ప్రతివారికిని దెలిసినవిషయమే. ఇట్టిప్రతిబంధములు పదిమందిని సంరక్షించు వారికి నెక్కువగా నుండును. తనసంరక్షణాలో నున్నవారిలోఁ ప్రతివానిస్వభావము వేరువేరుగా నుండుటవలన, వారికోర్కులు దీర్చి, వారినందఱి నాజ్ఞలో నుంచుకొనుటకు బహుచాతుర్యమును, ధైర్యమును కావలయును. ఒకకుటుంబమును సంరక్షించుట కింతశ్రమ యగునప్పు డొకరాజ్యమును వహించుట కెంత శ్రమ కావలయునో వేరుగఁ జెప్పనక్కరలేదు. రాజ్యము చేయుటలో నెన్నికష్టము లుండునో యవియన్నియుఁ గుటుంబమును భరించువా రూహించుట సులభము. రాజ్యములో ననేకప్రకృతుల లోకులుందురు; శౌర్యధైర్యాదులు గల గొప్పగొప్పవారు లుందురు. పరరాజు లెప్పుడును యుద్ధోత్సాహులయి యుందురు. వీరినందఱిని సమాధానపఱచి రాజ్యశకటమును నడుపుట బహు దుస్తరము. ఇందువలననే రాజ్యమును 'రాజ్యభార' మనియెదరు. ఈభారమును వహించుటకు విద్య, సారాసార విచారము, దక్షత మొదలయిన సద్గుణము లనేకములు గావలయును. ఒకానొక సమయమునం దీరాజ్యభారము యౌవనమునందే వహిం

---

* "అహాహా! మహాత్ములచరిత్రమహిమ అగాధము గదా"?

చుట సంప్రాప్తమైన పక్షమున నదియెంత దుస్సహమగునో వేరుగఁ జెప్పవలెనా? ఇన్నిసంగతులు లేకీభవించి యీరాజ్యాశకట మొక స్త్రీకి సంప్రాప్తమైనపక్షమున నామె యెటులఁ జేయునో యని మన కాశ్చర్యము దోచును. కాని యీశ్వరాను గ్రహమువలన జగత్తునం దెప్పుడెప్పు డెచ్చటెచ్చట స్త్రీలకు రాజ్యాధికారము దొరికెనో యప్పుడప్పు డచ్చటచ్చట స్త్రీలు పురుషులకంటె నధిక ధైర్యముతోను, అధిక నీతితోను, అధిక న్యాయముతోను రాజ్యముఁ జేసిరని చరిత్రములవలనఁ దేటపడు చున్నది. ఇదివఱ కీచరిత్రమాలయందు గ్రుచ్చఁబడిన నాంచీభవా నిగారిచరిత్రము, నహల్యాబాయిగారిచరిత్రయు నీసిద్ధాంతమునే స్థాపించుచున్నవి. ప్రతిదేశముయొక్క చరిత్రమునుండియు నిట్టి యుదాహరణము లనేకము లియ్యవచ్చును. మలబారుదేశము నుండి యొక యుదాహరణ మియ్యఁదలఁచితిని.

మలబారుదేశమునందు త్రావణకోరనియు, కొచ్చీయనియు రెండుసంస్థానములు గలవు. అందు త్రావణకోరు రాజ్య మతిప్రా చీనకాలమునుండి దానధర్మములవిషయమయి విఖ్యాతిని జెంది శ్రేష్ఠమై యొప్పును. ఈదేశమును మనయాంధ్రు లాడమళ యాళ మనియెదరు. అచ్చట మగవారే లేరనియు, అంతయు నచట ఆఁడవారే యుందురనియు, గాలికే పిల్లలు పుట్టెదరని యు మనయాంధ్రులు వింతకథలు చెప్పుకొనియెదరు. కాని యివి యన్నియు నిజమైనసంగతులు కావు. వారియాచారవిచారము లకును, మన యాచార విచారములకును ముఖ్యభేదము లేవనఁగా:—

మన దేశమందలి రీతిగాఁ దండ్రిసొత్తు కుమారునికిఁ జెందక ఆ దేశమునందు మేనల్లునికిఁ జెందును. మేనల్లుఁడు లేకపోయినయెడ ల మేనకోడలికిని, ఆమె సంతతికిని జెందును. ఇటులనచ్చటఁ గన్యా వంశమునకే రాజ్యముయొక్క హక్కు గాని పుత్రవంశమునకు లేదు. రాజపుత్రి తొమ్మిదిపదిసంవత్సరములది కాఁగానే, తాలికట్టుటయను ఒక వివాహవిధిఁ జేసెదరు. అందు భర్త యుండఁడు. పురోహితుఁడే చిన్నదానికి మంగళసూత్రముకట్టును. రాజకన్యకు యౌవనదశప్రాప్తమైనతరువాత నొక నంబూరి బ్రాహ్మణుని దెచ్చి యీ మెకువివాహముఁ జేసెదరు. ఇతనిని 'కోవిలతంబూరాను' అనఁగా రాజభవనములోని మహారాజు అని పిలిచెదరు. ఈకోవిల తంబూరానునకును, రాజకన్యకును గలిగిన యాఁడుబిడ్డలయొక్క సంతతికి రాజ్యము దొఱకును. ముఖ్యముగా నీయాఁడుబిడ్డల పుత్రులకు రాజ్యము దొఱకును. పుత్రులు లేనిపక్షమున కన్యలకు దొఱకును. రాజ్యము నేలుచున్న రాజుయొక్క భార్య రాణి గానేరదు. ఆరాజుయొక్క కుమారులకు వారి మేనమామసొత్తు లభించునే గాని రాజ్యము లభింపనేరదు. వారెన్నఁడును యువరాజులుగా నేరరు. ఇంతజ్ఞాపకముండిన నీచరిత్రము దెలియుట సులభమగును.

త్రావణకోరు సింహాసనముపై ననేక స్త్రీలు ఆరూఢలయిరి. వారిలో లక్ష్మీబాయి ప్రముఖురాలు. లక్ష్మీబాయికిఁ బూర్వమనఁగాఁ బందొమ్మిదవశతాబ్దారంభమున వంచిపాల బలరామవర్మ గారీరాజ్యమును ప్రతిపాలించుచుండిరి. ఈరాజుగారంతగా రాజ్యపరిపాలనమునందు దక్షులు గారయిరి. అందుచే బీదలకు న్యాయవిమర్శనము లేకపోయెను. గొప్పయధికారులు వారివారి పను

లయం దలక్ష్యము చేయసాగిరి. కొద్దియధికారులను లెక్క
యడుగువారు లేనందున రాజుగారికి రావలసినపన్నులు రాకపో
యెను. ఇట్లొకరినొకరు లక్ష్యము చేయనందువలన రాజ్యమం
తయు భర్తలేని భార్యవలె దీనదశకు వచ్చెను. అప్పు డీస్టిండియా
కంపనీవారు, రెసిడెంటుద్వారా మీరు మీరాజ్యమును జక్కపె
ట్టుకొని, మంచిదశకుఁ దెచ్చుకొనవలసినదని యనేకపర్యాయ
ములు రాజుగారికి సూచించిరి. రాజుగా రాసూచనలను లక్ష్య
పెట్టనందున రాజ్యముయొక్క దీనదశ దినదినము హెచ్చుచుం
డెను. ఇదిచూచి ఈస్టు ఇండియా కంపనీవారు [illegible] వ సంవత్సర
మునందు మీరు రాజ్యముయొక్కస్థితిని ఆఱుమాసములలో
బాగుపఱచినసరె; లేనియెడల మీరాజ్యము బందోబస్తు మేము
చేసెదమ"ని రాజుగారికిఁ దెలియఁజేసిరి. ఇందుచే రాజు చింతా
క్రాంతుఁడై కొద్దిదినములలోనే పరలోకగతుఁ డయ్యెను.

పంచిపాల బలరామవర్మగారి తదనంతరము రాజ్యభారముఁ
డగుటకు మగ వారసదారుఁ డెవఁడును లేకపోయెను. రాజుగారిత
ల్లియు, అక్కగారగు గౌరీబాయిగారును, అదివఱకే మృతిఁ
జెందిరి. గౌరీబాయిగారికి మగసంతానము లేకయుండెను. కాని
యామెకు లక్ష్మీబాయి యనియుఁ బార్వతీబాయి యనియు నిరు
వురు కొమార్తెలుండిరి. వీరును బాల్యావస్థలోనే యున్నందున
వీరికిని సంతానప్రాప్తి కాకపోయెను. కనుకఁ బెద్దదియగు లక్ష్మీ
బాయి రాజ్యముఁ జేయవలయుననియు, నామెకు కుమారుఁడు
గలిగిన నతఁడు రాజ్యమునకు వారసదారుఁ డనియుఁ గంపనీవా
రేర్పాటుఁ జేసిరి. ఈయేర్పాటునకు ముఖ్యకారణము లక్ష్మీబాయి

గారి తెలివియే. లక్ష్మీ పార్వతు లిద్దరును, స్వదేశభాషయందును, సంస్కృతభాషయందును మిక్కిలి ప్రవీణురాండ్రై, సుశీలలనఁ బ్రసిద్ధిగాంచిరి. అందు లక్ష్మీబాయి యిరువదిసంవత్సరముల వయస్సు గలదైనను సుగుణములకును దీర్ఘాలోచనకును, ప్రశంసనీయమైన యుక్తులకును, శతవృద్ధురాలికంటెఁ బ్రసిద్ధిగాంచినది గనుక, అప్పటి రెసిడెంటుగారగు కర్నల్ మెకాలే దొరగారు, త్రావణకోరు సింహాసనార్హత కీమెయే యర్హురాలని మెంచి, ఈ సంగతి కంపనీవారికిఁ దెలిపి "ఈమె చిన్నదయినను, ఇదివఱకీరాజ్యమునందుఁ గల యవ్యవస్థను తొలఁగించి, రాజ్యమును ఉన్నతస్థితికిఁ దెచ్చు సద్గుణము లీమెయందుఁ గలవు" అని తన యభిప్రాయము వ్రాసెను. కంపనీవా రిది యంతయు విని, లక్ష్మీబాయిని సింహాసనార్హురాలను జేయుటకయి యామోదించి, యామహోత్సవము యథావిధిగా నడుపుటకై, రెసిడెంటు కర్నల్ మెకాలేదొరగారిని నియమించిరి. కాని యింతలో లక్ష్మీబాయిగారి దాయాదులు కొందఱాసింహాసనముపై తమకు సంపూర్ణముగా హక్కుగలదనియు, హక్కుదారులు తమరుండఁగా ఆఁడుపిల్లలకు రాజ్యమిచ్చుట న్యాయముకాదనియుఁ జెప్పఁదొడఁగిరి. కాని మెకాలే దొరగారు వారి జల్పనలను లక్ష్యపెట్టినవారుకారు. కనుక వారు తిరుగఁబడిరి. అందుపై వారిని, వారికి సహాయులుగనున్న వారిని, రాజద్రోహులని కర్నల్ మెకాలేగారు కారాగృహమునకుఁ బంపిరి. మొదలు వీరు తేలిచేరీయను పట్టణమున నుంపఁబడిరిగాని

తరువాత చెంగల్పేటకుఁ బంపఁబడిరి. అచ్చట వారందఱును కారాగృహములోనే మృతిఁజెందిరి.

ఇట్లు శత్రువుల నందఱిని ఘోరముగా శిక్షించిన తరువాత, లక్ష్మీబాయిగారికిఁ బట్టాభిషేకము గట్టుటకై రెసిడెంటు దొర గారు గొప్ప యుత్సవముఁ జేసిరి; గొప్ప రాజసభఁ జేసిరి. రాజ సభఁ జేసిన యాస్థానమంటప మనేక సుందరపదార్థములవలన నలం కరింపఁబడి చూచువారికెంతయు నాహ్లాద జనకముగా నుండెను. ఆమహోత్సవముఁ జూచుటకై రాజ్యముయొక్క భిన్నప్రదేశ ములనుండి యనేకజనులు వచ్చియుండిరి. ముఖ్యాముఖ్య సామంత సర్దారులందఱు వచ్చి వారివారి నియమిత స్థానములయం దాసీను లైన పిమ్మట రాజకన్యలగు లక్ష్మీపార్వతులు వారి దేశాచారము ననుసరించి, యుత్తమ వస్త్రభూషణాలంకారములను ధరించి వచ్చి, సభయందు వారికొఱకు నియమింపఁబడిన యున్నతాస నములపైఁ గూర్చుండిరి. తరువాత కంపనీవారి ప్రతినిధియైన కర్నల్ మెకాలే దొరగారు నిలువఁబడి, యచ్చటి సభవారందఱు విన "కంపనీ సర్కారువారి యనుమతిప్రకారము, రాణీ లక్ష్మీ బాయిగారిని త్రావణకోరు సింహాసనముపైఁ గూర్చుండపెట్టు చున్నాను" అని మృదుమధుర గంభీరస్వరముతోఁ బలికి, సన్మాన పూర్వకముగా రాణీ లక్ష్మీబాయిని ఉచ్చస్థానమునందున్న రాజ సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టెను. అప్పుడే యాయన సర్వజ నుల యనుమతిని బడసి రాణిగారికి 'ధర్మవర్ధిని' 'రాజరాజేశ్వరి' యన్న బిరుదులఁగూడ సంరంభముతో నొసఁగెను. ఇచ్చట చదు వరులు రాణీగారికి ధర్మవర్ధినియన్న బిరుదుతోఁ బ్రయోజనమేమి

యని శంకింతురేమో. కనుక కొద్దిగా వివరించెద. త్రావణకోరు రాజ్యముయొక్క రాజధానియగు త్రివేంద్రమునకే అనంతశయన మని పేరు. ఇది యొకక్షేత్రమై యొప్పును. ఇచ్చట పద్మనాభ స్వామి శేషశయనుఁడై యుండును. త్రావణకోరురాజుల కుల దేవత యీపద్మనాభుఁడే. రాణీగారి పూర్వుఁడగు మార్తాండ వర్మ, తనరాజ్యమంతయు నొకనాఁడీదేవునికి సమర్పించెనఁట! అప్పటినుండియు, ఈరాజులు తమకు 'పద్మనాభ సేవకు' లనియు 'ధర్మవర్ధకు' లనియు బిరుదుల నేర్పఱచుకొనిరి. వీరి రాజముద్ర యందు "ధర్మోస్మత్కులదైవతం" అనువాక్యముండును. ఇట్లు ప్రతిరాజును, రాణియు, 'ధర్మవర్ధనుఁడు' 'ధర్మవర్ధిని' యన్న బిరుదును భూషణముగాఁ దలఁచుచుండిరి. కనుక రాణీగారికి 'ధర్మ వర్ధిని' యన్న పదవి రాజ్యారోహణ సమయమున నియ్యఁబడెను. మహారాణీగారి సంపూర్ణనామము, బిరుదులతో మళయాళమునం దిట్లు వ్రాయఁబడును. "శ్రీపద్మనాభసేవినీ వంచి ధర్మ వర్ధినీ రాజరాజేశ్వరీ రాణీగారిలక్ష్మీబాయి."

రాజ్యాభిషేకమయిన తరువాత ముహూర్త కాలమునకు రాణీ లక్ష్మీబాయిగారు సింహాసనంబుడిగ్గి, ప్రఫుల్లముఖముతో మెకాలే దొరగారిని, సకల సభ్యులను సంబోధించి మలయాళీభాషలో నష్కలితముగా నిట్లు సంభాషించెను :—

"ఆదరం బహుమానపెట్టనా హేంథే—పరమ సన్మాననీయులగు కర్నలుదొరగారు, అనాదికాలమునుండి మాపూర్వులచేఁ బాలింపఁ బడినట్టియు, ఈస్టుఇండియా కంపనీవారిచే నేటివఱకు సంరక్షింపఁబడినట్టియు, ఈత్రావణకోరు సింహాసనము నాకుఁ బ్రా

ర్తించునని నేనిదివఱకు స్వప్నమందైనను అనుకొనినదానను గాను. ఇప్పు డీశ్వరేచ్ఛచే బరలోకవాసులైన మా మామగారగు వంచిపాలవర్మ మహారాజుగారు కేవల మిరువదితొమ్మిది సంవత్సరముల ప్రాయమువారు. ఆయనమామగారు ధరించినట్లు రాజ్యదండ మీయన దీర్ఘకాలమువఱకు ధరింపవలయునని పద్మనాభస్వామిగారి యాజ్ఞలేక పోయెను. ఆపద్మనాభస్వామిగారి యిచ్ఛానుసారమే నాకు రాజ్యము ప్రాప్తమయినది. కనుక నాయనయాజ్ఞ నాకు శిరసావహ్యము. నేను స్వామియాజ్ఞను శిరసావహించుటకు సిద్ధముగా నున్నాను కాని నేను అబలను; అదియునుగాక యల్పవయస్కురాలను; ఇట్టి గొప్పరాజ్యకార్యముల యనుభవము లేనిదానను. మాతో స్నేహమైనప్పటి నుండియు, ఈత్రావణకోరు రాజ్యమును కన్నబిడ్డవలెఁ గాపాడుచువచ్చిన ఆనిరేబిల్ ఈస్టు ఇండియా కంపనీవారు దప్పనాకిట్టి స్థితియందు రెండవ యాధారములేదు. కనుక కర్నలుగారు, నేటినుండి మిమ్మును నేను సొంతయన్నగా భావించి, రాజ్యముయొక్క ప్రతికార్యమునందును విశ్వాసపూర్వకముగా మీమీఁదనే సర్వభారమును వేయుచున్నాను. ఇంతకంటె నధికమేమియుఁ జెప్పవలసినది లేదు." ఈమె గంభీర సంభాషణవిని సభికులందఱు తల్లీనులైరట!

లక్ష్మిబాయి యల్పవయస్కురాలైనందున నామె యెట్టి స్వభావము గలదియగునో రాజ్యమెటులుచేయునో, ప్రాప్తమయిన యధికారమెటులు నిర్వహించుకొనునోయని లోకులకు విచారముగా నుండెను. కాని నిర్భయముగా సింహాసనము

దిగి, వాక్ప్రౌఢిమయుం దసమానప్రజ్ఞ గలిగి సభాసదులను తన యిచ్ఛాప్రకారమాడించెడి వాగ్మివలె, లక్ష్మీబాయి గంభీరరవముతో సంభాషించుటవిని యచ్చటివారందఱును మిక్కిలి యాశ్చర్యము నొందిరి. ఆసంభాషణ విన్నవారందఱును, ఈమె సామాన్యురాలు కాదనియు, నసమాన ప్రజ్ఞగలదనియు, నీమెరాజ్యమునందుఁ బ్రజలకు సుఖమే గాని దుఃఖము లేదనియు నిశ్చయించిరి. ఈమె మధురగంభీర వాక్యములను విని కర్నలు మెకాలే ఈమెయం దధిక పూజ్యభావము గలవాఁడై ప్రతికార్యమందును సహాయముఁ జేయుదునని నమ్మిక పుట్టునట్లు చెప్పెను.

ఈప్రకార మారాజ్యాభిషేక మహోత్సవము సమాప్తమై లక్ష్మీబాయిగారిపై రాజ్యనిర్వాహకత్వము మోపఁబడినతోడనే యామె ప్రజలక్షేమమునకై యత్నింపఁ దొడఁగెను. ఆమెదూరదృష్టియు, దీర్ఘాలోచనయు, సమయజ్ఞత్వమును, సూక్ష్మగ్రాహకత్వమును బహుప్రశంసనీయములు. అంత చిన్నతనమునం దామెబుద్ధి విశాలతఁ జూడఁగా నత్యంతాశ్చర్యమును బొంది, యామె వయస్సునందు బాలయైనను మనస్సునందుఁ బ్రౌఢయే యని చెప్పవలయును. తన రాజ్యమునం ద[illegible]టను, పరిపూర్ణన్యాయముండవలయునని యామె కోరిక యుండెను. దీనదశకు వచ్చిన తనరాజ్యమును, ఏప్రకారముగా నయిన నున్నతదశకుఁ దేవలయునని మనసా యిచ్ఛగలదై, రాజ్యపద్ధతియం దేయే సంస్కరణము లెట్లెట్లు చేయవలయునో యని రేయుంబగలును మనసులో యోజించుచుండెను. పరులనేత్రములతోఁ జూచుట యామె కెన్నడును ఇష్టము లేకపోయెను. అనఁగా స్వంతముగా

తాను యోజింపక, యితరులు చెప్పినటులు నడుచుట కామె యెన్నఁడును సమ్మతించినదికాదు. మెకాలేదొరగారిని ఈమె యన్నయని భావించినది నిజమే; నమ్మికతో నతనిచే ననేక రాజ కార్యములను జేయించినది నిజమే; ప్రతిసంగతిని గురించి యతని సలహా యడుగుచుండెనన్న మాటయు నిజమే; కాని కార్యముఁ జేయునప్పు డీమె,

> "క. వినవలె నెవ్వరు సెప్పిన
> వినినంతనె తమక పడక వివరింపవలెన్
> విని కని వివరముఁ దెలిసిన
> మనుజుఁడె పో నీతిపరుఁడు మహిలో వేమా"

అను వేమనయొక్క చక్కనియుపదేశప్రకారము నడుచుచుండెను. క్రొత్తచట్టములు చేయుటయందును, ప్రాతచట్టములను సంస్కరించుటయందును, నాగరీకత వృద్ధిపఱచుటయందును, పొంతముగా రాణీగారనేకనూతన కల్పనలు మెకాలేదొరగారికిఁ దెలిపిరి. ఇందుచే రాణీగారి యసామాన్య బుద్ధివైభవము వ్యక్తమగుచున్నది.

వంచిపాల బలరామశర్మగారి రాజ్యమునం దత్యంతాస్వస్థత యేల గలిగెననియు, నిప్పుడది యెటులు సంస్కరింపవచ్చుననియు రాణీగారు యోజింపసాగిరి. ఉమనితాంబీయన్న కుమంత్రియొక్క దుశ్చేష్టలచే నింతవచ్చునని రాణీగారికిఁ దెలిసెను. ఈసంగతి తెలిసినతోడనే రాణీగారాకుమంత్రిని పనిమీఁదినుండి తీసివేసెను. తరువాత 'యోగ్యుఁడైన దివాన్ దొరకువఱకు మీరే యీపనిని జూడవలసినది'ని రాణీగారు మెకాలేగారి నడిగిరి. అం

దు కాలఁడు సమ్మతించి రెసిడెంటుపనియు, దివాను పనియు నిర్వ హించుచుండెను.

మొకాలేదారగారు దివానుగిరి చేతఁబూనినతోడనే యాయన చేయవలసిన పనులను గుఱించి, యతనికి రాణీగారిట్లు వ్రాసి పంపిరి:—(౧) మారాజ్యములోని యధికారులందఱు సమతమ పనులను తిన్నగాఁ జేయుచున్నారా లేదా; క్రింది యధికారులు పైయధికారుల యాజ్ఞలను వినుచున్నారా లేదా యన్న యంశ మును మొట్టమొదట విచారింపవలసినది. (౨) న్యాయస్థాన ములయందేమి, యితర కచేరీలలోనేమి, నియామకముగా పనులు జరుగుచున్నవా లేవా యని విచారించి తప్పక యటులు జరుగు టకై బందోబస్తు చేయవలయును. (౩) ఎవరైన సంస్థానము లోని యుద్యోగస్థులు తిన్నగాఁ బనులుచేయని యెడల వారికి దండుగలు మొదలైన స్వల్పశిక్షలు విధించి, వారిని త్రోవకుఁ దేవలసినదేకాని ఎకాయెకి యెవరినోటిముందటి తిండియుఁ దీయ వలదు. (౪) వసూలు లెక్కలు తిన్నగాఁజూచి వెనుకటి బాకీ లన్నియు వసూలు చేయవలసినది.

ఈ పైనిచెప్పిన సంగతులన్నియు రాణీగారు స్వాంతముగా యోజించి వ్రాసినవే. ఆమెబుద్ధి వికాసమిందువలనను గూడ వ్యక్తమగుచున్నది. పైని వ్రాసినప్రకారము రాణీగా రాజ్ఞాపిం చినతోడనే, మొకాలేదారగా రాయాపనులను చేయనారంభిం చిరి. మొదట సర్కారు ఉద్యోగస్థులందఱు సమతమ పనులను చట్టముల నియామకముల ప్రకారము చేయుచుండవలయునని యొక యాజ్ఞాపత్రిక ప్రతిగ్రామములోని యుద్యోగస్థులకుఁ బంపిరి.

వారందఱు తనయాజ్ఞప్రకారము నడిచెదరో లేదోయని చూచు టకై మెకాలేగారు సొంతముగా రాజ్యములోని ప్రతిగ్రామము నకుఁ దిరుగుచుండిరి. ప్రథమమునం దాయన కనేక సంకటములు వచ్చెను. కాని వాని కన్నిటికి నోర్చుకొని, మిక్కిలి ప్రయాసపడి మెకాలేగారు తుదకన్నిసంగతులును రాణీగారి యిష్టప్రకారమే సంస్కరించెను. క్రిందటిరాజుగారి రాజ్యములోని యలవాటుచొ ప్పున నుద్యోగస్థులందరు మిక్కిలి సోమరిపోతులై, మెకాలే గారి కఠినఁపు టాజ్ఞలనైనను లక్ష్యపెట్టకపోయిరి. ఇట్టు నిర్భ యులయి నిదురఁబోవుచున్నవారి నందఱిని మెకాలేదొరగారు మేలుకొలుపుచుండిరి. చేతనైనంతవఱకు వారిని ఉద్యోగముల నుండి తొలఁగింపక, చిన్నపిల్లలకుఁ గొట్టి బుద్ధిచెప్పినటులు, దం డుగ మొదలైనవానిచే శిక్షించి త్రోవకుఁ దెచ్చుచుండిరి. కాని కొందఱినిమాత్రము ఉద్యోగములనుండి తీయక విధిలేకపో యెను. ఈప్రకారమంతటను బందోబస్తున కారంభముకాగానే రాజ్యములోని వ్యాపారములు నియామక ప్రకారము జరుగ సాగెను.

పూర్వపు దివాౝ అగు ఉమనితాంబీని పనినుండి చాలించి రాణిగా రాపనిమీఁద కర్నలు మెకాలేదొరగారిని ఏర్పఱిచినందు వలన ఉమనితాంబీ కర్నలు గారిని బహు ద్వేషించుచుండెను. ఒకానొక సమయమునం దతఁడు కర్నలుగారికి విషప్రయోగము చేయ యత్నించెనఁట. ఈసంగతి రాణిగారికిఁ దెలిసినతోడనే యామె యందును గుఱించి విచారణఁ జేసి సాక్షులను విచారించి, అపరాధుఁడని స్థిరపడినందువలన ఉమనితాంబీని చెంగలపేటలోని

కారాగృహమునందు రాజయ కైదీగా నుంచెను. అచ్చటనే యతఁడు గతించెను.

తరువాత రాణీగారు వసూలువిషయమై విచారింపసాగిరి. వసూలును గురించి విచారింపఁగా, ఆదాయమెంతయో, వ్యయమెంతయో, అప్పెంతయో, తెలిసికొనుటకు మిక్కిలి కష్టముగా నుండెను. ఈ కష్టతరములైన యస్పష్టపులెక్కలు తిరుగవేసి తిరుగవేసి చూడఁగా ఈస్టు ఇండియా కంపనీవారికిని, తిరుశల్వేలి కోటారము, కోచ్చి, బొంబయి మొదలయిన స్థలములయందలి సాహుకారులకును, ఇయ్యవలసిన యప్పు అత్యధికముగా బయలుదేరెను. ఈయప్పంతయు లెక్కవేసిచూడ, సంస్థానముయొక్క సంవత్సరపు టాదాయముతో సరితూగెను. ఇంత గొప్పయప్పు తీరెడి యుపాయముఁ గానక రాణీగారు విచారించి, విచారించి, తుద కొక యుపాయమును జేసిరి. త్రావణకోరురాజ్యమునందు గొప్పగొప్ప దేవస్థానము లనేకము లున్నవి. వానియందు బహుధన మున్నను, పూజలు, అర్చలు క్రమముగా జరుగుట లేనందువలన, ఆద్రవ్యము సంస్థానమువైపున నుంచుకొని రాజుగారే యా దేవస్థానముల యుత్సవములు నడుపవలయునని పూర్వపు దివాన్ గొన్నిరోజులక్రిందట సూచించి యుండెను. ఈసూచన రాణీగారికి జ్ఞప్తికి వచ్చి, సమ్మతి యైనందువలన, నామె దేవస్థానములయం దున్న యధిక ధనసంచయమును స్వార్థపరమార్థములకు నుపయోగింపఁదలఁచెను. అదెట్లనిన, దేవస్థానములవద్దనుండి యప్పుదీసికొని, సంస్థానమును ఋణవిముక్తముగాఁ జేయుటస్వార్థము. ఊరక మూలమూలనుచున్న

దేవస్థానముల ధనమునకు వృద్ధి దొరకునటులు చేయుట పరమార్థము. ఇట్లు విచారించి, రాణీగారీసంగతి మెకాలేదొరగారికిఁ దెలియఁజేయఁగా నతఁడు రాణీగారి విచారశక్తిని ఎంతయుఁ బ్రశంసించి, సమ్మతించెను.

ఇట్లు రాణీ ప్రధానులు సమ్మతించినవెనుక, త్వరలోనే రాణీగారొక సభచేసిరి. ఆసభకు దేవస్థానముల యధికారుల నందఱిని బిలిపించి, వారికిఁ దనయుద్దేశము దెలిపి యందువలన దేవస్థానములకును, తనకును గలుగులాభములు స్పష్టపఱిచెను. ఈసంగతియంతయు వారికి విశదపడఁగానే వారందఱు రాణీగారు చెప్పినట్లు నడచుకొనుటకు సమ్మతించిరి. ఇందుపై నా దేవస్థానముల బందోబస్తంతయుఁ జేయుటకు శేష్గీరావని యపరనామముగల వెంకటరావను అధికారిని రాణీగారేర్పఱిచిరి. అతఁడాపని మిక్కిలి శ్రద్ధతోఁ జేసినందువలనఁ గొద్దికాలములోనే సంస్థానమునకుఁ గల యప్పంతయుఁ దీరెను.

ఇట్లప్పు బందోబస్తు చేసి రాణీగారు న్యాయసభలను సంస్కరించుటకుఁ బ్రయత్నించిరి. ఆమె సంస్కృతమునందు పాండిత్యము గలదయి పూర్వాచారములయందు దిట్టము గలిగినది గావున, మనుస్మృతి, పరాశరస్మృతి, విజ్ఞానేశ్వరము మొదలైన పూర్వగ్రంథముల యాధారమువలనను, ఇండియా గవర్నమెంటువారి చట్టముల యాధారమువలనను, లోకులకు హితకరము లగునని తనకుఁ దోఁచిన చట్టములను గొన్నిటిని గూర్చి యొక గొప్ప చట్టముల గ్రంథము, తనరాజ్యముకొఱకు నిర్మింపవలెనని యామె దలంచెను. కాని యింత గొప్పగ్రంథము, న్యాయశాస్త్రమునం దస

మానప్రజ్ఞగల విద్వాంసుని సహాయములేక గానేరదని రాణీ
గారికిఁ దోఁచెను. ఇంతలో రాణీగారికి వివాహసమయ మాయెను.
నిండుయౌవనావస్థ ప్రాప్తమయినందువలన నిఁక వివాహము చేసి
కొనవలెనని లక్ష్మీబాయిగారు నిశ్చయించిరి. పూర్వపు రాణీగారి
భర్తయొక్క బాంధవుఁడును, కులీనుఁడును, బ్రాహ్మణుఁడును అగు
రాజరాజవర్మ యను పేరుగల విద్వాంసుఁ డొకఁడు, చెంగనాసేరీ
గ్రామమునందు వాసము చేయుచుండెను. అతని విద్వత్తుకు
మోహించి, యతనిని రాణీగారు వరియించిరి. త్వరలోనే వీరికి
వివాహమైన రాజరాజవర్మగారు 'కోయిలతంబూరాను' అను పదవిని
జెందిరి. ఇతఁడు రాణీగారికంటె నొక సంవత్సరము పెద్ద. ఇతఁడు
గొప్పవిద్వాంసుఁ డని కీర్తిని జెందెను. ముఖ్యముగా నితనికిఁ
బ్రియమైనది న్యాయశాస్త్రము. సిద్ధాంతముక్తావలి మొదల
యిన న్యాయగ్రంథములను జదివి యితఁడు న్యాయశాస్త్రవిశా
రదుఁడయ్యెను. ధర్మశాస్త్రమునందును నితనికి గొప్పప్రవేశ
యుండెను. ఇట్టి యసామాన్యపండితుఁ డగు భర్తవలన, రాణీగారు
చేతఁ బూనిన గ్రంథనిర్మాణమునకు బహుసహాయము గలుగు
చుండెనని వేఱ చెప్పవలెనా? రాణీగారి కితఁ డన్ని పనులయందును
సహాయభూతుఁడయి వర్తించుచుండెను. చదువరులారా! ప్రౌఢత్వ
మునందు వివాహము చేసికొను పద్ధతి మలబారు దేశమునం దుం
డుట వలననేగదా లక్ష్మీబాయిగారికి వయోరూపగుణవిద్యలయం
దు సమానుఁడయిన పతి దొరకఁ గలిగెను? ప్రౌఢావివాహములు
జరిగినయెడల స్త్రీనీతి భ్రష్టమగుననియు, సంఘసౌఖ్యము తగ్గు
ననియు వృథా వాక్పాండిత్యమ్ముఁ జూపువారు రాణీలక్ష్మీబాయి

గారి యుదాహరణముఁ జూచి, ప్రౌఢావివాహములవలనను విద్య వలనను మన కుటుంబసౌఖ్యము వృద్ధియగునేగాని తగ్గనేరదని మనస్సమాధానముఁ జేసికొనవచ్చును. బొమ్మలపెండ్లిండ్లవలె నో రెఱుఁగని పసిపిల్లలకు వివాహముఁ జేసినందువలనఁ గలిగెడి నష్టము లందఱికిని దెలిసినవిషయమే యైనందువలన నిచ్చట మఱల వ్రాయవలసిన పని లేదు. ప్రౌఢావివాహమువలని లాభములు లక్ష్మీబాయి చరిత్రమువలనను దేటపడఁ గలవు. ప్రౌఢావివాహములు జరిగినపక్షమున నిట్టినష్టములు గలుగును, అట్టి నష్టములు గలుగును, అని ప్రాచీనాచారపరాయణులు వృథా భయపెట్టుదురు. ఈ భయము లన్నియుఁ గేవల కల్పనలేగాని, వాస్తవములు కావని లక్ష్మీబాయి మొదలగు సాధ్వీమణుల చరిత్రములవలన స్పష్టమగుచున్నవి యని చెప్పక తప్పదు. మన దేశస్థులగు మళయాళులకుఁ బ్రౌఢావివాహములవలన లాభమే గాని నష్టము గలుగుటలేదని చూచుచు, మనలో మాత్రము స్త్రీ విద్యా ప్రౌఢావివాహములవలన నష్టము గలుగునని చెప్పుట చూడఁగా మనము మనుష్యకోటిలోనివారము కామని చెప్పుట కాదా?

మిక్కిలి బుద్ధిమంతురాలగు ఆమెకు విద్యావంతుఁడగు కోయిల తంబూరాన్ యొక్క సాంగత్యమువలన మఱింత యుత్సాహము గలిగి, యామె యారంభించిన చట్టముల గ్రంథమును శీఘ్రముగా వ్రాయుచు, నడుమనడుమ దానిని మెకాలేదొరగారికిఁ జూపుచు, ఆయన యనుమతిని బొందుచు, ఆగ్రంథమును సంపూర్ణము చేసి దానికి, 'స్వత్వావర్థక' మను నామ మిడెను. ౧౮౧౨

వ సంవత్సరమునుండి, రాజ్యములోని సర్వవ్యాపారము లీసత్త్వా వర్ధకము ననుసరించి జరుగుచుండెను. ఈక్రొత్తచట్టములప్రకారము న్యాయము జరుగవలయునని, రాణీగారు క్రొత్తన్యాయస్థానముల నేర్పఱచిరి. క్రమముగా సర్వన్యాయస్థానములయందు సంస్కృతము, మలబారి, యింగ్లీషులందుఁ బ్రవీణులగువారిని నియమించిరి. కోచ్చీ నివాసస్థుఁడైన రామర్ మేనర్ అనుపండితోత్తముని, ముఖ్యన్యాయసభలోని ముఖ్యన్యాయాధీశునిగా నేర్పఱచిరి. తరువాత రాణీగారొకచట్టము నేర్పఱచి, తమరాజ్యములోని బానిసవ్యాపారమును బొత్తిగా మాన్పివేసిరి. ప్రజలకు భారమైన పన్నులు తగ్గించిరి ; ఉప్పు వ్యాపారమును వృద్ధిపఱచిరి. ఇట్లు దినదిన ప్రవర్ధమానమై రాజ్య మున్నతస్థితిని బొందుచుండెను.

రాణీలక్ష్మీబాయిగారు శ్రీపద్మనాభస్వామియం దధిక విశ్వాసముగలవారయి యాదేవతను భక్తిప్రపత్తులతోఁ బూజించుచుండిరి. వంశపరంపరగా జరుగుచున్న దానధర్మములను దప్పక నడుపవలయుననియు పూర్వులకంటె నధిక ధర్మకృత్యములను జేయవలయుననియు, ధర్మవర్ధినీ .యన్నబిరుదును సార్థకపఱుపవలయుననియు రాణీగారు సదా యత్నించుచుండిరి. కాని దివాను గారగు మెకాలేదొరగారు అంగ్లేయుఁడైనందువలన దానములు, ధర్మములు, అన్నసత్రములు, మొదలయినవన్నియు వ్యర్థపుకర్చులని యతఁడు దలఁచుచుండెను. కనుక ధర్మసంబంధములయిన కృత్యము లన్నియుఁ దిన్నగా జరుగుచున్నవా లేవా యని మెకాల్లే విచారించెడివాఁడు కాఁడు. ఇందునుగుఱించి

ప్రజల మొఱ వినెడివాఁడు కాఁడు. ఇట్లు మెకాలేగా రుదాసీను లయినందువలన రాజ్యములోని ధర్మాదాయము విషయమయి మిక్కిలి యవ్యవస్థ జరుగుచుండెను. ఒకరోజు రామేశ్వరమునకుఁ బోవు యాత్రికులు గొందఱు రాణీగారియొద్దికిఁ బోయి, తమకు నన్నపానాదులు దొఱకుట లేదనియు, అందునుగుఱించి దొర గారు నిర్లక్ష్యము చేయుచున్నారనియు మొఱ్ఱపెట్టుకొనిరి. వారికిఁ గొంతధన మిచ్చిపంపి రాణీగారు మెకాలేగారికి నిట్లు వ్రాసి పంపిరి:

"దివి ౧౭౯ ఎడవం మలశాకీవర్షములు ౧౦౦౫.

నాకు జ్యేష్ఠభ్రాతృతుల్యులగు కర్నలు దొరగారికి—మీరు అన్నిపనులను దక్షతతోఁ జేయుచున్నందువలనను, మీకు దేశముయొక్క గొప్పతనము, స్థితి, రీతులు, హక్కులు, ఆచారములు సంపూర్ణముగా విదితమేగనుకను, వానినిగుఱించి నేను మీకు వ్రాయవలసిన యావశ్యకము లేదు. మాపూర్వీకులు పేర్పఱచిన నియామకములును, పద్ధతులును, దానధర్మములును, ఆచారవిచారములును, వారిదయాళుత్వమున కుద్యోతకములై, ప్రజల హితముకొఱకును, దేశోన్నతికొఱకును, ఏర్పఱుపఁబడినవి. కనుక మీరు పూర్వనియమములను దప్పక రాజ్యమును నడుపవలయును. వానిలో హెచ్చుతగ్గు లేమియుఁ జేయకుండవలయునని మీకు నావిన్నపము. రామేశ్వరమునకు వెళ్ళెడి యాత్రికుల కన్నపానాదులు, దక్షిణలు దొరకుట లేదనినమొఱ నాచెవిని సోకినది. ఆసంగతి మీకుఁ దెలియఁ జేయుచున్నాను. కనుక మీ రిందువిషయమై శీఘ్రముగా బందోబస్తు చేసెదరని నమ్ముచు

న్నాను. మహాసింగు కిల్లాదారునకుఁ గూడ బందోబస్తుచేయుమని యాజ్ఞ పంపినాను. ఉత్తరప్రత్యుత్తరములవలన ఏపని యయినను ద్వరలోనౌను. కర్నలుడోరగారు నామాటలను సన్మానించెదరని నమ్ముదును.

నేను స్త్రీనైనందువలన మిమ్మును జ్యేష్ఠభ్రాతగా భావించి రాజ్యమునందలి పనులన్నియు విశ్వాసముతో మీకు సమర్పించితిని. కనుక నారాజ్యములోని, దానధర్మము లిదివఱకు జరుగుచున్నటుల జరిపి మీరు మాదేశమును, మాప్రజలను సుఖులను జేసెదరని సంపూర్ణముగా నమ్ముచున్నాను.

(దస్కతు) లక్ష్మీబాయి."

రాణీగారు తాము నమ్మిన ధర్మమును దృఢముగాఁ బాలించుట కెంత తత్పరులై యుండిరో, ప్రసంగోచితముగా నాంగ్లుల కడఁగూడ స్వతేజోబలమును నిశ్చయముగా నెట్లు ప్రకటముఁ జేయుచుండిరో, యీ యుత్తరమువలనఁ బ్రకట మగుచున్నది.

ఇట్లు శుక్లపక్ష చంద్రునివలెఁ ద్రావణకోరురాజ్యము దిన దినము నాగరికతయందుఁ బ్రవృద్ధమాన మగుచుండ ౧౮౧౩వ సంవత్సరమున లక్ష్మీబాయిగారికిఁ బుత్రరత్నము గలిగెను. సింహాసనమున కధిపతి జన్మించినందువలన రాజ్యమునం దంతటను గొప్పయుత్సవముఁ జేసిరి. ప్రతిగృహమున నూతనతోరణములు మొదలైనవి గట్టి పండుగు చేసిరి. పండ్రెండవ దినమున మహోత్సవముఁ జేసి పిల్లవానికి 'రామవర్మమహారాజ'ని పేరుపెట్టిరి. హిందూధర్మశాస్త్రప్రకారము మిఁక మీఁదఁ ద్రావణకోరు రాజ్య

మున కీశిశువే యధిపతి యని ప్రసిద్ధిపఱచిరి. తరువాత నొక శుభ ముహూర్తమున ౧౮౧౮రవ సంవత్సరమున ఆశిశువునకురాజ్యాభిషేకము చేయఁదలఁచిరి. దివి ౨౫ చింగం, మలబారీ వత్సరంబు ౯౮౪ రోజున రాజ్యాభిషేక మహోత్సవము జరిగెను. అచ్చటిపద్ధతి ననుసరించి యారోజున రాజగృహములో గొప్ప దర్బారు చేయించిరి. రాణీలక్ష్మీబాయిగారు శిశువున కుత్తమ వస్త్రభూషణము లలంకరించి, తాను నలంకృతయై, బాల రాజును దీసికొని సభామంటపమునకు వెళ్ళెను. సభాజనులంద ఱును తమతమ నియమితస్థానముల నాక్రమించిన పిదపఁ దన రెండుహస్తములతో రాణీగారు బాలరాజును దీసికొని సింహాసనమునుండి క్రిందికి దిగి, ప్రసన్నవదనయై, తన స్వాభావిక గంభీర వాణితో నందఱు నాశ్చర్యమొంద నిట్లనియె—"ఆనరేబిల్ ఈస్టు ఇండియా కంపనీవారు సదా న్యాయమార్గమునఁ బ్రవర్తింపు చుందురుగావున వారి యిచ్ఛానుసారముగా నన్నియుఁ బద్మనాభ స్వామివారు సమకూర్చు చుందురు. నాకులదైవ మగు శ్రీపద్మ నాభస్వామివారి ప్రసాదమువలన నాకుఁ గలిగినపుత్రుని కంపనీ వారి చేతిలోఁ బెట్టుచున్నాను. కనుక నితనిఁ బెద్దవానిఁ జేయు టయు, నితనికి విద్యాబుద్ధులు చెప్పించుటయు, నితని నింతవైభవమునకుఁ దెచ్చుటయుఁ గంపనీవారి భారమై యున్నది. ఇంత కంటె నధికమేమి చెప్పవలయును?" ఇటులఁ బలికి పిల్లవానిని మెకాలే దొరగారి చేతి కియ్యఁగానే, ఆయన యాపిల్లవానిని సింహాసనముమీఁద కూర్చుండఁబెట్టి "ఈరామవర్మగారు నేఁటి నుండి యీరాజ్యమునకు రాజయ్యెను. ఈయన యుక్తవయస్కుఁ

డగువఱకు రాణీలక్ష్మీబాయిగా రితని పాలనకర్త్రియని రాజ్యము
చేయఁగలరు” అని యందఱికిఁ దెలిపెను.

ఈరాజ్యాభిషేక సమయముననే మెకాలేదొరగారు దివాన్
గిరి వదలుకొనిరి. దేవన్ పద్మనాభన్‌గారు [illegible] రైరి.
కాని యీక్రొత్తదివానుగా రధికార[illegible] కొద్దిదినము[illegible]
యనుభవించిరి. అయిదాఱుమాస[illegible]ధికారముఁ జేసి యతఁడు
స్ఫోటకముచే మృతుఁడయ్యెను.



అటుతరువాత రమారమి [illegible]సంవత్సరమునకు రాణీగారికి
రెండవకుమారుఁడు పుట్టెను. కా[illegible] యా యానందము చి[illegible]
దినము లుండినదిగాదు. రాణీగారికి [illegible]రోగము సంప్రాప్తమై
రెండునెలలలోనే యది యసాధ్యమా[illegible] [illegible]వైద్యులనే
కౌషధము లిచ్చిరికాని, వానివలన గుణ మేమియులేక వ్యాధి
హెచ్చుచునే యుండెను. బ్రతుకునన్న యాశ లుడిగినపిదప నొక
నాఁడు లక్ష్మీబాయి, తనప్రియ భర్తను దనవద్దికిఁ బిలిచి, తన
చెల్లెలగు పార్వతీబాయిని దన చిన్నపిల్లలను, అతని చేతిలోఁ
బెట్టి యొప్పగించి, యిట్లనియె:—“ఇదివఱకు నాచే సంరక్షింపఁ
బడిన యీపిల్లల నందఱిని మీచేతిలోఁ బెట్టుచున్నాను. ఇఁక
మీరు వీరందఱిని సంరక్షింపవలయును. ఈరామవర్మమహారాజు
యుక్తవయస్కుఁ డగువఱకుఁ బార్వతీబాయి పాలనకర్త్రియై
రాజ్యము నడుపునట్లు చేసి, నాకు సహాయము చేసినట్లు, ఈమెకు
సకలరాజ్యకార్యములయందుసహాయముఁ జేసెదనని మీరువచన
మిచ్చిన యెడల నేను సుఖముగఁ బ్రాణములు విడిచెదను”. తన
ప్రియపత్నియొక్క యీనిరాశవచనములను విని, రాజరాజవర్మ యు

త్యంత దుఃఖితుఁడై, నేత్రములనుండి వెడలు దుఃఖాశ్రువులచే నోటనేమియుమాటరాక కొంతసేపూరకుండి, ధైర్యమవలంబించి పత్నితో "నేను నీయిచ్ఛపూర్తి చేయుదును" అని పలికెను. తరువాత రాణీగారు చెల్లెలైన పార్వతీబాయి వైపునకు వచ్చి, మిక్కిలి దీనస్వరముతో నిట్లనియె. "అమ్మాయి పార్వతీ! నీవు బహు జాగరూకతతో రాజ్యముఁ జేయవలయును. ఈయర్భకులను దిన్నగా సంరక్షింపుము. వీరిని పెంచి, రామవర్మ మహారాజుగారు యుక్తవయస్కుఁడు కాఁగానే, శుద్ధాంతఃకరణ పూర్వకముగా, ఆయన రాజ్య మాయన కిచ్చి కృతార్థురాలవు గమ్ము. నేను వెళ్ళుచున్నాను. నాకొఱకు దుఃఖింపకుము." ఈప్రకారము అక్కగారగు లక్ష్మీబాయి యంత్యకాలమం దిట్టి యుపదేశము చేయఁగా విని, ఆకోమలాంతఃకరణ యగు పదియేడు సంవత్సరముల యబల, దుఃఖాతిరేకముచేత నోటమాటరాక గద్గద కంఠయై "అక్కా! నీవు చెప్పినప్రకారము నేను చేయుదును. మీయాజ్ఞ యెంతమాత్రము తప్పక నడుచుకొనియెదను. నీవు మాత్రము నన్ను విడిచిపోయెదవా" యని దుఃఖింపసాగెను. అప్పుడచ్చటివా రందఱును దుఃఖింపసాగిరి.

ఈప్రసంగానంతరము రెండుదినములకు లక్ష్మీబాయిగారు నశ్వరసుఖముల వదలి, శాశ్వతమగు పరసుఖము ననుభవించుటకుఁ జనిరి. సులబారు దేశమంతయు దుఃఖసముద్రములో మునిగెను. త్రావణకోరులోని ప్రతి గృహమునందును రోదనధ్వనులు వినవచ్చుచుండెను. తల్లికొఱకు రోదనము చేసిన ట్లనేకులు రోదనము చేసిరి.

రాణీలక్ష్మీబాయిగారు నాలుగు సంవత్సరములే రాజ్యము చేసిరి. కాని యామె రాజ్యమునందు ననుభవించిన సౌఖ్యము ప్రజ లదివఱకై పోయిన రాజులలో నెవ్వరి పరిపాలనములోను అనుభవించినవారుకారు. ఆమె ప్రజలను స్వదేహమునకంటె నెక్కువగాఁ గాపాడినది. రాజ్యవిషయమై కర్నలుగారి సలహా పుచ్చుకొనినను, తనకు యోగ్యమని తోచినవానినే గ్రహించు చుండెను. ఈమె స్వబుద్ధివలన పెక్కు చట్టములను నిర్మించెనని యిదివఱకే తెలిపియున్నాను. న్యాయము, నీతి మొదలైన సంగతులను గుఱించి యామె చూపిన చాతుర్యమును, ఔదార్యమును అత్యంత స్తుతికిఁ బాత్రములు. ఆమెయందు దృఢనిశ్చయ మనెడి సద్గుణ మితరగుణములకంటె నధికముగా నుండెను. ఈమెయం దీగుణముండెను గనుకనే, యామె తన రాజ్యములోని న్యాయ సభలను గుఱించి యనేక సంస్కరణలు చేయఁ గలిగినది. ఆమె అయోగ్యుఁడైన ప్రాతదివానును దీసివేసి, దీర్ఘ ప్రయత్నుఁడగు మెకాలే దొరగారిని దివానుగా నేర్పఱచెను. ఇందువలన నామె విశాలమైన దూరదృష్టి వ్యక్తమగుచున్నది. మెకాలేదొరగా రామె వాక్యములు మన్నించి, దేశకళ్యాణము గోరి, సదా కార్యతత్పరుఁడై రాణిగారికి మనఃపూర్వకముగా సహాయముఁ జేసినందు కాతని నెంతయుఁ గొనియాడ వలసియున్నది. వర్ణమునందు విప్రవరుఁడగు కోయిల తంబూరాను యొక్కయు, సత్స్వభావముచే విప్రవరుఁడు నాఁదగు మెకాలేదొరగారియొక్కయు సహాయముఁ బుచ్చుకొని, క్రొత్తచట్టములను నిర్మించి, న్యాయసభలను సంస్కరించుటఁ జూడఁగా మహారా

జ్ఞీగారు విజ్ఞానేశ్వర ఋషియొక్క యీక్రింది యాజ్ఞను దప్పక శిరసావహించి, యందుఁ జెప్పఁబడిన ఫలమునుగూడఁ బొంది రని చెప్పవచ్చును.

"మ. ధరణీనాథుఁడు క్రోధలోభముల పొంతంబోక సద్ధర్మత
త్పరుఁడై విశ్రుతవిప్రవంశ్యులగు విద్వద్వర్యులుం దాను సు
స్థిరధర్మవ్యవహారనిర్ణయ మొగిం జేయందగుం జేయఁగాఁ
బరపై నిక్కుల నెక్కుఁగీర్తివెలయుంభాగ్యంబు నానాఁటికిన్."

ఈరాణిగారి చరిత్రమువలన నిదివఱకు స్థాపించిన సిద్ధాంతములు గాక యొక గొప్పసిద్ధాంతము స్థాపింపవలసియున్నది. ఆ సిద్ధాంత మేదియన "నిష్పక్షపాత బుద్ధితో విచారించినయెడల మానసశాస్త్ర దృష్టికి స్త్రీలు పురుషులకంటె నధికులు కాక పోయినను, ఎటుచూచినను పురుషులకంటెఁ దక్కువవారు కారు." అనేక సంవత్సరములు రాజ్యముచేసి, యనుభవశీలురును, వయోవృద్ధులును అగు రాజులు చూపని బుద్ధికౌశల్యము, నీతిధైర్యము, సారాసారవిచారము, లక్ష్మీబాయిగారు నాలుగు సంవత్సరముల రాజ్యపరిపాలనములోఁ జూపిరి. ఈమె యొక్కతె యిట్టి సామర్థ్యంబుఁ జూపెననికాదు. ఇదివఱకు వర్ణింపఁబడిన భవాన్యహల్యలును, ఇఁకమీఁద వర్ణింపఁబడు రాణీలును మహారాజ్ఞులును, ప్రాంతాధికారిణులును, సామాన్యస్థితిలోని సాధ్వీమణులును, ఇట్టి యమితబుద్ధి సామర్థ్యంబును జూపియున్నారు. ఇందును గుఱించి యొక గ్రంథకారుఁ డిట్లు వ్రాసియున్నాఁడు. "హిందూదేశములోని యొకానొక సంస్థానములోని రాజ్యవ్యవహారము బహు బందోబస్తుతోను, బహు జాగరూకత

తోను, బహు మితవ్యయముతోను జరుగుచున్నదనియు, ఆ
సంస్థానములోని ప్రజ లన్యాయ పరంపరలచే బాధపడక సుఖించు
చున్నారనియు, దినదినము రాజ్యములోని వ్యవసాయ మధిక
మగుచున్నదనియు వినిన పక్షమున నిట్టి నాలుగు సంస్థానముల
లో మూఁడుసంస్థానములు స్త్రీలచేఁ బాలింపఁబడుచున్నవని నిశ్చ
యించుటకు సందేహము లేదు." కేవలము మన హిందూ
స్త్రీలవిషయమయియే యీమాటనిజమనికాదు. దేశాంతర
ములయందును రాజ్యారూఢలైన రాజపుత్రిక లందఱును, ఇట్టి
కౌశల్యమునే చూపిరి. రాజ్యముఁ జేసిన పురుషుల సంఖ్య
కంటె, సింహాసనారూఢలైన స్త్రీలసంఖ్య యత్యంత స్వల్ప
ముగా నున్నది. అపరిమితమైన రాజుల సంఖ్యనుండి యుత్తమ
రాజులని యెంతమంది నేరి చూపింపవచ్చునో, యంతమంది
యుత్తమరాజ్ఞులను రాజ్యము చేసిన స్త్రీలయొక్క యత్యల్ప
సంఖ్యలోనుండి చూపింపవచ్చునని చెప్పుట కెంతయు సంతోష
మగుచున్నది. ఈసంగతి స్త్రీజాతి కెంతయు భూషణాస్పదము.
రాజ్యముఁ జేసిన స్త్రీలలో ననేకులు పూర్వరాజులచే నధోగతికిఁ
దేఁబడిన రాజ్యములపైఁ గూరుచుండి యారాజ్యములను మఱల
మహోన్నతదశకుఁ దెచ్చిరి. ఇందున కుదాహరణము మన లక్ష్మీ
బాయియే. మామగారిచేఁ బాడుచేయఁబడి, కంపెనీవారి చేతుల
లోఁ బడుచున్న రాజ్యమును దక్కించుకొని మహోన్నతదశకుఁ
దెచ్చిన లక్ష్మీబాయిగారి నెంత కొనియాడవలయునో తెలియ
కున్నది. స్త్రీలకు స్వాభావికములని వాడుకొనఁబడు చాంచ
ల్యము మొదలైన దుర్గుణము లిట్టి స్త్రీల యుదాహరణముల

లోఁ గానఁబడకయే తద్విరుద్ధములైన మనోదార్ఢ్యాది సద్గుణ
ములే కానఁబడుచున్నవి. ఇట్లు దైవయోగముచేఁ గొందఱు
స్త్రీలకు రాజ్యవైభవము ప్రాప్తమైనందువలన, కొందఱు స్త్రీ
ద్వేష్టు లేర్పఱిచిన సకలస్త్రీజాతి విరుద్ధములైన సిద్ధాంతములు
ప్రత్యక్ష ప్రమాణములచే నబద్ధములని ఖండింపఁబడినవి. ఇట్లు
రాజ్యస్థలైన స్త్రీలు స్వజాతికయి యనంతోపకారములఁ జేసి
యున్నారు. స్త్రీ నిందకుల నోరుగట్టుట కిట్టి మహాసాధనంబుల
నొసంగిన దయామయుఁడైన పరమేశ్వరుని స్త్రీ లందఱును
వేయినోళ్ళఁ గొనియాడవలయును.

కొందఱు, పైన స్థాపించిన సిద్ధాంతముపై నొక యాక్షేపణ
తేఁగలరు. అదియేదన "స్త్రీలు రాజ్యముఁ జేసినప్పటికిని,
రాజ్యములోని యధికారులందఱును బురుషులే యైనందువలన,
రాజ్యములోని యున్నతియంతయుఁ బురుషులచేఁ జేయఁబడెనే
గాని, రాజ్యస్థయైన స్త్రీచేతఁ జేయఁబడెనని చెప్పఁగూడదు."
ఈయాక్షేపణఁ జూడఁగానే మొదల నిజమయినదేయని తోఁ
చును; కాని కొద్దిగా సూక్ష్మవిచారముఁ జేసిచూడ నిందలి యస
త్యత స్పష్టముకాఁగలదు. ఈయాక్షేపణమే నిజమని గ్రహించి
నయెడల రాజుల రాజ్యములో జరిగిన లోకోపకారములకు
రాజులను భూషించుటకు వీలుండదు. అశోకమహారాజు,
భోజ విక్రమార్కాది చక్రవర్తులు, అకబరుబాదుషహా మొద
లయిన ప్రజాపూజ్యులగు రాజులరాజ్యములోనుగూడ మంత్రు
లును, అధికారులును, ఉండిరి. కనుక వారికీర్తికి భంగము
గలుగునా యేమి? వారి రాజ్యములో జరిగిన సత్కృత్యముల

శ్రేయస్సంతయు వారి యుద్యోగస్థుల కేనా? శ్రీరామ యుధిష్ఠిరు లెన్నఁడును, స్వయముగా కాఁపువానివద్దనుండి శిస్తు వసూలు చేయలేదని యందఱును వారి యశోకీర్తనము నేఁటినుండి యాప వలెనా? ఇట్లు స్త్రీలకీర్తిని మలినము చేయవలయునని ప్రతి పక్షులు చెప్పినయుక్తి, నిజమని యొప్పుకొనినయెడల సకల పురుష పుంగవులయొక్క కీర్తికి నాశము గలుగుచున్నది. కనుక నిది కువాద మనియు లేక వితండవాద మనియుఁ జెప్పవలసి యున్నది. ఇట్లు వాదించెడివారికి రాజ్యము చేయుట యన నేమో తెలియదనియే చెప్పవలయును. రాజ్యముయొక్క ప్రతిసంగతి స్వయముగాఁ జేయుట రాజుపనికాదు. ఇటులఁ జేయుటయు నసంభవమే. రాజులు మంత్రులనెడి నేత్రముల సకలరాజ్య మును జూచుచుండవలయును. కనుక యోగ్యులయిన మంత్రుల నేర్పఱచుటయు, తగిన యుద్యోగస్థులను గుర్తెఱింగి వారిని ప్రోత్సాహపఱచి, వారిచే యోగ్యమైన పనులను జేయించు కొనుటయే యోగ్యముగా రాజ్యశకటము నడుపుట. ఈ సంగతి ప్రతిపక్షు లెట్లు మఱచెదరో తెలియకున్నది. బుద్ధిమంతు లై నట్టియు, రాజకార్యధురంధరు లైనట్టియు, ప్రజాహితదక్షు లై నట్టియు సేవకులను పరీక్షించి, వారినే మంత్రులఁగాను, గొప్ప గొప్ప యధికారులఁగాను, నియమించి, అయోగ్యులను దీసి వేయుట సద్రాజలక్షణము. ఇంత చేసిన రాజు స్వయముగా రాజ్యములోనిపనులను జేయనక్కఱలేదు. సుసేవకుల మంచి యాలోచనలను వినునంతబుద్ధి యాతని కుండినఁ జాలును. అతఁడు నియమించిన సేవకగణము రాజ్యహితముకొఱకై చేసెడి

సత్కృత్యముల యశస్సంతయు నతనిదే. ఇటులనే రాజ్యము చేసెడి స్త్రీలవిషయమయి చెప్పవచ్చును. రాజ్యములోని మంచి యధికారులు పురుషు లయినప్పటికిని, వీరికి నధికార మిచ్చుట యందుఁ జూపిన గుణగ్రాహకత్వము రాణిగారిదేగనుక, రాజ్యమునందుఁ గలిగిన దేశోన్నతివలనఁ గలుగుకీర్తికి నామెయే సర్వదాపాత్రురాలు. ఈసంగతి లక్ష్మీబాయిగారి చరిత్రమువలన స్పష్టమగును. ఆమెరాజ్యమునందుఁ బ్రజల కేల సౌఖ్యము గలిగెను? ఈప్రశ్నకు మాప్రతిపక్షులు, మేకాలే మొదలయిన పురుషుల యత్నములచే సౌఖ్యముగలిగెనుగాని రాణిగారియత్నముచేతఁ గలుగలేదు, అని జవాబు చెప్పుదురు. ఇందుపై నీ పురుషులు రాణిగారిమామ రాజ్యము చేయునప్పు డేల లేకపోయిరి యని యడిగెదము. ఇందుకు, ఆయన యిట్టి మంచియధికారులను నేర్పఱుపక, అయోగ్యులయినవారిని అధికారులనుగా నేర్పఱిచెనని చెప్పవలసివచ్చును. అనఁగా, వీరు యోగ్యు లయిన సేవకులు వీరు అయోగ్యు లయిన సేవకు లన్న తారతమ్యజ్ఞానము రాణిగారి కుండెను; ఈ జ్ఞానము రాణిగారి మామగారికి లేకపోయెను. ఇదే మంచి సింహాసనాధిపతికిని, చెడ్డసింహాసనాధిపతికినిఁ గలభేదము.

కనుక, రాజ్యకార్యములందు స్త్రీలు పురుషులతో సమానమైన సామర్థ్యంబును జూపినారని వెనుకఁ జేసినసిద్ధాంతమే మఱల స్థిరపడుచున్నది. నడుమ ప్రతిపక్షులు చేసిన పూర్వపక్షము ఖండిత మగుచున్నది. ఇంత వ్రాసి యీమహాసాధ్వీచరిత్రను ముగించుచున్నాను.

# శికందరుబేగము

* "సుచింత్యచోక్తం సువిచార్య యత్కృతం
సుదీర్ఘకాలేపి నయాతి విక్రియాం"

ఇదివఱ కీచరిత్రమాలయందు వర్ణింపఁబడిన ముగ్గురుస్త్రీలు హిందూనారీమణులే గనుక మేము కేవలము హిందూస్త్రీల పక్షపాతుల మని కొంద అనుకొనఁ గలరు. అటులగాక మేము సకల స్త్రీవర్గపక్షపాతుల మని దెలుపుట కిచ్చట నొకయవన స్త్రీచరిత్రమును వ్రాయుచున్నాము.

నర్మదానదికి నుత్తరమున మధ్యహిందూస్థానములో భూపాళ మనుసంస్థాన మొకటి కలదు. శిందేసర్కారువారి గ్వాలేరు సంస్థాన మీసంస్థానమునకు నుత్తరభాగముగా నుండును. ఈ సంస్థానముయొక్క వైశాల్యము రమారమి యేడువేలచదరపుమైళ్ళుండును. సంవత్సరమున కీసంస్థానముయొక్క యాదాయము ౨౦ లక్షలరూపాయిలు. కథానాయిక యగుశికందరుబేగ మీరాజ్యమునకు రాణిగా నుండెను.

పదియేడవ (౧౭) శతాబ్దముయొక్క యంత్యమునందు డిల్లీలో రాజ్యముఁ జేసిన యౌరంగజేబు బాదషహావద్ద సర్దారుగా నున్న దోస్తమహమ్మదను తురుష్కునిచే నీరాజ్యము సంపాదింపఁబడెను. ఈయఫగాను సర్దారుఁడు, శూరుఁ డనియు, సాహసి యనియు, బుద్ధిమంతుఁ డనియు విని యతనికి నౌరంగజేబుబాద

---

* చక్కఁగా యోజించి చెప్పినమాటయుఁ జక్కఁగా విచారించి చేసినపనియు దీర్ఘకాలమునకును విఫలములు గా నేరవు.

షహా మొట్టమొదట సైన్యములో నొక చిన్న యధికార మిచ్చె ను. తదనంతర మొకపర్యాయము దోస్తమహమ్మదు సైన్య ములోఁగూడ రాజకార్యమునకయి మాళవప్రాంతమునకుఁ బో యెను. ఇతని ధైర్యాదిగుణములఁ జూచి, యచ్చట సుబేదారితని యం దనుగ్రహము గలవాఁడై, బాదుషాగారితోఁ జెప్పి, యితనిని భైరసియాప్రాంతమునకు సుబేదారుగా నేర్పఱచెను. అచ్చట నుండు కాలములోఁ దనచాతుర్యమువలనఁ దాను సుబేదారుగా నున్న ప్రాంత మంతయుఁ దనచేతికిఁ దెచ్చుకొని, ఔరంగజేబు మరణానంతర మాతఁడు స్వతంత్రరాజై, భూపాళ్ అనుపట్ట ణమును తనరాజధానిగా నేర్పఱచుకొనెను. కనుక బేగముగారి వంశమున కీతఁడు మూలపురుషుఁడని చెప్పవచ్చును.

దోస్తమహమ్మదఖాన్ ౧౭౨౮వ సంవత్సరమున మృతుఁడ య్యెను. ఇతని మరణానంతరము భూపాళరాజ్యమును గుఱించి యనేకకలహములు జరిగెను కాని తుదకు సులతానుమహమ్మదు, యారమహమ్మదు, యాశరీఫ్‌మహమ్మదు, హయాతుమహమ్మ దులు క్రమముగా రాజ్యాభిషిక్తులైరి. వీరిలో నాఖరువాఁడగు నవాబు హయాతుమహమ్మదు ౩౦ సంవత్సరములు రాజ్యము చేసెను. ఇతనిరాజ్యములోనే మరాఠావారితో ననేకఘోరయుద్ధ ములు జరిగినవి. ఇతఁడు కాలముచేసిన తదనంతర మతనికు మారుఁడగు గోసమహమ్మదు రాజ్యస్థుఁడాయెను. ఈగోసమ హమ్మదు పేరుకు రాజుగా నుండినను నితని పినతండ్రికుమారుఁ డగు వజీరుమహమ్మదు రాజ్యమును జరుపుచుండెను. ఈవజీరు మహమ్మదు ధైర్యస్థైర్యములుగల పురుషుఁడు గావున నాభూపాళ

దేశముపై వచ్చినసంకటములనన్నిటిని నివారించి, దండెత్తి వచ్చిన పరరాజుల నోడించి రాజ్యమును రక్షించెను. ఈ వజీరుమహమ్మదు ౧౮౧౬ వ సంవత్సరమున గతించెను. అనంతర మాయనకుమారుఁడగు నజరుమహమ్మదు రాజాయెను. ఇతఁడు తండ్రి వలెనే బహుగుణసంపన్నుఁడయి ప్రజలను సుఖపెట్టెను. ఈనవాబుకొమార్తయే శికందరుబేగము. హిందూదేశ చరిత్రములో భూపాలబేగ మని ప్రసిద్ధిగాంచిన నారీరత్న మీయెయే. నజరు మహమ్మ దొకదినము తనకొమార్తెను ముద్దాడి యాడించు చుండఁగా, అతని బావమఱఁదియగు, ఎనిమిదిసంవత్సరముల వయస్సుగల ఫౌజదారుఖాఁ అన్నుటనే యొక చిన్నతుపాకిఁ దీసికొని యాడుకొనుచుండ నందులోనిగుండు అకస్మాత్తుగా నెగిరి, నవాబుకుఁ దగిలి యతనిని గతప్రాణునిఁ జేసెను!

నజరుమహమ్మదుకుఁ బుత్రు లెవరును లేకపోయిరి; శికందరు బేగ మను కొమార్తెమాత్ర ముండెను. కాని యీమె చిన్నదై నందువలన నీమెకు రాజ్యము కట్టుటకు వీలులేకపోయెను. అప్పుడచ్చటియధికారు లందఱును కంపనీవారి యనుమతిఁ బుచ్చుకొని నజరుమహమ్మదుకు నన్నకుమారుఁ డైన మునీరమహమ్మదఖానునకు శికందరుబేగమును పెండ్లిచేసి యతనిని నవాబుగాఁ జేయవలయుననియు, వివాహ మగువఱకు నజరుమహమ్మదుభార్య యగు కుదషిబేగము రాజ్యము చేయవలయు ననియు నిర్ణయించిరి. అటులనే శికందరుబేగము తల్లియగు కుదషియాబేగము రాజ్యాధికారిణి యాయెను. ఫైలికి సంపూర్ణాధికారము

వచ్చినతోడనే యామె చక్కఁగా రాజ్యము చేయసాగెను
రాజ్య సుఖము బహుదినములవఱకు ననుభవింపవలయు నన్న
యిచ్ఛ గలదై కుదషియాబేగము తనకొమార్తెకుఁ ద్వరగా
వివాహముచేయకపోయెను. త్వరగా వివాహ మైనయెడలఁ దనకు
రాజ్యము రాఁగలదని, మునీరమహమ్మదుఖాను వివాహోత్సు
కుఁడై తనకు వివాహము త్వరగాఁ జేయుమని యతఁడు కుదషి
యాబేగమును పోరసాగెను. ఇందుచే వీరిద్దఱికి వైరము సంప్రా
ప్తమాయెను. కాని రాజ్యములోని సామంతులు, ఉద్యోగస్థులు
మొదలయినవా రందఱును కుదషియాబేగముపక్షమువా రయి
నందువలన, పూర్వము చేసిన నిబంధనను కొట్టివేసి, మునీరుఖా
నుకు ర[illegible] రూపాయ లిచ్చి, వారితగవుతీర్చి, కుదషియాబే
గమే రాజ్యము చేయవచ్చునని నిర్ణయించిరి. మునీరుఖానుకును
శికందరుబేగముకును వివాహము చేయవలయు నన్న యేర్పాటు
మీఱినతరువాత, జహాంగీరనువానితో శికందరుబేగముగారి
వివాహముఁ జేయవలయునని నిర్ణయించిరి. ఈ జహాంగీరుకూడ
శికందరుబేగముయొక్క పెదతండ్రికుమారుఁడే. ఇచ్చట హిందూ
చదువరులు మహమ్మదీయులలోఁ గల యొకరూఢిని జ్ఞాపక
ముంచుకొనవలయును. మనలో మేనమామకూఁతురును వివాహ
మాడుట సశాస్త్రీయ మైనట్లు, తురకలలోఁ బినతండ్రి పెదతండ్రుల
కొమార్తెలతోఁ బెండ్లియాడుట సశాస్త్రీయము. ఇది మనకు
వింతగాఁ గానుపించునుగాని, తురకలలో సామాన్యమైనరూఢియే.

కుదషియాబేగము సంపూర్ణముగా రాజ్యలోభగ్రస్త యై
నందువలనఁ దనబిడ్డను జహాంగీరున కిచ్చి వివాహము చేసెదనని

కాలము గడపుచుండెనేగాని, త్వరగా వివాహము చేసినదిగాదు. ఐనను శికందరుబేగ ముపవరమైనందువలన ౧౮౩౫వ సంవత్సరమున నామెవివాహము జరిగెను. ఈ వివాహసమారంభము బహుగొప్పగా జరిగెనఁట. వివాహము జరిగినతోడనే జహంగీరు తాను 'నవాబు' అనుబిరుదును వహించి, రాజ్యము చేయ యత్నించెను. తనచేతిలోనిరాజ్యము వదలఁగూడదని కుదషియాబేగము నిశ్చయించెను. ఇట్లు రాజ్యలోభముచే, అత్తగారును, అల్లుఁడును పరస్పరవైరు లయిరి. ఇట్లు కొంతకాలము జరిగిన పిమ్మట, నొకరితోనొకరు యుద్ధముఁ జేయుటకయి వారిద్దఱును సైన్యములను పోగుచేసిరి. కుదషియాబేగమునుబట్టి కారాగృహమునం దుంచుటకయి జహంగీరుఖాన్ యత్నించెను. కాని యతనికిఁ జాలునంత ధైర్యము లేనందువలన నతఁడీయత్నమునందు విఫలుఁడయ్యెను. ఇట్టియత్నము జరిగినతరువాత బేగము అత్యంత క్రోధాన్వితురాలయి యుద్ధమునకు సన్నద్ధురాలాయెను. ఇద్దఱికిని ఘోర యుద్ధము జరిగి యందు జహంగీరు పరాజితుఁడయ్యెను. అందువలన నతనికి మూడు మాసములవఱకు కారాగృహవాసము చేయవలసివచ్చెను. కాని యింతలో ఇంగ్లీషువారును, మఱికొందఱును, మధ్యస్థులై, ఆయనను విడిపించి, ౧౮౩౭ వ సంవత్సరమున రాజ్యాభిషిక్తునిఁ జేసిరి. కుదషియాబేగము గారికి ౬౦,౦౦౦ రూపాయీల స్వతంత్రజహగీరుదారి యిచ్చిరి. అప్పటినుండి యామె భూపాళరాజ్యవిషయమైన సంగతులలోనికి రాఁగూడదని కట్టుదిట్టములుచేసికొనిరి.

జహాంగీరు రాజ్యముఁ జేయుటయందు దక్షుఁడు కానందు వలన లోకప్రియుఁడు గాకపోయెను. స్వభావముచేత దుష్టుఁడై నందువలన భార్యను దిన్నగాఁ జూడకుండెను. సదా వ్యసనాసక్తుఁడై యున్నందువలన భార్యాభర్తల కనుకూలత లేక కలహములే జరుగుచుండెను. కాని శికందరు బేగము సద్గుణవతి గనుక, ఆదాంపత్యకలహము చాలరోజులవఱకు జరగినదికాదు. పెనిమిటికి ఏ లయినంతవఱకు బుద్ధి చెప్పి చూచి లాభములేదని తెలిసికొని, కలహము లాపుటకొఱకయి తల్లివద్దికి వెళ్లి యుండు చువచ్చెను. జహాంగీరుఖాన్ దుర్భాగ్యుఁడై, యత్యంతవ్యసనాసక్తుఁడై నందువలనఁ దొమ్మిదిసంవత్సరములే రాజ్యముచేసి ౧౮౪౪వ సంవత్సరమున మృతుఁడయ్యెను. ఇతనికి దస్తగీరను దాసీపుత్రుఁ డొకఁ డుండెను. జహాంగీరు మృతుఁ డయినప్పుడీదాసీపుత్రునకు రాజ్య మియ్యవలసినదని మృత్యుపత్రమునందు వ్రాసెను. కాని యీ మృత్యుపత్రము నెవరును ఒప్పుకొనిన వారు కారు. శికందరు బేగమునకు శహాజహానను స్వల్పవయస్కురాలగుకూఁతు రొకతె యుండెను. ఈమె రాజ్యమున కధికారిణి గనుక నీమె పెద్దదియగువఱకు నీమె పేరిట శికందరు బేగముగారు రాజ్యపరిపాలనము చేయవలయునని యింగ్లీషువారు నిర్ణయించిరి.

శికందరు బేగము మొదలే బుద్ధికుశలత గలదని విఖ్యాతిఁ జెందియుండెను. అందులో నింత గొప్పరాజ్యమునకు స్వామిని యైనందువలన నామెకు బుద్ధి వికాసముఁ జూపుటకు మఱింత యవకాశము గలిగెను. వర్షోదయమువలన చాతకములకును, క్షీర పానమువలన హంసపక్షులకును, చంద్రోదయమువలన చకోర

ములకును, అత్యంతానందము గలిగినటుల, శికందరు బేగము రాజ్యాధికారమును వహింపఁగానే ప్రజల కమిత ప్రమోదము గలిగెను. ఈమె సింహాసనారూఢ కాఁగానే సంస్థానమునం దంతటను గొప్పయానంద ఘోషమునకుఁ బ్రారంభ మాయెను. రాజ్యమునం దనేకోత్సవములు జరిగెను.

ఈమె రాజ్యకార్య ధురంధరత్వమును సవిస్తరముగా వర్ణింపఁబూనిన నొక గొప్పస్వతంత్రగ్రంథమగును. కనుక నటులచేయక యీామెవిషయమయి యొకగ్రంథకారుఁడు సంక్షేపముగా వ్రాసియున్నసంగతినే యిచ్చట భాషాంతరీకరించి వ్రాసెద. “శికందరు బేగమునకు రాజ్యాధికారము సంప్రాప్తమైనందువలన, ఆమె బుద్ధిప్రకాశము ప్రసరించుట కత్యంత విశాలమైన యవకాశముదొరకెను. ఆమె కర్తృత్వ సామర్థ్యములను గుఱించి లోకులకుఁ గల నమ్మకము నిజమని యామె కార్యముల వలన స్థిరపడెను. రాజ్యమునకుఁ గల ఋణమంతయు నామె యాఁడుసంవత్సరములలోఁ దీర్చివేసెను. గ్రామములు, తహశ్శీళ్ళు వగైరాలు మక్తాకిచ్చెడి పూర్వపురీతిఁ దీసివేసి, సొంతముగా గ్రామాధిపతుల వద్దనుండి తానే పన్నులు పుచ్చుకొనసాగెను. కొన్నిపదార్థములఁ గొందఱు వ్యాపారులే యమ్మవలయునని గల నిర్బంధములఁ దీసివేసి, ఆపదార్థము లందఱు అమ్మవచ్చునని యేర్పాటు చేసెను. ఇట్లు వ్యాపారవృద్ధికిఁ దాను ముఖ్యకారణమాయెను. టంకశాలయొక్క బందోబస్తు సొంతముగా నామె చూచుకొనెను. సంరక్షకభటుల ననేకులఁ గ్రొత్తగా నేర్పఱచి, వారు దేశమునకు నష్టముచేయకుండ క్షేమమే చేయునటుల నేర్పాటు

చేసెను. ఇట్లు రాజ్యములో ననేక సంస్కరణలాచరించెను. ఆమె ధైర్యముతో, సతతప్రయత్నముతో, బుద్ధికుశలతతోఁ బ్రజల హితముకొఱకు రాజ్యమునందుఁ జేసినసంస్కరణములు, అనుభవము గలిగినట్టియు, రాజ్యకార్యధురంధరుఁ డగునట్టియుఁ బురుషునకుఁగూడ భూషణాస్పదంబులు" ఈ గ్రంథకారుని వాక్యముల వలన. శికందరుబేగ మెంత రాజధర్మనిపుణయయినది తేటపడుచున్నది. ఈమెయందుఁ గల ముఖ్యగుణము వత్సలత; అనఁగా ప్రజలను వాత్సల్యముతోఁ జూచుకొని ప్రేమించుట. ఇందు విషయమయి భర్తృహరి తన నీతిశతకమునం దిట్లువ్రాసియున్నాఁడు :—

రాజన్ దుధుక్షసి యది క్షితిధేనుమేనాం
తేనాద్య వత్సమివ లోకమముం పుషాణ
యస్మింశ్చ సమ్యగనిశం పరితుష్యమాణే
నానాఫలైః ఫలతి కల్పలతేవ భూమిః.*

ఇట్లు బేగముగారు లోకులయెడ వాత్సల్య ముంచుటవలన, వారు సకలజనులకుఁ బూజ్యులయి, పృథ్విని కల్పవృక్షము గావించి, స్వేప్సితఫలములను గైకొనిరి! బేగముగారివలెఁ బ్రజావాత్సల్యమే పరమధర్మమని సకలరాజులు తలంచి, అటుల వర్తించుటకు యత్నించినపక్షమున, లోకములోని జనులందఱు సుఖింతురుగదా ? జిత జేతలలోని వైరముడుగునుగదా ?

---

*" తే. గీ. ధరణిధేనువుఁ బిదుకంగఁ దలఁచితేని
జనులఁ బోషింపు మధిప వత్సములమాడ్కి
జనులు పోషింపఁబడుచుండ జగతి కల్ప
లత తెఱంగున సకలఫలంబు లొసఁగు."

రాణీగారు తురుష్కు లయినను, తమరాజ్యములోని హిందూ జనులను దయతోఁ జూచుచుండిరి. నిరపరాధు లగుహిందువుల ననేకులను తురుష్కరాజులు పశువులవలె నఱికివేసిరని యితిహాసప్రసిద్ధమే కనుక బేగముగారియందుఁ గల సమత విశేష ప్రశంసనీయము.

బేగము షహాజహానునకు, అనఁగా బేగముగారికొమార్తెకుఁ బదునెనిమిది సంవత్సరముల ప్రాయము వచ్చువఱకు బేగముగారు రాజ్యము చేయవలయునని యింగ్లీషువారు సిద్ధాంతముఁ జేసిరని వెనుక వ్రాసియుంటిని. ఇంత కొద్దికాలములోనే బేగమువారు తన సంస్థానమును ఒక యద్వితీయ మైనట్టియు ననుకరణీయమైనట్టియు సంస్థానముగాఁ జేసిరి. అకబరుబాదుషా తరువాత జన్మించి రాజ్యపరిపాలనముఁ జేసినతురుష్కులలో నీమె యుత్తమ ప్రభ్వి యని చెప్పుటకు సందేహములేదు. అకబరునందుండిన సద్గుణములలోని యనేక సద్గుణము లీమెయందు వాసము చేయుచుండెను. కంపనీవారి ప్రభుత్వములోని గొప్పగొప్ప యధికారు లీమెరాజ్యవ్యవస్థను జూచి సానందాశ్చర్యమును బొందుచుండిరి. రాజ్యములోనిప్రజలందఱును సదా సంతోషముతో “మా పురాకృత పుణ్యమునలన మా కీశికందరుబేగముగారు రాణీగా లభించిరి” అని కొనియాడుచుండిరి.

ఇట్లు బేగముగారు సకలవందితలయి రాజ్యముఁ జేయుచుండ, అమెకూఁతురగు బేగము షహాజహాను ఉపవర యయ్యెను. అప్పుడు బేగముగారీచిన్నదానికి, బక్షీబాకరమహమ్మదఖా నను వరుని దెచ్చి, వివాహముఁ జేసిరి. అప్పటికి బేగముగారు బిడ్డకు

రాజ్య మిచ్చుటకు మూఁడుసంవత్సరముల వ్యవధి యుండెను. బేగముగారి మనసున నంత్యకాలమువఱకుఁ దాము రాజ్యము చేయువలయు నన్న యిచ్ఛయుండెను. బేగముగారియిచ్ఛ త్వరలోనే సిద్ధించెను.

౧౮౫౭వ సంవత్సరమున ఉత్తరహిందూస్థానము నందలి పటాలములోని సిపాయిలు తిరుగఁబడినందున ఇంగ్లీషువారికి గొప్పసంకటము సంభవించెనని, హిందూదేశ చరిత్రము చదివినవారి కందఱికిని తెలిసినవిషయమే. ఆసంకటసమయమున, దయార్ద్రహృదయ యగుబేగముగారు ఇంగ్లీషువారి కనేకరీతుల సహాయముఁ జేసి, ఇంగ్లీషువారు సూర్యచంద్రాదు లుండువఱకు మఱవఁగూడని యంత యుపకారముఁ జేసినది. సంకట సమయమున నింగ్లీషువారికి నుత్తరహిందూస్థానమునందు శిందోహోళకరులును, మధ్యహిందూస్థానమునందు భూపాళు బేగముగారును, దక్షిణమున నైజామును, సహాయముఁ జేసి నందువలననే యీ దేశమునం దాంగ్లేయు లుండఁ గలిగిరేమో. అనఁగా మనమిప్పుడింగ్లీషురాజ్యమువలన ననుభవించుచున్న శాంతత, నాగరికత, విద్యాభివృద్ధి మొదలగు సౌఖ్యములకు అంశతః శికందరుబేగముగారు కారణభూతురా లని నిర్భయముగాఁ జెప్పవచ్చును. ఈమె రాజ్యములోని యనేకజనులును, సొంతముగా నీమెతల్లియు, నింగ్లీషువారిపైఁ దిరుగఁబడిరి; కాని యీమె వారందఱిని నివారించి, మృత్యుముఖమునఁ బడనున్న యనేకాంగ్లేయుల యుక్తిప్రయుక్తులతో నింగ్లీషు సైన్యముండిన హుషంగాబాదుపట్టణమునకు సురక్షితముగాఁ జేర్చుటయందు బేగముగారు చూపిన ధై

ర్యమత్యంత ప్రశంసనీయము. ఇట్లనేకరీతుల బేగముగారు ఇంగ్లీషువారికి సహాయముచేసి అంతట శాంతపడిన తరువాత నింగ్లీషువారిరాజ్యము స్థిరపడుటకును అనేకరీతుల సహాయము చేసెను. ఈప్రకారముగా నీమె ఇంగ్లీషువారిని కృతజ్ఞతాబద్ధులను జేసినందువలన, వారీమెను చాల సన్మానించి, అదివఱకు గైకొనిన బైరసియాప్రాంత మామె కిచ్చివేసిరి. ౧౮౬౦ వ సంవత్సరమున నింగ్లీషువారు, శికందరు బేగము భూపాలసంస్థానమునకు స్వామిని యనియు, మరణకాలమువఱకీమెయే రాజ్యము చేయవలయు ననియు, ఈమె మరణానంతర మామెకొమార్తెకు రాజ్యము దొరకుననియు నేర్పాటుచేసిరి. ఇట్లు బేగముగారి యిచ్ఛ సిద్ధించెను. ఇంగ్లీషువారు కృతజ్ఞతాబుద్ధితో నామెకు నాలుగు తోపులు బహుమాన మొసంగిరి. వారు ౧౮౬౩ వ సంవత్సరమున గొప్పదర్బారుచేసి బేగముగారికి 'స్టార్ ఆఫ్ ఇండియా' అనఁగా హిందూదేశముయొక్క నక్షత్ర మనుబిరుదు నొసంగిరి. ఇట్లు బహువిధముల నింగ్లీషుప్రభువు లీమెను సన్మానించిరి.

శికందరుబేగ మిట్లు రాజ్యకార్యదక్షతనుగుఱించి కీర్తిని సంపాదించి, ఇంగ్లీషువారియెడ రాజనిష్ఠతను జూపి, వారిచే ననేక సన్మానములను బడసి, ప్రజలప్రీతికిఁ బాత్రురాలయి యైహికసుఖముల ననంతముగా ననుభవించుచుండెను కాని సౌఖ్యములలో నామె పారమార్థికవిచారమును మఱచినది కాదు. ఆమె బీదలయం దధికదయగలదయి వారి దుఃఖనివారణమున కనేకోపాయములను జేసెను. ఈమె స్త్రీలకు స్వాభావికములయిన యనేక ధర్మకృత్యములను జేసియున్నది. తురుష్కుల ధర్మశాస్త్రప్రకార

మాయమె ప్రతిదినమును మూడుపూటలఁ దప్పక ఈశ్వరప్రార్థన చేయుచుండెను. ౧౮౬౩ వ సంవత్సరమున, ఆమె రాజ్యమంతయు బిడ్డ కప్పగించి, ఆరాజ్యమును కాపాడవలయునని ఇంగ్లీషు ప్రభుత్వమువారికి విన్నవించి, తాను మక్కాయాత్రకు వెళ్ళెను. మనహిందువులకుఁ గాశీ మొదలగునో, తురష్కులకు మక్కా మొదలగునని చదువరులు గ్రహింపఁగలరు. యాత్రచేసికొని అచ్చట ననేకధర్మములుచేసి, దానశూరురాలని కీర్తినిజెందెను. అచ్చటి నుండి తిరిగి తనరాజ్యమునకు వచ్చి, ౧౮౬౮ వ సంవత్సరము వఱకుఁ బరమార్థవిచారములో సుఖముగాఁ గాలము గడిపెను. ౧౮౬౮ వ సంవత్సరమున నీమెకు రోగవ్యాధి కలిగి, అక్టోబరు నెల ౩౦ వ తేదిని ఈమె కాలధర్మమును జెందెను. అప్పుడీమె ప్రజలును, ఇంగ్లీషువారును దుఃఖితు లయిరి.

ఈమె కాలము చేసినతరువాత నీమెకూఁతురగు షహాజహాన్ బేగముసింహాసనమెక్కి, మిక్కిలి న్యాయముతో రాజ్యము చేయుచున్నది. తల్లివలె నీమె ప్రజావాత్సల్యమునందును, ఇంగ్లీషువారియెడ రాజభక్తిదృఢముగాఁ జూపుటయందును మిక్కిలి ఖ్యాతిని గన్నది. ఈమె సుగుణములను దర్బారునందు నింగ్లీషువారు పొగడి యీమెకు జీ. సీ. ఎస్. ఐ. అన్నపదవిని ఇచ్చిరి.

లార్డు ర్యాండుల్ఫు చర్చి గారి ప్రభుత్వసమయమునం దాయన భూపాలుసంస్థానముఁ జూచుటకు వెళ్ళి, యచ్చటి ప్రభుత్వమును జూచి మెచ్చి యా సంస్థానమును గుఱించి యిట్లు వ్రాసియున్నాఁడు :—

" భూపాలసంస్థానాధీశ్వరు లెప్పుడును రాజ్యకార్యధురంధరత్వమునకును రాజభక్తికిని ఔదార్యమునకును ప్రఖ్యాతులయి యున్నారు. ప్రస్తుతపు సింహాసనాధీశ్వరియొక్క తల్లిగారగు శికందరు బేగముగారు ౧౮౫౭వ సంవత్సరమున బ్రిటిషువారికి (ఇంగ్లీషువారికి) జేసినసహాయ మెప్పుడును మఱువఁదగినది కాదు. ఇప్పటి బేగముగారు తల్లిగారి రాజ్యము గ్రహించిన ట్లులనే, ఆమెసద్గుణములనుగూడ గ్రహించినది. ఈమె, నారాచారవిచారము గలిగినట్టియు, బుద్ధివైభవము గలిగినట్టియు, రాజ్యకర్త్రియని పేరొందినది; ఆమె లోకోపకారప్రదములైన యనేకకార్యముల కొఱ కత్యంత ధనమును వ్యయపఱచినది. ఈమె వైద్యశాలలకు సహాయముఁ జేసినది; భూపాలులోని లోకులకొఱకు నద్వితీయ మయినజలము దెప్పించినది. తాను కొన్నిదినముల క్రిందట తనసైన్యములలోనుండి యిచ్చెదనన్నసైన్యమును బ్రిటిషువారు తీసికొనవచ్చుననియు, ఆసైన్యము హిందూదేశసంరక్షణార్థ ముపయోగింపవలసినదనియు, నీమె నాకు నేఁడు తెలియఁజేసినది."

ఈవంశస్థు లిట్టులనే కీర్తినిఁ జెంది, శికందరుబేగమువంటి యనేక బేగములచే భూషితు లగుదురుగాక యని యీశ్వరుని ప్రార్థించి, యీచరిత్రము సమాప్తి చేయుచున్నాను.

# మైనాబాయి పోవారీణ్.

"ధైర్యసాహసములచేతఁ గార్యమగును."

ఈమె ధారానగరసంస్థానికుఁ డగు ఆనందరావు పోవారు గారి ధర్మపత్ని. 'పోవారీణ్' అను శబ్దము 'పోవారు' అన్న శబ్దముయొక్క మహాస్త్ర్యర్థకరూపము. స్త్రీనామ ముచ్చరించునప్పుడు మహారాష్ట్రభాషయందు నింటిపేరుయొక్క సుహాస్త్ర్యర్థకరూపమును వికల్పముగాఁ బ్రయోగించెదరు. కనుక మైనాబాయి పోవారు అని వ్రాయుటకు బదులుగా పోవారీణని వ్రాసియున్నాను. అటులనే అహల్యాబాయి హోళకరీణ్ అని వ్రాయవచ్చును.

మైనాబాయిగారిమామగా రగుఖండేరావుగారు ఉదోదాసంస్థానాధీశ్వరుఁ డగు గోవిందరావునాయకవారి పుత్రికను వివాహమాడిరి. ఆచిన్నది గర్భిణిగా నున్నకాలమున ఖండేరావు పరలోకగతుఁ డయ్యెను. అప్పు డాయనభార్య, రాజ్యభార మంత్రియుఁ బ్రధానిపై నుంచి, పుట్టినింటికి వెళ్ళి, మగశిశువునుగని, మృతిఁ జెందెను. తరువాత ఆపిల్లవాఁడు ఇరువదిసంవత్సరముల వాఁడై తనరాజ్యమునకు వెళ్ళఁగా నచ్చటి మంత్ర్యాదులు రాజ్యలోభముచే నాపిల్లవానికి నేమియు నీయక వెడలఁగొట్టింప యత్నించిరి. వారిలో రంగరావుఓఢేక రనుదివాన్ ప్రముఖుఁడై యుండెను. కాని మంత్ర్యాదులు తప్ప రాజ్యములోని ప్రజలందఱును రాజు పక్షమువారే యైనందున నాతఁడు మంత్ర్యాదుల నోడించి తనరాజ్యమును సంపాదించెను. కాని యీతఁడు

రాజ్యము చేసినంతకాలము న్యాయమున కనేకులవలన ననేకసంకటములు సంప్రాప్తించి, రాజ్యము కాపాడుకొనుటయే కష్టతరమాయెను. ఈసంస్థానమున బాధించువారిలో శిందే హోళకరులు ప్రముఖులై యుండిరి. వీరివలన నీ రాజ్యమున కత్యంతనష్టము గలిగెను. ఇట్టి సంకటసమయమున ఆనందరావు ఆకస్మికముగా నేదో వ్యాధివలన మృతిజెందెను. అప్పుడు రాజ్యభార మంతయు నాతనిభార్యయు గర్భవతియు నగుమైనాబాయిగారిపైఁ బడెను. అప్పుడు, స్త్రీయని యామెను ధిక్కరించి, వీరివంశస్థుఁడగు మురారిరావను నతఁడు రాజ్యమంతయు నాక్రమించుకొనెను. అత్యంతక్రూరుఁడైన మురారిరావు లంచములిచ్చి రాజ్యములోని యధికారుల ననేకులఁ దనకు వశపఱచుకొనినందున, దీర్ఘాలోచనగల మైనాబాయి, ప్రసవసమయమునందు ధారానగరములో నుండుట మంచిది కాదని తలఁచి, అచ్చటినుండి బయలుదేఱి ఇందూరు పట్టణమునకు వెళ్లి యచ్చటనే మగచిన్నవానిఁ గనెను. పిల్లవానికి రామచంద్రరావని పేరుపెట్టిరి. మగశిశువు గలిగినందున మైనాబాయిగారి కత్యంత ధైర్యస్థైర్యములుగలిగి యామె మురారిరావు నెదిరించి, కుమారునకు రాజ్యము సంపాదింప నిశ్చయించెను. ఇంతలో ధారాసంస్థానములోని కిల్లేదారుఁ, డనఁగా కోటమీఁది యధికారి, మైనాబాయిపక్షము నవలంబించి క్రొత్తగాఁ బుట్టిన యజమానుని పేరిట కోటను సంరక్షింపఁ నొడఁగెను. ఇట్లు కొన్నిదినములలో మైనాబాయిగారిపక్షము ప్రబలము కాఁగానే మురారిరావు భయపడి కపటము చేయసాగెను. కొందఱు మధ్య

స్థల నేర్పఱచి, వారిద్వారా "నేను మీయాజ్ఞ ప్రకారమే నడు
చుకొనఁగలను" అని కపటరహితయైన మైనాబాయిని నమ్మించి,
యామెను ధారానగరమునకు రమ్మని విన్నవించెను. ఆమాటలు
నమ్మి, ఇందూరునుండి యామె ధారాపట్టణమునకు బయలుదే
ఱెను. త్రోవలో మురారిరావుపక్షము వారనేకు లామెకెదురై
పుత్రజన్మమునకై యామె నభినందించి, హితులవలె మాటలాడి
యటులనే నటించి యామెను వెంబడించి, ధారాపట్టణమునకు
వచ్చిరి. అచ్చట నామె నొకగృహమునందుంచి, వెంటనే యాగృ
హముచుట్టు విచ్చుకత్తులు ధరించినభటుల నుంచిరి. ఇంతతో సం
తుష్టిఁ జెందక నాయింటికి నిప్పు ముట్టింప యత్నించిరి! ఆహా!
రాజ్యలోభమువలన మనుజుఁడెంతెంత దుష్కృత్యములను జేయు
నో చూడుఁడి!

ఈసంగతి మైనాబాయిగారిసేవకులకుఁ దెలియఁగానే, వారు
రోదనము సేయుచు యజమానురాలివద్దకి వెళ్లి, మురారిరావు
చేసినమోసమును దెలిపి, "మగవేషముతో మీరెచ్చటికైన
పాఱిపోయి ప్రాణములఁ దక్కించుకొనుఁడి" యని వేఁడుకొన
సాగిరి. కాని యామెధీరనారి వారితో నిట్లనియె. "మీరు నాహిత
ముగోరి యిట్లు చెప్పితిరిగాని యటులఁ జేయుట నాకు యుక్త
ముగాఁ దోఁచలేదు. పగరకు నెన్నఁడును వెన్నియ్యని రాజవంశ
మునఁ బుట్టి యట్టివంశముననే చొచ్చినందువలనఁ బాఱిపోవుట
నాకు యుక్తముకాదు. ఇట్టికృత్యమునకు నేనెట్లు సాహసింతును
నా కిష్టముకానిస్థలమునకుఁ బోవనొల్ల. ధర్మము దప్పక నాకిష్ట
మైన స్థలమునం దుండినప్పుడు నాకు మరణము సంప్రాప్తించినను

సంతోషమే. ఇట్లు మృతిఁ జెందినయెడల సహగమనము చేసిన వారి పదమునకు నేను పోఁగలను." ఈవీరరసయుక్తమైన సంభాషణము చదివినప్పుడు క్రింది భర్తృహరిశ్లోకము జ్ఞప్తికి రాకమానదు:—

సంపత్సు మహతాంచిత్తం భవే దుత్పలకోమలం
ఆపత్సుచ మహాశైలశిలాసంఘాతకర్కశమ్.*

ఇట్లు మైనాబాయి కఠినహృదయయై ధైర్యము నవలంబించి యచ్చటనే నిలుచుటకు నిశ్చయించెను. ఇంతలో నామెవద్ద నుండు పరిచారికాగణములోని యొకస్త్రీ తన కొమారుని మైనాబాయి కిచ్చి, రాజ్యమున కధిపతియైన యామెకుమారునిఁ దాను తీసికొని యెటులనో తప్పించుకొని యాగృహము వెడలి, రాణీగారి పక్షమువారిచే సంరక్షింపఁబడిన కోటలోనికిఁ జొచ్చి సురక్షితముగా నుండెను. ప్రభువు ప్రాణములు దక్కించుటకయి తన సొంత కుమారుని సమర్పించిన యాదాసీరత్నముయొక్క స్వామిభక్తిని గొనియాడుట తరమా? ఇట్లు మహోన్నత సుగుణసంపదలు నీచజాతి స్త్రీలలోఁ గూడఁ గానిపించుచుండఁగా స్త్రీలు దుర్గుణస్వభావము గలవారని చెప్పుట యన్యాయము కాదా? తమ దేహములను తమపుత్ర దేహములను పరోపకారార్థమై సమర్పించువారు పురుషులైనను, స్త్రీలైనను వంద్యులేగాని నింద్యు లెట్లగుదురు?

---

* "తే. గీ. సంపదలు గల్గునపుడు మహాజనులహృదయ
మభినవోత్పలకోమలం బగుచు వెలయు
నాపదలు వొందునప్పుడు మహామహీధ
రాశ్మసంఘాతకర్కశం బై తనర్చు."

ఇట్లురక్షకుఁడును, రాజ్యమునకు నధిపతియు నైన తనకుమా
రుని సురక్షితస్థలమునకుఁ బంపి, మైనాబాయి, రాఁగలసంకట
ముల నన్నిటిని ధైర్యముతో నెదిరించుటకు సన్నద్ధ యయ్యెను.
తనవద్దనున్న మితపరివారమునకు ధైర్యము పుట్టునటులమాటలు
చెప్పి, శత్రువులు తమమీఁదికి వచ్చినపక్షమున వారిని భయము
లేక యెదిరించుఁడనియు, మనసంఖ్య తక్కువగా నున్నను సత్యము
మనవైపునను, అసత్యము శత్రువులవైపునను ఉన్నందున 'సత్య
మేవజయతే' యని యున్నది గనుక మనకే జయము కలుగునని
యు, నామహాధైర్యశాలిని యగు మైనాబాయి తనపరివారము
నకు బోధించెను! ఇట్లు బోధింపఁబడిన వీరులసంఖ్య బహుస్వల్ప
మైనను వారు ఖడ్గములను ధరించి తమయజమానురాలికి నేమియు
మోసము రాకుండ, స్వప్రాణముల కాశపడక రక్షించుచుండిరి;
తా నిట్టిసంకటములలో నున్నాననియుఁ దనకుసహాయము చేయ
వలసిన దనియు శిందేసర్కారువారివద్దకు గుప్తముగా మైనాబా
యిగారు మనుష్యుని బంపెను. ఇట్లనే ఇంగ్లీషువారిసహాయ
మడుగుటకై వారివద్దకుఁగూడ గుప్తముగా పరిచారకునిఁ బంపె
ను. కాని యీచిక్కులలోఁ బడినందువలనఁ దమ కేమినష్టము
గలుగునో యన్నభీతిచేత వారెవరును ఆమెకు సహాయము చేయు
టకునై రాకపోయిరి. గొప్పది యుండినపక్షమున ధనాశకు సంక
టముల నైన నోర్చుకొని పీరిలో నెవరైన మైనాబాయిగారికి
సహాయము చేసియే యుందురు. ఈసంగతు లన్నియు మురారి
రావుకుఁ దెలియఁగానే యతఁడు క్రోధావేశపరవశుఁడై యామె
నిప్పుడే నేలపైచి కాల రాచెదనని తలఁచి, యాప్రయత్నములో

నుండెను. కాని మైనాబాయి యెంతమాత్రము జడియక మురారీ
రావున కిట్లు వర్తమానము చెప్పెను. "నీ వెన్నికుయుక్తులఁ బన్ని
నను, రాజ్యాధికారి యగు నాకుమారుఁడు నీచేతఁ జిక్కనేరఁడు.
నన్ను నీ వేమి చేసినను చింతలేదు; కాని నేను వీరపత్నిని అన్న
మాటమాత్రము మఱవకుము." ఈ మాటలు విని యాగ్రహపడి
మాలేరావు మైనాబాయిని జంప యత్నించుచుండఁగా, బరోడా
సంస్థానము మంత్రియొక్క తమ్ముఁడగు సఖారాంచిమణాజీ గుజ
రాతు దేశమునుండి, గొప్పసైన్యముతో రాణిగారికి సహాయము
చేయుటకయి వచ్చుచున్నాఁడని విని యాతఁడు ధారానగరము
నడిచి పలాయనముఁ జేసెను. అప్పుడు రాణిగారు బంధవిముక్త
యయి కుమారుని పేరిట రాజ్యతంత్రము లన్నియుఁ జూడసాగెను.
బరోడానుండి వచ్చిన సైన్యాధిపతికి, రాణిగారు స్వయముగా
రాజ్యముఁ జేయుట సమ్మతము కాకపోయెను. ఎందుకనఁగా తాను
చేయు సహాయమువలనఁ దన కేమయినలాభము కలుగవలయు
ననియు, తన యజమానుఁ డగు బరోడారాజున కేమయిన
లాభము కలుగవలయు ననియు నతని యభిప్రాయమై యుండెను
కాని మైనాబాయిగారిబుద్ధి కుశలతవలన నీకోరికలో నేదియు
సిద్ధించినది కాదు. ఇట్లు రాజ్యము సంపాదించుకొనుట శక్యము
కాదని తెలియఁగానే సఖారాంచిమణాజీ రాణిగారివద్ద మంత్రిగ
నుండి కార్యములను జూచుటకు సమ్మతించెను. పైనివర్ణించిన
సంకటములవలన సంస్థానమునకు నష్టము చాల పెరిగెను. ఈ
యప్పంతయుఁ దీర్చుటకు మంత్రిగారి సహాయముచే రాణిగా
రనేకోపాయములను బన్నిరి. కాని సఖారాంచిమణాజీ త్వర

లోనే కాలధర్మము నొందెను. తరువాత నతనికిఁ బ్రియుఁడగు బాపూ రఘునాథరావుగారు దివానయిరి. ఇతని చాతుర్యము వలనను, పరిశ్రమమువలనను, మైనాబాయిగారి ధైర్యసాహస ములవలనను ధారాసంస్థాన మనేకసంకటములనుండి రక్షింపఁబడి నది. పరదేశములకుఁ బోయి పలుసారులు దండయాత్రకు వెడలి, ధన మార్జించి మైనాబాయిగారు రప్పింపఁజేయుఁ దీర్చిరి. తరువాత నీసం స్థాన మనేకసంకటములలోఁ జిక్కి తుదకుఁ బరకీయు లగు హూణ ప్రభువుల సహాయముచే సురక్షితం బయ్యెను. కాని యీకథా భాగములో మనకుఁ బ్రయోజనము లేదు. మైనాబాయిగారు రాజ్యమును సంతోధైర్యములోను, న్యాయములోను నడిపెనుగాన నిప్పటికిఁ నామెను ఆదేశస్థు లనేకములుగాఁ బొగడుదురు. ధారాసం స్థానచరిత్రమునం దామెను గ్రంథకారుఁడు బహు నుతించినాఁడు. ఇంగ్లాండుసంస్థానమున కెట్టుల అహల్యాబాయిగారు భూషణప్ర దులో యట్టులనే ధారాసంస్థానమునకు మైనాబాయిగారు భూష ణప్రదు లని చెప్పవచ్చును. ఒకకవి యిట్టులవ్రాసియున్నాఁడు:—

చ. నతు లగుచు స్మహాన్నతిఁ దనర్చుచు నన్యగుణోక్తిచే గుణో
న్నతిఁ బ్రకటించుచుం బరజనప్రియకార్యసమర్థతం సమం
చితనిజకార్యసంగ్రహము సేయుచు నిష్ఠురవాదులం క్షమా
వృతి నిరసించుచుం బరఁగుధీరులు పూజ్యులుగారె యేరికిన్ .

ఈపద్యమునందు వర్ణించిన గుణము లన్నియు మైనాబాయి గారియం దుండినవి గావున నామె యందఱికిఁ బూజ్య యని చెప్పుటకు సందేహము లేదు.



# వీరమతి.

స్త్రియ స్తథా పాలనీయా యథా తాః కార్యవస్తుని
పుంవత్ ప్రవృత్తి మాధాయ సాధయేయు రనాకులాః,*

సంసారరూప మయినరథమునకు స్త్రీపురుషులు రెండుచక్ర ము లని యందఱికిని దెలిసినవిషయమే. ఈరెండు చక్రములు సమానముగా నుండినఁగాని సంసారరథము తిన్నగా నడవదు. రెండుచక్రములలో నెంతెంతభేద ముండునో యంతంతకష్టముగా రథము నడచును. పురుషుఁడు జ్ఞానవంతుఁడును, స్త్రీ యజ్ఞానాంధకారమగ్నయు నైన యెడలఁ గుటుంబములోఁ గొంచెమాత్ర మైనను సౌఖ్య ముండనేరదని మనలోని యనేకోదాహరణముల వలన స్పష్ట మగుచున్నది. భార్యాభర్తృరూపమయిన రెండు గిల్లలు విద్యాబుద్ధులయందు సమానముగా నుండినపక్షమున సంసారశకటము బహుసులభముగా నడచు ననియు, నడుమ నెన్ని సంకటములు వచ్చినను ఆగక, చక్రద్వయ సహాయముచే సులభముగాఁ గదలు ననియు, తుద కానందముగా నిష్టితస్థలమునకు రథము చేరుననియుఁ, జూపుటకు వీరమతిచరిత్ర మత్యంతోపయోగకర మయినది. కాన చదువరులు దీనిని విశేషశ్రద్ధతోఁ జదువవలయును.

శాలివాహనశకాబ్ద మందలి [illegible]ండవశతాబ్దమునం దేక మూడవశతాబ్దమునను గుజరాతు దేశమున చావడావంశస్థుఁ

* "పురుషులవలె ధైర్యము నవలంబించి, భీతిఁజెందక సర్వకార్యములను నిర్వహించునటుల, స్త్రీలకు విద్య నేర్పవలయును."

డగు బీరజీడను రాజు, టుకటోడా యనుగ్రామమును రాజధా
నిగా నేర్పఱచుకొని ప్రజాపాలనముఁ జేయుచుండెను. ఇతనితండ్రి
బ్రతికియున్నను, అతఁ డతివృద్ధుఁ డయినందువలన, బీరజీడే
ప్రజాపరిపాలనము చేయుచుండెను. వృద్ధరాజునకు బీరజీడుగాక
వేఱుసంతాన ముండెను. వారందఱిలోఁ గడగొట్టు కూఁతురి పేరు
వీరమతి. ఈమె యందఱికంటెఁ జిన్నదయినందునఁ గడు గారాబ
ముగాఁ బెరుగు చుండెను. చిన్ననాటి నుండియు రాజపుత్రుల
తోఁ గలసి మెలసి యుండుటవలన నామె రాజపుత్రులు నేర్చు
కొను విద్యలన్నియు నేర్చుకొనెను. కావ్యవ్యాకరణాదులయందు
నామె కృషిచేసినదో లేదో తెలియదుగాని, చక్కఁగ వ్రాయుట,
చదువుట, లెక్కలు మొదలగునవానిలో నామె ప్రవీణత సం
పాదించినదని చరిత్రమువలనఁ దెలియవచ్చుచున్నది. ఇదియును
గాక అశ్వారోహణము, గజారోహణము, సాముచేయుట, గద
త్రిప్పుట, యుద్ధములో వింట నం బుపయోగించుట మొదలైన
రాజపుత్రుల కత్యంతావశ్యకమైన ధనుర్విద్యలును ఆమె నేర్చుకొ
నెను! ఇట్లు యుక్తవయస్సు వచ్చువఱకు వీరమతి, స్త్రీలకు
స్వాభావికము లగు సౌందర్య గాంభీర్యవినయాది సద్గుణములను
విడువకయే 'పుంవత్ప్రగల్భ' యయ్యెను.

వీరమతి దినదినప్రవర్ధమాన యయి పదునాలుగు సంవత్సరం
బులది కాఁగానే, యామె వివాహయోగ్యయైన దని తలఁచి
అప్పుడుగల యత్యంతశ్లాఘనీయ మయిన స్వయంవర పద్ధతి నను
సరించి యామె వివాహము చేయ నిశ్చయించి, ఆమె యన్న
గారగు బీరజమహారాజు దేశదేశములకు విప్రుల నంపి, అప్పట

చ్చటి రాజపుత్రుల లక్షణము లరసి వారి పటములను తెండని చెప్పెను. విప్రు లాప్రకారమే దేశ దేశములకు వెళ్లి యనేక రాజపుత్రుల స్వరూపపటములను దెచ్చి వీరమతికిఁ జూపి, యాయా రాజపుత్రుల స్వభావగుణములను నోటితో వర్ణనచేసిరి. వారిలో, ధారానగరములో రాజ్యము చేయుచున్న ఉదయాదిత్య మహారాజుగారి కుమారుఁ డగుజగదేవుఁ డను రాజపుత్రుని సద్గుణములను వినియు, నతని సుందరరూపమును జూచియుఁ దానాతనిఁ దప్ప మఱియొకరిని వరింపనని వీరమతి నిశ్చయించుకొనెను! ఈ సంగతి యామె యన్నగారికిఁ దెలుపఁగా నతఁడు 'నా చెల్లెలగు వీరమతిని మీ కుమారుఁ డగు జగదేవున కిచ్చెద' నని ఉదయాదిత్యునకు శుభలేఖ పంపెను.

ఉదయాదిత్యుఁడు సూర్యవంశ క్షత్రియరాజు; విక్రమాదిత్యుని వంశములోని పదవ పురుషుఁడు. ఈయన మాలవదేశములోని ధారానగరమును తన రాజధానిగాఁ జేసికొని యనేక సామంతులకుఁ జక్రవర్తిగానుండెను. చావడావంశస్థుఁ డగు వీరరాజతనికి సామంతుఁడుగానే యుండెను. ఉదయాదిత్యుఁ డత్యంత శౌర్యవంతుఁడని ప్రఖ్యాతినిఁ జెందినవాఁడు. ఇతని భార్య లిద్దఱుండిరి. ఈ రాణీల నామములు తెలియకపోయినను పెద్దభార్య వాఘేలీవంశములోని దనియును, రెండవభార్య సోళంకవంశములోని దనియునుఁ దెలియుచున్నది. వాఘేలీరాణికి రణధవలుఁడనియు, సోళంకీరాణికి జగదేవుఁడనియుఁ బుత్రులు గలిగిరి.

వాఘేలీ సోళంకీరాణులు సవతు లయినందున నొండొరులొండొరులపయి నత్యంత మత్సరముతోఁ బ్రవర్తించుచుండిరి.

బహు పత్నీత్వదోష మీ దేశమునందు బహుకాలమునుండి, శిష్టాచారముగా నడుచుచున్నందున ననేక కుటుంబముల గృహ సౌఖ్యము నాశన మగుచున్నదని సకల జనులకుఁ దెలిసినవిష యమే. ఒక స్త్రీని వివాహమాడి, యామె తన సహధర్మచారి ణియనియు, నర్ధాంగియనియు, 'నాతిచరామి' యని వివాహ మునందు నామెకు వచన మిచ్చితిననియు మఱచి, రెండవభార్య ను వివాహమాడి, మొదటి భార్యయందలి ప్రేమను విభజించుట గొప్ప యన్యాయమని చెప్పవలెనా? ఏకపతివ్రతమును, ఏకప త్నీవ్రతమును, ఉత్తమ నాగరికతా ద్యోతకములని పెద్దలు చెప్పెదరు. మనసమాజములో స్త్రీలయెడ జరగెడి యన్యాయం బులలో బహుపత్నీకత్వ మొక గొప్పయన్యాయము. 'సవతి పోరు స్వర్గమునందయిన నక్కఱలేద'న్న సామెతవలననే యీ బహుపత్నీకత్వమువలన సమాజమునందుఁ గలిగెడి కల్లోలములు వ్యక్తము కాఁగలవు. కావున కుటుంబదుఃఖమునకుఁ గారణమ యిన యీ బహుపత్నీకత్వమును మాన్పి, యనాదికాలము నుండి యీ దేశమున నడుచుచున్న యేకపతివ్రతమువలెనే, యే కపత్నీవ్రతమును దేశాభిమానులు స్థాపించెదరని నమ్ముచున్నాను.

ఉదయాదిత్యమహారాజు వాఘేలిరాణియందు బద్ధానురాగుఁ డయి, సోళంకిరాణిని దాసివలెఁ జూచుచుండెను. కొంతకాల మునకు సవతిమత్సర మధికమయి, వాఘేలిరాణి సోళంకిరాణిని ఇల్లు వెడలఁ గొట్టించెను. కాని మంత్ర్యాదులు మధ్యస్థులయి, సోళంకిరాణియొక్కయు నామె కుమారునియొక్కయు నుదర నిర్వాహకమునకు రెండుగ్రామముల నిప్పించి, వాసము చేయుట

కయి యూరిబైట నొక్కగృహము నిర్మించిరి. సోళంకిరాణి విచారశీల గావున, సంప్రాప్తమయిన దుస్థితియందుఁగూడ తన కుమారునకు విద్యాబుద్ధులు చెప్పించుటకు మఱచినది కాదు. ఇతర వ్యయము లన్నియుఁ దగ్గించి, మిగిలిన ధనముతోఁ గుమారునకు రాజయోగ్య మైనవిద్య లన్నియుఁ జెప్పించెను. ఇట్లు జగదేవుఁడు కొన్ని దినములలో రణధవలునికంటె నధికశూరుఁడని విఖ్యాతిని జెందెను. ఇందుచే రాజ్యమునందలి లోకు లందఱును, జగదేవుని యందే బద్ధానురాగు లయి యుండిరి. రాజుగూడ జగదేవుని శౌర్యసాహసముల విని సంతోషించుచుండెను. కాని వాఘేలి రాణికిఁ గోపము వచ్చునేమోయని రాజు తనకు జగదేవుని యందుఁ గలప్రేమ స్పష్టపఱుచుటకు వెఱచుచుండెను. ఇట్లు కొంతకాలము జరిగిన వెనుకఁ బైని వర్ణింపఁబడిన వీరజరాజుగా రంపినశుభలేఖను దీసికొని కొందఱు బ్రాహ్మణు లుదయాదిత్యుని సభకు వచ్చిరి. ఆశుభపత్రికలను జూచి, రాజు ఆనందభరితుఁ డాయెను; గాని రణధవలుని వివాహము కానందున వాఘేలి రాణి జగదేవుని వివాహమున కనుజ్ఞ యిచ్చునో లేదోయని సంశయించెను. కాని జగదేవుని యదృష్టమువలన రాజుగారు వాఘేలిని త్వరలోనే సమాధానపఱుపఁ గలిగిరి.

ఇట్లు పెద్దభార్యయనుజ్ఞ పుచ్చుకొని ఉదయాదిత్యుఁడు టంకుతోడా గ్రామమునకుఁ దరలివెళ్ళి, కుమారుఁ డగుజగదేవునకు వివాహముఁ జేసి కోడ లగువీరమతిని వెంబడిఁ దీసికొని, ధారానగరమునకు వచ్చెను. జగదేవుని వివాహ మయినప్పటి నుండియు సోళంకిరాణియు, జగదేవుఁడును, పూర్వగృహమునం

దుండక రాజగృహమునందే యుండిరి. కొన్నిరోజులత్తవారి యింట నుండి, వీరమతి పుట్టినింటికి వెళ్ళెను.

రాజగృహమునందుండి, రోజును రాజసభకు వచ్చి రాజకార్యము లనేకములు నిర్వహించుచుండుటవలన జగదేవునికీర్తి దినదినము వృద్ధిని జెంది సభవా రందఱును, అతనినే ప్రేమించుచుండిరి. వాఘేలికుమారుఁ డయినరణధవళుఁడు చిన్నతనమునాటి నుండియు నెట్టివానివలె నుండుటచేత వాఁ డెవరికిని ప్రియుఁడు గాకపోయెను. ఇట్లు తనకుమారునిఁ జూచి యందఱు అసహ్యాపడుదు రనియుఁ దనసవతికుమారుని నందఱు ప్రేమించెద రనియుఁ జూచి, యటులనే కొన్నిరోజులు జరగ నిచ్చినయెడలఁ దనకుమారుని వెడలఁగొట్టి జగదేవుఁడే రాజగు ననియు వాఘేలిరాణి తలంచెను. జగదేవుఁడు తనసవతితల్లి యగు వాఘేలీరాణిని సదా సంతోషపెట్టవలయు ననియు, తనపయి నామె పుత్రవాత్సల్యము నుంచవలయు ననియు, నెల్లప్పుడు ఆమె యంతఃపురము నకుఁబోయి యామెకరుణను బడయుటకుఁ బ్రయత్నించుచుండెను. ఇట్లు తనయంతఃపురమునకు శుద్ధాంతఃకరణముతోఁ బలుమారు వచ్చెడిబాలునిపై గొప్పునెప మొక్కటి మోపి, రాజునకు నమ్మిక పుట్టునటులఁ జేసి, వాఘేలి యీమ జగదేవుని రాజ్యము వెడలఁ గొట్టించెను. అప్పు డాకుమారుఁడు ఒక గుఱ్ఱమును, తన యాయుధములను మాత్రము వెంటఁబుచ్చుకొని, పట్టణ మును స్వతంత్ర సంస్థానమునకు వెళ్లి, యచ్చటిరాజునొద్ద నేదియైన నధికారము సంపాదించుకొనవలయు నన్న యుద్దేశముతో నా సంస్థానమునకు బయలుదేఱెను. కాని యంతలోఁ దనసహధర్మచారిణి యగు

వీరమతినిఁ జూచి, యామె యనుజ్ఞ వడసి, పట్టణమునకు వెళ్ళు దమని తలఁచి, గుఱ్ఱమును టుకుటోడాపట్టణము వైపునకుఁ ద్రిప్పెను. ఇట్లు జగదేవుఁడు బయలుదేఱి కొన్ని దినములకు టుకుటోడాగ్రామసమీపమున నున్న యొక యుద్యానవనము చేరెను. అచ్చటికిఁ జేరువఱకు సాయంకాల మయినందువలనను, గుఱ్ఱము ప్రవాసముచే నత్యంతాయాసము పడినందువలనను, అచ్చట కొంతకాలము విశ్రమించుకొని, రాత్రి వెన్నెలలో గ్రామము చేరవచ్చునని దలఁచి, జగదేవుఁ డా యుద్యానములోనికి వెళ్లి, గుఱ్ఱమును విడిచి, తాను ఫలాహారము చేసి నిదురించెను.

జగదేవుని వెడలఁగొట్టినతరువాత వాఘేలిరాణి వెంటనే కొందఱు దుర్మార్గులకు ధనాశఁ జూపి, జగదేవునిఁ ద్రోవలోఁ జెఱ బట్టి రండని వారిని బంపెను. జగదేవుఁడు వెళ్లినదిక్కునకె వారు వెళ్లిరి; కాని తన సవతితల్లి తనను జంపుటకయి యిటుల మనుష్యులను బంపునేమో యని తలఁచి, జగదేవుఁడు, పెద్దత్రోవను విడిచి నడిమిదారిని నడుచుచుండెను. కనుక వాఘేలి పంపిన మనుష్యు లితఁడు త్రోవలోఁ గనుపడినవాఁడు కాఁడు. పైని వర్ణించిన యుద్యానవనములో నిదురించినప్పుడు నలుగురు మనుష్యు లచ్చటఁ బ్రవేశించి, నిదురించుచున్న రాజపుత్రుని బంధించి యడవిలోనికిఁ గొనిపోయిరి. ఇంతలో దైవవశమున వీరమతియు, నామె చెలికత్తెయుఁ బురుషవేషములు వేసికొని, వేఁటాడి యావనములోనికి వచ్చిరి. అప్పు డచటి సేవకజనము లామెతో నెవరో రాజపుత్రుఁ డచ్చటికి వచ్చెననియు, నిద్రించుచున్న సమయమున నతనిని నలుగురు దొంగలు పట్టుకొని పోయి

రనియుఁ జెప్పిరి. ఆమాటలు వినినతోడనే వీరమతియు నామె
చెలికత్తెయు దొంగలు పోయినత్రోవను రాజపుత్రుని విడిపించు
టకై గుఱ్ఱములను పరుగెత్తించిరి. కొంతదూరము పోయిన తరు
వాత నొక యరణ్యములో నాకూరస్త్రీలు, కాలుచేతులు కట్టి
బడియున్న జగదేవుని నడుమఁ బెట్టుకొని యతనిని జంపవలెనా
వలదా యని తమలోఁ దాము వాదించుకొనుచుండిన చోరచతు
ష్టయమును గాంచిరి. పురుషవేషధారులగు వీరిద్దరిని జూచి
దొంగలు వారివద్దిధనముఁ దీసికొనవలె నన్న యిచ్ఛచే వారి
మీఁదికిఁ వచ్చిరి; కాని వీరమతియు నామె సహచరియు భీతి
నొందక వారిపయి తమ కంకపత్రములను, భల్లములను బ్రయో
గింపసాగిరి. ఆదుష్టులు చేయఁగలిగిన ప్రయత్నములఁ జేసిరిగాని
వారిలో నొకఁడు వీరమతిచేఁ జచ్చెను; మఱియొకఁడు చెలికత్తె
యొక్క భల్లప్రహారణమువలనఁ దొడ తెగి క్రిందఁ గూలెను.
వీరమతిని జూచి మిగిలిన యిద్దఱును పారిపోయిరి. అప్పుడు వీర
మతి జగదేవుని బంధనములు విప్పి, యతఁడు తనపెనిమిటియని
తెలిసికొని, తా నెవరో చెప్పక యతనిని గ్రామమునకు రమ్మని
బలవంతముచేసి, వెంటఁ దీసికొనిపోయెను. అచ్చటికి నేగినతరు
వాత నిజస్వరూపముఁ జూపఁగా, తన ప్రాణములు రక్షించినది
తన యర్ధాంగియే యని తెలిసికొని, జగదేవుఁడత్యంత సంతోష
చిత్తుఁ డయ్యెను. అప్పుడు వీరమతి "మాకుఁ దెలియపఱుపక
యిటుల నొక్కరు వచ్చుటకుఁ గారణంబేమి" యని భర్తను అడి
గెను. అందుపయి నతఁడు తన వృత్తాంత మంతయుఁ జెప్పి "నన్నుఁ
గొనిపోయినదుష్టులు మాసవతితల్లిగారిచేఁ బంపఁబడినవారు. నే

నీకమీఁద నిచ్చట నుండినపక్షమున, నీయన్నగారు మాతండ్రికి సామంతుఁడుగాన నాతనికిఁ జేటు వాటిల్లును, గనుక నేను పట్టణ సంస్థానమునకుఁ బోయి యచ్చట నుద్యోగమును సంపాదించుకొని, నిన్నుఁ బిలిపించుకొందును. పోవుటకు ననుజ్ఞ యిమ్ము" అని పలికెను. అందుపయి వీరమతి, తన్ను వెంటఁ దీసికొని వెళ్ళవలయునని తొందర పెట్టసాగెను. అందుమీఁద జగదేవుఁడు బావమఱఁది యగు వీరజుని సమ్మతిఁ బుచ్చుకొని, భార్యను వెంటఁ దీసికొనిపోవుటకు సమ్మతించెను. వెంటఁగొంత సైన్యముఁ దీసికొనవలసినదని వీరజుఁడు బలవంతపెట్టెనుగాని, యందుకు జగదేవుఁడు సమ్మతింపక పోయెను. భార్యాభర్తలిరువురు రెండు గుఱ్ఱములపయి నెక్కి, యుద్ధమునకు నుపయోగించు శస్త్రములను వెంటఁ దీసికొని, పట్టణమునకు బయలుదేఱిరి.

ఇట్లు ప్రవాసము చేయుచు వారొకనాఁడు మధ్యాహ్నమొక యూరిలో దిగి భోజనముచేసి, విశ్రమించి, యచ్చటి వారిని పట్టణమునకుఁ ద్రోవ యేదియని యడుగఁగా వారు రెండు దారులు గలవనియు, నందొకదారిలో మనుష్యులను దిను రెండు బెబ్బులులు లున్నవనియుఁ జెప్పిరి. అప్పుడు పులు లున్న త్రోవనే మనము వెళ్లి, వానిని వేఁటాడి చంపి లోకుల కుపకారము చేయుద మని, వీరమతి జగదేవునితోఁ జెప్పెను. భార్యయొక్క శౌర్యోత్సాహములను జూచి జగదేవుఁడు సంతసించి యా దారినే వెళ్లుటకు సమ్మతించెను. వా రాత్రోవను నాలుగుక్రోశముల దూరము పోఁగానే వారు "ఈ క్రూరమృగమును జంపి మా ప్రాణములను రక్షింపుఁడి" యన్నధ్వనిని వినిరి. ఆశబ్దము వచ్చెడి

దిక్కునకు వా రిరువురు తమగుఱ్ఱములను త్రిప్పి కొంతదూరము వెళ్లిరి. దూరమునుండి చూడఁగా, పెద్దచెట్టుపై నిద్దఱుమనుష్యులు కూర్చుండి గజగజ వడఁకుచుండుటయు, క్రింద నొక పెద్దపులి బొబ్బలు పెట్టుచు, నెగురుచు, భయంకర మయిన రూపమును దాల్చి చెట్టుపై నున్న మనుష్యులను క్రిందఁ బడవైచుటకుఁ బ్రయత్నించుచుండుటయుఁ గానవచ్చెను. ఇట్లుఁ జూచి వారిరువురు నాపులిని సమీపించి యొక పొదచాటునుండి, దాని వీపునకుఁ దగులునట్టుగా బాణము వేసిరి. అంత నాపులి వృక్షముమీఁది మనుష్యులను వదలి, వెనుకకుఁ దిరిగి తనను నొప్పించిన దంపతులపయికి నురికెను. అంతలో జగదేవుఁడు మఱియొక బాణము వేయఁగా నది తప్పిపోయెను. అంతచేత నాపులి మఱింత గర్జించుచు, జగదేవుని సమీపించెను. అప్పుడు వీరమతి తనచేతికత్తి నాపులిపొట్టలోఁ గ్రుచ్చఁగా నది క్రిందఁ బడి ప్రాణములు విడుచుచుఁ బెద్దగా బొబ్బరించెను. ఆ ఘోర శబ్దమును విని, పొదలలో నున్న యాఁడుపులి యంతకంటెఁ బెద్దగా నఱచుచు, తనప్రాణనాయకుని సహాయమునకు వచ్చెను. అప్పుడా శృంగారదంపతులు కూడి యాపులినిగూడఁ జంపిరిగాని దానిగోళ్ళచే గీరఁబడినందున జగదేవునిగుఱ్ఱము బాధచే మృతిఁ బొందెను. అందుకు జగదేవుఁడు మిక్కిలి చింతించి, తనదేహముపయి పచ్చడము దానిపై కప్పెను. చెట్టుపయిని యిద్దఱుమనుష్యులు దిగివచ్చి, తమప్రాణదాతలకు నమస్కరించిరి. మీ రెవ్వరని జగదేవుఁడు వారిని నడుగఁగా వారిట్లు చెప్పిరి. "ఉదయాదిత్యమహారాజుగారికి రెండవకుమారుఁ డగు జగదేవుఁ డిటువ

దినముల క్రిందట నేకారణమువలననో యింటినుండి బయలుదేఱి యెవరికిఁ జెప్పక యెచ్చటికో పోయినాఁడు. అతనితల్లియగు సోళంకిరాణి యతనిని వెదకుట కయి ధీరసింహుఁడనుమంత్రిని బంపినది. మేము ధారానగరమువద్ద నున్నయొక పల్లెలోని వారము. ప్రవాసములో నందఱికంటె ముందు పోయి భోజన ప్రయత్నము చేయుట కయి ధీరసింహుఁడు మమ్ము వెంబడి తెచ్చినాఁడు. నిన్నటిరోజు మేము ధీరసింహునకంటె మొదట బయలుదేఱి, ముందటిగ్రామమునకుఁ బోవుచుండఁగా, త్రోవతప్పి యీ యడవిలోకి వచ్చి పెద్దపులులచే బాధితుల మయితిమి." ఇట్లు వారిచేఁ దనతల్లి క్షేమసమాచారమును తనను వెదకుట కయి తనతల్లిగారు తన కత్యంతప్రియుఁడగు ధీరసింహునిఁ బంపిన దనియును విని, జగదేవుఁ డత్యంత ముదితుఁడయి ధీరసింహుఁ డెచ్చట నున్న వాఁడో యచ్చటికిఁ దీసికొనిపొండని వారి నాజ్ఞాపించెను. వారిలో నొకఁడు ముందు, నడుమ గుఱ్ఱముపయి, జగదేవవీరమతులు వారివెనుక నింకొక సేవకుఁడు, ఇట్లు నడుచుచు, కొంతదూరము వెళ్లినతరువాత వారికి నెవరో గుఱ్ఱపురౌతులు, ఎనిమిది పదిమంది యెదురుగా వచ్చుచున్నట్లు గానిపించిరి. వారు ధీరసింహుని మనుష్యులేయని నమ్మి జగదేవాదులు వారిరాకకు నెదురు చూచుచు నిలువఁబడిరి. కాని కొంత సేపటికి వచ్చెడి వారు తమకు మిత్రులుగాక, యెవరో శత్రువులని తెలిసెను. అప్పుడు జగదేవవీరమతులు శస్త్రాస్త్రములను సవరించుకొని యుద్ధమునకు సన్నద్ధులయిరి. వారివెంబడి నున్న సేవకులు కొన్ని

రాళ్ళను పోగు చేసికొని యచ్చటనున్న యొక వృక్షమునెక్కి-శత్రువులపయి రువ్వసాగిరి.

ఇంతలో నాగుజ్జపురాతులు వచ్చి, యాదంపతులను జుట్టుకొనిరి. వా రెనిమిదిమంది యున్నందున వారితోఁ బోరి గెలుచుట యసాధ్యమని తలఁచి, జగదేవుఁడు వారు తమపయికి రాకుండ ఖడ్గము తనచుట్టు త్రిప్పుకొనుమని తనభార్యకు సూచించి తానును అదేప్రకారము చేసెను. వీరిలో వెనుక జగదేవుని పట్టుకొని పోయినవారిలోనివాఁ డొకఁ డున్నందున, వీరందఱును వాఘేలీరాణిగారిచేఁ దమ్ము చంపుటకునై పంపఁబడినవారని వారు గ్రహించిరి. ఇట్లు కత్తి చుట్టుఁ ద్రిప్పుకొని యాత్మసంరక్షణము చేసికొనుచున్న యాదంపతుల పయి నాశత్రువులనేకబాణములు గురిపెంచిరిగాని యవి యన్నియు వేగముతోఁ ద్రిప్పఁబడుచున్న ఖడ్గముచే ఖండితము లయ్యెను. ఆసమయమున వారిశరీరమును స్పృశించుటకు వాయుదేవునికిఁగూడ శక్యము కాకపోయెను. ఇట్లు మహావేగముతోఁ గత్తి కొంతసేపు ద్రిప్ప డస్సి యిఁక నట్టుల చాలసేపు సేయుట యశక్యమని తలఁచి వీరమతి, వారుచుట్టిన యావరణమును పగులఁగొని యవతలికిఁ బోవ యత్నించెను; అటులనే సేయుటకయి పతికిని సూచించెను. వారిరువురు రెండుప్రక్కల నావరణమును బగులదీయుటకయి యత్నింపఁ జొచ్చిరి. వీరమతి యాశత్రువుల నాయకునిపయి నొకబాణము వేయఁగా నతఁ డాబాణమును దప్పించుకొనెనుగాని యాబాణము దగిలి వానిగుఱ్ఱము కూలెను. ఆగుఱ్ఱము కూలఁగానే యతఁడును క్రిందఁబడి మూర్ఛిల్లెను. ఇట్లు వీరమతిచేఁ

దమనాయకుఁడు భంగపడుట చూచి యితరులందఱుఁ గ్రోధావేశపరవశులయి యామెపైకి నురికిరి. వారందఱు నొక్కసారి పేర్చియార్చిన వీరమతి వారితోఁ బోరాడెనుగాని, యామెఱకు ఖడ్గము త్రిప్పిత్రిప్పి యలసియున్నందున నాఘోరకలహములో నాచేతిపట్టు బడి ఖడ్గము క్రిందఁబడెను. దానిని తీసికొనుటకై యామె ప్రయత్నించు నంతలో రెండుబాణములు వచ్చి యొకటి యామె కాలికిని మఱియొకటి యామె చేతికిని తగిలెను. వానిని దీయుటకై యత్నించుచుండ నొకఁడు వెనుకనుండి వచ్చి యామె మెడఁ బట్టుకొనెను. ఇందుపై నామె మూర్ఛిల్లెను గాని యింతలో జగదేవుఁడు తనఖడ్గముచే నామనుష్యుని రెండుచేతులను దునిమి, తన ప్రియభార్యను విడిపించుకొనెను. ఇఁక జగదేవునకు మూర్ఛిల్లిన భార్యను రక్షించుకొనుటయు, శత్రువులతో యుద్ధము చేయుటయునను రెండుపనులు చేయవలసివచ్చెను. ఇట్లు జగదేవుఁడు తన శౌర్య మంతయుఁ జూపుచుండఁగా ధీరసింహుఁ డిరువది గుఱ్ఱపురౌతులతో నదేమార్గమున వచ్చుట సంభవించెను. -తరువాత జగదేవుని గుఱ్ఱెఱిఁగి యాదొంగల నందఱిని పైకిదుచేసెను. తరువాత ధీరసింగుగుఱ్ఱము దిగి జగదేవుని కౌఁగిలించుకొని, యతనిచే దొంగలవృత్తాంత మంతయు విని మూర్ఛిల్లియున్నది వీరమతి యని తెలిసికొని యామెకు శీతోపచారములు చేయించి, గాయములకుఁ గట్లు కట్టించెను. అంత నామె స్మృతి నొంది లేచి, ధీరసింగును చూచి, యతనికి మ్రొక్కెను. తరువాత వారందఱును ఆరోజున నచ్చటనే కూడి భోజనాదులు చేసిరి. భోజనోత్తరము ధీరసింగు జగదేవునితో నిట్లు లనియె "ఇదియంతయు వాఘేలీ

రాణిగారు చేసినపనియే. కనుక నీవు ధారానగరమునకువచ్చి, యీ సంగతినంతయు మీతండ్రిగారికి విశదపఱచి, నీయందు దోషము లేకపోవుట స్థాపించుకొనవలసినది. ఇందుకై నేను నీ వైపున సాక్ష్య మిచ్చెదను." అందుపై, తా నట్లుచేసిన తన సవతితల్లికి నవమాన మగుననియు, తా నింటినుండి బయలు దేఱినప్పుడు తన బాహుబలముచే గీర్తి సంపాదించిగాని తండ్రికి ముఖముం జూపనని ప్రతిజ్ఞం జేసితిననియు, తాను పట్టణమునకు వెళ్ళి యచ్చట తన బాహు విక్రమముచే గీర్తియు శ్రీయు సంపాదించి, తల్లిని దండ్రిని జూచుటకు వచ్చెదననియు జగదేవుఁడు ధీరసింహునితోఁ జెప్పెను. ధీరసింహుఁ డందుకు సమ్మతించి, తనగుఱ్ఱములలో నొకదానిని జగదేవుని కిచ్చి, యతనియాజ్ఞఁ బుచ్చుకొని ధారానగరమునకు నెడలెను. అప్పుడు జగదేవుఁడు "మాతల్లిగారికి నాక్షేమసమాచారము చెప్పి, యామెకు నేమియు నాయాసము గాకుండఁ జూచుచుండవలసినది" యని చెప్పెను. ఆమంత్రి సత్తముఁడు రాజధానికిఁ బోయి యటులనే చేసెను. ఇచట నాదంపతు లిద్దఱు గుఱ్ఱములెక్కి సవారు లయి మార్గములో ననేకసంకటములఁ బడుచు కొన్నిరోజులకుఁ బట్టణ మని యపరనామము గల అణహిలపురమునకుఁ జేరిరి. ఆగ్రామమునకు సమీపమున సహస్రలింగతటాక మను నొకచెఱువున్నది. ఆతటాకతీరమున దిగి యచ్చటనే గుఱ్ఱములను వీరమతిని ఉంచి తాను బసచూచివచ్చెద నని జగదేవుఁడు గ్రామములోనికిఁ బోయెను.

జగదేవుఁడు గ్రామములోనికి వెళ్ళిన కొంతసేపటికిఁ జెలువున
కోకవనిత నీళ్ళకు వచ్చి వీరమతినిఁ జూచి నేర్పుగా నామె పేరు,
ఆమె పెనిమిటిపేరు మామపేరు కనుఁగొనిపోయి యాసంగ
తులన్నియుఁ దన యాజమానురాలితోఁ జెప్పెను. ఆకాలమున
నాపట్టణము పండ్రెండుక్రోశముల వైశాల్యము గలది యయి
బహు రమ్యముగా నుండెనఁట. జయసింగు సిద్ధరాజను రాజు
ప్రజాపరిపాలనము చేయుచుండెను. ఆయన ధర్మాత్ముఁ డనియు,
దయాశాలి యనియుఁ బ్రసిద్ధి కెక్కెను కాని అతఁడు రాజ్యము
లోనియధికారులఁ బరీక్షింపక వారిపయి నమ్మిక గలిగి ప్రవర్తిం
చుటచే నాపట్టణమందు ననేకాన్యాయములు జరుగుచుండెను.
ఆపట్టణమునకుఁ గొత్వాలనఁగా దండనాయకుఁడుగా నున్న
డుంగరసీ యనువాఁడు స్వయముగా నన్యాయములు చేయించు
చుండెను. స్వయముగా దొంగలను బ్రోత్సాహపఱచి వారు
తెచ్చినసొమ్ములో భాగము గొనుచుండెను. వేశ్యాంగనాసక్తుఁ
డయి గ్రామమునం దనేక వేశ్యాంగనలను దెచ్చియుంచెను.
వారిలో లాలమొతీ యనువేశ్యాంగన మక్కలి చక్కనిదయి
లెక్కింపరాని ధనమును సంపాదించెను. దానియిల్లు రాజభవన
మునకెను ఘనఁదోటలు రాజోద్యానములనకెను గానుపించును.
ఈవేశ్యాంగనలలోని రాణి తనదేహమును విక్రయించుటయే
గాక పట్టణములోని యనేక సాధ్వీమణులను మోసపుచ్చి తన
యింటికి రప్పించి, బలవంతముగా వారిని కాముకజనుల కర్పించి
వారిపాతివ్రత్యమును భంగము చేయుచుండును. దండనాయకుని
కుమారుఁ డగు లాలదాసనువాఁడుగూడ జారశిరోమణి యని

పేరు గాంచి యీజామోతికి దాసుఁడయి యొప్పుచుండెను.

పైని చెఱువునకు నీళ్ళకొఱకువచ్చి వీరమతి నామగ్రామములు కనుఁగొనినదని చెప్పినవనిత యీజామోతియొక్క సేవకురాలు. దాసి చెప్పినమాటలు విన్నతోడనే యావేశ్యాంగన రాజస్త్రీకి యోగ్యమయినవేషము వేసికొని మేనాయెక్కి, వెంటఁ గొందఱు భటులను దీసికొని వీరమతి యున్నచోటికి వెళ్లెను. అచ్చట నామెను గాంచియెవరో కావలసినదానివలె నామెవద్దికి వచ్చి, "పరాయి వారివలె మీరిట్లు వేరు బసచేసుకొనుట న్యాయమా? మీరు వచ్చెద రని మొదలే కబురు చేసినపక్షమున మేము మీ కెదురుగనే వచ్చి యుందుము. నేను ఉదయాదిత్యుని పినతండ్రి కూతురను; జగ దేవునికి వేలువిడిచిన మేనయత్తను. బస చేయుట కయి జగదేవుఁడు పట్టణములోనికి రాఁగా రాజుగారతనిని జూచి యానవాలుపట్టి రాజమందిరములోనికిఁ దోడుకొని వచ్చిరి. అచ్చట నతనిచే నీవిచ్చట నున్నసంగతి విని నిన్ను రాజభవనమునకుఁ దీసికొనిపోవ వచ్చితిని. ఈగుఱ్ఱములు మొదలైనవానిని నాబంట్లు తీసికొనిరాఁగలరు. ఈమేనాలోఁ గూరుచుందుము. పద, పోయెదము" అని పలికెను. ఆమాటలు విని యామె చెప్పినసంగతు లన్నియు నిజమనుకొని వీరమతియామెవెంబడి రాజగృహమునకు సరితూగుచున్న యామె గృహమునకుఁ బోయెను. అచ్చటికి వెళ్ళినపిదప నావేశ్యాంగన వీరమతికి నభ్యంగనస్నానము చేయించి, కొంతసేపటికి భోజనమునకు లెమ్మని పిలిచెను. అందుపైని మీమేనయల్లుఁడు భోజనము చేసినఁగాని నేను భోజనముచేయనని యామె యుత్తర మిచ్చెను. అందుపైజామోతి

తన పరిచారికలలో నొక దానిని, 'మీకొఱకు మీమేనయత్త కని పెట్టుకొని కూర్చున్నది' అని చెప్పి జగదేవునిఁ దీసికొనిరమ్మని పంపెను. ఆదాసి పోయినటుల నటించి, తిరిగివచ్చి, రాజుగారితో జగదేవుఁడు భోజనము చేసినాఁడు; మిమ్మును వీరమతిగారిని భోజనము చేయుమని చెప్పినాఁడు అనిచెప్పెను. అందుపయి వీరమతి కొంచెము భుజించెను. తరువాత నా వారయువతి యొక సుందరమైన యఱకఁజూపి వీరమతిని అచ్చట విశ్రమించు మని చెప్పి వెళ్ళెను. ఈసంగతు లన్నియుఁ జూచి వీరమతికి సంశయము గలిగెనుగాని సాయంకాలమువఱకుఁ బెనిమిటి వచ్చునేమోయన్న యాశచే నామె యాగదిలో శయనించెను. సాయంకాలము కాఁగానే యింటి యజమానురాలు మఱల వచ్చి భోజనమునకు రమ్మని పిలిచెనుగాని, భర్త వచ్చి భోజనము చేయనిది తాను అన్నము ముట్టుట లేదని వీరమతి తననిశ్చయము తెలిపెను. అప్పుడు జామోతి యేమియుఁ జేయలేక కొన్ని ఫలాహారము లచ్చటఁ బెట్టి తినుమని చెప్పి వెళ్ళిపోయెను. పోవుచు జామోతి గదియొక్క వెలుపలి గొళ్ళెమును వేసికొనెను. అదియంతయుఁ జూచి యిది యొక మాయగానున్నదని తలఁచి వీరమతి మఱింత భీతి నొందెను. ఆమె యాగదిలోఁ గూరుచుండి పెనిమిటిని నెప్పుడు చూచెదనా యని చింతించుచుండెను.

ఆపట్టణములోని దండనాయకుని కుమారుఁ డగు లాలుదాసునకుఁ బ్రతిదినమున నొక క్రొత్త యువతిని సమర్పించుట జామోతి యొక్క నిత్యవ్రతము. ఆరోజు వీరమతివంటి చక్కనిస్త్రీ దొరికి

నందుకు జామోతి యెంతయు సంతసించి, తనకు గొప్ప బహు
మానము దొరుకునని నిశ్చయించుకొని యుండెను. సాయం
కాలము కాఁగానే యావారకాంత నాదినము జరిగినవృత్తాంత
మంతయు లాలుదాసునకుఁ దెలిపి, వీరమతి పెనిమిటిపేరు చెప్పె
యతనిఁబట్టి కారాగృహములో వేయించి, రాత్రికి నతనిని (లాలు
దాసును) తనయింటికి రమ్మని చెప్పెను. ఆ నరాధముఁడు రాత్రి
నియమితకాలమునకు, వేషమువేసికొని, సురాపానము చేసి, జా
మోతి గృహమునకురాఁగా ఆచండాలిని పుచ్చుకొనవలసిన ధన
మంతయుఁ బుచ్చుకొని యతనికి వీరమతి యున్న మేడఁ జూపి, తన
నివాసస్థలమునకు వెళ్లిపోయెను. ఆ నరాధముఁడు మేడ యెక్కి
నప్పు డయిన చప్పుడువిని, భర్తృధ్యానరత యైనపతివ్రతానాయిక,
తనభర్త వచ్చెనని తలంచి సంతసించెను గాని పాతకుఁడు
లోనికి రాఁగా వానిభయంకర మైనస్వరూపమును జూచి, పర
పురుషుఁ డని యెఱిఁగి గజగజ వడఁక సాగెను. అంతలో రాజస్త్రీలకు
స్వాభావిక మైన ధైర్యము నవలంబించి, యెన్నియో బోధవచనము
లచే నాదుష్టుని దుర్మార్గమునుండి తొలఁగింప యత్నించెను. ఆమాట
లువినక ఆ నరపశువు, మదోన్మత్తుఁడయి, వివేకశూన్యుఁడై, వీర
మతియొక్క పవిత్రదేహమును దనపాపపు హస్తములతో స్పర్శిం
చుటకై యత్నించెను. ఇఁక నూరకుండిన మానమునకు భంగము
కలుగునని తలఁచి, యా యతులపరాక్రమశీల యగు అబల తన
నడుములోని గుప్తఖడ్గము సర్రునఁ దీసి యా నరాధముని రెండు
తునకలుగాఁ ద్రుంచెను. ఈఖడ్గ మెక్కడిది యని చదువరులకు
సందేహము వచ్చునేమో. ఆకాలపు ప్రతిరాజపుత్ర స్త్రీకి

నడుమున మొలకట్టురూపమున నొక సన్నఖడ్గము అమరి యుండు
ను. ఈ ఖడ్గములు వంచిన విరగనట్టి యుక్కుతోఁ జేసినవి; ఇవి
మొలకట్టు ఆకారము గలబంగారపు ఒరలో నుండుటవలనఁ జూచు
వారికి మొలకట్టులవలెనే గానుపించును. మానమునకు మోసము
గలుగుచున్న పక్షమున రాజపుత్ర స్త్రీ లాఖడ్గమును ఉపయో
గించుచుండిరి. ఆఖడ్గమునే సంకటసమయమున వీరమతి యుపయో
గించి, తనమానమును సంరక్షించుకొనినది! ఆహా! ఇట్టి పతివ్రతా
తిలకంబులఁ గొనియాడ నెవరితరము? స్త్రీపురుషుల కందఱికిని వం
దనార్హమైన యీ నారీతిలకము మునితిలకుఁడైన మనువు వ్రాసిన

అరక్షితా గృహేరుద్ధాః పురుషైరాప్తకారిభిః
ఆత్మాన మాత్మనా యాస్తు రక్షేయుస్తాస్సురక్షితాః. *

అనిన వచనమును సోదాహరణముగా స్థాపించి, స్త్రీలకయి
మహోపకారముఁ జేసినది. ఓ సోదరీమణులారా! చూచితిరా
పాతివ్రత్యప్రభావము! వనితలకుఁ బాతివ్రత్యమే శ్రేయమనియు,
గ్రాహ్యమనియు, లాభమనియు నమ్ముఁడు. పాతివ్రత్య
మునకు సాటి యగు ధర్మము స్త్రీలకు మరియు లేదు. పతివ్రతా
స్త్రీలను సంరక్షించుటకయి సదా సర్వేశ్వరుఁడు సిద్ధముగా
నుండును. పాతివ్రత్యమునకుఁ దన్నుఁ దానే రక్షించుకొను సామ
ర్థ్యముగలదని కొందఱు చెప్పుదురు. అనఁగా పతివ్రతా స్త్రీ
లెంతనిస్సహాయలైనను, ఎన్ని సంకటములలో మునిఁగియున్నను, వా
రికి స్వసద్గుణములను గాపాడుకొను సామర్థ్య మీశ్వరుఁ డిచ్చును.

---

* ఆప్తులైన పురుషులచే గృహమున నిర్బంధింపఁబడు స్త్రీలు రక్షితు
రాండ్రు కారు; ఏ స్త్రీలు తమయాత్మను తామే కాపాడుకొందురో వారే
సురక్షితురాండ్రు.

పతివ్రతలను దుష్టులచేతిలోనుండి విడిపించుటకయి పతివ్రతల వెంబడి యెల్లప్పుడును దేవదూత లదృశ్యులై తిరుగుచుందురని యొకపాశ్చిమాత్యకవి వ్రాసియున్నాఁడు. కీచకుని గృహమునకుఁ బోవునపుడు ద్రౌపదీదేవి తనపాతివ్రత్యమును రక్షింపవలసినదని సూర్యునికి విన్నవింపఁగా,

క. "తరణియు దుఃఖిత యగున
త్తరుణిం గాచుటకు నత్యుదగ్రభుజావి।
స్ఫురణాఢ్యు నొక్కరక్కసుఁ।
గరుణార్ద్రమనస్కుఁడగుచు గ్రక్కునఁ బనిచెన్"

అని మహాభారతమునఁ జదువుచున్నారము గదా? దమయంతి శాపంబునఁ గిరాతుఁడు దగ్ధుఁడయ్యెనని యు విందుము. ఈ దేవదూతలును, రాక్షసుఁడును, శాపసామర్థ్యమును పతివ్రతాస్త్రీల యొక్క సత్ప్రవర్తనమును, దృఢనిశ్చయమును, శౌర్యసాహసములును అనియె చెప్పవచ్చును. తమధర్మమునకు భంగము కలుగుట సంభవించినప్పుడు పతివ్రతా నారీమణులకుఁ గ్రోధాతిరేకము కలుగును. ఆక్రోధాతిశయము వలనదె దుష్టుని శిక్షించి, పాతివ్రత్యమును సంరక్షించుకొనుసామర్థ్యము గలదు. కనుక నోహిందూ సుందరులారా! ప్రాణములైనఁ బోఁగొట్టుకొని మీ పాతివ్రత్యమును రక్షించుకొనుఁడు. మీసచ్ఛీల మనుధనమును అపహరించుటకయి యనేక నరచోరులు సదా తత్పరులై యుందురు. మీకు విద్యనేర్పక మూర్ఖులను జేసి తమవలలో వేసికొనవలెనని యనేకులు స్త్రీవిద్య యక్కఱలేదని ప్రతిపాదించెదరు. వారిమాటలు వినకుఁడి. సద్విద్యను గఱచి, పతివ్రతలచరిత్రము

-లను జదివి, వారివలె ప్రవర్తించుటకు యత్నించుఁడి. విద్యనేర్చు
కొనిన నిట్టిసంకటములు రావని నాతాత్పర్యముకాదు. కాని
యిట్టి సంకటములు సంప్రాప్తించినపుడు మూర్ఖులవలె నిరాశను
బొందక విద్యనేర్చినస్త్రీలు ధైర్యము నవలంబింతురు. సంకట
మును దొలఁగించుకొనుటకు వారికి ననేక యుక్తులు తోఁచును.
వీరమతికి శస్త్ర మెటుల నుపయోగించినదో యటులనే విద్య
యిప్పటి స్త్రీలకు సంకట సమయమునం దుపయోగించును. కనుక
మీ పాతివ్రత్యసంరక్షణార్థమై మీ రెల్లప్పుడును విద్యయనుశస్త్రము
ను వెంబడి నుంచుకొనుఁడి.

ఇట్లు నరాధముఁ డగులాలుదాసును యమసదనమునకుఁ
బంపి, వానిశరీరమును గుడ్డలో మూటగట్టి వీరమతి యామూ
టను గవాక్షములోనుండి వీధిలోఁ బాఱవైచెను. తదనంతరము
లోపలికి మఱి యెవరు రాకుండునటుల మేడత్రోవ లోపల బిగి
యించుకొని యిఁక నేమేమి విచిత్రములు జరగునో చూతమని
చేత ఖడ్గమును ధరించి గవాక్షమువద్ద నిలువఁబడెను. అంతే
రాత్రి గస్తి తిరుగు సంరక్షకభటులు కొందఱా మూటను
జూచి, విప్పి, దండనాయకుని కుమారునిశవ మని తెలిసికొని,
తత్క్షణమే యాసమాచారము దండనాథునికిఁ దెలియఁ జేసిరి.
తనపుత్రునిశవమును జూచి, దండనాయకుఁడు శోకాకులచిత్తుఁ
డై, యాశవ మెచ్చట దొరకినదని యాభటుల నడిగెను. జామో
తియొక్క గుప్తగృహసమీపమున దొరకినదని వారు చెప్పఁగా
నతఁడు వెంటనే యా వారకాంత యింటికిఁ బోయి లాలుదాసుఁ
డేఁడియని యడిగెను. అందుపై జామోతి నవ్వి యతఁ డొక

క్రొత్తరంభావిలాసములో నున్నాఁడు. నెఱవకుండి; పిలుచుకొని వచ్చెదనని మేడపైకిఁ బోవుటకు వెడలెను. కాని పైకిఁ బోవు త్రోవనె మూసియున్నందున, నెన్ని పిలుపులు పిలిచినను, ఎవరునుఁ బలుకకపోయిరి. అప్పుడామె మఱలివచ్చి యీసంగతియంతయుఁ గొత్వాలుతోఁ జెప్పెను. అప్పుడతఁడు కొందఱు భటులను బిలిపించి, యీమేడతలుపులను దీయ యత్నించెను. కాని జామోరినియింట జరిగిన ఘోరకృత్యము లన్నియు నామేడలో జరుగుచున్నందున నావేశ్యాంగన యెవ్వరికిని దీయ నలవిగాని ఘనతర మైనతలుపు ఆమేడకుఁ బెట్టించి యుండెను. కనుకఁ గొత్వాలు చేసినయత్నము లన్నియు విఫలము లయి తలుపు రాకపోయెను. అప్పుడు వీధిగోడకు నిచ్చెనవేసి గవాక్షములో నుండి లోపలికిఁ బోద మని నిశ్చయించి యటులనే నిచ్చెన వేసికొని యొకభటుఁడు పైకెక్కి గవాక్షములోఁ దలఁ బెట్టఁగానె యచ్చట నిలుచున్న వీరమతి తనఖడ్గముతో వానిమెడఁ ద్రుంచెను. అంత వానిమెడలోపలఁబడి, వానిమొండెము వీధిలోఁబడెను! అందుకు భయము నొందక మఱియొకఁడు పైకిరాఁగా పతివ్రతాతిలక మగుమనచరిత్రనాయిక వానినిగూడ ఖడ్గమునకు బలియిచ్చెను! ఇట్లు పదునొకండుగురు మేటిమగ లాయబలచే నిహతులైరి!! అప్పుడు పైకెక్కుట కేవాఁడును సాహసింపక పోయెను. ఇంతలో నీవార్త ప్రాతఃకాల మగుటవలన గ్రామములో సంతయునిండి, యీవారవనిత గృహమునకు లోకులు గుంపులు గూడి రాసాగిరి. ఒకస్త్రీ పండ్రెండుగురుభటులను గూల్చిన దని యంద ఱనుకొనఁగ నాపట్టణపు రాజుకూడ వినెను.

అతఁ డిట్టి విచిత్రమును చూచుట కయి స్వయముగా నచ్చటికిపో యెను. అచ్చట నామె చంపినవారి నందఱినిఁజూచి, స్వయముగా నిచ్చెనపైకి నెక్కి, గవాక్షమువద్ద నిలువఁబడి, యిట్లనియె. "ఓ యసమాన శౌర్యము గల స్త్రీ! నీవెవ్వరవు? ఇట్లు నాప్రజలను జంపుటకుఁ గారణమేమి? నేనీపట్టణమునకు రాజును. నీకెవరైన నపరాధము చేసినపక్షమునఁ జెప్పుము. వారిని నేను దండించె దను." అందు పయి "మహారాజా! నేను చావడా కులోత్పన్నుఁ డయిన బిరజమహారాజుగారి చెల్లెలను ; ధారానగరమునకు నధి పతియైన యుదయాదిత్య మహారాజుగారి కోడలను. నా పేరు వీరమతి" అని చెప్పి తనవృత్తాంతమంతయు తన్ను మోసపుచ్చి వేశ్యాంగన యిచ్చటికిఁ దీసికొని వచ్చినవిధమును సవిస్తరముగాఁ జెప్పి, లాలుదాసుని యనుచితకృత్యమును దెల్పి, "నా పాతివ్రత్య రక్షణమున కయి నేను వానిని జంపితిని ; నన్నుఁ బట్టుకొనవ చ్చిన పదునొకండుగురనుగూడ అందునకే వధించితిని ; నేను క్షత్రియకన్యను. నా దేహమునందుఁ బ్రాణ ముండువఱకు నన్య పురుషస్పర్శ కానియ్యను" అని స్ఫుటముగా వీరమతి పలికెను. ఆమాటలువిని రాజెంతయు సంతసించి "రాజపుత్ర స్త్రీలకుఁ దగినపని చేసితివి ; వెడలిరమ్ము ; నిన్ను నేను నా పుత్రికవలెఁ బాలించెదను. నీపెనిమిటిని వెదకించెదను" అని పలికెను. కాని "నాపెనిమిటి వచ్చినఁగాని యీమేడతలుపు తియ్యనని ప్రతిజ్ఞ చేసియున్నాను. కనుక మొదట నాపెనిమిటిని దెప్పించినపక్షమున తమయాజ్ఞ శిరసావహించెదను. లేనిపక్షమున నిచ్చటనే దేహ మును విడిచెదను" అని వీరమతి యుత్తర మిచ్చెను.

అప్పుడు రాజు తనభటులను బంపి వెతకించి, కారాగృహమునం దున్నజగదేవుని దెప్పించెను. భర్తనుజూచి యామె యానందించి, మేఁతలుపు తీసి వెలుపలికి వచ్చెను. రాజు జామోతిని కైదులోవేయించి దాని యిల్లంతయు జప్తుచేయించెను. పిమ్మట జగదేవ వీరమతులను దనరథమున నెక్కించుకొని, యింటికిఁ దీసికొనిపోయెను. పట్టణపుత్రోవను రథములో నెక్కి వీరమతి పోవుచుండ ననేక స్త్రీలు ఆమెకు వందనములు చేసి, కులాంగనలపాలిటిరాక్షసు లైన లాలుదాస జామోతులను శిక్షించి పట్టణపు పాతివ్రత్యమును రక్షించినమహాపతివ్రత యీమెయే యని వేయినోళ్ళ కొనియాడఁ జొచ్చిరి.

రాజుగారు పూర్వపుదండనాయకుని దుశ్చేష్టలను గనుఁగొని యతనిఁద్రోసి, జగదేవుని బుద్ధిప్రభావములఁ జూచి యతనిని దండనాయకునిగా నియమించెను. అధికారము చేతికి రాఁగానే జగదేవుఁడు రాజ్యమునందుఁ గల యవ్యవస్థయంతయు మాన్పి, రాజ్యములో నంతయు న్యాయము జరుగునట్లు చేసెను. దినదినము శౌర్యవిద్యాదులచే నతఁడురాజునకు నధిక ప్రియుఁడయ్యెను. ఇంతలో వీరమతి గర్భవతియై యామెకుఁ బుత్రుఁడు పుట్టెను. అప్పుడు జగదేవుఁడు గొప్పయుత్సవముచేసి యాశిశువునకు జగద్ధవలుఁ డని పేరు పెట్టెను. ఈసంగతి తన తల్లిదండ్రులకుఁ దెలుపుట కయి యొకదూతను బంపెను. ఇట్లు సుఖముగాఁ గాలక్రమణము చేయుచుండఁగా నొకనాఁడొక చమత్కారము జరిగెను. అందువలన జగదేవుని కుటుంబమంతయు నాశముఁ జెందునేమో యని భీతిగలిగెను. అదియెట్లనిన :

జగదేవునికి నధికారప్రాప్తియైనప్పటినుండియు దుష్టులకు బహు బాధ గలుగుచుండెను. కనుక వారందఱును జగదేవునిఁ జంపుటకై యనేకోపాయములఁ బన్నిరిగాని యవియన్నియు నిష్ఫలములయ్యెను. కాని యొకసంవత్సర మాపట్టణమునఁ గత్తెరలుపుట్టి లోకు లనేకముగాఁ జచ్చుచుండిరి. ఎన్నియుపాయములు చేసినను గత్తెర యాగకపోయెను. అప్పుడు రాజు సర్వప్రజాసంహార మగునేమోయని భీతిల్లి, తన్నివారణమునకై యూరిబైటనున్న కాళికాదేవినిఁ బూజించుటకు రోజును స్వయముగా వెళ్ళుచుండెను. ఇట్టి సంకటసమయమున నెవ రేమిచెప్పినను, ఎట్టి యసంభవములైన దైవికచమత్కారములను జూపినను రాజుగారు నమ్మఁగలరని తలఁచి దుష్టులొక యుక్తిని గల్పించిరి. వారిలోనొకఁడు కాళికాదేవి విగ్రహమునకు వెనుక నిలువఁబడి రాజుగారేకాంతముగాఁ బూజచేయునప్పుడు, దేవి పలికినటులే యిట్లనియె. “ఓమహారాజా ! నీభక్తికి మెచ్చితిని ; ఈరోగముపోవుట కొక యుపాయము చెప్పెదను వినుము. సర్వసద్గుణ సంపన్నుఁడైన యొక రాజకుమారుని నాకు బలియిచ్చినపక్షమున, ఈ రోగము పోయి నీప్రజలు సుఖింతురు ; నీవును నూరేండ్లు రాజ్యముచేసి యానంద మొందెదవు.” అందుకు రాజు “ఓతల్లీ! నారాజ్యములో సకల సుగుణములు గల రాజపుత్రుఁ డెవ్వఁడు గలఁడో నీవే యానతియిమ్ము” అనెను. అప్పుడు కాళికాదేవి యిట్లనియె. “వత్సా! నీరాజ్యములో నిట్టి రాజకుమారుఁడు లేఁడని చింతపడకుము. నీదండనాయకుఁ డగు జగదేవుఁ డిన్నిగుణములు గలవాఁడు. కనుక నతనిని బలియిచ్చిన పక్షమున నీవును, నీప్రజలును సుఖిం

చెదరు." ఈమాటలు విని రాజు మిక్కిలి ఖిన్నవదనుఁడై యింటికిఁబోయెను. రాజు ఖిన్నవదనుఁ డగుటకుఁ గారణ మేమి యని, జగదేవుఁడు విచారించి, యాసంగతినిఁ దెలిసికొని, చిన్న పోవలదనియు, లోకులకొఱకును, రాజుగారికొఱకును, దాను సంతోషముతోఁబలి పోయెదననియును, రాజుగారితోఁ జెప్పెను. రాజు వలదని చెప్పెనుగాని యామాటలు వినక జగదేవుఁ డింటి కిఁబోయి భార్యతో నామాటలు చెప్పఁగా నామె తానును, దనకుమారుఁడును బలివచ్చెదమని చెప్పెను. ఇట్లు లోకహితా ర్థమై యా త్రదేహములను సమర్పింప నిశ్చయించి యాదంపతులు తమసొత్తంతయు బీదలకుఁ బంచిపెట్టి,యభ్యంగనస్నానము లాచ రించి, ప్రాతఃకాలమున మంగళవాద్యములతో దేవికడకుఁ బోయి రి. దేవికిఁ బూజచేసి, మొదటి పిల్లవానిని, పిదప వీరమతిని, తరువాత జగదేవుని బలియియ్యఁదలంచిరి. ఇట్లు ఆదంపతులు కృతనిశ్చయులై యున్న సమయమున రాజుగారికి నాసమాచా రము తెలిసి, వారి నివారించుటకై యతఁడు దేవిగుడికి వచ్చెను. వచ్చి జగదేవుని వలదని రాజు నివారించుచుండఁగా నాదుష్టులలో నొకఁడు మరల దేవి వెనుకకుఁ బోయి దేవివలెనే యిట్లనియె— "రాజా! వలదని యతని నివారింపకుము. ఈబలివలన నీకుఁ గాలాభము గలుగును." ఈమాటలు వినఁగానే రాజుగారికి సంశయము గలిగి, దేవి వెనుక వెదకి చూడఁగా నాదుష్టులకృత్రి మము తెలిసెను. ఇదేకథ కొంద ఱిట్లు చెప్పెదరు. జగదేవుఁడును అతని భార్యాపుత్రులును కాళికాదేవివద్దికిఁబోయి స్వదేహము లను స్వహస్తములతో బలి యిచ్చికొనిరఁట. వీరందఱు మృతు

లయిన వెనుక రా జచ్చటికి వచ్చి, వారినిజూచి దుఃఖించి, తన దేహమునుగూడ దేవికి సమర్పింపఁ బోఁగా, దేవి ప్రత్యక్షయయి యతని నివారించి, మృతులయి పడియున్న జగదేవాదుల లేపెనఁట. ఈ రెండుచరిత్రములలో నేది నిజమై యుండవచ్చునో చదువరులే గ్రహింపఁ గలరు.

ఇట్లు దుష్టుల దుర్మార్గత తెలిసినతోడనే రాజుగారు వారికిఁ దగినశిక్షలను విధించి జగదేవుఁడు లోకహితార్థమైయును, రాజహితార్థమైయును జూపినసాహసమునకయి యతనికి నేమి యిచ్చినను ఋణము దీర నేరదని యెంచి, యతనికిఁ బ్రభావతి యనుతన కొమార్తె నిచ్చి వివాహము చేసెను. కూఁతుతో ననేకగ్రామాదుల నల్లునికి వరదక్షిణ యిచ్చెను. దుష్టులు జగదేవునకుఁ గీడు చేయఁదలఁచిరిగాని, యందువలన నతనికి మేలే కలిగెను.

ఈప్రకారము జగదేవుఁడు సుఖముగా కాలక్రమణము చేయుచుండఁగా నచ్చట ధారానగరములో ఉదయాదిత్యుఁడు వార్ధక్యమున రాణీగారి కుతంత్రములను గానలేక యామెచెప్పుచున్నట్లు రాజ్యము చేయుచున్నందున, రాజ్యములో నంతయు నన్యాయములు జరుగుచుండెను. ప్రజ లందఱు అసంతుష్టులై యుండిరి. ఈసంగతు లన్నియుఁజూచి దగ్గరనున్న యొక రాజు దండెత్తి వచ్చి, ఉదయాదిత్యునిరాజ్యమును దీసికొని, యతనిని అతని బాంధవుల నందఱిని గారాగృహములో వేసెను. ఈసంగతి యంతయు జగదేవునికిఁ దెలిసి యతఁడు, మామగారియాజ్ఞ పుచ్చుకొని, బయలుదేఱి, ధారానగరమునకుఁ బోయి, శత్రురాజుల నోడించి, తండ్రిగారిని మరల రాజ్యాధిపతినిగాఁ జేసెను.

అప్పుడు మంత్రిసత్తముఁ డగుధీరసింహుఁడు రాజునకు జగదేవుని సమాచార మంతయుఁ జెప్పి, యతనియం దెంతమాత్రము తప్పులేదనియు, వాఘేలీరాణియొక్క కుయుక్తులే జగదేవుని దుఃఖములకుఁ గారణము లనియుఁ దెలియఁ జెప్పెను. అప్పు డుదయాదిత్యుఁడు జగదేవుని గౌఁగిటఁ జేర్చుకొని, ముద్దాడి, యతనిని యువరాజుగా నియమించెను. అప్పటినుండి ఉదయాదిత్యమహారాజుగారికి వాఘేలీరాణియం దసహ్యత గలిగి, యాయన సోళంకీరాణిగారినే ప్రీతితోఁ జూచుచుండెను; కాని వాఘేలిని దిన్నఁగాఁ జూడవలసినదని పతివ్రతాతిలక మగు సోళంకీరాణి భర్తకుఁ జెప్పుచుండును. ఉదయాదిత్యుని యనంతరము జగదేవుఁడు సింహాసనము నెక్కి న్యాయముగా రాజ్యపరిపాలనము చేసెను.

జగదేవునకు ముగ్గురుభార్య లుండినను, వారియందఱిలో మొదటినుండి, పతికిఁ బ్రతికార్యమందును సహాయముచేసి, యతనిఛాయవలెఁ దిరిగిన వీరమతియే యతని ముఖ్య మహిషిగా నుండెను. కాని యామె సద్గ్రంథములను జదివినదిగనుకఁ గణ్వమహాముని శకుంతలకు నుపదేశించిన

> శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీవృత్తిం సపత్నీజనే
> భర్తుర్విప్రకృతాపి రోషణతయా మాస్మ ప్రతీపం గమః
> భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే భాగ్యే ష్వనుత్సేకినీ
> యాంత్యేవం గృహిణీపదం యువతయో వామాః కులస్యాధయః.*

అను సదుపదేశము ననుసరించి సదాచారిణియై, గృహిణి యన్న సార్థక బిరుదమునువహించెను.

# రాణీరామాబాయి

"వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి
లోకోత్తరాణాం చేతాంసి కోహి విజ్ఞాతు మర్హతి.†

ఈ యసమానసాహసము గలిగిన శూరనారీరత్నము రాజపుత్రస్థానములోని చిత్తూరు సంస్థానాధీశ్వరుఁడగుజగమల్ మహారాజుగారి ధర్మపత్ని. ఢిల్లీచక్రవర్తులలో నుత్తమోత్తముఁ డని కీర్తినిఁ జెందిన యక్బరుబాదుషాతో జగమల్‌మహారాజు సమకాలీనుఁడు. రాణీరామాబాయి తనబుద్ధిప్రభావముచేఁ బెనిమిటి పయికి వచ్చిన సంకటములను బెక్కుసారులు తప్పించెను; గనుక అప్పటినుండి మహారాజుగారు భార్యయనుమతిలేక, యేకార్యమును చేయకుండెను.

తనసార్వభౌమత్వమును స్థాపించునప్పుడు, అక్బరుబాదుషా యీ చిత్తూరు రాజ్యముపైకి దండెత్తి వచ్చి, నీవు నాసామంతుఁడవుగానుండి నాకుఁ గొంత సాంవత్సరికపు సిస్తు చెల్లించుటకు నొప్పుకొనవలసినది ; లేనియెడల యుద్ధమునకు రావలసినది ; అని

* చ. గురులకు సేవఁజేయుము, మనుఁగుంగతిఁ జూడుము నీసపత్నులన్ ;
వరుఁ డలుకన్ వహించినను భర్తృవిరుద్ధవుగాకు మీసునన్ ;
పరిజనులందుఁ జూపుము కృపం గడుఁ ; బొందకుభాగ్యగర్వమున్ ;
తిరిగిన నిట్లు, కాంతురు సతీత్వము కాంతలు ; నింద్య లొండుచోన్.

† గొప్పవారిమనసు వజ్రమునకంటెఁ గఠోరముగాను, పుష్పమున కంటె మృదువుగాను ఉండును. కనుక వారి మనసు ఎవరు కనుఁగొనఁ గలరు ?

జగమల్ మహారాజునకు వర్తమానముచేసెను. అందుపయి జగమల్లుఁడు, మాబొందిలోఁ బ్రాణము లుండువఱకు మేము దీనులవలె మీకు శరణుచొచ్చి, మీసామంతులము కానేరము; మీతో యుద్ధమే చేసెదము. అని ఢిల్లీవల్లభునికి వర్తమానము చేసి, కోటద్వారము లన్నియు మూయించి, సైన్యసమేతుఁడయి, బురుజులమీఁది కెక్కి శత్రువులతో యుద్ధము చేయసాగెను. కాని ప్రతిపక్షు లగుతురుష్కు లధికు లయినందున, క్షత్రియులధైర్య మంతకంతకుఁ దగ్గుచుండెను. ఒకనాఁడు జగమల్ మహారాజుగారొకబురుజుపయినుండి, శత్రువుల యమితసంఖ్యను, అసమానశౌర్యమును జూచి, తాము శత్రువులచే హతులై, తమస్త్రీలందఱును అగ్నిలోఁ బ్రవేశింప వలసినసమయము దగ్గఱకు వచ్చినదని తలఁచి యెంతయుఁ జింతాక్రాంతుఁడాయెను. అప్పుడు రామాబాయి సైన్యములోని భటులను బ్రోత్సాహపఱచుచు నచ్చటనే యిటునటు తిరుగుచున్నందున నామె తనపతియొక్క దైన్యమును జూచి, యత్యంతదుఃఖితురాలయి, సంకటమునుండి తొలఁగించుట కొకయుపాయము యోచించి, భర్తతో నిట్లనియె. "నేను మాఱురూపముతో శత్రుసైన్యములోనికిఁ బోయి, మనముఖ్యశత్రుఁ డగు అక్బరును జంపివచ్చెదను. మనరాజ్యమును రక్షించుకొనుట కయి, యింతకంటె వేరొకయుపాయము లేదు." ఈమాటలు విని రాజు, తనభార్యయొక్క సాహసమున కత్యంతాశ్చర్యముఁ జెంది, "ఇంత గొప్పకార్యము నీచేతఁ గానేరదు" అని ప్రత్యుత్తర మిచ్చెను. ఈమాటలు విని రామాబాయి యిట్లనియె. "అందునుగుఱించి

మీరు సంశయింప నక్కఱలేదు. ఆభారమంతయు నీశ్వరునిమీఁదను నామీఁదను వేసి మీరునాకు అనుజ్ఞ యిండి. భర్తయనుజ్ఞచే భార్య యెంత గొప్పకార్యముల నయినను జేయఁగలదు.” ఇట్లు భార్యచే ధైర్యముతో వేడఁబడినందున జగమల్ మహారాజుగారు కొంచెము యోచించి యిట్లనియె. “నీసుకుమారహస్తములచేఁ కఠినహృదయు లగు శత్రువుల హృదయభేదనము చేయఁగల నని నీకు ధైర్యము గలదేని నీయిష్టప్రకారము చేయుము. కాని వెంట నొకచిన్నకత్తి గుప్తముగా నుంచుకొనుము; ఎప్పుడయిన మానభంగ మగునట్టిప్రసంగము వచ్చినపక్షమున రాజపుత్రస్త్రీలకు యోగ్య మయిన యాత్మహత్య చేసికొని మానమును రక్షించుకొనుము.” పతియనుజ్ఞ దొరికినతోడనే రామాబాయి యత్యంతప్రముదితహృదయ యయి, తనవేషమును మార్చి, కావివస్త్రములను ధరించి, ముక్తకేశిని యయి, పెద్దపెద్ద పూసలహారములను వేసికొని ఫకీరువేషమునఁగా తురకబైరాగివేషము ధరించెను. చిన్నఖడ్గము నొకదానిని గుప్తముగా దాచుకొని, ఫిడే లొకటి వెంటతీసికొని, యెవరికిఁ దెలియకుండ కిల్లా వెడలి, శత్రు సైన్యములోనికిఁ జొచ్చెను. అచ్చటి సంరక్షకభటులతో నామె “నేను బాదుషహాను జూచి యాశీర్వదింప వచ్చితిని ; నన్నతనివద్దికిఁ దీసుకొని వెళ్ళుఁడి” యని పలికెను. ఆమె మృదుమధురవచనములను విని, యామె యెవరోయొక గొప్పఫకీరయి యుండవచ్చునని యెంచి, యామెను బాదుషావద్దికిఁ దీసికొనిపోయిరి. అచ్చటికివెళ్లి యామె బాదుషాకుఁ దురష్కులకు యోగ్యమైనరీతిని జోహారులొనరించి, యాశీ

ర్వచనము లియ్యఁ జొచ్చెను. ఆమె ముఖలక్షణమును నిరీక్షిం
చిచూచి, యక్బరు "నీవేమియిచ్ఛతో నిచ్చటికి వచ్చితివ"ని
యడిగెను. "హిందూ దేశపుచక్రవర్తి లగుమిమ్మును ఆశీర్వదించి,
ఈశ్వరభజనచే మెప్పించి బహుమతి పడయవచ్చితిని" అని
యామాయబైరాగిని చెప్పెను. ఇట్లు చెప్పి యామె ఫిడేలువా
యించి, దాని కనుకూలముగా నాలాపము చేసి, యొక హిందూ
స్థానికీర్తన పాడఁగా, అతిమధుర మయిన యామెకంఠస్వరము
విని బాదుషా పరవశుఁ డయ్యెను. ఇట్లు అక్బరు తల్లీనుఁడై
కనులుమూసికొని చేతులతోఁ బాటకుఁ దాళము వేయుట చూచి,
యామెయోగిని, మెల్లఁగా త్తితీసి, బాదుషాగారి కంఠముఁ దెగ
వేయ యత్నించెను. ఇంతలో గానము ఆగినందున బాదుషా
కనులు తెఱచి, ఖడ్గపాణిని యయినయోగినినిఁ జూచి, ఆమె
చేయఁదలఁచినపని యెఱిఁగి యుక్తితో నామెచేతిలోని కత్తి
గుంజుకొనెను.

ఇట్లు తనమనోరథము విఫలముకాఁగా, రామాబాయి యే
మియుఁ దోచక దిగ్భ్రమఁజెంది నిలిచి యుండెను. అప్పుడు
అక్బరు "నీగానమునకు మెచ్చితిని; నీ కేమి కావలయునో యడు
గుకొనుము; నీయపరాధము క్షమించితిని అని" పలికెను. ఆపలు
కులు విని రామాబాయి తనవృత్తాంతమంతయు బాదుషాకుఁ
దెలిసి, "ప్రాణములకాశపడక నే నిచ్చటికి వచ్చినాను; నాయు
ద్దేశము ఫలించినదికాదు. కనుక నేను మరల మాసైన్యములోకి
పోఁజాల. ఎవరిచేతనయిన నాశిరస్సు తెగవేయింపుఁడి. ఇదే నా
యిచ్ఛ అనిచెప్పెను. ఇట్టి ప్రగల్భవచనముల కాశ్చర్యపడి, ఉదా

రుఁ డగుఢిల్లీశ్వరుఁ డిట్లనియె "నీ వెందుకొఱకువచ్చినను, శూరులగు నాభటు లొకయబలపై తమశస్త్ర నిపుణతచూపరు. నేనిచ్చటికి స్త్రీలతో యుద్ధము చేయుటకై రాలేదు" ఇట్లు పలికి ఆయసమానుఁ డగుబాదుషా, తనముఖ్యసేవకులను వెంటనిచ్చి రామాబాయిని జగమల్ వద్దికిఁ బంపివేసెను!

ఇట్లు భగ్నమనోరథయై తిరిగివచ్చినతరువాతఁగూడ రామాబాయి ధైర్యమును విడువక భర్తతో నిట్లనియె. "ప్రాణేశ్వరా! ఈతుచ్ఛులచేత మనమంగళము కోలుపోవుసమయము తటస్థించినది. కాని మనము ప్రాణావసానపర్యంతము దీనత్వముఁ జెందక వైరులతోఁ బెనఁగులాడి స్వర్గసుఖము అనుభవించెదము." ఇటు లనేకరీతుల బెనిమిటికి ధైర్యము చెప్పి యుద్ధము జరుపుచుండెను.

ఒకనాఁ డక్బరుసేనలు నిచ్చెనలు వేసికొని బురుజులపై నెక్క యత్నింపుచుండ వారిని వారించి, యనేకులను క్రిందపడవేసి, తమ సైన్యములను ప్రోత్సాహపఱుచుచు తటిత్తోయదములవలె బురుజులపై రామాబాయిగారును, జగమల్‌గారును తిరుగుచుండిరి. అప్పుడు తురకసైన్యములోనుండి వచ్చిన యొకబాణము తగిలి జగమల్ మహారాజు గతప్రాణుఁ డయ్యెను. అది చూచి క్షత్రియు లందఱు తమప్రాణముల కాశపడక కిల్లానుండి వెడలి, బురుజుల పైని నిలిచి, అక్బరుసైన్యముపై నిప్పులు కురియింపసాగిరి. ఇంతలో మ్లేచ్ఛసైన్యములో నంతటను మహారాజు చచ్చినసంగతి తెలిసి, వారందుకు సంతసింపుచు కిల్లాలోనికి నెప్పుడు చొచ్చెద మాయని యోచించుచుండిరి. అంతలో నొక ద్వారమునుండి,

యనేక క్షత్రియసైన్యములు వెడలి, బాదుషాసైన్యములపైఁ బడి యార్చి పేర్చెను. అప్పుడు వారిలక్షణము చూడఁగా, వారు మరల లోనికిఁ బోదుమను ఆశ లేక, కన్నుల నిప్పులు రాల్చుచు, వీరావేశపరవశులయి, పగరపై నెగిరి యొక్కొక్కరు పదుగురేసి ప్రతిభటుల ప్రాణములఁ గొనుచుండిరి. వారి రౌద్రావేశము చూడఁగా తురక లప్పుడే నిశ్శేషు లగుదురని తోఁచెను. ఈసైన్యములో అందఱికంటె ముందుఁ బురుషవేషమున నసమానరణప్రియత నను జూపుచున్నది పతివిరహితయగు రామాబాయియే! పతిప్రాణములకు మారుగా బాదుషాప్రాణములు బలి యియ్యకపోయినయెడల తనజన్మము వృథాయని యెంచి, త్రిపురమర్దని యవతారమును ధరించి, యెదురుగ వచ్చినవారి నందఱిని ఖడ్గమునకు బలి యిచ్చుచు, నొక్కొక్కయడుగు ముందుకు నతిత్వరగాఁ బోవుచు, ఎట్లైన బాదుషాను సమీపించి, యతని శిరము తనచేతి ఖడ్గముతో నఱకవలెనని యత్నించుచుండెను. ఆమె, నడుమ వచ్చిన ప్రతిభటుల రక్తముతో స్నానము చేయుచు, ప్రతిభటుల ఆయుధములచే శరీరముపై పెక్కుగాయములైనను, తనప్రయత్నములను వదలక, రాజమందిరద్వారమువఱకుఁ బ్రవేశించెను! అప్పటికిఁ బోవువఱ కీమెబలము చాల తగ్గినందువలన సచటి భటు లామెను బట్టుకొని అక్బరువద్దికిఁ దీసికొనిపోయిరి. ఆమె సాహసధైర్యశౌర్యాదులు వినియుఁ గనియు బాదుషా యత్యంతాశ్చర్యము నొంది, యిట్టి శూరనారీమణిని గాంచుట దుర్లభమని యెంచి, సమీపవర్తినులగు పరిచారికలను పిలిచి, ఆమె శరీరమునందలి గాయము లన్నియు కడిగి, ఔషధోపచారము

చేయుఁడని యాజ్ఞాపించెను. ఇట్లచ్చట కొన్నిరోజులవఱకు ఉప
చారములు జరిగినతరువాత, ఆమెగాయములు చాలవఱకు మాని,
యామెకుఁ బూర్వబలము వచ్చెను. అంతట నామె యొకరోజు
బాదుషాను చూడవలయునని యిచ్ఛ దెలుపఁగా నామెను,
బాదుషాముందటికిఁ దీసికొనిపోయిరి. అప్పు డామె నిర్భయ
ముగా బాదుషాతో నిట్లనియె. "నేను అనేక పర్యాయములు
నిన్నుఁ జంపఁ బ్రయత్నించితిని. కాని యీశ్వరేచ్ఛ వేరుగా
నున్నందున నాప్రయత్నములన్నియు నిరర్థకము లయినవి. నా
ప్రాణము లున్నయెడల ఎన్నటికైనను నాపెనిమిటిని జంపినపగ
సాధింపకపోను. కాని యిప్పుడు నేను నీచేతఁ జిక్కినందున ఈసారి
క్షమకుఁ బాత్రురాలను కాను. మరణమునకును నేను వెఱచుట
లేదు. ప్రాణేశ్వరుని సమీపమునకుఁ బోవలె నన్నయిచ్ఛ నన్ను
త్వరపెట్టుచున్నదిగనుక, మీరు తమసేవకులలో నెవరికైన నన్ను
త్వరగా యమసదనమునకుఁ బంపుటకు ఆజ్ఞ యియ్యవలసినది."
ఇట్టి ధీరోదాత్తవచనములు విని అక్బరుబాదుషా కొంతసేపు
చింతాక్రాంతుఁడయి, ఆమెతో నిట్లనియె. 'ఓ! శూరనారీరత్న
మా! ఇంతపతిప్రేమ గలిగినట్టియు, శౌర్యము గలిగినట్టియు నీమీఁ
ద నాశస్త్ర మెట్లాడును? నేను శూరపురుషులతో యుద్ధము చే
యుదునేకాని, స్త్రీలకొకముల్లయినను దాకనియ్యను. నీపెనిమిటి
గతించినందునకయి నాకును మిక్కిలి వ్యసనముగా నున్నది. మిమ్ము
ను మా అంకితులను జేయుట మాపనిగాని, మిమ్మును జంపుట మా
ముఖ్యోద్దేశముకాదు. అయినను జరిగిపోయినసంగతికి దుఃఖించిన
ప్రయోజనము లేదు. ఇప్పటికయినను మీరు నే నన్నప్రకారము

నాకువశ్యులయి మెలఁగుదు రేని, ఈయుద్ధము ఆపివేసి మీ దేశవా సులకందఱికి అభయ మిచ్చెదను." ఇందుకురామాబాయి యిట్లనియె. "ఈచిత్తూరు సంస్థానములో క్షత్రియు లుండువఱకు ఈ రాజ్యము మీచేతఁ జిక్కనేరదు. రాజపుత్రులబొందిలోఁ బ్రాణము లుండువఱకు వారందఱు మీతో యుద్ధము చేయుదురుగాని, దీను లయి మీకు శరణు రారు. వారందఱు నిహతు లయిన తరువాత మీరు మీయిష్టప్రకారము చేసికో వచ్చును." అప్పు డక్బరు "మీరు మ్లేచ్ఛులు దుష్టులని మమ్మును నిందించెదరు. కాని మీయందును మాయందును గల భేదము చెప్పెదను వినుము. నీవు నన్నుఁ జంపుట కనేక యత్నములు చేసితివి. ఇప్పటికిని నీవు నన్నుఁ జంపుటకు కృతనిశ్చయురాలవుగానే యున్నావు. నేను మీహితము కొఱకయి చెప్పిన మాటలు నీవు వినుచుండ లేదు. నీ విన్నిసారులు నాచేతఁ జిక్కినను నిన్ను శిక్షింపక నేను విడిచిపెట్టినాను. ఇందువలననే మీ క్రూరతయు మాసాధుత్వమును దేటపడుచున్నవి" అని చెప్పి, ఆమెను బల్లకిలో నెక్కించుకొని, కిల్లాలో విడిచిరండని సేవకులకు నాజ్ఞాపించెను. అప్పుడు రామాబాయి తన ప్రయత్నములన్నియు నిరర్థకము లయినందుకుఁ జింతించుచు, స్వజాతినింద వినినందువలన రోష మావహిల్ల కన్నులబాష్పకణము లొలుక, పంజరములోఁ జిక్కినపులివలె నేమియుఁ జేయలేక కిల్లాద్వారము సమీపించి తనబిడ్డలకడఁ జేరెను. అంత నామె యిచ్చట కిల్లాలో నున్న రాజపుత్రుల నందఱిని బిలిపించి, యొకగొప్పసభ చేసి, "ఓ! క్షత్రియవీరులారా! ఇదివఱకు మీరు మాసంస్థానమును

రక్షించుటకయి సింగములవలెఁ బోరాడితిరి. మీబాంధవులలో ననేకులు ఈయుద్ధమున మృతులయిరి. ఇంతచేసినను మనము గెలుతు మన్నయాశ అడుగంటెనది. కొద్దిరోజులలోనే మ్లేచ్ఛులు కోటలోనికిఁ జొరఁబడుదురు. కాన నిఁక ప్రాణముల కాశపడక మీశౌర్య మంతయుఁ జూపి వీరశయనము నొందవలసినది. ఇదియే క్షాత్రధర్మము" అని వారికి నుత్సాహము కలుగునట్లు సంభాషించెను. అందుకు వారందఱును సంతోషముతో యుద్ధమునకు సన్నద్ధు లయిరి. కాని వారిలో నొకసర్దారుఁడు "తల్లీ! మన మిట్లు వ్యర్థముగాఁ బ్రాణములఁ గోలుపోవుట కంటె బాదుషాగారితో సంధిచేసి రాజ్యమును సంరక్షించుకొనుట మేలు" అని పలికెను. ఆమాటలు విని రాణీరామాబాయిగా రసహ్యాపడి, కన్నుల నిప్పులురాల క్రోధాయమానమానస యయి యాసర్దారునిఁ జూచి, "నాప్రాణవల్లభునిఁ జంపినదుష్టునితో సంధిచేయుమని చెప్పుటకు నీ కెట్లు నోరాడెను? నీముఖము చూడ నొల్లను. ఈక్షణమే నాయెదుటనుండి వెళ్ళిపొమ్ము" అని పలికెను. ఇట్లామె పలుకఁగా నక్కడ నున్నవారందఱును వాని నత్యంత తిరస్కారదృష్టితోఁ జూడ వాఁడును మిక్కిలి లజ్జితుఁడయి తల వంచుకొని తొలఁగి చనెను.

అంత నామె వారలనందఱినిఁజూచి, వారి స్వామిభక్తికి మెచ్చి "మీరందఱు క్షత్రియధర్మమును ఎఱుఁగుదురు. శత్రువెంతమంచివాఁడయినను, మనస్వాతంత్ర్యమును నష్టము చేయుటకయి వాఁడు వచ్చినప్పుడు, మనము వానితో యుద్ధముచేయవలసినదేకాని, సంధిచేయకూడదు. క్షత్రియునకు యుద్ధమందుఁ

జచ్చుట వివాహముతో సమానము; సంధిచేసి బ్రదుకుట
చావుతో సాటి కాన నుత్తమక్షత్రియు లగు మీరెట్టిమరణము
కోరవలయునో నేను వేరుగఁ జెప్ప నక్కఱలేదు" అని ముచ్చ
టించెను. అందుపై సర్దారు లందఱును ఏకముఖముతో, మేమం
దఱము మారాణికొఱకును, రాజ్యముకొఱకును బ్రాణముల
యం దాశయుంచక వైరులతోఁ బోరాడి భూదేవికి రక్తస్నా
నము చేయించి, మాశిరములను అర్పించెదము, అని గర్జించిరి.
ఆగర్జనకు నెంతయు సంతసిల్లి రామాబాయి వారినందఱిని,
యుద్ధమునకుఁ బంపెను. అట్లు వారు దండు వెడలినతరువాత,
రామాబాయి, తమకుమార్తె లగుచంద్రావతి, లీలావతులను
బిలిచి తనతోడ వారిని పరలోకయాత్రకు రమ్మని యెట్లు చెప్పుదు
నని విచారపడుచుండెను. ఇంతలో వారిరువురు సంగతు లన్నియు
విని తల్లివద్దికి వచ్చి కూర్చుండిరి. వారిలోఁ బెద్దకూఁతురివ
యస్సు పదునేడుసంవత్సరంబులును, చిన్నకూఁతురివయస్సు
పదునేను సంవత్సరములును. యౌవనావిర్భావముచే నత్యంత
సుందరముగాఁ గానఁబడుచున్న కొమార్తెలను జూచి కొంత సే
పామెకు నేమియు పలుకుటకు నోరాడకపోయెను. కొంతసేపటికి
నామె ధైర్యము తెచ్చుకొని పుత్రికలతో నిట్లనియె. "నే నెన్ని
ప్రయత్నములుచేసినను దుర్భాగ్యవశమున మనకు జయము కలు
గక తురకలచేతులలో మనము పడవలసి వచ్చినది. కనుక మన
మందఱము అగ్ని దేవుని ఆశ్రయించి, అపవిత్రులయినతురకలచే
తులలోఁ జిక్కక, శాశ్వతసుఖము గలస్వర్గమున కేగి సుఖింపవల
యునని నేను నిశ్చయించినాను. కనుక మీ రీలోకములోనే

యుండి యనేకదుఃఖములను అనుభవింపఁ దలఁచెదరో, లేక పతి
వ్రతలుపోవు పరమపదమునకుఁ బోవఁదలఁచెదరో, త్వరగాఁ జె
ప్పుఁడి". అందుకుఁ జంద్రావతి మిక్కిలి యుత్సాహముతో
"అమ్మా! మేము రాచకన్నెలమై ప్రాణములు దాచుకొనుటకు
యత్నించెదమా? ఇట్టిస్థితియందుఁ బ్రదికియుండి తురకలచేతుల
లోఁబడి మానభంగమును బొందుట మా కె[illegible]ల ఇష్టమగును?
మనపూర్వులందఱు ఆపత్సంకట సమయములందుఁ జేసిన స్తుత్య
కృత్యమునే చేయుటకు మేమును సిద్ధముగా నున్నాము" అని
చెప్పెను. ఆబాలికలయొక్క ధైర్యవచనములు విని రామాబాయి
మిక్కిలి సంతోషించి, వారిని కౌఁగిలించుకొని, యిట్టిసుగుణవతు
లీజగమున నుండినపక్షమున నెట్టిమహాకార్యములు చేసియుందు
రో యని తలఁచి, కన్నుల బాష్పబిందువులు గార కొంతసేపు దుః
ఖించెను. అప్పు[illegible]డా బాలికలుగూడ ఆర్తనాదము లెసఁగ శోకిం
చిరి. ఇట్లు కొంతసేపు మనోదుఃఖము బాష్పరూపముగ వెలువడిన
తరువాత, రామాబాయి దుఃఖమును ఆపుకొని బాలికలకు
ధైర్యము చెప్పి వారిని దార్చెను. వారినిఁ దీసికొని రాజపుత్రులు
యుద్ధమునకు సన్నద్ధు లయియున్నచోటికిఁ బోయి వారిలోఁ బ్రతి
వానికి నుత్సాహము గలుగుమాటలు మాటాడి, "రేపు ప్రాతః
కాలమున మీరందఱు, ప్రాణములు పోయినవని యెంచి, శత్రుసే
నలతో యుద్ధము చేసి ముక్తి నందుఁడి" అని చెప్పి, వారిభార్యల
కడకుఁ బోయెను. పురుషులు యుద్ధమునకుఁ బోయినతోడనే వారి
స్త్రీలు ఎవరిక వారు చితులమర్చుకొని, అందు కూర్చుండి, నిప్పు
ముట్టించుకొని పతివ్రతలపదవికిఁ బోవలయుననియు, తురకలు

కిల్లాలోనికి వచ్చునప్పటికి నచ్చట మంటపొగలును, భస్మరాసులును
తప్ప మఱేమియు నుండకుండ చేయవలసినదనియు నావీరపత్ను
లకు రాణిగా రాజ్ఞాపించి స్వమందిరమునకుఁ బోయిరి. స్వమందిర
మున రాత్రి అంతయు రాణిగారు ఈశ్వరునిఁ బ్రార్థించుచుండిరి.
కడమ స్త్రీలందఱును తమతమ యత్నములలో నుండిరి.

తెల్లవారువఱకు రాజపుత్రు లందఱు యుద్ధసన్నద్ధులై యొ
కరొకరుగా వెళ్లి కోటద్వారము సమీపమున గుంపులుగూడిరి.
అప్పుడు వారిమనోవికారము లన్నియు నేకీభవించి శత్రుసంహా
రేచ్ఛయందుఁ గలిసినందున వా రప్పుడు ప్రత్యక్షకాలాంతకుల
వలెఁ గానఁబడుచుండిరి. వారిభార్యలు తమప్రియపతులయొక్క
కడసారిదర్శనము చేసికొని పోవలయునని యెంచి, అప్పటికి
వచ్చి యిప్పుడు తప్పిన మరల సగుపడరని యెంచి తమప్రియప
తులను, పుత్రులను, అన్నలను, దమ్ములను, గౌగిలించుకొనుచు,
ముద్దాడుచు, మ్రొక్కుచు, తనివి తీరకుండ నేడ్చుచుండిరి. వారి
మధ్య వారికందఱికిఁ బూజ్యురాలగు రామాదేవి తనకొమా
ర్తెల నిద్దఱిని ఇరుప్రక్కల నుంచుకొని మిక్కిలి ఖేదముద్రతో నాన
వీరులను, వీరపత్నులను జూచుచుండెను. ఇట్లొకముహూర్తము
వఱకు అప్పటిపురుషులును స్త్రీలును గొల్లు మని రోదనము
చేసిరి. అంతలో రామాబాయిగారు ధైర్యము తెచ్చుకొని,
స్త్రీ సమూహములోనుండి వెడలి వచ్చి ఘోర స్వరముతో
"ఓ రాజపుత్రులారా! మీరు మీశరీరముతో మీ స్త్రీ
లయొక్క మానముగూడ మ్లేచ్ఛులకు నొప్పగింప, నిశ్చ
యించితిరా యేమి" అని పలికెను. ఈమాటలు కర్ణశూల

మువలెఁ దోఁచినందున "అట్లుకాదు అట్లుకాదు." అన్నశబ్ద మంగతి నోటినుండి వెడలెను. "అట్లైనరోదనము చాలించి పురుషులు యుద్ధమునకును స్త్రీలు అగ్నిప్రవేశమునకును వెడలవలయును. విలంబము చేయవలదు" అని రామాబాయి యాజ్ఞాపించెను. యజమానురాలి యాజ్ఞ యైనతోడనే, పురుషులు తమఖడ్గకార్యమునకును స్త్రీలుఁ తమ యగ్ని కార్యమునకును వెడలిరి.

అప్పుడు తురుష్కులు ఆరోజున కిల్లాద్వారము తెట్లైనఁ బగులకొట్టుకొనిలోనికిఁ బ్రవేశింపవలయు నని యత్నించుచుండిరి. అంతలో కిల్లా యొక్క పూర్వద్వారకవాటములు తెరచుకొని వేలకొలఁది రాజపుత్రులు 'హరహరమహాదేవ' యన్న రణనాదము చేయుచు వెడలిరి! వారి భయంకరమయిన యుగ్రతను జూచి తురుష్కులు కొంత వెనకకు జరిగిరి; కాని మరల ముందుకు వచ్చి మొగలులు పోరాడసాగిరి. వారికప్పుడు ఘోరయుద్ధము జరిగెను. ఒకవైపు హతాశు లయినను శౌర్యముతోఁ బోరాడువారును, రెండవవైపు కొద్దిగా గెలిచినయెడల మనమే రాజులమన్న నిశ్చయముతో, బోరాడువారును గలిగియున్న యారణము పదునెనిమిదవ నాటిప్రాతఃకాలమందలి భారతయుద్ధమును బోలియుండెను. హిందువు లొకవయిపునను దురుష్కు లొకవయిపునను తమ శౌర్యాతిశయమంతయుఁ జూపుచుండిరి. ఈరాజపుత్రుల నెటులనైన గడచి కిల్లాలోనికిఁ బోవలయు నని తురకలు ఘోరముగాఁ బోరాడుచుండిరి. ఆ రెడిదీపమునకుఁ గాంతి

హెచ్చునన్న నామెతచొప్పున రాజపుత్రుల వీరావేశ మంత కంతకు హెచ్చుచుండెను. ఇట్లు కొంతసే పొండ్రారులను నుగ్గు చేసికొని పీనుంగుపెంటలు కావించిరి. తరువాత తురకలసైన్యములు నలుదిక్కులనుండి యొక్కపెట్టున రాజపుత్రులపైఁ గవియఁగా రాజపుత్రు లనేకులు గతప్రాణులైరి. ఇట్లు అనేక రాజులు క్రమక్రమముగాఁ గూలుచున్నను రాజపుత్రులు శత్రులకు వెన్నిచ్చి పారరైరి. ఇంతలో సాలంబ్రారుఁ డనురాజపుత్రుల ముఖ్య సర్దారుఁడు పడెను. అతని మృత్యువుఁగాంచి మిగిలిన రాజులందఱు ధైర్యము విడిచి యుద్ధపరాఙ్ముఖు లగుటకు యత్నించుచుండిరి. కాని వారినందఱిని మఱల యుద్ధమునకుఁ ద్రిప్పుటకొక వింత జరిగెను. అందుచే వారందఱు మఱలి తిరిగి యుద్ధమునకుఁ బ్రవృత్తులైరి. ఆవింత యేమనః—

ఈయుద్ధము జరగుటకుఁ గొన్నిరోజులు పూర్వము పదునెనిమిది సంవత్సరముల రాజపుత్రునికిని పదునేను సంవత్సరముల బాలికకును వివాహమాయెను. యుద్ధమునకుఁ బ్రారంభమయిన దివసమున నాకుఱ్ఱవాఁడు ఖడ్గము తీసికొని యుద్ధమునకు బయలుదేరెను. అప్పు డానవోఢాబాలిక తనభర్తతో యుద్ధమునకుఁ బోయెద నని సన్నద్ధురాలాయెను. పోవలదని యెవ రెంత చెప్పినను వినక, తనపతి దేహమువాల్చినచోటనే తనదేహమును వాల్చెద నని దృఢముగాఁ బట్టుపట్టెను. ఇట్లుకొడుకుకోడండ్ర నిశ్చయమును జూచి యాపిల్లవానితల్లి సంతసించి, వారికిఁ బ్రోత్సాహము కలుగునటుల ననేకవచనములు చెప్పి, వారిచేతికి ఖడ్గములు నిచ్చి కొంతదూరమువఱకు వారినిఁ బంపి తిరిగిపోయెను.

వెనుక వర్ణించినట్లు, కొందఱు రాజపుత్రులు యుద్ధరంగమునుండి పాఱి వచ్చుచున్న సమయమున, ఈనూతన బాలదంపతులు రణములోనికిఁ బ్రవేశించిరి. వారు శత్రుసంహారము చేయుటను జూచి పాఱిపోవుచున్న క్షత్రియులు సిగ్గుపడి, మఱల యుద్ధము లోనికిఁ జొచ్చిరి. ఆబాలుఁడును, వానిభార్యయు ననేకులను యమ సదనమున కనిచి తుదకు వారును చిరస్వర్గసుఖము ననుభవించుటకయి యుద్ధరంగములో హతులయిరి. తరువాత తురకలు హతశేషు లయిన క్షత్రియుల నొక్క రొక్కరిని జంపి కోటలోనికిఁ బోవుటకు సిద్ధ మయిరి.

కొన్ని దినములక్రిందట సౌఖ్యమున కాటపట్టయిన జగమల్ మహారాజుగారికోట యిప్పుడు దుఃఖమునకుఁ బుట్టినిల్లాయెను! రాజగృహమునందు, చిచ్చు సామగ్రి సిద్ధముచేసికొని రాణీరామాబాయిగా రిరుప్రక్కల నొక్కొక్కకుమార్తె నుంచుకొని, యితర రాజస్త్రీలతోడ మిక్కిలి విచారములోఁ గూర్చుండియుండెను. వారందఱు కొంతసేపు రాజపుత్రులకు జయ మిమ్మని యీశ్వరుని ప్రార్థించి, తల యెత్తి యేమి వార్తయని యెదురు చూచుచుండిరి. ఇంతలో శరీర మంతయు రక్తములో నిండి, లెక్కలేని గాయములచే బాధపడుచున్న పురుషుఁ డొకఁడు మహావేగములో నచ్చటికి వచ్చెను. వానిని గుర్తించి రామాబాయి "ఓ రామసింగా! జయమేనా?" అని యడిగెను. ఇంతలో నాపురుషుఁడు నిలువలేక భూమిపైఁ బడి, తలయెత్తి రామాదేవికి వందనము లాచరించి "అమ్మా! ఇంకెక్కడి జయము? ఆయుధము పట్టుకొనుశక్తి మాచేతులలో నున్నంతవఱకు మేము పోరాడి,

వైరుల పీనుఁగు పెంటలు చేసితిమి. కాని మీదురదృష్టమువ లన మనవారందఱు మడిసిరి. ఒక రిద్దఱున్న వారు; కాని వారును మృతు లయినవారే యని తలంపవలసినది. తూర్పుద్వారము వద్దఁ బడిన పీనుఁగులగట్టును గొద్దికాలములోఁ దీసివేసి తురకలు కోటలోనికి రాఁగలరు.” అని చెప్పి మాటాడలేక కొంత కొట్టు కొని ప్రాణములను విడిచెను.

వాఁ డట్టి కర్కశఘోర మయిన వర్తమానము చెప్పి ప్రాణము విడుచుట చూచి, రాజపుత్రస్త్రీల నందఱిని జూచి యీ మాటలు ఇట్లు నియె. “అక్కలారా' ప్రాణసమాను లగు మీపతులును, దమ్ము లును, బుత్రులును యుద్ధములోఁ జచ్చి స్వర్గమునకుఁ బోయిరి. వారియంశము మీయందుఁ గలదు. ఇఁక నాలస్యము చేసిన యెడల వీరకాంతలు వీరమాతలు అగు మీరు మ్లేచ్ఛులచేఁ జెర పట్టఁబడి దూషిత లగుదురు; వారికి దాసీ లయి యుండవలసి వచ్చును. ఈశబ్దోచ్చారణయే నాకెంతయో శ్రవణ కఠోర ములుగా నున్నవి. కనుక శీఘ్రముగా నగ్నిలోఁ బ్రవేశింపుడి. ఇట్లుఁ జేసినచోఁ దప్పక స్వర్గసౌఖ్య మనుభవించెదరు.” ఈ మాటలు విని యందఱును మేము సిద్ధముగా నున్నారమని యరచి తమతమ పసిపిల్లలను తీసికొని అగ్నిలో దుముకుటకు సన్నద్ధలైరి. ఇంతలోఁ దూర్పు ద్వారములోఁ బ్రవేశించిన తుర కల “దీన్ దీన్” అన్నరణఘోష వినఁబడినందున, స్త్రీలంద ఱును, త్వరపడి చితులపై నెక్కి, చితులకు నిప్పు ముట్టించిరి. క్షణములో కోట అంతయు నగ్నిమయ మాయెను. మండుచుం టుల దాహమునకు తాళఁజాలక తురకసైన్యములు వెనుకకు జరి

గెను. కాని యొక రాజపుత్ర స్త్రీయయినను మంటలోనుండి పారినది కాదు. మంట లన్నియుఁ జల్లారినతరువాత అక్బరు బాదుషా కోట చూడవచ్చెను. అప్పుడు కోట జనశూన్యమయి, నిశ్శబ్దమయి, మహాభయంకరమయి తోఁచెను. భస్మములై పడి యున్న యార్యవీరాంగనలను జూచి ఆబాదుషా మిక్కిలి దుఃఖించి "పాతివ్రత్యము రక్షించుకొనుటలో నార్యస్త్రీలతో సమాన మే స్త్రీలును రారు; వీరే యుత్తమోత్తమ పతివ్రత" లని పలికెను.

ఈ చరిత్రమునందు పతిభక్తి ధైర్య సాహసములను గుఱించి చరిత్రనాయిక యగు రామాబాయిని, పాతివ్రత్యరక్షణమునందుఁ గల తత్పరత్వవిషయమయి రాజపుత్ర స్త్రీలను, స్వదేశాభిమానమును గుఱించి బాలదంపతులను, ఔదార్యమునకయి అక్బరు బాదుషాను వేయినోళ్లఁ గొనియాడవలయును!

---

# కుమారీ ప్రేమదేవి.

---

"భవోహి లోకాభ్యుదయాయ తాదృశాం" *

ఈమె ఢిల్లీనగరమునందు ౧౮[illegible]వ సంవత్సరము ఆగష్టునెల ౧౬వ తేదిని జన్మించెను. ఈమె తండ్రిగారగు దేవీప్రసాదుగారు, ఇంజినీరింగు ఇలాఖాలో అసిస్టాంటు ఇంజినీరుగా నుండిరి. దేవీప్రసాదుగారికి స్త్రీవిద్యయం దభిమానముగలదు గనుక ఇతరుల వలె వారు పుత్రికాజన్మమునకు దుఃఖించినవారు కారు. ఈ భరతఖండమునందలి స్త్రీల దురదృష్టమేమో కాని ఆడుపిల్లపుట్టె నదని విన్నతోడనే, యేదో యొక గొప్పసంకటము సంప్రాప్తించినట్లు తండ్రియు, ఆప్తులును చింతాక్రాంతు లయ్యెదరు. బారసాల మొదలైన వేడుక లంతగా చేయరు. ఆడుపిల్లలను ఎత్తుకొని ముద్దాడనని ప్రతిజ్ఞవహించిన శిక్షితులుగూడ మన దేశమునందు అనేకులు గలరు. ఇట్లు బాలికాజన్మ మత్యంతాశుభప్రదమని జనసామాన్య మెంచెదరు. ఇట్లెంచుటకు, స్త్రీవిద్యాభావమువలనను, స్త్రీస్వాతంత్ర్యాభావమువలనను హిందూసుందరీమణులకుఁ గలిగిన దురవస్థయే ముఖ్యకారణమని తోచుచున్నది. ఈ దేశములోపల స్త్రీపరంపరాభివృద్ధికై "పుత్రేణదుహితా సమా" యన్న పురాతనవచనము సత్యమని మా దేశస్థులు శీఘ్రకాలములోనే యెంచుదురుగాక. పుత్రజన్మోత్సవము వలెనే పుత్రికాజన్మోత్సవముకూడ ఆనందముతోఁ జేయుదురుగాక.

---

* "ఇట్టివారిజన్మము లోకహితముకొఱకే."

దేవీప్రసాదుగారు స్త్రీవిద్యాభిమానులని వెనుక వ్రాసియుంటిని. ప్రేమదేవి యైదుసంవత్సరములది కాఁగానే యామెను తండ్రి కుమారీపాఠశాలకుఁ బంపెను. దేవీప్రసాదుగారిభార్యయు విద్యావతి యైనందున ఆమె తన కూఁతునకు విద్య గఱపుచుండెను. ఇట్లు పాఠశాలయందును, ఇంటను విద్య నేర్చినందున ప్రేమదేవికి నేడు సంవత్సరములప్రాయము వచ్చువఱకు నాగరీభాష సంపూర్ణముగా వచ్చి, సంస్కృతమునందుకూడ కొద్దిగా ప్రవేశము గలిగెను. అంత నింటిలో నొక యుపాధ్యాయుని నియమించి, ఆమెకు ఇంగ్లీషు నేర్పఁగా బుద్ధిసూక్ష్మతవలన నామె తొమ్మిదిసంవత్సరముల ప్రాయమువఱకును నింగ్లీషు పుస్తకములు నాల్గు నేర్చుకొనెను! దినదిన మిట్లు విద్యయం దధికప్రీతి గలదై జ్ఞానాభివృద్ధిఁ జేయుచుండెను.

బాల్యమునుండియు నామె యీశ్వరునియం దధిక విశ్వాసము గలిగి ప్రవర్తించుచుండెను. ఈశ్వరుఁడు సకలమానవుల ప్రార్థనలను విని వారివారి మనోరథములు పూర్తి చేయునని యామె నమ్ముచుండెను. ఇట్లునమ్మి ప్రతిదినము ప్రాతస్సాయంకాలములయందు నీశ్వరునిఁ బ్రార్థించును. ఈమెభక్తిఁ జూచి తల్లిదండ్రు లెంతయు సంతసిల్లిరి. ఇట్లు పదునొకండు పండ్రెండు సంవత్సరముల ప్రాయము వచ్చునప్పటికి ధర్మశ్రద్ధ హెచ్చి ఆమె ధర్మగ్రంథముల ననేకములను శోధించెను. తుదకు జగత్తులోని సౌఖ్యము లన్నియు తుచ్ఛము లనియు, ఈశ్వరభజనమునఁ గలిగినట్టియు పరోపకారమువలనఁ గలిగినట్టియు సౌఖ్యమే నిజమయిన సౌఖ్య మనియును, ఆమె నిర్ధారణము చేసి, అట్లు ప్రవర్తించు

టకు నిశ్చయించెను. ౧౮౮౯ వ సంవత్సరమున ఎస్. ఎస్. అగ్నిహోత్రియను ధర్మశీలుఁ డొకఁడు దేవధర్మమను నవీన ధర్మమును స్థాపించి, అందునుగుఱించి లోకుల కుపదేశము చేయుచుండెను. ఈ సమాచారము ప్రేమదేవిగారికిఁ దెలిసి ఆమహాత్మునిఁ జూచుట కామెకు నిచ్ఛగలిగెను. ఇట్లు ఇచ్ఛగలిగిన కొద్ది దినములలోనే యామె తండ్రిని అగ్నిహోత్రిగా రున్న గుజరావలీ యనుగ్రామమునకు మార్చిరి. అచ్చట నగ్నిహోత్రిగారి యుపదేశమున నామె యంతఃకరణము అతిశుభ్రము కాఁగా ఆమె తన జన్మమంతయుఁ బరోపకారములోనే వ్యయపఱచుటకు దృఢముగా నిశ్చయించెను. అప్పటి కామెవయస్సు పదునాలుగు సంవత్సరములు! ఇంత చిన్నవయస్సునం దింత పరమార్థవిచారము కుదురుట చూడఁగా ప్రేమదేవి, సాధుమండలిలో నొకతె యని చెప్పవలసి యున్నది.

కొన్నిరోజుల కామె బ్రహ్మసమాజవార్షికోత్సవము చూచుటకయి తండ్రిగారితో లాహోరు పట్టణమునకుఁ బోయెను. అచ్చటి యుపన్యాసములు, ధర్మచర్చలు, ప్రార్థనలు విని యామెమనసు మఱింత కరఁగి, అచ్చటనే యోగిని యయి సత్సంగములో నుండవలెనని యిచ్ఛగలిగెను. కాని తండ్రిగారి నిర్బంధమువలన నామె యతని వెంబడి అమృతసరు పట్టణమునకుఁ బోయెను. కొంతకాలమునకు లాహోరులో స్త్రీలకు వైద్యశాస్త్రము నేరుపుటకుఁ బాఠశాలయొకటి స్థాపించఁబడెను. ఈమాట విని ప్రేమదేవిగారిని ఆమెతండ్రి వైద్యవిద్య నేర్చుకొనుటకు లాహోరుకుఁ బంపెను. అచ్చట నీకన్యాలలామ వైద్యశాస్త్రము నభ్య

సించుచు సమయము దొరకినప్పుడు బ్రాహ్మతత్వములను జదువుచు, సజ్జనులయుపదేశము వినుచు ఆనందముతో కాలక్రమణ చేయుచుండెను. ఇంతలో బ్రాహ్మసమాజముయొక్క ద్వితీయ సాంవత్సరికోత్సవము జరిగెను. అప్పుడు జరిగిన యుపన్యాసములన్నియు విని, ప్రేమదేవి లేచి నిలువఁబడి, గద్గదకంఠయయి యీశ్వరుని ప్రార్థించి, తనజీవిత మాయనకు సమర్పించితి ననియు, ఆయనమహిమ వెల్లడించుటలో తనజీవితము గడుపుదు ననియు, ఆర్యస్త్రీలయున్నతి కొఱకై యత్నించెద ననియుఁ బ్రతిజ్ఞ చేసెను ! ఇట్టిఘన మయినప్రతిన విని యచ్చటి వారికందఱికిని మహాశ్చర్య మాయెను. అప్పటినుండి యామె క్రైస్తవమిషనరీ స్త్రీలవలె నవివాహితయయి యుండి పరోపకారము చేయుటకు నిశ్చయించెను. ఈసంగతులన్నియు విని యామె బాంధవు లనేకులు సన్యాసము స్వీకరింపవల దనియు, వివాహమాడి సంసారసౌఖ్య మనుభవింప వలసిన దనియు నుపదేశము చేసిరి ; కాని ఆమె తన నిశ్చయమును వదలినదికాదు. ఎందఱెన్ని సౌఖ్యములను జూపినను ఆమె స్వీకృతకార్యమును వదలి సంసారసముద్రములో మునుఁగుటకు సిద్ధ మయినది కాదు.

అవివాహితగా నుండి పరోపకారము చేయుట అనఁగా నేమియని మాస్త్రీ చదువరు లడుగుదు రేమో. వారిసమాధానమునకయి అందునగుఱించి కొంచెముగా వ్రాసెదను. పశ్చిమఖండమునందలి క్రైస్తవధర్మమునందు రోమనక్యాథొలిక్కులని యొక మతస్థులుగలరు. వారిలో స్త్రీలకుఁ బురుషులవలెనే సన్యాసము గలదు. మనదేశమునందు విధవలెట్లు మరణపర్యంతము బ్రహ్మ

చర్యవ్రతము చేయుదురో అటులనే యూరోపు క్యాథోలిక్కు-
జోగినులు బ్రహ్మచర్యమును బాలించెదరు. మనలోఁ బతిపరా
యణత్వము నెట్లు పాతివ్రత్యమందురో అటులనే వారిలో స్త్రీల
బ్రహ్మచర్యమును బాతివ్రత్య మందురు. ప్రొటస్టాంటుమతమునం
దిట్టి యోగినులు లేకపోయినను అనేకపరోపకార పరాయణలు
వివాహ మాడక బ్రహ్మచారిణులుగా నుండి, పరహితము లనేక
ములు చేయుచున్నారు. వీరు చేయుపను లేవనఁగా, ఆమతమున మత
ముల భజనాలయములయందు భజనప్రార్థన లాచరించుట, సమయ
ము కొలఁదిని జ్ఞానవిహీనలగు ఇతర స్త్రీల యిండ్లకుఁ బోయి వాం
డ్రకు ధర్మోపదేశము చేయుట, చదువురానివారికిఁ జదువునేర్పు
ట, కుటుంబములో నుపయోగించు కుట్టుపనులు మొదలయినపను
లు నేర్పుట, రోగిణులుగా నున్న స్త్రీల కౌషధంబు లిచ్చి, వారిని
బాగుచేయుట, బందిఖానాలోనికిఁ బోయి అచ్చట నున్నకైదీల
కు బోధచేసి వారికి సర్వేశ్వరునియందు భక్తి కలుగునటుల చేయు
ట, దొంగతనము మొదలైన యపరాధములవలని నష్టములు
వారికిఁ దెలియఁ జెప్పి వారిని ఆ యపరాధములనుండి పరావ
ర్తులను జేయుట మొదలయినవి. ఇట్టిమహోపకారపు బనులు
చేయుట కయి పశ్చిమదేశములలో ననేక స్త్రీలు ప్రతిసంవత్స
రము, కుటుంబసౌఖ్యమును వదలి బయలుదేరుచున్నారు.
ఇట్టి స్త్రీలను దేవాంగన లని చెప్పుట కేమి సందేహము? వీరి
సహాయమువలన వేలకొలఁది దుఃఖితు లిదివఱకు సుఖులయిరి;
లక్షలకొలఁది యధార్మికులు ధార్మికు లయిరి.

పైనివర్ణన చేసినట్టి యింగ్లీషు స్త్రీల చరిత్రములు చదివినది గనుకనే ప్రేమదేవి తానును వారివలెనే యవివాహితగానుండి లోకకల్యాణము చేయఁ దలఁచెను. ఇందునకై యామె లోకస్తుతికిఁ బాత్రురా లని చెప్పుటకు సందేహము లేదు. ఎందుకనఁగా ఎవరెవరు స్వార్థమును విడిచి, పరార్థమును జేయుదురో వారు లోకవంద్యులుగాక నింద్యులెట్లగుదురు? కాని హిందూసమాజము యొక్క ప్రస్తుతస్థితినిబట్టి చూడఁగా బాలికలు వివాహములేక యుండుట స్పృహణీయము కాదని నా తాత్పర్యము. బ్రాహ్మణకన్యకవివాహ మాడక యుండవలదని శాస్త్ర మున్నందువలనను వైవాహికవిధి సమాజోన్నతికి నత్యంతావశ్యకంబై యున్నందువలనను విద్యావతులు వివాహ మాడినయెడల సమాజమునందు జ్ఞానవతు లయినభార్యలు, తల్లులు, అక్కలు దొరకుట సంభవించకపోవుట వలనను, పశ్చిమదేశవాసులకు హితప్రద మయిన యీబ్రహ్మచారిణులపద్ధతి, ఇప్పుడు మన దేశమునందు హితప్రదము కానేరదని నాయభిప్రాయము.

విితంతువులకు విపన్న.

పరోపకారము చేయుటకు మనదేశమునందు బాలిక లవివాహితలుగా నుండు నంతయావశ్యకమే లేదు. మనసామాజిక నిర్బంధనలవలన నీదేశమునం దిట్టి బ్రహ్మచారిణులు, సన్యాసినులు లక్షలకొలఁది యున్నారు. ప్రతిసంవత్సరము లెక్కలేక పెరుగుచున్నారు. వీరెవరని సంశయింప నక్కఱలేదు. వీరు మహాదుర్భాగ్య లగు బ్రాహ్మణ వితంతువులే యని వేరుగాఁ జెప్పవలెనా? కేవలము దుఃఖము ననుభవించుటకొఱకే యీదేశము

నందు జన్మించిన వితంతువులకు సద్విద్య గఱపి పైని వర్ణింపఁ
బడిన పరోపకారము లన్నియు వారిచేఁ జేయింపవచ్చును. పరోప
కారము చేయుటయందు వీరి జన్మమంతయు వ్యయ మయిన
యెడల నిప్పటివలె వారికి, తమజన్మము కేవల నరకమని తోఁ
పదు; వారిసంకటము లనేకములు తగ్గును. కనుక వితంతువులను
ఈకార్యమునందుఁ బ్రవేశపెట్టిన పక్షమున రెండు లాభములు
గలవు. ఒకటి వితంతువులదుఃఖస్థితి సంస్కరించుట; రెండవది వా
రిద్వారా లోకోపకారము చేయుట. ఇప్పుడు వితంతూద్వాహ
ములు జరుగుచున్నవిగనుక నిట్టిపరోపకారకార్యములకు వితంతు
వులుగూడ దొరకుట దుర్లభమని కొందఱు చెప్పుదురేమో
కాని యిట్లు సంశయింప నక్కఱలేదు. అచ్చటచ్చట వితం
తూద్వాహములు జరుగుచున్నను, మన హిందూసమాజము
"శాస్త్రాత్ రూఢిర్బలీయసీ" యన్నమంత్రమును జపించుచు
న్నందున, పునరుద్వాహాచార మీదేశమునందంతటను వ్యా
పించి సర్వసమ్మత మగుటకు నొకయుగము కాకపోయినను,
ఒక శతాబ్దమయినను కావలయును. కనుక దుఃఖసముద్రములో
మునిఁగియున్న పూర్వసువాసినులకు సద్విద్య నేర్పి వారిని పరో
పకారపరాయణలను చేయుట యిప్పటికాలములో నత్యంతావ
శ్యకము. ఇట్లు ఆత్మోన్నతి చేసికొని పరోన్నతి చేయుట హిం
దూధర్మమునకుఁగాని, శాస్త్రమునకుఁగాని విరుద్ధము గానం
దునఁ బునర్వివాహమును దిరస్కరించినటువంటి పూర్వనాగరికు
లీకార్యమును తిరస్కరింపఁ జాలరు. "పరోపకారః పుణ్యాయ"
అని యున్నదిగనుక నవనాగరికులవలెనే పూర్వనాగరికులుకూడ

ఈకార్యమునకు సహాయము చేయఁగలరు. కనుక బ్రాహ్మసా
మాజికులేమి, ప్రార్థనాసమాజమువారేమి, భారతమహామండ
లాధ్యక్షులేమి, హిందూధర్మవర్ధకులేమి, దివ్యజ్ఞానసమాజము
వారేమి, శశిపాదబనర్జిగారు బంగాళాదేశమునందు స్థాపించు
నట్లు, విశంతువులకొఱకు నొకపాఠశాల స్థాపింపవలయును.
ఆపాఠశాలలయందు, అనాథస్త్రీలకు నుపయుక్తమైన సంగతులు
నేర్పి వారిని మిషనరీస్త్రీలవలె లోకోపకారిణులను చేయవలయు
ను. ఇట్టిపాఠశాల పూనాపట్టణమునం దొకటియు, చెన్నపట్టణ
మునం దొకటియు స్థాపింపఁబడునని విన్నాము. ఇట్టిసత్కార్య
ములకు సజ్జనులు సహాయము చేయుదురు గాక. ఏలు గలిగినవా
రు తమబాంధవు లగుపూర్వసువాసినులను, డఫరిన్ దొరసాని
గారి సన్మానార్థముగ స్థాపింపఁబడిన స్త్రీవైద్యశాలలకుఁ బంపి,
వారికి స్త్రీచికిత్సాశాస్త్రము నేర్పి వారిచే లోకోపకారము చేయిం
పవచ్చును. సద్బ్రాహ్మణస్త్రీయు లగుశాస్త్రపండితులు, తమయింటిలో
ని విశంతువులకుఁ గొంచెముగా సంస్కృతము చెప్పి, వారికిఁ గొంచెనన్వ
యజ్ఞానము గలుగునట్లు చేసి, వారిచే నితరస్త్రీలకుఁ బురాణా
దులు చెప్పించి, ధర్మోపదేశము, పాతివ్రత్యమాహాత్మ్యము, గృ
హనిర్వాహకత్వము మొదలయినవి యుపదేశింపవచ్చును. ఇం
దును గురించి విద్వాంసులు విచారణ చేసెదరుగాక యని కోరి,
మూలపరిశ్రమునకు వచ్చెదను.

లాహోరుపట్టణములోని వైద్యశాలలో ప్రేమదేవి అధ్యయ
నము చేయుచుండెనని వెనుక వ్రాసియుంటిని. ఆపాఠశాలయం
దీమె తనబుద్ధికుశలతఁ జూపుచు అందఱికంటె నధికముగా విద్యా

ధ్యయనము చేయుచుండెను. నాలుగుసంవత్సరంబు లచ్చటఁ
జదివి తుదకుఁ బరీక్షయందు నితరులకంటెఁ బై తరగతిలోఁ గృ
తార్థురా లాయెను. అప్పు డామెకు విశేష బహుమతులు దొరకి
నవి. తాను చేయదలఁచిన పరోపకారకృత్యములు చేయుచునే
పరీక్షకుఁ జదివినను అద్వితీయబుద్ధి వైభవముచే నీమె పరీక్షలో
గొప్పగా కృతార్థురా లాయెను. అచ్చట నీమె చదువుచున్న
సమయముననే ఆమె తండ్రిగారిని నచ్చటికి మార్చిరి. అప్పటినుండి
యీమె తండ్రిగారివద్దనేయుండి చదువుచుండెను. ఆకాలమునందు
వివాహ మాడుమని ప్రేమ దేవిగారిని ఆమెతండ్రి అత్యంత నిర్బంధ
పెట్టసాగెను. ఒక గొప్పధనవంతుఁ డగువరునిఁ జూచి కూతును
వాని కిచ్చి వివాహముచేయుటకు నిశ్చయించెను. కాని దృఢని
శ్చయము గల యీమె తండ్రిగారితోఁ దనకు వివాహ మక్కఱ
లేదని స్పష్టముగాఁ జెప్పెను. అందుపైఁ దండ్రి యీమెను
నిర్బంధ పెట్టిన లాభము లేదని యెంచి వివాహ విచారము
వదలి వేసెను. తనయింట నీమె యొక స్త్రీ సమాజము నేర్ప
ఱచి, వారవారము సమాజములోని స్త్రీల కందఱికని బోధ చే
యుచుండెను. బ్రాహ్మసమాజవార్షికోత్సవమునందు ఈమెను "దే
వధర్మపరిచారిక దీక్షిత" గా నియమించిరి. ప్రేమదేవిగారు గ్రామ
మునందు స్త్రీలకొఱకు యొక ఔషధాలయ మేర్పఱచి, యచ్చటి
స్త్రీలకు బాలురకు నౌషధంబు లిచ్చుచుండెను. ఇదిగాక యీమె
ప్రతిదినమును ఘోషాయందుండు ఆడువారి యింటికిఁబోయి
వారికి దైవభక్తి యుపదేశించి, కుట్టుపనులు, విద్యమొదలై
నవి నేర్పి యుపకారము చేయును. అనేక స్థలములలో స్త్రీ

విద్యాస్వాతంత్ర్యములను గూర్చి యుపన్యాసము లిచ్చుచుండెను. బీదలకుఁ జేతనైనంత సహాయము చేసి, వారి దుస్థితి బాగు చేయుటకై యీశ్వరునిఁ బ్రార్థించుచుండెను. ఇట్లు అనేకపరోప కారకృత్యములు చేసి, మఱియు ననేక సత్కృత్యములఁ జేయఁ దలఁచెను. కాని యామెచేయు పరిశ్రమవలన నామె దేహ మంత కంతకు దుర్బలము కాసాగెను. ఆమె తన దేహ మశాశ్వతమని యెఱిఁగినదిగావున, తనరోగమును లక్ష్యపెట్టక లోకోపకారమున కై పాటుపడుచుండెను. అంత్యకాలము సమీపింప, నీమె తనచరి త్రము స్వయముగానే యింగ్లీషుభాషలో వ్రాసియుంచెను. తరు వాత నంతకంతకు వ్యాధి హెచ్చి ప్రేమదేవి ౧౮ [illegible] ౯ వ సంవత్స రమునందుఁ బరలోకవాసిని యయ్యెను. ఈమె యింకను జీవించి యుండినపక్షమున, చేసినకార్యములకంటె గొప్పగొప్ప సత్కార్య ములు చేసియుండు ననుటకు సందేహము లేదు.

---

# రాణీదుర్గావతి.

---

గీ. చిదుకులఁ గదల్చుటను నగ్ని చెలఁగి యుండు;
చెడుగు చేయుటచేఁ బాము పడగ ద్రిప్పు;
మఱియు క్షోభంబువలననే మానవుఁడును
దనగు మహిమంబు చూపును దథ్యముగను.—వీరేశలింగకవి.

పదునాఱవ శతాబ్దమున బుందేల్‌ఖండు సంస్థానములోఁ బ్రసిద్ధికెక్కిన రాజులలోఁ బ్రథముఁడగు చందవేల్ రాజునకు రూపగుణ సంపన్నురాలగు ఒక కన్యక గలిగెను. ఆమె పేరు దుర్గావతి. ఆమె రూపగుణముల కీర్తి దిగంతముల నిండి, యనేక రాజపుత్రులామెకొఱకు చందేల్ రాజును ఆశ్రయించుచుండిరి. కాని యారాజపుత్రులు తనకూఁతునకుఁ దగినవారు కారని యెంచి చందేల్ రాజు వారి కేదో యొక కారణము చెప్పి పంపుచుండెను. ఒకసారి గఢామండలా సంస్థానాధిపతియగు గోండురాజు దుర్గావతినిఁ దన కిమ్మని యామె తండ్రిని వేఁడెను. ఈగోండురాజుయొక్క శౌర్యసాహసములను గుఱించి చారులచే వినినదిగావున దుర్గావతియు నాయనయందు బద్ధానురాగయై యుండెను. గోండులు జాతియందును, విద్యయందును, నాగరికతయందును రాజపుత్రులకంటెఁ దక్కువవారు. గోండువారార్యులుగారు; అనార్యులు. కనుక నిట్టి నీచకులజునికిఁ దను శ్రేష్ఠవంశపుకన్యను ఇచ్చుటకు చందేల్‌రాజునకు నిష్టము లేక పోయెను. కాని అప్పుడు గోండురాజు మిక్కిలి బలవంతుఁడుగా

నుండెను. ఈరాజు పాలించెడి గఢామండలరాజ్య మంతగా గొప్పది కాకపోయినను, అతఁడు మిక్కిలి బలవంతుఁడై, అతనికి అనేక రాజులు సహాయముగా నుండిరి. ఇట్టి రాజుతోఁ బోరిగెలుచుట దుర్లభమనియు, దుర్గావతి మనము అతనియందుఁ జిక్కినదనియు నెఱిఁగి, చందేల్ రాజు గఢామండలాధీశునకుఁ దన కన్యక నిచ్చి మహావైభవముతో వివాహము చేసెను.

వివాహము జరిగినతరువాత సత్తవారింటికి వచ్చినప్పుడు దుర్గావతి, తన పుట్టిన రాజ్యమునందున్న పేదసాదల కనేకులకు శాశ్వత జీవనము లేర్పఱచెను. అందువలన వారందఱామెను తమ పాలిటి దైవమని భావించి యామె కనేకము దైనసేవన లొనరించిరి. ఈమె గఢామండలమునకు వచ్చినతరువాత నీమెభర్త, రాజ్యవిచారణ మేమియుచేయక, యీమెయందే యధికానురాగము కలవాఁడై, సదా నర్మదానదీతీరమునను, అచ్చటనున్న యుద్యానవనములయందును విహరించుచు కాలము వ్యర్థపుచ్చుచుండెను. అనేక పర్యాయములు దుర్గావతి రాజ్యమును బాగుగా నేలుమని రాజునకు సూచించెనుగాని విషయాసక్తుఁడయిన రాజు ఆమాటలను లక్ష్యపెట్టినవాఁడు కాఁడు. అంతఁ గొంత కాలమునకు దుర్గావతీరాణి గర్భవతియయి యొకపుత్రునిఁ గనెను. ఆపుత్రునికిఁ బదిసంవత్సరముల ప్రాయము వచ్చినప్పుడు, రాజుగారు దీర్ఘరోగముచేత మృతి నొందెను. అప్పుడు రాజ్యపాలనమంతయు దుర్గావతిమీఁదఁ బడినందున నామె తనకుమారుని సింహాసనాసీనుఁ జేసి, యతనిపేరిట తానే రాజ్యముఁ జేయఁ జొచ్చెను. ఆమె తన పెనిమిటివలెఁగాక, మిగుల దక్షతతో,

న్యాయముతోఁ, రాజ్యపరిపాలనముఁ జేయుచుఁ బ్రజలను సంతోష పెట్టుచుండెను.

ఇట్లు తనప్రజలను సుఖపెట్టుచు, పరరాజులతో వైరము లేక యైదాఱుసంవత్సరములు రాణిగారు రాజ్యము చేసినతరువాత మొగలాయి రాజైన యక్బరుబాదుషా ఆమెకీర్తి విని, యిట్టి రాజ్యము పరిపాలించెడిరాణి మనకు నంకితురాలుగా నుండవలయు నని నిశ్చయించెను; ఇట్లు తలఁచి యక్బరు అసఫ్ఖాను అను ప్రసిద్ధవీరుని ౧౫౬౪ వ సంవత్సరమున దుర్గావతిరాజ్యము పైకిఁ బంపెను! అక్బరు సకల సద్గుణసంపన్నుఁడని చరిత్రకారులు చెప్పుదురు. అతనియందు ననేక సద్గుణము లుండెడివి. ఇతర యవన ప్రభువులతోఁ బోల్చి చూచినయెడల నతఁడు దేవసమానుఁడే యని చెప్పుటకు సందేహములేదు. కాని యిట్టి మహాత్మునిని గూడ రాజ్యకాంక్ష వదలినది కాదు. రాణి దుర్గావతి యక్బరు నేమి, ఆయనరాజ్యములోని ప్రజలనేమి యించుకంతమాత్రము బాధ పెట్టినది కాదు. వారి జోలికైన నెన్నఁడు పోయినదికాదు. ఇట్టు లుండఁగా నాయబలమీఁదికి సైన్య మంపుట మహాత్మాకాంక్షగాక మఱియేమి? ఇట్లు అసఫ్ఖాను శూరుఁడు (అవును. అబలతో యుద్ధమునకుఁ దలపెట్టినవాఁడు శూరుఁడే.) తనపై దండెత్తి వచ్చుచున్నాఁడన్నమాట విని, దుర్గావతి భయపడక, మహాధైర్యముతో యుద్ధమునకు సిద్ధము చేయసాగెను. మహాప్రయత్నము చేసి కొద్దికాలములోనే ౫౦౦ కరులను, ౨౦౦౦ తురంగములను, గొప్పకాల్బలములను సిద్ధపఱచెను. తాను పురుష వేషము ధరించి, ఆయుధములను బుచ్చుకొని, యేనుఁగు పైనె

క్కి ప్రత్యక్షదుర్గవలె యుద్ధభూమికి వెడలెను! ఆమెనుజూచి సైనికుల కందఱికిని ఉత్సాహము గలిగి వారిశౌర్య మినుమ డియై వారు శత్రుసైన్యముపై నడరి యతిధూర్తు లగు యవన సైనికుల ననేకుల రూపుమాపె, మఱునాఁ డాసేనాధిపతిని యమ సదనమున కనుప నిశ్చయించిరి. కాని ఢిల్లీశ్వరునిచే మహావీ రుఁడని ప్రఖ్యాతిని గాంచిన ఆసఫ్ ఖాన్ కొద్దిసైన్యముతో నీమె ను జయించుట దుస్తర మని తెలిసికొని, మఱునాఁ డింకను సైన్యమును గూర్చుకొని, తమవద్దనున్న ఫిరంగీ లన్నియు నగ్ర భాగమునం దుంచి, గోండుసైనికులపై నకస్మాత్తుగా వచ్చి, తన సామర్థ్య మంతయుఁజూప వారు చీకాకుపడి శత్రువుల మా ర్కొన శక్తులు కాకయుండిరి. ఇట్టి దురవస్థఁజూచి, దుర్గావ తీకుమారుఁ డల్ప వయస్కుఁ డయ్యును, అభిమన్యు కల్పుఁ డుగాన, తాను ముందై వెడలవలదని సైనికులకు ధైర్యమి చ్చి, శత్రువులను మార్కొనెను. ఇట్లు కొంతసేపు మహాధైర్య ముతోఁ బోరాడి యా బాలవీరుఁడు బాణఘాతముచే మూ ర్ఛిల్లెను. అప్పుడు సైనికు లందఱు చింతాక్రాంతులై యా దుఃఖవార్త, యింకొకవైపున తురకలను మర్దించుచున్న దుర్గా వతికిఁ దెలియఁజేసిరి. ఆమాట విని, దుఃఖించుట కది సమయము కాదని యెంచి, రాణీగా రిసుమంతైనను జలింపక పుత్రవాత్సల్య మును ఆపి, తనసేనాధిపతికి నిట్లు వర్తమానము చేసెను. "ఈస మయము ధైర్యమును వదలి దుఃఖించుచు కూర్చుండఁ దగినది కాదు. శత్రుహననము మన ముఖ్యకర్తవ్యము. ఈశ్వరేచ్ఛ వలన నైన కార్యమునకు వగవఁ బనిలేదు. కాన పిల్లవానిని శిబిర

మునకుఁగొనిపోయి తగిన యుపచారములు చేయుఁడు. నేని
ప్పుడు యుద్ధమును విడిచి వచ్చుటకు వీలులేదు. రణయజ్ఞము
సమాప్తము చేసి, ప్రాప్తియున్న మరలఁ జూచెదను.” ఈయనుజ్ఞ
ప్రకారము సైనికులు కార్యమును జరిపిరి.

యుద్ధమునందుఁ గొంతసేపు వారికి జయమును, కొంతసేపు
వీరికి జయమును గలుగుచు, ఎందరెవరు గెలుతురో నిశ్చయిం
చుటకు వీలు లేకయుండెను. ఇట్లు కొంతసేపు ఉభయపక్షముల
సమానముగా యుద్ధము జరిగి, అది హిందువుల స్వాతంత్ర్య నా
శన కాలముగాన, తురుష్కులకే యాధిక్యము వచ్చెను. గోండు
సైనికులు పోరాడిపోరాడి, ఉత్సాహహీనులైరి. గోండు లెట్లె
ట్లు ఉత్సాహహీనులైరో, అట్లట్లు మ్లేచ్ఛులబలము హెచ్చుచుఁ
బోయెను. సమరాజ్యమును గోండుదేశమునందు స్థాపించవలె
నన్నదృఢేచ్ఛ గలవారు గనుక ‘దీన్ దీన్’ అను రణశబ్దము ఘుష్ప
రించుచు ఘోరముగా గోండు సైన్యములను [illegible]. ఇట్లు
భయంకరమయిన హననయజ్ఞము జరుగఁగ, మూడువందల సైని
కులతోడ దుర్గావతిరాణీమాత్రము బ్రతికి భయంకరముగాఁ
బోరాడుచుండెను. ఆమెను మార్కొనుటకు ఆసఫ్ఖాన్ దుర్గా
వతివద్దికి స్వయముగా వచ్చెను. కాని యీమె రౌద్రమునుజూచి
భయమంది, దూరముపోయి, అచ్చటనుండి యామెపై బాణవర్ష
మును గురిపింపసాగెను. ఆమె యాబాణములు నన్నిఁటిని
దునిమెను. కాని యందొక బాణము శిరస్సునందు గ్రుచ్చుకొ
నఁగా నామె మఱింత క్రోధాయమానమానసయై, ఆ బాణమును
తాన పెరికివైచి, మఱింత రౌద్రముతో యుద్ధము చేయసా

గెను!! అప్పు డామెశరీర మంతయు రక్తమయ మైనసంగతి చూచి, ఆమెడస్సిన దని తెలిసికొని, స్వామిభక్తి గలయొకసేవకుఁ డామెను సమీపించి యిట్లనియె, "అమ్మా! మీ రిఁక యుద్ధమును జేసినందువలన లాభ మేమియు లేదు. కొద్దికాలములోనే శత్రువులు మిమ్ము జెరఁబెట్టఁ గలరు. వారిచేతులలోఁబడక శీఘ్రముగా నిచ్చటనుండి పలాయనముచేయుట మేలు: తమకొకయిబ్బంది లేక నేను ఆవలకు దీసికొని పోయెదను." ప్రియసేవకుఁడు పలికిన యీవచనములు విని ఆమెచింతించి, శత్రువులు నిజముగా సమీపించుచున్నా రని చూచి, పవిత్ర మైనదేహము మ్లేచ్ఛులచే నపవిత్ర మగునన్న మాటమాత్రము తలఁపునకురాఁగా సహింపలేక, విషణ్ణవదనయై, తనసేవకునిఁజూచి యిట్లనియె "ఓరీ! నీ వన్నమాట నిక్కము. ఇదిగో నాచేతనున్నఖడ్గముంగొని, యిచ్చటనే నాశిరచ్ఛేదము చేయుము; నేను క్షత్రియకన్యను; కాన పగరకు వెన్నిచ్చి, చనుట నాకనుచితము. ఈశరీరమును శత్రువు లంటఁజాలరు. కాన నీ వన్యథా విచారము చేయక నాతల దునుముము. అందుచే నేను వీరస్వర్గమును బొందుదును. నాయాజ్ఞ విని నన్నుసంకటమునుండి కాపాడినందున నీకును బుణ్యమే గలుగును; పాపము గలుగనేరదు." ఈమాటను విన్నతోడనే యాస్వామిసేవాపరాయణుఁడయిన సేవకుఁడు నిశ్చేష్టితుఁడై యేమియుఁ దోఁచక నిలువఁబడెను. కొంతసే పట్లు నిలువఁబడి వాఁ డిట్లనియె. "తల్లీ నావిన్నప మాలకించి, ఈయేనుఁగు నెక్కుఁడి. అది శీఘ్రముగా మిమ్మును శత్రువులబారినుండి తప్పించి, యవతలకుఁ గొనిపో

వును. నేను స్త్రీవధ చేయఁజాలను." అప్పుడు రాణీగారు మిక్కిలి విచారించి, మ్లేచ్ఛులు సమీపించుట గని, తన ఖడ్గమునకు మ్రొక్కి దానితోఁ దనంతట దానే పొడుచుకొని రణభూమియందే ప్రాణములు విడిచెను!!! రాణీగారిశవము మ్లేచ్ఛులచేఁ బడకుండ నామె సేవకుఁడు భద్రపఱిచి, తాను యుద్ధముచేసి యచటనే మృతుఁడయ్యెను! రాణీగారికుమారుఁడును పరలోకగతుఁడయ్యెను. ఇట్లొక తురక బాదుషాయొక్క రాజ్యలోభముచేత గోండుసంస్థానములోని నిరపరాధు లగులోకు లందఱు హతులైరి. అహా! రాజ్యలోభ మెట్టి ఘోరకృత్యములను జేయునో గదా!

ఈరణశూర యైనదుర్గావతియొక్క సమాధి జబ్బలపురము వద్ద నున్నది. ఆసమాధియొద్దనే యామె గుణవర్ణనాత్మక మైన శిలాశాసనము కలదు. అచ్చటికి వెళ్లిన బాటసారు లందఱును ఆసమాధిని మహాభక్తితోఁ జూచి యీశూరనారిని గుఱించి పూజ్యభావమును వహించెదరు. పరమధార్మికుఁ డయిన యొక బాటసారి యిందు గుఱించి యిట్లు వ్రాసియున్నాఁడు. "దుర్గావతియొక్క సమాధి నాపర్వత దేశమునందు నిర్మింపఁబడినది. అచ్చట రెండు పాషాణస్తంభంబు లున్నవి; వానినిఁ జూడఁగానే వెనుక జరగిన యుద్ధము మూర్తీవంతముగాఁ గనులయెదుటఁ గానఁబడును. ఆగిరిశిఖరముమీఁద నిప్పటికిని భయంకరమైన రణఘోషము రాత్రిపూట వినవచ్చునని యచ్చటిలోకులు నమ్మెదరు. నిర్జన మయ్యును రమణీయ మగునీస్థలమునకు వచ్చెడి బాటసారులు ప్రేమపూర్వకముగా రాణీగారి సమాధిని దర్శి

తుగు. ఆమెపరాక్రమ శ్రవణముచే విస్మయచిత్తులయి నానంద ముతో నామె సమాధిని బూజించెదరు. ఆస్థలమునందుఁ బ్రకాశ మానము లయినగాజు తునుక లనేకము లున్నవి. ఆగాజుతును కలే రాణీగారికి బాటసారు లర్పించెదరు. ఈపూర్వాచారము ననుసరించి, నేనును దుర్గావతియొక్క దివ్యగుణములను అభినం దించుటకయి యొకగాజుతునుక సమాధికి నర్పించితిని.” అవును. ఇట్టి యలౌకికశౌర్య మేరికి నభినందనీయము గాకుండును ? క్షత్రి యులకు నత్యంత శ్రేయస్కర మయినధర్మమును నాచరించి స్వర్గ ద్వారమునందుఁ జొచ్చినవారు పురుషులయినను, స్త్రీలయినను సర్వజనవంద్యులే. శ్రీకృష్ణమూర్తియు నర్జునున కిదియే బోధించె నాఁడు:—

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్
సుఖినః క్షత్రియాః పార్థ ! లభంతే యుద్ధ మీదృశమ్.*

---

* ఓ అర్జునుఁడా ! కోరకుండ సంభవించినట్టియు, తెఱవఁబడిన స్వర్గ ద్వారరూపమయినదియు నగు నిట్టి యుద్ధమును ఏరాజులు పొందుచున్నారో, వారలు సుఖు లగుచున్నారు.—భగవద్గీత. అ. ౨. శ్లో ౩౨.

# సౌభాగ్యవతి రఖమాబాయి కేళ్కోకర్.

## స్త్రీవిద్యావిజయధ్వజము !!!

సంపత్సరస్వతీ సత్యం సంతానం సదనుగ్రహః ।
సత్తా సుకృతిసంభారః సకారాః సప్త దుర్లభాః ॥ †

వర్తమానకాలమున హిందూదేశమున స్త్రీవిద్యను గురించి యనేక వాదవివాదములు జరుగుచున్నవి. ఉన్నతవిద్య స్త్రీలకు నేర్పవలయునా వలదా యన్నసంగతిని గురించి యనేకు లనేక విధములుగా వితర్కించుచున్నారు. కొందఱు, స్త్రీలకుం బురుషులవలె నన్ని విద్యలు చెప్పవచ్చునని చెప్పుదురు. స్త్రీలకు బురుషులవలె నున్నతవిద్య యక్కఱలేదనియు, వారి కల్పజ్ఞానము గలిగినం జాలుననియుం గొందఱు చెప్పుదురు. స్త్రీలకు నింటి పనితప్ప చదువుతో నొత్తిగా ప్రయోజనము లేదనియు మఱి కొందఱు చెప్పుచున్నారు. స్త్రీలకు విద్య నేర్పినయెడల వారు గర్వింతు రనియు, వీరు గూడ స్వాభావిక సద్గుణములను త్యజింతు రనియు, భర్తలను లక్ష్యము చేయరనియు, అందువలన సంసారము చక్కఁగా జరుగక, స్వధర్మ మంతయు చెడి, సమాజ సౌఖ్య మంతయు విధ్వంస మగుననియుం గొందఱు ప్రతిపాదించెదరు. ఇట్టి ప్రత్యక్షముగా ఉదాహరణము లేమియు నెదుట

† సంపత్తి, సరస్వతి (విద్య), సత్యము, సంతానము, సదనుగ్రహము (పెద్దలకృప; లేక గొప్పవారి ఆశ్రయము), సత్త(అధికారము), సుకృతిసంచయము, ఈసకారసప్తకము దుర్లభము సుమా.

లేనందువలన నెవరికి మనసువచ్చినట్లు వారు స్త్రీవిద్యావిషయ
మయి మాటలాడుచుందురు. 'విద్యా దదాతి వినయం' అని
యున్నదిగనుక విదుషీ స్త్రీ యితర స్త్రీలకంటె నధికసుశీలము గల
వారును, అధిక వినయసంపన్నలును, కావలయును. ఐనను
విద్యచే స్త్రీలు చెడుదురని యనేకులు చెప్పుట వింతగానున్నది.
ఇట్టి నాక్షేపణ లాడుమాటలు కేవల మర్థములేని మాట
లనుట ప్రత్యక్షప్రమాణముచే కావలయును. ఉన్నతవిద్య నేర్చు
కొని, మహావిద్యావతులని పేరు వడసియు, వినయాదిసద్గుణ
విభూషితలయి, ధర్మశ్రద్ధగల విదుషీ. ఇంగ్లీషువారి దురాచార
ములను గ్రహింపక, వారి సద్గుణములనుమాత్రమే గైకొనుచు
పాతివ్రత్యమును [illegible]ముగాఁ బ్రతిపాలించిన సతీశిఖామణుల
నొక్క ప్రత్యేక చరిత్రములే దురాక్షేపలాడు ప్రతిపక్షులను లజ్జి
తులను జేయును. ఇట్టి పవిత్రచరిత్రములవలన. మన దేశమునందు
గల స్త్రీవిద్యాద్వేషము సమూలముగా నశింపగలదు. ఈ
దేశమునందు స్త్రీవిద్య వృద్ధిఁ బొందినకొలఁదిని, ఇట్టిసుగుణా
భిరామ లయినవిదుషీరత్నము లనేకులు కలుగఁగలరు. ఇప్పుడు
[illegible]సనమువారిసహాయమువలన నీదేశమునం దనేక బాలికా
పాఠశాలలు స్థాపింపఁబడినవి. ఈ పాఠశాలలయందు నేర్చుకొని
యచ్చటచ్చట విదుషీరత్నము లుత్పన్న లగుచున్నారు. ఇదియు
నుగాక యనేక స్త్రీవిద్యాభిమానులు, తమభార్యలకు విద్యచెప్పి
వారిని తమసహధర్మచారిణులుగాఁ జేసికొనుచున్నారు. ఇట్లు మ
న దేశమునం దుద్భవించుచున్న విదుషీమణులసుగుణసంపదలు,
లోకులకుఁ దెలిపి, స్త్రీవిద్యను వృద్ధిపఱచుట ప్రతిస్వదేశాభి

మానునిపని. కనుక నిప్పుడు బ్రతికియున్న యొకమహాసాధ్వి యొక్క దివ్యచరిత్రము చదువరులకొఱకీమాలయందు గ్రుచ్చఁ దలఁచితిని. ఈమెపేరు సౌభాగ్యవతి రఖమాబాయి కేళ్కర్. ఈపతివ్రతాతిలకముయొక్క విద్యావైభవము, అసామాన్యసౌజన్యము, నిస్సీమపతినిష్ఠ, పరమవినయము, సంపూర్ణశాలీనత, అనుపమేయౌదార్యము, అనుకరణీయ మయినగృహ నిర్వాహకత్వము, మొదలయిన సద్గుణసమూహమును జూచి, విభ్రమముఁ జెంది యెంతగొప్ప పూర్వనాగరికుఁ డయినను, తనమనసులోని స్త్రీవిద్యాద్వేషము సంపూర్ణముగాఁ బోఁగొట్టుకొని యతఁడు స్త్రీవిద్యాభిమాని కాక మానఁడు. ఇట్టిప్రభావ మీచరిత్రమునందుఁ గలదు గావుననే యీమెను మహారాష్ట్రములోని పూర్వనాగరికులగు పత్రికాకర్తలుగూడ వేయినోళ్ల గొనియాడుచున్నారు. కావుననే యీమె చరిత్రమునకు శిరోభాగమునందు నేను 'స్త్రీవిద్యా విజయధ్వజము' అని పేరుపెట్టితిని. శిరోభాగమున నుదాహరింపఁబడిన శ్లోకమునందుఁ జెప్పఁబడిన సకారసప్తక మీమెయందు నేకీభవించియుండుటఁ జూచి, మహైశ్వర్యమగ్నురాలనై, ఇట్టిపవిత్రచరిత్రమును వ్రాసినయెడల సోదరీమణుల కత్యంతోపయోగ మగునని యెంచి రఖమాబాయిగారి చరిత్రము సంక్షేపముగా వ్రాయుచున్నాను.

సౌ. రఖమాబాయిగారు మహారాష్ట్రవైశ్యులు. ఈజాతివారు చాల తక్కువగానుండి, బొంబాయి, సోలాపూరు, విరాపూరు, వసయీ, యన్నగ్రామాదులలోనే యున్నారు. ఈమె బొంబాయి పట్టణమునందు ౧౮౬౪ వ సంవత్సరప్రాంతమున

జన్మించెను. చిన్నతనమునం దీమె విద్యాభ్యాసము చేసినది కాదు. ౧౮౬౮వ సంవత్సర ప్రాంతమున బొంబాయిలో, డాక్టరు కృష్ణాజిదాదాజి యన్నఆయనతో నీమె వివాహము జరిగెను. ఈ వివాహసమయమునుండియే, యీమె నిజమ యినచరిత్రమునకుఁ బ్రారంభ మయినదని చెప్పవచ్చును. రాజ శ్రీ కృష్ణాజీగారి మూలనివాసస్థలము వసయీ యన్నగ్రామము. ఈయన బొంబాయిపట్టణములోని గ్రాంట్ మెడికల్ కాలేజిలో వైద్యశాస్త్రము నభ్యసించి, డాక్టరుపరీక్షయందు పారంగతుఁ డయ్యె. ఈయనకుఁ జిన్ననాటినుండియు విద్యావ్యసనము గలదు. పాఠశాలయం దభ్యసించిన వైద్యశాస్త్రమునం దేకాక, మహా రాష్ట్రభాష, వ్యాకరణము, కవిత్వము మొద లయినవాని యందుఁగూడ కృష్ణాజీ ప్రవీణుఁ డయ్యెను. ఈడాక్టరుకుఁ బ్రథ మమునుండి స్త్రీవిద్యయందుఁ జాల అభిమానముగలదు. కేవలా క్షరజ్ఞానముమాత్రము స్త్రీలకుఁ జాలునని యీయన అభిప్రా యముకాదు. పురుషు లభ్యసించు నున్నతవిద్యలన్నియు స్త్రీలకు నేర్పవచ్చునని కృష్ణాజీగారి యభిప్రాయము. విద్యవలన నాఁడు వారు చెడిపోవుదు రన్నమాట యసత్యమని డాక్టరుగారి యభి ప్రాయము గనుక, తాను స్వయముగా తనభార్యకు విద్య నేర్పి, స్త్రీవిద్యా నిందకులమాటలు స్వప్న సృష్టిలోనివేగాని, వాస్తవ సృష్టిలోనివి కావని ప్రత్యక్ష ప్రమాణముతో స్థాపించుటకు డాక్టరు కృష్ణాజీగారు నిశ్చయించిరి.

తననిశ్చయము ననుసరించి కృష్ణాజీగారు రఖమాబాయికి విద్య నేర్పుట కారంభించిరి. ఆమెకు వివాహమునకుఁ బూర్వము విద్యా

మానునిపని. కనుక నిప్పుడు బ్రతికియున్న యొకమహాసాధ్వి యొక్క దివ్యచరిత్రము చదువరులకొఱకీమాలయందు గ్రుచ్చఁ దలఁచితిని. ఈమెపేరు సౌభాగ్యవతి రఖమాబాయి కేళ్కోకర్. ఈపతివ్రతాతిలకముయొక్క విద్యావైభవము, అసామాన్యసౌజన్యము, నిస్సీమపతినిష్ఠ, పరమవినయము, సంపూర్ణశాలీనత, అనుపమేయౌదార్యము, అనుకరణీయమయినగృహనిర్వాహకత్వము, మొదలయిన సద్గుణసమూహమును జూచి, విభ్రమము జెంది యెంతగొప్ప పూర్వనాగరికుఁడయినను, తనమనసులోని స్త్రీవిద్యాద్వేషము సంపూర్ణముగాఁ బోఁగొట్టుకొనియతఁడు స్త్రీవిద్యాభిమాని కాక మానఁడు. ఇట్టిప్రభావ మీచరిత్రమునందుఁ గలదు గావుననే యీమెను మహారాష్ట్రములోని పూర్వనాగరికులగుపత్రికాకర్తలుగూడ వేయినోళ్ళ కొనియాడుచున్నారు. కావుననే యీమె చరిత్రముమునకు శిరోభాగమునందు నేను 'స్త్రీవిద్యా విజయధ్వజము' అని పేరుపెట్టితిని. శిరోభాగమున నుదాహరింపఁబడిన శ్లోకమునందుఁ జెప్పఁబడిన సకారసప్తక మీమెయందు నేకీభవించియుండుటఁ జూచి, మహాశ్చర్యమగ్నురాలనై, ఇట్టిపవిత్రచరిత్రమును వ్రాసినయెడల సోదరీమణుల కత్యంతోపయోగ మగునని యెంచి రఖమాబాయిగారి చరిత్రము సంక్షేపముగా వ్రాయుచున్నాను.

సౌ. రఖమాబాయిగారు మహారాష్ట్రవైశ్యులు. ఈజాతివారు చాల తక్కువగానుండి, బొంబాయి, సోలాపూరు, విజాపూరు, వసయీ, యన్నగ్రామాదులలోనే యున్నారు. ఈమె బొంబాయి పట్టణమునందు ౧౮౬౭వ సంవత్సరప్రాంతమున

జన్మించెను. చిన్నతనమునం దీమె విద్యాభ్యాసము చేసినది కాదు. ౧౮౭౭వ సంవత్సర ప్రాంతమున బొంబాయిలో, డాక్టరు కృష్ణాజిదాదాజి యన్నఆయనతో నీమె వివాహము జరిగెను. ఈ వివాహసమయమునుండియే, యీమె నిజము యినచరిత్రమునకుఁ బ్రారంభ మయినదని చెప్పవచ్చును. రాజశ్రీ కృష్ణాజీగారి మూలనివాసస్థలము వసయీ యన్నగ్రామము. ఈయన బొంబాయిపట్టణములోని గ్రాంట్ మెడికల్ కాలేజిలో వైద్యశాస్త్రము నభ్యసించి, డాక్టరుపరీక్షయందు పారంగతుఁ డయ్యె. ఈయనకుఁ జిన్ననాటినుండియు విద్యావ్యసనము గలదు. పాఠశాలయం దభ్యసించిన వైద్యశాస్త్రమునం దేకాక, మహారాష్ట్రభాష, వ్యాకరణము, కవిత్వము మొద లయినవాని యందుఁగూడ కృష్ణాజీ ప్రవీణుఁ డయ్యెను. ఈడాక్టరుకుఁ బ్రథమమునుండి స్త్రీవిద్యయందుఁ జాల అభిమానముగలదు. కేవలాక్షరజ్ఞానముమాత్రము స్త్రీలకుఁ జాలునని యీయన అభిప్రాయముకాదు. పురుషు లభ్యసించు నున్నతవిద్యలన్నియు స్త్రీలకు నేర్పవచ్చునని కృష్ణాజీగారి యభిప్రాయము. విద్యవలన నాఁడు వారు చెడిపోవుదు రన్నమాట యసత్యమని డాక్టరుగారి యభిప్రాయము గనుక, తాను స్వయముగా తనభార్యకు విద్య నేర్పి, స్త్రీవిద్యా నిందకులమాటలు స్వప్న సృష్టిలోనివేగాని, వాస్తవ సృష్టిలోనివి కావని ప్రత్యక్ష ప్రమాణములో స్థాపించుటకు డాక్టరు కృష్ణాజీగారు నిశ్చయించిరి.

తననిశ్చయము ననుసరించి కృష్ణాజీగారు రఖమాబాయికి విద్య నేర్పుట కారంభించిరి. ఆమెకు వివాహమునకుఁ బూర్వము విద్యా

గంధ మయినను లేకపోయినను, బుద్ధికుశలత గలిగినదిగావున, త్వరలోనే మహారాష్ట్రము వ్రాయుట, చదువుట చక్కఁగా నేర్చుకొనెను. అందువలన ఆయన కధికోత్సాహము కలిగి, భార్యకు విద్యచెప్పుట మాతని కొకవినోదమైన పనిగాఁ దోఁచెను. తన యుద్యోగమునకును, రోగులయిండ్లకు వెళ్లి చూచుటకును కావలసినవేళతప్ప, కడమసమయ మంతయు కృష్ణాజీగారు భార్యకు విద్యగఱపుటయందే గడపుచుండెను! ఆకాలమునందు భార్యాభర్త లిరువురును యౌవనసంపన్ను లయ్యుండియు, ధనసంపన్నులై యుండియు, నితరులవలె స్వేచ్ఛాసుఖములయం దిష్టము లేనివారై, యుభయులును విద్యాభివృద్ధికై పాటుపడుచుండిరి! అట్టి సమయమునం దెంతమాత్రము విసుగులేక, ఆమె యెంత త్వరగా నభ్యసించిన నంత యుత్సాహముతో బోధించిన కృష్ణాజీగారి సదుద్దేశము లెంతయుఁ బ్రశంసింపవలసి యున్నది. కృష్ణాజీగారు తనభార్యకు విద్య గఱపినరీతి యత్యంత ప్రశంసనీయముగాను, అనుకరణీయముగాను, ఉన్నది. సుఖమార్గముగాను చదువుకొను అఱలోఁ బెట్టిన ప్రతిపదార్థమును బోధప్రదముగానే యుండెను. గోడలకు గోడసంచులు మొదలైనవి కొట్టుటకుమారుగా గోళములయొక్కయు, గోళార్ధములయొక్కయు, నక్షత్రములయొక్కయు, సూర్యమండలముయొక్కయు, గ్రహణములయొక్కయు సుందరమైన పటములను కృష్ణాజీగారు కొట్టించిరి. జగత్తులో పర్వతములయొక్కయు, నదులయొక్కయు, ద్వీపములయొక్కయు, పటములను శ్రమపడి సంపాదించి, గది నలంకరించుచుండెను. ఆవిద్యామందిరమందు, భిన్నభిన్న దేశ

ములలోని లోకుల ప్రతిమలును, సీత, తార, ద్రౌపది మొదలైన పౌరాణికసాధ్వీమణుల పటములును, అహల్యాబాయి, ఎలిజబేతు మొదలైన స్త్రీలయొక్కయు, వాషింగటన్, నెపోలియన్ మొదలైనవారియొక్కయు పటములును, తుకారాము, రామదాసు, మోరోపంతు, ముక్తేశ్వరుఁడు మొదలయిన మహారాష్ట్రకవులయొక్క బోధవచనములు పెద్దయక్షరములతో వ్రాయఁబడిన కాగితములును, స్థలస్థలమునందుఁ గానవచ్చుచుండెను. సూర్యునిచుట్టు పృథివి యెటులు తిరుగునో, పృథివిచుట్టుచంద్రుఁ డెట్లు తిరుగునో చూపుటకుఁ జేయఁబడిన యంత్రము, వాయుభారమును గొలుచుయంత్రము, ఉష్ణత గొలుచు యంత్రము, పాలలో నీరు కలిసినది లేనిది తెలిసికొనుటకుఁ జేయఁబడినయంత్రము, చల్లచేసెడియంత్రము, జాగరూకత నిమిత్తమై చేయఁబడిన గడియారము మొదలయిన చిన్నచిన్న కొద్దివెల గలయంత్రములచే నాగది యలంకరింపఁ బడుచుండెను. ఇట్లు ఆవిద్యామందిరమం దెటచూచినను, ఆనందప్రదము లయినట్టియు, బోధప్రదము లయినట్టియు, జ్ఞానప్రదము లయినట్టియు వస్తువులే గానవచ్చుచున్నందున, ఆగృహాము కేవలముగా సరస్వతీదేవియొక్క విలాసమందిరముగాఁ దోచుచుండెను! ఇట్టి సరస్వతీమందిరమునం దధ్యయనము చేసినందువలన రఖమాబాయిగారికి సరస్వతీ దేవితో నతిశీఘ్రముగా సహావాసము గలిగెనని చెప్పుటకు సందేహాము లేదు. ఆగదిలోని యేయేపదార్థమువైపు ఎప్పుడెప్పుడు దృష్టిపోయిన అప్పుడప్పుడు కృష్ణాజీగారు · వాని వాని విషయమై భార్యకు సవిస్తరముగా బోధ చేయుచుండిరి.

అచ్చటి ప్రతి పదార్థమును జూచి దానిని గుఱించిన సంగతు లన్నియు సంపూర్ణముగాఁ దెలిసికోవలయునని యామెకుఁ గుతూహలము గలిగి యామెభర్తను సవినయముతో ననేక ప్రశ్న లడుగుచుండెను. డాక్టరు కృష్ణాజి సర్వము తెలిసినవాఁడుగావున, భార్యకుఁ గలిగినశంకల కన్నిఁటికిని తగిన సమాధానములు చెప్పి, ఆమె జ్ఞానమును వృద్ధిపఱచుచుండెను. ప్రసంగానుసారముగా నితిహాసము, పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము, జ్యోతిషశాస్త్రము మొదలైనవానిలోని సంగతు లన్నియు మనోరంజకముగా నుండునటుల బోధించి యామె మనస్సునందు నాటునట్లు చేసెను! వ్యాకరణము, గణితము మొదలైన విషయములు నేర్పునప్పుడేమి, నేర్చుకొనునప్పుడేమి పురుషులకే మహాకఠినముగా నుండును. స్త్రీల కంతకంటెఁ గఠినముగా నుండునని వేరుగాఁ జెప్పవలెనా? ఐనను కృష్ణాజీగారు గణితవ్యాకరణములను గూడ సులభముగాను, మనోరంజకముగాను భార్యకు నేర్పిరి! ఇందుచేతనే రఖమాబాయిగారు గణితవ్యాకరణములలో మిక్కిలి ప్రవీణయై, కోలాపూరుపట్టణములో నధ్యాపనము చేయునప్పుడు, ఈవిషయములలోని ప్రావీణ్యమును గుఱించి ప్రఖ్యాతిని వహించెను. ఇదియంతయు కృష్ణాజి దాదాజిగారి పరిశ్రమఫల మని చెప్పుట కేమి సందేహము? ఇంగ్లీషు నేర్చుకొని, మాతృభాషలను మఱచిపోవువారివలెఁగాక కృష్ణాజీగారు, మహారాష్ట్రభాషయందుఁ బ్రావీణ్యము గలవారుగావున, ఆయన తనభార్యకు మహారాష్ట్ర భాషయొక్క సాహిత్యశాస్త్రమును గూడ నేర్పెను.

ఇట్లు రఖమాబాయిగారు మహారాష్ట్రమునం దధికాభ్యాసము గలవారై, యింగ్లీషువిద్య నభ్యసించుటకుఁ బ్రారంభించిరి. ఆమెకుఁ గల యుత్సాహమువలనను, కృష్ణాజిగారి పరిశ్రమమువలనను కొద్దికాలములోనే యాభాషయందుఁ గూడ రఖమాబాయిగారికిఁ జాలప్రవేశము గలిగెను. ఇదియంతయు, నామె స్వయముగా నింటిపని చేసికొని తీరినకాలములో నేర్చుకొనెను! బడికి వెళ్ళక యింటనే యభ్యసించినను, బడియం దభ్యసించి ప్రవీణు లనఁబడు వారికంటె నధికముగానే నేర్చెను!! కాని, యింతవిద్వాంసురాలయినను, ఈమెకు నక్షరజ్ఞాన మైనకలదని, యిరుగుపొరుగువారికేమి, బాంధవులకేమి తెలియక యుండెను!!! ఐనను కస్తూరి పరిమళ మెంత దాచినను దాగనేర దన్నట్లు, ఈమె యెంత గుప్తముగా నుండినను, ఈమె కీర్తి మిక్కిలి చమత్కారముగా నీవలకు వచ్చెను.

డాక్టరు కృష్ణాజీ యెల్లప్పుడును తమపనియం దధికశ్రద్ధ గలవాఁడయి, కౌశలముతోఁ బనిని నిర్వహించుచుండెను. కానఁ బయియధికారు లాయనను జాల ప్రేమించుచుండిరి. అప్పటి యధికారిపేరు డాక్టరు జాక్సను. ఒకరోజు డాక్టరు జాక్సన్ అకస్మాత్తుగా కృష్ణాజీగారి వైద్యశాల చూచుటకయి వచ్చెను. వచ్చి, నీవుత్వరగా వైద్యశాలకు రావలసినదని వ్రాసి కృష్ణాజీ యింటికి నొకచీటిని బంపెను. కాని కృష్ణాజిగా రొకరోగిని జూచుటకయి, దగ్గఱి గ్రామమునకు వెళ్లియున్నందున, ఆయుత్తరము రఖమాబాయి చేతఁబడెను. ఆయుత్తరము ఇంగ్లీషులో నున్నందున, ఆమె దానిక్రింద "కృష్ణాజిదాదాజిగారు ఇంటివద్ద

లేరు. రోగినిజూచుటకయి గ్రామాంతరము వెళ్లియున్నారు; సాయంకాలమునకు రాఁగలరు" అని యింగ్లీషులోనే వ్రాసి, దొరగారివద్దికిఁ ద్రిప్పి పంపెను. ఆకాగితము చూచుకొని, ఆయన యింటికిఁ బోయెను; గాని ఆకాగితముపై దస్కతు లేనందున కాగిత మెవరు వ్రాసిరో యని జాన్‌స్టనుకు సంశయము కలిగెను.

తదనంతర మారోజుసాయంతనము కృష్ణాజీగారు గ్రామము నుండి వచ్చి వెంటనే డాక్టరు జాన్‌స్టనుగారి యింటికి వెళ్లిరి. అనేకసంగతులను గుఱించి మాటలాడి ప్రసంగానుసారముగా దొరవారు "నాయుత్తరమునకు ఇంగ్లీషుతో జవాబు వ్రాసిన వా రెవరు?" అని కృష్ణాజిని అడుగఁగా "జవాబు వ్రాసినది నా భార్యయే" యని యాయన ప్రత్యుత్తర మిచ్చెను. అప్పుడు దొరగా రత్యంత విస్మితులయి "ఇంతవిద్య నామె యెచ్చట నభ్యసించెను" అని యడిగెను. అందులకు కృష్ణాజిగారు "ఇదియంతే యు నేను ఇంట నేర్పినవిద్యయే, గాని మఱి యెచ్చటను నేర్చు కొనినది కాదు" అని చెప్పెను. ఈమాటలు విని దొరగారు మిక్కిలి యానంద మగ్నమానసులై 'మీభార్య దర్శనము నా కగుటకు నేమయిన నభ్యంతరము కలదా?' యని మిక్కిలి పూజ్యభావముతో నడిగెను. అందునకు కృష్ణాజీగా రొప్పు కొని, యింటికిఁ బోయిరి. మఱునా డుదయమున దొరగారు వచ్చి, వైద్యశాలయంతయు సంశోధించినతరువాత కృష్ణాజీ తన యధికారిని నింటికిఁ దీసికొనిపోయి భార్యను జూపించెను. ఆమెను చూడఁగానే నిన్నప్రత్యుత్తరము వ్రాసిన స్త్రీ యీమెయే యయియుండవచ్చునా యని దొరగారికి సంశయము కలిగెను.

కాని కొద్దికాలములోనే ఆమె సంభాషణవలన నామె విద
శయము వ్యక్తమయి, జాన్స్టనుగారి సంశయము తొలం
ఇంటిలోనేయుండి యింతవిద్య నేర్చుకొనుట నూచి వారు
మిక్కిలి యాశ్చర్య మయి, ఆయన కృష్ణాజిగారిని, రఖమా
యిగారిని మిక్కిలి కొనియాడెను. వారిపరిశ్రమను అభినం
వారికి నుత్సాహము కలుగునట్లు చేసెను.

కృష్ణాజిగారి యీయుదాహరణమువలన నీదేశము
పురుషులు బోధగ్రహింపవచ్చును. ఈదేశములో బాలికా
శాల లుండినను ఆశాలలకుఁ జిన్నచిన్నపిల్లలే వెళు
కొంచెము పెద్దవా రయినతరువాత ఆఁడుపిల్లలు పాఠశా
వెళుటకు సిగ్గుపడుదురు. కనుక హిందూసుందరులకు సంపూ
ముగా విద్య నేర్చుకొనుటకు బాలికాపాఠశాల లుపయో
పవు. ఇదియునుగాక యనేకబాలికాపాఠశాలలలోఁ బురు
యుపాధ్యాయులుగా నుండుటవలన ననేకులు, తమబాలిక
పాఠశాలలకుఁ బంప రొల్లరు. కావున స్త్రీవిద్యాభిమాను
పురుషు లందఱును తమతమభార్యలకును, అక్కలకును, చె
డ్రకును, ఇంటివద్దనే చేతనయినంతవిద్య గఱపవలయును.
లము అక్షరజ్ఞానమేకాక సమస్తవిద్యలును గృహములో
వచ్చునని, రఖమాబాయిగారి యుదాహరణమువలన స్పష్ట
చున్నది. కావున ప్రస్తుతస్థితిని విడువఁజాలని మనదేశము
పురుషులు గృహమునందుననె చేతనైనమట్లుకు స్త్రీవిద
వృద్ధిచేయవలయును. ఇట్లు చేసిన బహుసులభముగాను,
ముగాను, ఈదేశమునందు స్త్రీవిద్యాభివృద్ధి కాఁగలదు.

భార్యకుఁ జదువు చెప్పినపుడు డాక్టరు కృష్ణాజిగారికిఁగాని, అత్యుత్సాహముతోఁ జదువుకొనునపుడు సౌ॥ రఖమాబాయికిఁ గాని, ఆవిద్యవలన ధనము సంపాదించవలెనని యూహలేదు. విద్య నేర్పుటయందును, నేర్చుకొనుటయందును వారి ముఖ్యోద్దేశము లేవియన, ఆమె మానసోన్నతిచేసి ఆమెను జ్ఞానవతిని జేయుటయు, స్త్రీల కిట్టిజ్ఞానము గలిగిన చెడుదురన్నలోకోక్తి యబద్ధమని చూపి అట్లు మిథ్యోక్తు లాడువారిని లజ్జితులను చేయుటయు, మనదేశములోని స్త్రీలకు నొక యుత్తమోదాహరణము చూపుటయు, స్త్రీకి జ్ఞానప్రాప్తియై సృష్టిచమత్కారజ్ఞానమంతయు భార్యాభర్తల కిరువురికి సమానముగానున్న వారిజీవితకాలము విశేషసుఖముగా జరుగునని వారితాత్పర్యము! ఈయుద్దేశముతోనే చేతనైనంతమట్టుకు కృష్ణాజిగారు భార్యకు విద్యనేర్పిరి. కాని యీవిద్యవలన వారికి ద్రవ్యసంచయము గలుగవలయు నని యీశ్వర నియామక ముండినందువలన, సుఖముగానుండి జ్ఞానమును సంపాదించుచున్న యీదంపతుల కొకగొప్పసంకటము సంభవించెను. అదియేదియన—

డాక్టరు కృష్ణాజిగారికిఁ జిన్నతనము నుండియు పీనస అను పేరుగల యొక నాసికారోగ ముండెను. అందువలన అప్పుడప్పుడు కొద్దిగా బాధ కలుగుచుండెను. కాని విశేషబాధ లేకయుండెను. ఆయన స్వయముగా వైద్యుఁడు గనుక ఆరోగమున కేదో యౌషధము చేయుచునే యుండెను. కాని యామందులవలన నేమియు గుణములేక కొన్నిరోజులకు ఆరోగము హెచ్చసాగెను. డాక్టరుగా రత్యంత పరోపకారబుద్ధి కలవారుగావున అనేకుల

కాయన ప్రీతిపాత్రుండయ్యెను. లోకు లాయన పరోపకారబు
ద్ధికి మెచ్చి, ఆయనను పనవేల్ మ్యునిసిపాలిటిలో మెంబరుగా
నేర్పఱిచిరి. ఆమ్యునిసిపాలిటీసభలో నొకరోజు ఏదోయొక సంగ
తిని గురించి వాదము చేయుచుండఁగా నకస్మాత్తుగా నాయన
ముక్కులోని పీనస అధికమై ముక్కునుండి రక్త ప్రవాహము
గారఁజొచ్చెను. అప్పు డాయన నిరుపాయుఁడై ఆప్రసంగ మంతటఁ
జాలించి యింటికి వెళ్ళ వలసినవాఁ డాయెను. ఆరోజునుండియు
రోగము దినదినము హెచ్చుటయే కాని తగ్గుట లేకపోయెను.
అప్పు డారోగము విశేషబాధాకరమనితోచి, కొంత కాలము
వఱకు కృష్ణాజిగారు ఇంగ్లీషు ఔషధోపచారములు చేసిరి. సౌ॥
రఖమాబాయియును మిక్కిలి శ్రద్ధాభక్తులతోఁ బతికి నుపచా
రము చేసెను. కాని యేమియు లాభములేకపోయెను. కనుక
నింగ్లీషు ఔషధములు చాలించి, దాజీశాస్త్రియను పేరు వడ
సిన హిందూవైద్యునివద్ద కృష్ణాజి మందుపుచ్చుకొనసాగెను. ఆ
యనమందువలన మొదట కొద్దిగా గుణముకలిగెను. కాని మొ
త్తముమీఁద నేమియు లాభము లేకపోయెను. ఇట్లేమియు సుగుణ
మగుపడకపోవుట చూచి, యాహిందూవైద్యుఁడు ఒకగొప్ప
యౌషధమును సిద్ధము చేసి, ౨౮ దినములకు మాత్రలు కట్టి
యిచ్చెను. ఈగొప్ప యౌషధమువలన సుగుణ మగుపడుట
యటుండఁగా, ముక్కుకాక మొగ మంతయు వాచి శ్వాసో
చ్ఛ్వాసములుసహితము నడచుట దుర్లభ మాయెను. అన్నము
మ్రింగుడు పోవుటలేక పాలైనను మిక్కిలి కష్టముతో నొంతులో
జారుచుండెను. అట్టిసమయమునం దాదంపతులకుఁ గలిగినచింత

వేఱుగా వక్కాణింప నక్కఱలేదు. 'అయ్యవారిని చేయఁబో యిన కోతియాయెను' అనిన లోకోక్తిచందమున బాగగుటకు యత్నించుచుండఁగా ప్రాణసంకటమే సంప్రాప్తించెను. అప్పు డాయన జీవించియుండుటయే దుర్లభమని వైద్యు లనుకొనిరి. కాని సౌ॥ రఖమాబాయిగారి మంగళసూత్రముయొక్క మహి మచేఁ గృష్ణాజిగారి ప్రాణముమీఁది సంకటము తప్పెను. కాని శాశ్వతమైన యంగవైకల్యము సంప్రాప్తించెను. కనుక నిరాశనుబొంది కృష్ణాజిగారు ఉద్యోగమును వదలుకొన వలసి నవాఁ డాయెను. ఇట్టి సంకటసమయమున రఖమాబాయిగారికి నెంతమనోవ్యాధి యుండెనో చదువరులే యోచించఁగలరు.

సుఖానంతరము దుఃఖము దుఃఖానంతరము సుఖము సంభ వించుట జగత్తుయొక్క ధర్మమేయని పెద్దలుచెప్పుదురు. కృష్ణా జిగారు పరోపకారు లను పేరొందిరి. రఖమాబాయిగూడ దయ, సత్యము, శీలము, శాంతిమొదలైన గుణములు కలదై, సద్వి ద్యాభ్యాసమువలన బంగారమునకు పరిమళమబ్బినట్లు ప్రశంసనీ యమై యుండెను. ఇట్లు సద్గుణశీలు రయి విద్యావ్యసనము తప్ప మఱి యేవ్యసనమును ఎఱుఁగనిదంపతులకు నిట్టిసంకటము గలుగుటచూడఁగా దైవగతి విచిత్రమని చెప్పకతప్పదు.

కృష్ణా గారివ్యాధి కొద్దిగా కుదిరినను, అంగవైకల్యము ప్రాప్తించినందున, నలుగురిలోఁ దిరుగుటకుఁగాని, యుద్యోగము చేయుటకుఁగాని వీలులేదని యెంచి, భార్యాభర్త లిరువు రొక పల్లెయందు నేకాంతముగా నుండ నిశ్చయించిరి. అందుకుఁ దగిన యేర్పాటు చేసికొని వారు దగ్గఱనున్న యొకపల్లెకు వెళ్లి, బీద

లవలెఁ గాపుర ముండిరి. అచ్చటను కృష్ణాజిగా రప్పుడప్పుడు రోగముచే బహు పీడితు లగుచుండిరి. ఔషధమువలన నేమియు గుణము లేకపోయెను.

అట్టి సమయమున రఖమాబాయిగారు చూపిన ధైర్యమును చేసిన పతిసేవయు వర్ణనీయములు. ఆమె చేసిన పతిశుశ్రూష వినినపక్షమున పురాణములలోని పతివ్రతల చరిత్రము చదువు చున్నామా యేమి యని తోఁచును. పతికి మఱింతదుఃఖ మగు నని తలఁచి, యామె తనకుఁ గలదుఃఖము నంతను నడఁచి, సంతోషవృత్తిని ధరించి పతికి సేవచేయుచుండెను. ఆమె పతికి ననేకధైర్యపుమాటలు చెప్పి, పెనిమిటిని దుఃఖసమయమునందు నుగూడ సంతోషపెట్టుచుండెను. ఆరోజులలో విసుగులేక రఖమాబాయిగారు చేసిన యసమానసేవను తలఁచుకొని కృష్ణాజిగారు ఇప్పటివఱకును ఆనందబాష్పములు రాల్చుచుందురు! ఆహా! ఏమి యీసాధ్వియొక్కమహిమ! సాధారణ యువతులందఱును తమభర్తలారోగ్యవంతులై యుండుకాలమునందు వారికి వినయముతోఁ బనులు చేయుచునేయుందురు. కాని కష్టసమయమునఁగదా వారి నిజమైనప్రేమ పరీక్షింపఁబడును? అట్టి పరీక్షయందు సంపూర్ణముగాఁ గడ తేరినవారుగదా నిజమైన గృహిణు లనఁబడుదురు? ఇట్టిపరీక్షయందు విద్యావిభూషితయైన రఖమాబాయిగారు ఇతరస్త్రీలకంటె నెక్కువగాఁ గడ తేరి విద్యయందజ్ఞానులచే నారోపింపఁబడు దోషము మిథ్యయని వెల్లడిచేసినారు! ఇట్టి సంకటసమయమునం దీపతివ్రతాతిలకము

యొక్క పతిప్రేమ తగ్గక యిట్టిదియయ్యెను!! ఇట్టిదిగదా విద్యాప్రభావము!!!

ఇట్లా దంపతు లిద్దఱు ఆపల్లెయందుఁ గాలయాపనము చేయుచుండఁగా, వారి కాగ్రామమునందు ప్రొద్దుపోవుట దుస్తరమయ్యెను. చిన్నప్పటినుండియు గొప్పనగరములో వాసము చేసిన వారుకావున వారికి పల్లె రమ్యముగాఁ గానిపించదయ్యెను. వారి బిడ్డల కచ్చట నౌషధంబులు దొరకకపోయెను. ఇట్టిదురవస్థలో వారికొమార్తెయొకతె ఔషధాభావమువలన మృతినొందెను. ఇట్లచ్చట వారికి దుఃఖములే సంప్రాప్తమైనందువలన వారి కాగ్రామమునం దసూయగలిగి, వారందఱును సముద్రతీరమందున్న ఆలీబాగుపట్టణమునకు వచ్చిరి. వీరి అదృష్టమువలన అప్పుడు డాక్టరు జాన్స్టనుదొరగారును, పనిమీఁద నాగ్రామములోనే యుండిరి. జాన్స్టనుదొరగారికి కృష్ణాజియందుఁ బరిపూర్ణకటాక్షముండెనని వెనుకనె వ్రాసియున్నాను. కాన నాదొరగారు కృష్ణాజి యెచ్చట నున్నాఁడని, లోకులను నడుగుచుండెను. కాని ఆయనకుఁ గృష్ణాజి యెచ్చట నున్నది బొత్తిగాఁ దెలిసినది కాదు. తాను ఆలీబాగుకు వచ్చినతరువాతను మఱచిపోక, ఆపరోపకారపరాయణుఁడైనదొరగారు కృష్ణాజిని గుఱించి వీరిని వారిని అడుగుచునే యుండెను. ఒకరోజు కృష్ణాజిగారు త్రోవలోఁ బోవుచుండఁగా, ఆయనను గుర్తించి దొరవారినేవకుఁ డొకఁడు, ఆయనవద్దికిఁ బోయి, 'దొరవారుమిమ్మును వెదుకుచున్నారు' అని చెప్పెను. ఆమాట విని కృష్ణాజి చాల సంతోషించి, తత్క్షణమే యాదొరగారిని దర్శించుటకుఁ

బోయెను. ఆదొరగారు కృష్ణాజికి సంభవించిన దురవస్థనుజూచి వ్యసనపడి, పూర్వము కృష్ణాజి యుద్యోగమును వదలినప్పుడు తాను పైకివ్రాసి కృష్ణాజిగారికొఱకుఁ దెప్పించిన బహుమానపు రూపాయ లతనికిచ్చెను. కృష్ణాజి మిక్కిలి మంచివాఁడని పైయధికారులవద్ద జాన్స్టనుగారు ప్రశంసచేసి కృషి చేసినందువలననే యీపైకము దొరకెనని వేఱుగఁ జెప్పవలెనా? ఇందువలననే జాన్స్టనుదొరగారి సదయాంతఃకరణము వ్యక్తమగుచున్నది. ఇట్లు ధనసాహాయ్యము చేయుటయే కాక, ముందు జీవనము నడుచుటకుఁ గూడ ఆయన యొకయుపాయము సూచించెను. దొరగారు కృష్ణాజితో నిట్లనిరి. "నీ విట్లు వికలాంగుఁడవై యేమియుఁ జేయుటకు శక్తిలేనివాఁడవైతివి గాన నీకుటుంబమును పోషించుకొనుట కష్టము. నీభార్య యధికవిద్వాంసురాలును, సూక్ష్మబుద్ధిగలదియునై యుండ మీూరక కూర్చుండుట నాకు బాగుగా లేదు. ఆమె కెచ్చటనయిన నుద్యోగము దొరకఁగలదు. వాటింగ్ దొరగా రిప్పుడు విద్యాశాఖయందు ఇన్స్పెక్టరుగా నున్నారు. నీవు వెళ్లి ఆయనను దర్శింపుము. అవశ్యముగా లాభము కలుగఁగలదు. అనిచెప్పి జాన్స్టనుదొరగారు, విద్యాశాఖాధికారికి నొకయుత్తరము వ్రాసియిచ్చి, అది తీసికొని కృష్ణాజీని ఆదొరగారివద్దకిఁ బొమ్మని యాజ్ఞయిచ్చెను. ఇట్టి మహోపకారమునకై కృష్ణాజిగారు కృతజ్ఞతాపూర్వకముగా దొరగారికి సలాముచేసి యింటికిఁ బోయెను. అచ్చట తన రాకకు నెదురు చూచుచున్న రఖమాబాయిగారికి ఆవర్తమాన మంతయు సంతోషముతో సవిస్తరముగాఁ జెప్పి, జాన్స్టను

డోరగారు వాటింగ్ డోరగారికి వ్రాసియిచ్చిన యుత్తరము చూపెను. ఆసంగతియంతయు విని రఖమాబాయిగారికి మొదట కొంచె మానందమాయెను గాని కొద్దిసేపులోనే యింతపని నాచేత నెట్లగునా యని ఆమెకుం జింతగలిగెను. తన కెంతవిద్య వచ్చినను, తా నెన్నఁడును పరీక్ష లియ్యలేదనియు, ఎవ్వరైనఁ బరీక్ష చేసిన నెట్లు ప్యాసు అగుదుననియు, ప్యాసు అయినను, ఏదైన నుద్యోగము దొరకినయెడల దాని నెట్లు నిర్వహించుకొనె దననియు నామె చింతింపసాగెను. డోరగారు చెప్పినట్లు ఇప్పుడు చేయకపోయిన మనకు ధన మెట్లు సంప్రాప్తించుననియు, డోరగా రిచ్చిన యుత్తరమును ఇప్పు డుపయోగింపనియెడల మరల నిట్టి ప్రసంగము రానేరదనియు నామె విచారించుచుండెను. అటులనే డాక్టరు కృష్ణాజీగారి మనసుగూడ అందోళనముగానే యుండెను. ఇట్లు వీరు త్రొక్కుడుపడుచున్న కాలములో నేమో ఒకనిమిషమున పూనాట్రేనింగుస్కూలు (అధ్యాపకలకు అధ్యాపనవిధి నేర్పుటకై నియమింపఁబడిన పాఠశాలలోని) శిక్షకురా లాగ్రామమునకు వచ్చెను. ఆమె రఖమాబాయిగారిని జూచి యామె మనసునం గలసంశయముల నన్నిఁటిని తొలఁగించి, కృష్ణాజీగారికి ధైర్యము చెప్పి వారందఱు పూనాకుఁ బోవునట్లు చేసెను.

వారుభయులు పూనాపట్టణమునకు వెళ్లి, వాటింగ్ డోరగారిని దర్శించి డాక్టరు జాన్స్టనుగారు ఇచ్చినయుత్తరము వారి కిచ్చిరి. ఆయుత్తరమునందు దాదాజీగారి దురవస్థను స్పష్టముగాఁ దెలిపి, ఆయనకు సహాయము చేయవలసినదని వ్రాసియుండెను. దాదాజీగారి దురవస్థను ఆడోరగారు స్వయముగాఁ జూచి, తన

చేత నయినంత సహాయము చేసెదనని చెప్పెను. ఆదొరగారు రఖమాబాయిని కొన్ని ప్రశ్న లడిగి, ఆమె యిచ్చిన యుత్తర ములవలన నామె మిక్కిలి విద్వాంసురాలని గ్రహించి, 'ఇంటఁ జదువుకొని యింతవిద్యను సంపాదించినందునకు నీమెయే ప్రథ మోదాహరణమని నేఁ జెప్పఁగలను. అయినను, ఈమె యిచ్చట ఫీమేల్ ట్రేనింగ్ కాలేజుయొక్క [illegible]ంటుగారిని, (ముఖ్యాధ్యాపకను) దర్శించి, [illegible]ద్దనుండి యో[illegible] పత్ర మును సంపాదించినపక్షమున [illegible]క్కలి యుపయోగకర[illegible]ము.' అని చెప్పెను.

దొరగారి యనుమతిప్ర[illegible]రము, రఖమాబాయిగారు, [illegible]నా ఫీమేల్ ట్రేనింగ్ కాలేజుయొ[illegible] యధికారిణి యగు మిస్ [illegible]మ్. ఆర్. మిచల్ దొరసానిగారిని [illegible] ఆమెకుఁ [illegible] నెఱిఁ గించెను. ఆదొరసానిగారు మిక్కి[illegible] గనుక, రఖమాబాయిగారి దురవస్థకు మిక్కిలి చింతించి, ఆమెయొక్క విద్యావినయాదిగుణముల కెంతయు మెచ్చి, ఆమెను పరీక్షిం చెను. పరీక్షించి రఖమాబాయిగారి విద్యాప్రవీణతకు సంతసించి, 'నీకు సంపూర్ణముగా విద్య వచ్చుననుటకు సందేహము లేదు. కాని యిచ్చటి కాలేజియొక్క నియమానుసారము, నీవీ కాలేజి లోఁ గొన్నిరోజులయిననుండనిది యోగ్యతాపత్రిక యిచ్చుటకు వీలులేదు.' అని చెప్పెను. అప్పుడు రఖమాబాయి యాపాఠ శాలలో కొన్నిరోజు లుండుటకు సమ్మతించెను.

ఇట్లు కొన్నిరోజులు భార్యాభర్త లిరువురును పూనాపట్టణము ననే నివసించియుండిరి. కాని కాలేజునందు రఖమాబాయిగారు

క్రొత్తగా నేర్చుకొనుసంగతి యేమియు లేకపోయెను. కాన నామె కొన్నిరోజులు వృథాకాలక్షేపము చేయవలసివచ్చెను. ఈక్రొత్త మార్పువలన నామె మనసు అస్థిరమై యేమియుఁదోఁచక యెట్లో కాలక్రమణ చేయుచుండిరి. వారి కుటుంబమునకు అచ్చటి నీరు పడనందువలన వారి దేహము లెప్పుడును అస్వస్థముగానే యుండెను. ఇంతలో రఖమాబాయిగారు గర్భవతియైనందువలన నీళ్లాడుటకు సెలవు తీసికొని యెచ్చటికైనను పోవలయు నని నిశ్చయించిరి. ఇంతలో, బొంబాయిపట్టణమున జ్యూమతస్థులచే స్థాపింపఁబడిన పుత్రీపాఠశాలకుఁ బ్రధానోపాధ్యాయిని కావలసి వచ్చెను. ఆస్థలమునకు రమ్మని రఖమాబాయిగారిని విశేషముగా బలవంత పెట్టసాగిరి. మిచల్ దొరసానిగారుగూడ ఆస్థలమును స్వీకరింపవలసినదని రఖమాబాయిగారికి నుపదేశించిరి. పూనా పాఠశాలలోని పరీక్ష యప్పటికి చాలకాల మున్నందువలన రఖమాబాయిగారు ఆపనికి నొప్పుకొని పూనాపాఠశాలలో నొక సంవత్సరపు సెలవు తీసికొని ముఖ్యోపాధ్యాయినిగా బొంబయికిఁ బోయెను. అచ్చటికిఁ బోయినప్పుడు ఆమెకు సూపరింటెండెం టయిన మిచల్ దొరసానిగా రొక యోగ్యతాపత్ర మిచ్చెను. ఆపత్రికవలన మిచల్ దొరసానికి రఖమాబాయిని గుఱించి గల గౌరవాభిప్రాయము వ్యక్త మగుచున్నది. కావున నాపత్రిక నిచ్చట నుదాహరించెదను:—

"పూనా. ౨౭ వ డిసెంబరు ౧౮౮౧.

"ఈ పత్రికావాహినియగు సౌ॥ రఖమాబాయి కేళోకరు, పూనాపట్టణముననున్న ట్రేనింగ్ కాలేజిలోఁ గొన్నిరోజులవఱకు

నధ్యయనము చేసినది. ఆమె నేర్చుకొనవలసిన సంగతులన్నియుఁ బూర్తిగా నేర్చుకొనె నని చెప్పవచ్చును. పునాపట్టణపు గాలి యామె శరీర ప్రకృతికి సరిపడనందున నేను ఆమెకు, జీతము (విద్యార్థి వేతనము) లేనిపద్ధతిమీఁద నొకసంవత్సరము సెల విచ్చితిని. ఈమె యత్యంత సద్గుణసంపన్నురాలును, శ్రేష్ఠమైన ఆచరణపరాయణురాలును అయి, జ్ఞానసంపాదనయం దాసక్తి కలదియై యున్నది. ఈమె సర్వోత్కృష్ట మగు ఉపాధ్యాయిని అగునని నాయొక్క యభిప్రాయము."

(దస్కతు) ఎమ్. ఆర్. మిచల్.,

లేడీ సూపరింటెండెంటు, ఫీమేల్ ట్రేనింగుకాలేజి, పూనా.

విద్యానిధి యని పేరొందిన మిచల్ దొరసానివద్ద నుండి యిట్టి స్తోత్రపత్రిక సంపాదించునంతవిద్య సంపాదించిన రఖమాబాయిగారి పరిశ్రమను మన మెంతయుఁ గొనియాడవలసి యున్నది. ఇంటిపను లన్నియు మగనిచేఁ జేయించి, యీామె యింతజ్ఞానము సంపాదించె నని కొందఱు వికటతార్కికులు అనెదరేమో. అట్లనుకొనుట గొప్ప తప్పు. ఇంటిలోనిపనియంతయుఁ దానే చేసికొని, పిల్లలను తానే సవరించుకొని, మిగిలినసమయములోనే రఖమాబాయిగా రింతవిద్య నేర్చుకొనిరి. విద్య నేర్చుకొనుచున్నానని గృహకృత్యములయం దలక్ష్యము చేసినదికాదు. మొదటినుండియు ననఁగా వీరిస్థితి బాగున్నప్పటినుండియు, రఖమాబాయి స్వయముగా నింటిలోని కార్యముల నన్నింటిని చక్కపెట్టుకొను చుండెను. ఇట్లింటిపనియంతయు తానేచేసి, తనపాఠములను చదువును. ఇందువలన, రఖమాబాయిగారు తమ ఆయు

ష్యములోని యొకగడియ యైనను వ్యర్థపుచ్చక, ప్రతినిమిష మును సత్కార్యమునందే వినియోగించుచుండిరని స్పష్టము గాఁ దెలియవచ్చుచున్నది.

స్త్రీవిద్య యక్కఱలేదు అని చెప్పెడివారెల్లప్పుడును, స్త్రీల కింటిలోఁ గార్యము లనేకము లుండును కాన వారికిఁ జదువుకొనుటకు వ్యవధియే దొరకఁజాలదు; అని యాక్షేపించుచుందురు. కాని యిది దురాక్షేపణయే యని రఖమాబాయిగారి యుదాహరణమువలన స్పష్ట మగుచున్నది. ఇదియునుగాక, కొంచెముగా నాలోచించిచూచినయెడల నీయాక్షేపణయందు సత్యాంశ మెంత మాత్రమునులేదని విశద మగును. ప్రొద్దున లేచినప్పటినుండియు, రాత్రి నిదురింపఁబోవువఱకు ఇంటిపనులే చేయుచున్న స్త్రీలీదేశ మున నేమి యేదేశమున నేమి చాల లేరనియు, ఇట్టి స్త్రీలుండు ఆవశ్యకతయు లేదనియు, అందఱికిఁ దెలిసినవిషయమే. అత్యంత దరిద్రులై జీవనము కొఱకు నింటిలోని స్త్రీలును పురుషులును భిక్షాటనమో కూలిపనియో చేయుచున్న అతి దరిద్ర కుటుంబ ములలోని స్త్రీలకుఁ దప్ప, సాధారణస్థితిగల ప్రతిగృహములోని స్త్రీలకుఁ బొరుగిండ్ల పెత్తనములు చేయుటకు అధమపక్షము రెండుమూడుగంట లయిన వ్యవధియుండునని మన మెఱుఁగుదుము కదా? ధనవంతులయింటి స్త్రీల కేమియుఁ బని యుండదనియు, వారుకాలిపైకాలువేసికొని దినమంతయు ముచ్చటిపురాణాములు చెప్పుచుందు రనియు విశ్వవిఖ్యాతమే కదా? వీరికి దినమంతయు వ్యవధియే యని చెప్పవచ్చును. పైని చెప్పఁబడిన నిరుపేద స్త్రీలను చదువుకొనుఁ డనియెవరును చెప్పలేదు. వారిపురు

షులును విద్యాశూన్యు లయియే యుందురు. మన దేశమునందలి పరోపకారులు వీరికొఱకు రాత్రి పాఠశాలలను స్థాపించువఱకు వీరు అజ్ఞానములోనే యుండవలసిన వారు. ఇందుకు ఉపాయము లేదు. కాని మధ్యమస్థితి గలయాఁడువారును, ధనవంతుల యింటి స్త్రీలును ఏల చదువుకొనఁగూడదో తెలియకున్నది. ‘ఎల్లమ్మ గారి యింట గోంగూర వండిరి. పుల్లమ్మగారియింట పులుసు కూర వండిరి ” అని రాజకార్యములు చేయుటకంటె విద్య నభ్యసించుట శ్రేయస్కరముకాదా? రోజు రెండుగంటలు చదువుకొని సంస్కృతమువంటి కఠినభాషలోఁ బ్రవీణు లైనవారనేకులుగలరు. కనుక మన దేశములోని స్త్రీలు కాలము వ్యర్థపుచ్చక విద్య నేర్చుకొనినయెడల వారు ఏవిద్యలోఁ బడిన నావిద్యలోఁ బ్రవీణులు కావచ్చును. కనుక పైయాక్షేపణ నిరాధారమయినది యనియే చెప్పవలసియున్నది.

బొంబాయియందుండు ‘ఆంగ్లోజ్యూస్సు అసోసియేషన్’ యొక్క బాలికాపాఠశాల మిక్కిలి విస్తీర్ణముగానుండి, అందు మూఁడు వందలకంటె నధికముగ బాలికలు చదువుకొనుచుండిరి. వారికి విద్య చెప్పుటకు ముగ్గురుపాధ్యాయినులుండిరి. బాలికలకు విద్య నేర్పుటయందదివఱకు రఖమాబాయిగారికి ననుభవము లేకుండినను, ఆమె యాపనిని శ్రద్ధవహించి చేసెను. బాలికలకుఁ జక్కఁగా చదువు చెప్పుటయందుఁ బ్రసిద్ధి వహించి, అసోసియేషన్ వారివలన నత్యుత్తమప్రశంసపత్రిక పుచ్చుకొనెను. అచ్చట నున్నస్వల్పకాలములోనే యామె తనసద్గుణములచే సకలజనులకుఁ బూజ్యురా

లయ్యెను. అందువలన నామె యీపాఠశాల విడుచునప్పుడు జ్యూయిష్‌కమిటీవారు, ఆమెవియోగమున కెంతయుఁ జింతిల్లిరి.

బొంబాయిలో నున్నకాలముననే, ఆమె ప్రసవకాలము గడచి, బాలింతతనము సమాప్తియయి, పూనా ట్రేనింగుకాలేజి యొక్క చివరపరీక్షకు వచ్చి యందు నామె యుత్తమోత్తమ ముగా కృతార్థురా లాయెను. ఈక్రింది యోగ్యతాపత్రికవలన నామె విద్యావైభవము తెలియఁగలదు.

"ఫీమెల్ ట్రేనింగ్ కాలేజి, పూనా." ౧౬ మార్చి ౧౮౮౩.

"ఇందువలనఁ దెలియఁజేయుట యేమనఁగా, సౌ॥ రఖమాబాయి కేళోకర్, పూనా ఫీమెల్ ట్రేనింగ్ కాలేజిలోని అత్యుచ్చమయినపరీక్షయందు, అత్యంతోత్తమముగానే, ప్రథమతరగతిలోను కడ తేరినది. మఱియు నీమె మంచి సద్గుణవతియు, అప్రతిమ పదాచరణపరాయణయు, మంచి యుపాధ్యాయినియు నయి యున్నది. ఈమె యిప్పుడు కాలేజి విడిచి పోవుచున్నదిగాన, ఈకాలేజితో సంబంధించినవా రందఱును ఆమెను అభినందించు చున్నారు."

(దస్కతు) ఎస్. ఆర్. మిచల్,

లేడిసూపరింటెండెంటు, ఫీమెలు ట్రేనింగుకాలేజి, పూనా.

ఈయోగ్యతాపత్రిక సామాన్య మయినది కాదు. ఈపత్రిక చూచినతోడనే రఖమాబాయిగారియొక్క విద్యావిశేషములను గాని సద్గుణములనుగాని విశేషించి వర్ణింపనక్కఱలేకయే యవి తేటపడఁగలవు. వెనుక నుదాహరించిన యోగ్యతాపత్రికయందును, ఈపత్రికయందును మనము ఆనందముతోఁ జూడవలసిన

సంగతి యొకటి గలదు. అదియేదనఁగా, మిచల్ దొరసానిగారు రఖమాబాయిగారిని కేవలము విద్యావైభవమును గుఱించియే నుతింపక, సద్గుణములను గుఱించియు విశేషముగాఁ బొగడియున్నది. ఇందువలన 'విద్యా దదాతివినయం' అన్న వచన మీమెయందు సార్థక మయినదని చెప్పుట కెంతమాత్రము సందేహము లేదు.

ఇట్లు రఖమాబాయిగారు పరీక్షయందుఁ గృతార్థురా లయి కొంతకాలము విశ్రాంతి పుచ్చుకొనవలయు నని తలఁచి యుండెను. కాని యింతలో కోలాపూరు దర్బారువారు, ఇంగ్లీషు దొరతనమువారిని ఒక యుత్తమోత్తమోపాధ్యాయిని కావలయునని యడిగిరి. అందుపై బొంబాయిసర్కారువారు సౌభాగ్యవతి రఖమాబాయిని తమవైపునుండి కోలాపూరుసంస్థానమునకు నిచ్చితి మని నియామకము చేసి ౫౫ రూపాయిలవేతన మిచ్చి రఖమాబాయిగారిని కోలాపురమునకుఁ బంపిరి. కోలాపురము చాల దూరమని మొదట రఖమాబాయిగారు వచ్చుటికిఁ బోవుటకు ననుమానించిరి. కాని మిచల్ దొరసాని మొదలయినవారు, ఆమెకు ధైర్యము చెప్పి, కోలాపురము సంస్థానమయినందువలన త్వరలో నీకు జీత మెక్కువై లాభము గలుగునని బోధించినందువలన నామె పోవుటకు నొప్పుకొనెను.

కోలాపురమునకుఁ బోయినతరువాత రఖమాబాయిగారిని మాతుశ్రీ ఆనందీబాయి రాణీగారికి విద్యనేర్పుటకు నియమించిరి. కాని కొద్దిరోజులలోనే మాతుశ్రీగారి భర్తయగు నాల్గవశివాజీ మహారాజుగారు గతించినందున నామెకు మిక్కిలి దుఃఖమును

ఔదాసీన్యమును గలిగి యామె విద్యాధ్యయనమును మానెను. అప్పుడు రఖమాబాయిని ఫీమెల్ ట్రేనింగుకు అధికారిణి యయిన, మిస్ లిటిల్ సూపరింటెండెంటుగారి చేతిక్రింద కోలాపూరులోని ఫీమెలు ట్రేనింగుకాలేజిలోఁ బ్రధానోపాధ్యాయినిగా నేర్పటిచిరి. అచ్చట నీమెచేతిక్రిందఁ బనిచేయువా రెవరును లేకపోయినను ఒక్కతెయే యన్నిపనులను నిర్వహింపుచుండెను.

౧౮౮౩-వ సంవత్సరమునందు రఖమాబాయిగారు క్రొత్తగా కోలాపురమునకు వచ్చినప్పుడు వీరికుటుంబమున కనేకములైన యిబ్బందులు కలిగెను. ఉండుటకు వారికి మంచియిల్లయినను దొరకినది కాదు. కాని అప్పు డచ్చట నున్న బర్వేదివాన్‌గారు, ఈ దంపతులకుఁ జాలసహాయము చేసిరి. పొలిటికల్ ఏజంటుగా రయిన కర్నల్ రీవసుదొరగారు, వీరికష్టములను జూచి కరుణించి పాఠశాలకు సమీపమున నున్నయొక సర్కారుబంగళా రఖమాబాయిగారికి నుండుట కిప్పించిరి. ఇట్లు రఖమాబాయిగారి సచ్ఛీలమునుజూచి, అందఱును ఆమెను మన్నించుచు, సత్కరింపుచుండిరి.

రఖమాబాయిగారివర్తన మత్యంత సరళముగా నుండును. మాటలయం దేమి ప్రవర్తనమందేమి నగలు అన్నమాట యామెకు తెలియదు. ఆమెయొక్క సరళత చూచి తీరవలయునే గాని యిట్టిదని యెంత వర్ణించినను సంపూర్ణముగాఁ దెలియఁ జాలదు. ఆమె యెల్లప్పుడును తనకర్తవ్యమునందే చిత్తము గలిగి యుండును. ఇతరమైన యధిక ప్రసంగముల కెన్నడును పోదు. ఆమెను క్రొత్తఁగాఁ జూచువారు, ఆమె సరళతనుజూచి, ఆమె

యెవరో సాధారణపు స్త్రీ యని యెంచుదురేగాని యంత గొప్ప విద్వాంసురాలని సంశయింపఁజాలరు. గణితము, వ్యాకరణము, ఇతిహాసము మొదలగు గహనమైన శాస్త్రములయందు నీమెకుఁగల మార్మికపరిజ్ఞానమును జూచి, ఈమె శారదాదేవి యొక్క యపరావతారమా యేమియని సంశయింపవలసి యున్నది! బాలికలకుఁ జదువుచెప్పెడి యుపాధ్యాయినులకు నుపాధ్యాయినియైన రఖమాబాయిగారి విద్యాతిశయము వేఱుగా వర్ణింపవలెనా? కావ్యములయందును, కుట్టుపనియందును, ఈమెకు విశేషప్రీతికలదు. ఈమెశిష్యురాండ్రు నలువు రీమెవలెనే ప్రవర్తించుటకు యత్నించుచున్నారు. ఆహా! ఏమి యీమెభాగ్యము! మొదటమొదట, లేడీసూపరింటెండెంటయిన లిటిల్ దొరసానికి నీమె సద్గుణములు దృశ్యమానము లయినవికావు. కాని సుగుణములు చాలరోజులు దాఁగియుండవుగనుక, క్రమక్రమముగా లిటిల్ దొరసానిగారికి రఖమాబాయిగారి సద్గుణములు దృశ్యమై యామెయం దధికవిశ్వాసమును, భక్తియుఁ గలిగెను. ఈదొరసానిగారు సీమకు వెళ్లిపోవునప్పుడు, అడుగనిదే తాను రఖమాబాయిగారికి నొక యోగ్యతాపత్రిక యిచ్చినది. ఆపత్రిక యీచరిత్రముయొక్క తుదను ప్రచురించెద. ఆపత్రిక చూచిన యెడల నీదొరసానికి రఖమాబాయియందు నెంత గౌరవము కలదో తెలియఁగలదు. ఇట్లు స్వపరిశ్రమవలనను, స్వసద్గుణములవలనను, సదాచరణమువలనను, రఖమాబాయిగారు లోక ప్రఖ్యాతకు పాత్రురాలైరి.

ఇట్లు కొన్నిరోజు లయినతరువాత మిస్ లిటిల్ దొరసాని ఇంగ్లండు దేశమునకు వివాహనిమిత్తమై పోఁదలఁచి, తనయుద్యోగమును వదలుకొనెను. ౧౮౯౨వ సంవత్సరమున ఆగస్టునెలలో దొరసానిగారు తనపనిని వదలుకొని వెళ్ళిపోయెను. అప్పుడాగొప్పపని యెవరి కియ్యవలయునని సంస్థానాధీశ్వరునికి సంశయము గలిగెను. మిస్ లిటిల్ దొరసానిగారికి, నాలుగువందల యేఁబదిరూపాయలు జీతము, ఉండుటకు గొప్పబంగళా, కావలసిన పరిచారకులు, రెండుగుఱ్ఱములబండి, సంస్థానము వారిచ్చుచుండిరి. కోలాపురసంస్థానమునందుఁ గల బాలికాపాఠశాలలకన్నిఁటికిని, ఆమెయే యధికారిణిగా నుండెను. ఈపను లన్నియుఁ జేయుటకు ఇంగ్లీషుస్త్రీ తప్ప నితరు లెవ్వరును సమర్థురాండ్రు కారని బహుజనుల యభిప్రాయము. కనుక మరల నెవరినయిన ఆంగ్లేయస్త్రీని, దెచ్చి యాపని యియ్యవలెనని, సంస్థానములోని యధికారులు తలఁచిరి. కాని యట్టిపనులనేగాక యింతకంటె గొప్పపనులనుగూడ నిర్వహించునంత విద్యయు, సామర్థ్యమును రఖమాబాయిగారికిఁ గలవని కోలాపురములోని యనేకవిద్వాంసులకుఁ దెలియునుగనుక, ఆపట్టణమందలి విద్యావిలాసము, జ్ఞానసాగరము మొదలయినపత్రికలు, రఖమాబాయిగారికిఁ దప్ప నితరులకు సూపరింటెండెంటు పని యియ్యఁగూడదని, యధికారుల కుపదేశించెను. ఇట్లు పత్రికలు, రఖమాబాయి యోగ్యురాలని శ్రీమహారాజా ఛత్రపతిగారికి నివేదింపఁగా, వారును, దివాన్‌గారును, సభ్యులును ఆమోదించి, ఆసన్మానప్రద మయిన గొప్ప యుద్యోగము రఖమాబాయికి నిచ్చిరి. ఈమె కీయుద్యోగ మొక

యమూల్యభూషణమని చెప్పవచ్చును. ఈపతివ్రతాతిలకమునకు
లేడీ సూపరింటెండెంటు పనికంటెను అధికమయినపని యిచ్చి
నను శోభింపఁగలదని చెప్పుటకు సందేహము లేదు. కాని మన
దేశమున స్త్రీలకు నాలుగునూఱులుజీతముఁగాని, రెండుగుఱ్ఱ
ముల బగ్గీగాని, కావలసిన సేవకులఁగాని యెవరిత్తురు? లిటిల్
దొరసానికి మొదట నిన్నూఱు రూపాయిలు జీతముండెను. కాని
రఖమాబాయి హిందువుగనుక నామెకు మొదటనూఱు రూపాయి
లే చాలునన్నారు. జీత మెంతయినను, అధికారము రఖమాబాయి
గారి కిచ్చినందుకుఁ గొల్హాపురాధిపతిని మనము కొనియాడవలసి
యున్నది. రఖమాబాయిగారికి నిట్టియధికార మిచ్చి మహారాజు
గారు, ఆమెనే కాక హిందూసుందరుల నందఱిని సన్మానించిరని
చెప్పుటకు సందేహము లేదు. ఇటులనే యితరమహారాజులును,
తమతమ రాజ్యములలో స్త్రీవిద్యాభివృద్ధిని జేయుదురుగాక.

ఇప్పుడు రఖమాబాయిగారికి దొరకిన యధికారము బహు
గొప్పదియు, మాన్యత గలదియు ననుటకు సందేహము లేదు.
కాని యిందునుగుఱించి యామెకు లేశమాత్రమైన అభిమానము
ను, గర్వమును లేదు. తానొకశ్రేష్ఠురాలననిగాని, ఇతరులు తన్ను
సన్మానించవలెననిగాని యీమెకు నెప్పుడును తోఁచక, ఈమె
యెల్లప్పుడును మర్యాదను విడువక స్వకార్యమునందు దక్షు
రాలై యుండును. ఆమె యెల్లప్పుడును గృహిణికి శోభించునట్టి
బట్టలనే ధరించును. ఇంగ్లీషువేషముగాని, బూట్లు, మేజాళ్ళు,
మొదలైన వానిఁగాని యెన్నఁడును ధరించదు. ఈమె పాఠశా
లలోఁ జదువు చెప్పునప్పు డెవరైనఁ బురుషులు పాఠశాలఁ

జూడవచ్చినయెడల కుర్చీమీఁదనుండి లేచి నిలువఁబడును. కూర్చుండవలసినదని వారంతగా బలవంతపెట్టినయెడల, అచట బల్లమీఁదఁ గూర్చుండును. స్త్రీకి స్వాభావిక మైనమర్యాదను విడిచి యెప్పుడును పురుషులతో మాటలాడదు. ఇటుల నెల్లప్పుడును వినయాదిసద్గుణము లామెను సేవించుచునే యుండును.

విద్యవలన స్త్రీలు దాంభికురాం డ్రగుదురనియు, అవిధేయ లగుదురనియు, వారికిఁ స్వాభావికము లయినవినయమర్యాదాది సద్గుణముల నతిక్రమించెదరనియు, తమ విద్యాతిశయముఁ జెప్పుకొని మురియుచు గర్విష్ఠురాం డ్రగుదురనియు, స్త్రీవిద్యాద్వేషు లొత్తియొత్తి చెప్పెదరు. ఈమాటలన్నియు శశశృంగముల వలెను, ఆకాశపుష్పములవలెను, అత్యంతాభావములని సప్రమాణముగా స్థాపించుటకుఁ గాంబోలును సౌభాగ్యవతి రఖమాబాయి గా రవతరించిరి. గర్వమనుదుర్గుణము 'విద్య' యను సద్వస్తువునం దెట్లుపుట్టునో తెలియకున్నది. గర్వము స్వతంత్రమైన యొకదుర్గుణము. అది విద్యావంతులయందేగాని, తక్కిన యితరుల యందుఁ గానుపించదని లేదు. విద్యావిహీనునియందుఁగూడఁ గానుపించును. అక్షరశూన్యుఁ డయిన మంగలిమంగాయకు, చాకలి సరవాయకు, కమ్మరిగుండాయకు గర్వ మనుదుర్గుణము లేదని చెప్పుట కెవ్వరు సాహసింతురు? అక్షరశత్రువు లైన ఆచారపు అన్నమ్మ, చేదస్తపు చెలమమ్మ లందఱును గర్వము లేనివారేనా? ప్రాయికముగా అక్షరసహితులకంటె నక్షరరహితులే యెక్కువ గర్విష్ఠులుగ నుండుదురు. ఇట్లుండుటచే గర్వ మను దోషము స్త్రీవిద్యయం దారోపించుట యుక్తమై యుండలేదు.

ఎచ్చటనైన విద్యాధికులయిన పురుషులేమి, స్త్రీలేమి, గర్వము
గలవారుగాఁ గానఁబడిన, అది వారిస్వభావదోషమో, లేక
సాంగత్యదోషమో అయియుండును, గాని విద్యాదోషము కానే
రదు. ఇదియునుగాక యిట్టిగర్వమున కింకొకచిన్నకారణము
గలదు. కొద్దిగా సూక్ష్మవిచారము చేయువారికి ఆకారణము తెలి
యఁగలదు. తనకు రెండుకాళ్లును, రెండుచేతులును గలవని గర్వ
పడినమనుజుల మన మెన్నఁడయినఁ జూచితిమా? లేదు. ఇందుకుఁ
గారణమేమి? అందఱు మనుష్యులకును రెండుకాళ్లు, రెండుచే
తులు ఉండుటవలన అందునగుఱించి యెవ్వరును గర్వము వహిం
చుటకుఁ గారణములేదు. అనఁగా నితరులకంటెఁ దమలో నేమైన
నాధిక్యము గలిగినఁగాని, మానవుఁడు గర్వము వహించఁడు.
కనుక పురుషులలో నేమి, స్త్రీలలో నేమి యొకరిద్దఱికి విద్య
నేర్పినయెడల గర్వము గలుగుట సంభావ్యము. కాని వారిలో
ననేకులకు విద్య నేర్పినయెడల గర్వమునకు స్థానమే యుండదు.
మొదట ఇంగ్లీషువిద్య యీ దేశమునందు ప్రారంభమయినప్పుడు,
ప్రవేశపరీక్షలోఁ గృతార్థులయినవారు. ధన్యుల మనుకొను
చుండిరి. ఇప్పు డదేవిద్య ననేకులు అభ్యసించుటవలన, ఈకాల
మునందుఁ బట్టపరీక్ష యిచ్చినవారికిఁగూడ గర్వమున కవకా
శములేక యున్నది. కనుక స్త్రీవిద్యచే స్త్రీలు గర్వితలగుదు
రేమో యని భీతి యున్నచో, అందుకుఁ దగినయుపాయము
స్త్రీలకుఁ జదువు చెప్పకయుండుట కాదు. స్త్రీవిద్యను ప్రోత్సా
హపఱిచి, బాలికాపాఠశాలలను వృద్ధిచేసి, జనానాస్త్రీలకుఁ
జదువుచెప్పుటకుఁ దగినస్త్రీలను నియమించి, అనేకస్త్రీలకు

విద్యాదానము చేయుటయే విద్యవలనఁ గలుగు నన్న గర్వమును అణఁచుటకు నుత్తమోపాయము. ఇట్లనేక స్త్రీలలో బహువిద్యాప్రసార మయినయెడల, ఒకరికంటె నొకరు విద్యావతు లయినందున, గొప్పవిద్య రాని స్త్రీల కెవరికిని గర్వము కలుఁగనేరదు. గొప్పవిద్య వచ్చినవారికిని గర్వ ముండఁబోదు. ఎందుకనఁగా గొప్పవిద్యను సంపాదించి, మహాపండితు లనియు, విద్వాంసుల నియు నేటివఱకుఁ బేరొందినవారిలో నెవరో కొందఱు తప్ప, అందఱును వినయశీలు రని విఖ్యాతిఁ జెందిరి. కనుక విద్యవలన స్త్రీలకు భూషణప్రదము లయిన వినయమర్యాదాదిగుణములు లోపించక, అధికసంస్కృతము లయి వెల్లడిల్లునని చెప్పకతప్పదు.

కోలాపురములోని బాలికాపాఠశాలలును, బావడేయన్న గ్రామములోని బాలికాపాఠశాలలును, సరిగా జరుగుచున్నవా లేదా యని పరీక్షించుటకు సౌ. రఖమాబాయి ప్రతిదినమును, బగ్గీ మీఁద నెక్కి యాయాపాఠశాలలకు వెళ్లుచుండును. వెళ్లినప్పుడు వెంబడిని మిఠాయి, బొమ్మలు మొదలయినపదార్థములు తీసికొని పోయి, పాఠశాలలోని చిన్నబాలికలకు నిచ్చి, విద్యయందు వారికి నభిరుచి పుట్టించును. కొద్దిగాఁ బెద్దబాలికలతోఁ బ్రియోక్తులు పలికి వారికి విద్యాప్రభావము బోధించుచుండును. ఈమె బాలికలకుఁ జేయుబోధ బహుశ్రావ్యముగనుండును. ఆఁడుపిల్లల తల్లులతో మాటలాడునప్పుడు, వారిపిల్లలను పాఠశాలలకుఁ బంపుట విషయమయి వారుస్వయముగా విద్య నేర్చుకొనుటను గుఱించి బోధించి, వారిమనసు త్రిప్పుచుండును. ఎప్పుడయిన నాదివా

రమునాఁడు సభ్యస్త్రీలను పేరంటమునకు తనయింటికిఁ బిలిపించి, వారికి ననేకసంగతులను బోధించుచుండును.

ఈమె యింతయధికారసంపన్నురా లయినప్పటికి పాఠశాల పని కాఁజేసికొని యింటికి వచ్చినతరువాత నీమె నెవరయినఁ జూచినయెడల ఇంతయధికారము గలస్త్రీయని యనుకొనఁజా లరు. ఈమె యుద్యోగము చేయుననికూడ నెవరికి సంశయము రానేరదు. ఇంటికి రాఁగానే యుద్యోగపు దుస్తులు తీసి విడిగా నుంచి, వేఱుబట్టలు గట్టుకొని యీమె యింటిపనులు చేయుట కారంభించును. ఒకవంటకత్తెను ఇద్దఱు ముగ్గురు సేవకులను బెట్టుకొని యన్నిపనులు వారిచేఁ జేయించి, తాను సుఖముగా కూర్చుండునంతధనము ఈమెకు నీశ్వరుఁ డిచ్చియున్నాఁడు. కాని తా నట్లు చేసినయెడల, విద్య నేర్చినస్త్రీలు సోమరిపోతు లగుదు రన్న నిరాపనింద స్త్రీవిద్యయందు నారోపింపఁ బడునని తలఁచి, యీగృహిణీలలామ, యింటిలోనివంట, పిల్లలకును పతికినిఁ గావ లసిన బట్టలు స్వయముగాఁ గుట్టుట, మొదలైనయింటిలోని పను లన్నియు స్వయముగాఁ జేయుచుండును. కేవలము విద్యలో నేగాక, కుట్టుపని, ఉన్నితో అల్లిచేసెడిపనులు, స్వయంపాకము మొదలయినవానియందుఁగూడ నీమెకు నధికప్రవీణత గలదు! భిన్నభిన్న దేశములలోని పక్వాన్నములు రుచిగా వండుట యీ మెకుఁ దెలియును. ఇంతియకాక, శిశువులను బోషించుట, వారి యారోగ్యరక్షణము చేయుట, వారికిఁ దగిన యౌషధంబు లిచ్చుట సశాస్త్రముగాఁ బురుడుపోయుట మొదలయినపనులు

గూడ నీమెకుఁ దెలియును. ఇట్లు సంసారమున కత్యంతావశ్య కంబు లయినపను లన్నియు నీమె యెఱుఁగును.

ఈమె ప్రతిదినము బాలికాపాఠశాలల నన్నిఁటిని జూచి, ట్రేనింగు కాలేజు చూచుటకు వెళ్ళును. సమయ ముండిన యెడల నచ్చటియుపాధ్యాయినులకుఁ గొంతసేపు తాను స్వయముగాఁ జదువు చెప్పును. బాలికాపాఠశాలలకొఱకు నామె చేసిన నిబంధనలు బహుబాగుగనున్నవి. బాలికల కెవరికిని దేహదండన చేయక, వారిని లాలించి, బుజ్జగించి, బహుమానముల యాశ చూపి చదువు చెప్పవలెనని రఖమాబాయిగారు నియమించిరి. దెబ్బలు కొట్టనిదే పిల్లలకుఁ జదువు రాదనినమాట రఖమాబాయిగా రబద్ధముచేసిరి. పాఠశాలలయందుఁ జదువు పిల్లలయొక్కయు, చదువుచెప్పెడి యుపాధ్యాయినుల యొక్కయు, ఆచరణయు నీతియు స్తోత్రార్హముగా నుండవలయునని యామె యెల్లప్పుడును యత్నించుచుండును. దుర్నీతియే జీవనముగాఁ గలవేశ్యాంగనలును, కొందఱు నీతిమాలిన నీచజాతిస్త్రీలును, విద్యార్థివేతనము దొరకు నన్నయాశచే పాఠశాలలోఁ జదువు కొనుటకు వచ్చుచుండిరి. కాని వీరివలన నితరబాలికలు చెడుదురని అవివాహిత లైనయెడల తండ్రివద్దనుండి యోగ్యతాపత్రిక, వివాహితలయిన యెడల పెనిమిటివద్దనుండి యోగ్యతాపత్రిక తెచ్చినఁగాని యెవరిని బాలికాపాఠశాలలోనికిఁ జేర్చుకొనవలదని రఖమాబాయిగారు నియమించిరి. ఇట్లీమెచేతిక్రింద నున్న బాలికాపాఠశాలలలో నెల్లప్పుడును విద్యావృద్ధియు, నీతివృద్ధియు జఱుగుచుండును. ఈపాఠశాలలలోని బాలికల సత్ప్రవర్తనయు, విద్యా

కుశలతయు, అక్షరసౌందర్యమును,' జూచి మన దేశములోని బాలిక లింత యోగ్యురాం డ్రయిరి యని మనమున కత్యంతా నందము కాకమానదు; వారి నింతవారిని జేసిన రఖమాబాయి గారి యెడలఁ బూజ్యభావము గలుగక పోదు.

ఉద్యోగసంబంధమునరఖమాబాయిగారు సేయుపనులను ఇది వఱకు వర్ణించితిని. ఇఁకనింటియందలియామెదినచర్యవిషయమయి కొంచెము వ్రాసెదను. ఈమెయొక్క యుద్యోగశీలతను జూచి లోకులు మహాశ్చర్యమును బొందుదురు. ఈమె యెప్పుడును ఇంటివద్ద నూరక కూర్చుండియుండదు. సదా సర్వకాల మేద యినపని చేయుచుండును. ఈమెకు నైదుగురు ఆఁడుపిల్లలును, నలుగురు మొగపిల్లలును గలరు. ఇంతపరివారమును ఈమె స్వయముగాఁ బోషించుచుండును. ఇంట వంటలక్క లేదనియు నీమెయే వంటఁ జేయుననియు వెనుకనే వ్రాసియున్నాను. వంటలక్కలు తిన్నగా, రుచిగా, స్వచ్ఛముగా వంటచేయరనియు, వస్తువు లను దొంగిలించి నాశము చేసెదరనియు, వారితో తగవులాడుచు నుండవలెననియు, కనుకనే మనమే వండుకొనిన మేలనియు నీమె యభిప్రాయము. 'నే నే స్వయముగ వంట చేసికొనని యెడల నాకు అన్నము రుచిగాను యుండదు' అని ఆమె చెప్పును. ఇట్లు ఉద్యోగమునుండి రాఁగానే యింటిపనియందును, ఇంటిపని అ యినతోడనే ఉద్యోగమునందును రఖమాబాయిగారు నిమగ్న రాలయియుండుదురు. మధ్యాహ్నము కొంచెము విశ్రాంతి కొఱకు నింటికి వచ్చినప్పుడును, ఆమెకు విశ్రాంతి దొరకదు. ఉపాధ్యాయినులును, ఇతరసేవకులు మొదలైన వారు, సెలవు

లడుగుకొనుటకు, జీతము హెచ్చింపుమని యడుగుకొనుటకు, ఇత రములైన మొఱలు చెప్పుటకు, అవిశ్రాంతి సమయములోనే యామెవద్దికి వచ్చుచుండెదరు. వీరికి సెలవులిచ్చి, వారిస్థల మున నింకొకరిని నియమించి, తగినయేర్పాట్లు చేయుటకే విశ్రాం తికాల మంతయును సరిపోవును. ఈపనిగాక యింటిపనులును అనేకము లుండును. చిన్నచిన్నపిల్లలను పెంచుట యెంతకష్టమో పిల్లలు గలమాతలకే వేద్యము. ఒకపిల్ల కావురు మన్న, రెండవ పిల్ల బావురు మనును. నేడు వీనికి రోగము వచ్చిన, రేపు వానికి రోగమువచ్చుగా. ఇటుల నత్యంతకష్టప్రద మయినను రఖ మాబాయిగారు శిశుసంరక్షణ మత్యంతజాగరూకతతోఁ జేయు చుండును; వారికి విద్యాబుద్ధులు చెప్పుచుండును; వయోమాన మును గుర్తెఱిఁగి వారివారికిఁ దగినవిద్య నేర్పుచుండును. ఈమెను జూచుటకు గ్రామములోని పెద్దమనుష్యులభార్యలు పలువురు వచ్చెదరు. వారితో మాటలాడుటయందును, ఆమాటలలో స్త్రీవిద్య, బాలసంగోపనము మొదలయిన విషయములను గుఱించి యుపదేశము చేయుటయందును గొంతకాలము గడ చును. ఇట్లీమెకాలమంతయు స్త్రీవిద్యాభివృద్ధిని జేయుటయందే వినియోగ మగుచుండును.

ఇతరుల బాలికలకు విద్య చెప్పెడి విషయమై రఖమాబాయి గా రధికముగాఁ బరిశ్రమపుచ్చుకొనియెద రని చెప్పినందువలనఁ దమకన్యల కెంత శ్రద్ధతో విద్య నేర్పెదరో చదువరులే యూహిం చఁగలరు. ఈకుటుంబమువలన నీదేశమునందు స్త్రీవిద్యాభివృద్ధి కావలయునని యీశ్వరసంకేత ముండినందునఁ గాఁబోలును.

మొదటి నాలుగు కానుపులకు నీమెకుం ఆఁడుపిల్లలే కలిగిరి. ఈనలు గురు బాలికలకు సౌ. రఖమాబాయిగారు సద్విద్యయును నీతియుఁ గఱపినారు. వీరిలోఁ బెద్దవారయిన సౌ. ద్వారకాబాయియు సౌ. కృష్ణాబాయియుఁ బ్రథమశాస్త్ర పరీక్షయందుఁ గృతార్థురాం డ్రయి, యిప్పుడు బొంబాయిలోని వైద్యవిద్యామందిరమునందు ఎల్. ఎమ్. అండు ఎస్. అను వైద్యపరీక్షకుఁ జదువుచున్నారు. ఈపాఠశాలయందు వీరు అందఱకంటెఁ బ్రథమలుగానే యుం దురు. కొన్నిదినములక్రిందట శారీరశాస్త్రమునందు జఱిగిన పరీ క్షలో సౌ. ద్వారకాబాయిగారు మొదటినంబరును సంపాదించె నని వినుచున్నాము. ౧౮౯౫ వ సంవత్సరమున పూనాపట్టణము నందు దేశీయమహాసభ జరిగినప్పుడు, ఈయక్కచెల్లెండ్రు కోలా పూరుపట్టణమునుండి ప్రతినిధులుగా నామహాసభకు వచ్చియుం డిరి. వీరెల్లప్పుడు తమ యాచరణమునందుఁ దల్లినే యనుసరించె దరు. మూఁడవ నాల్గవ కన్నియలైన సౌ. యమునాబాయియు, సౌ. అహల్యాబాయియు పూనాపట్టణములోని ఫీమెల్ హైస్కూ లులో (స్త్రీలకు ఉన్నతవిద్య నేర్పుటకు పూనాయందు స్థాపిం చఁబడిన పాఠశాలయందు) చదువుకొనుచున్నారు. కొన్నిరోజుల క్రిందటఁ జిన్న కొమార్తె గణితములోని పరీక్షలోని మొదటిసంఖ్య సంపాదించెనఁట! ఇదే ప్రకారము చిన్న చిన్న పిల్లలవి ద్యనుగుఱించి సౌ. రఖమాబాయిగారు శ్రద్ధ వహించి, వారికిఁ జిన్నప్పటినుం డియు సుగుణములను ఉగ్గు త్రాగించుచుండును. పిల్లలకు, పెని మిటికి, తనకుఁ గావలసిన బట్టలన్నియు నీమె స్వయముగా నింటనే కుట్టును. ఎండకాలపు సెలవులలోఁ బిల్లలందఱును ఇంటికి

వచ్చినప్పుడు, సంవత్సరమునకుఁ గుటుంబమునకు సరిపోవు నన్ని
బట్టలు, వారిసాహాయ్యముచేఁ గుట్టి యుంచును. ఇంటిపనులన్ని
యుఁ జేసివేళ దొరకినయెడల వృత్తాంతపత్రములను, మాసపత్ర
ములను, నూతనగ్రంథములను జదువుచుండును. ప్రతిదినము క్రొత్త
దేమయినఁ జదువనియెడల నామెమనసు వికాసముగానే యుండ
దఁట! ఈమె వంటచేయుచున్నపుడును, ఇతరమైనపనులు చేయు
చున్నపుడును, డాక్టరు కృష్ణాజిగారు లేక యీమెపుత్రికలలో
నెవరయిన, ఈమెకు సద్గ్రంథ మేదయినఁ జదివి వినిపించెదరు.
ఇట్లీ యద్వితీయగృహిణీలాలమ, యొకక్షణమయిన వ్యర్థపుచ్చక
స్వపరజ్ఞానాభివృద్ధిఁ జేయుచుండును.

జ్ఞానార్జనము చేసినస్త్రీలు గృహకృత్యములను జేయరనియు,
శిశుపోషణముచేయ రనియు, మగవారికి నాఁడువారిపనులుఁ చేయ
వలసివచ్చుననియు స్త్రీవిద్యానిందకులు చెప్పుదురు. కాని, యీ
మాట లన్నియు మత్సరజన్యములేకాని, సత్యములుకావనియు,
రఖమాబాయిగారిప్రవర్తనము వేయినోళ్ళఁ జెప్పుచున్నది. ఇట్టి
దురాక్షేపములు చేయువారు, ఈసంసారములోని సంగతు
లన్నియు మానవేచ్ఛప్రకారమే నడచుననియు, వానిని నడుపుట
యందు ఈశ్వరనియామక మేమియు లేదనియుఁ దలఁచెదరు
గాఁబోలును. ఇప్పుడు జగత్తులోని స్త్రీలందఱును దమతమ
పిల్లలను సంరక్షించుకొను చున్నందునకుఁ గారణము వారికి భార
తభాగవతములు చదువుట రాకపోవుటయేయని వీరి తాత్పర్యమా
యేమి? అందఱు స్త్రీలకు భారతభాగవతములు చదువుట వచ్చిన
యెడల జనవృద్ధి నేటితో నాగిపోవును గాఁబోలును! స్త్రీలు తమ

పిల్లలను ప్రేమించుటకుఁ బెద్ద వారిని జేయుటకు వారి యజ్ఞానము
కారణముగాక, ఈశ్వరుఁడు వారియం దుంచిన నైసర్గిక పుత్రవా
త్సల్యమే నిజమయిన కారణమని చెప్పవలయును. ఈవాత్సల్యము
పశువులయందుఁ బక్షులయందు క్రిమికీటకాదులయందు, పురుషుల
యందు, స్త్రీలయందు, విద్యనేర్చినవారియందు, విద్యనేరువనివా
రియందు, అందఱియందును ఉండును. ఇట్లు విశ్వవ్యాపక మైన
యీవాత్సల్యము విద్య నేర్చుకొనిన స్త్రీలయం దుండదనుకొ
నుటకు మాత్సర్యము తప్ప రెండవకారణము లేదు. ఇంతియు
కాదు. విద్యావతులు, విద్యలేని స్త్రీలవలెఁ దమపిల్లలను, ఎండకు
ఎండినట్టును వానకుఁ దడిసినట్టును ఉంచక, వారిపోషణయందును
ఔషధోపచారములందును విద్యాబుద్ధులయందును విశేష
దక్షులై యుందుదురని యు, రఖమాబాయిగారిచరిత్రమువలనఁ
దెలియుచున్నది. విద్య నేర్చినందువలన లలనలు ఇంటిపనులయం
దలక్ష్యము చేయుదురన్న మాటయు నమ్మఁ దగినది కాదు. ఇప్పుడు
సంసారము చక్కఁగాఁ జేయుసుందరీమణులకుఁ జదువుటయు,
లెక్కవేయుటయు, రానందువలననే వారు సంసారమునందు శ్రద్ధ
గలిగి యున్నారనియు, లేనియెడల వారు సంసారమును నాశము
చేసియుందు రనియు, చెప్పుట యెంత హాస్యాస్పదము! 'సతీహి
తబోధిని' 'గృహనిర్వాహకత్వము' 'స్త్రీధర్మరత్నభాండాగా
రము' 'కుమారీశతకము' 'మానినీశతకము' మొదలయినగ్రం
థములను జదివినందువలనను, ఇంటివెచ్చముల లెక్కలువేయుట
నేర్చుకొనినందువలనను, స్త్రీలు గృహకార్యములందు అధికతత్ప
రత వహించెదరో లేక తత్పరత వహింపకపోవుదురో సారాసార

విచారము గలచదువరులే యోచింపఁగలరు. అపాత్రదానము, చిఱుతిండి, చూచుటకు రమ్యముగానుండి గవ్వకయినఁ గొఱకాని యసత్యపునగలు కొనుట, లెక్క వేయుట రానందువలన సేవకుల మోసము కనుఁగొనలేక ధనమును బోఁగొట్టుకొనుట, ఆయ వ్యయములు ఎంతెంతయని చూచుటకు చేతఁగానందున ఆయమునకంటె నధికముగా వ్యయపఱచుట, మొదలయిన యజ్ఞానజన్య దోషము లన్నియు స్త్రీ విద్యవలనఁబోయి, స్త్రీలు సంసారసుఖమును వృద్ధి చేయుదురు గాని యెంతమాత్రమును సుఖహాని చేయఁజాలరు.

ఇంటియందు స్వచ్ఛత యుంచుటయందును, స్నానపానాదులయందు దేహారోగ్యమున కనుకూలముగా నడచుకొనుటయందును భోజనవిషయము మితముగా నుండుట యందును రఖమాబాయిగారు బహుదక్షురా లయియుండును. ఇందువలననే వీరి యింట రోగములు చాల అరుదుగా ప్రవేశించును. సౌ. రఖమాబాయిగా రన్న వ్యాధి అన్నమాటయే యెఱుఁగదని చెప్పుదరు. తనపిల్లలను పాఠశాలలోనిపిల్లలను స్వచ్ఛముగా నుంచి వారికి స్వచ్ఛతయొక్క యావశ్యకము బోధించుచుండును. స్త్రీవిద్యను గుఱించియు, పురుషవిద్యను గుఱించియు, ఈమె చాల విచారము చేసియున్నది. ఇందువిషయమయి యామెమనమునందనేకమైనయూహాలు కలిగియున్నవి. ఇప్పుడు పాఠశాలలయందుఁ జెప్పెడి పురుషవిద్యయందేమి, స్త్రీవిద్యయందేమి యనేకగ్రంథములను వ్రాయఁదలఁచి యున్నది. కాని మనదురదృష్టమువలన నామెకు గ్రంథరచన చేయుటకు సమయమే చిక్కక యున్నది.

ప్రాతఃకాలము ఆఱుకొట్టినప్పటినుండియు రాత్రిపదికొట్టువఱకు నామె యేదో యొకపనిలోనే యుండును.

తనకుఁ గలిగిన యమితవిద్యవలనను, విద్వాంసుఁడును రసికుఁడును అయిన భర్తయొక్క సహవాసమువలనను, ఈమె అత్యంత ఉన్నతములయిన మతములను (అభిప్రాయములను) గ్రహించినది. అయినను దేవుఁడు, దైవభక్తి, ముఖ్యములయిన వ్రతములు, మొదలయినవానిని విడిచినదికాదు. కాని, యీమె యన్నివ్రతములకంటెను 'పతిభక్తి' యను వ్రతమునే యెక్కువగ నెంచుచుండును. పతినిఁ బ్రత్యక్షదైవముగ నెంచి, ఆయనను సంతుష్టినిగ నుంచవలయునని యెల్లప్పుడును యత్నించుచుండును. నేఁడు రఖమాబాయిగారికి సౌభాగ్యమును, సంపత్తియు, సంతతియుఁ గలవు; గొప్ప యధికారముగలదు; రాజసంస్థానమునందు మాన్యతగలదు. ఇవి యన్నియుఁ జూచి ఈమె 'చాలసుఖి' యనికొందఱనుకొనియెదరు. కాని యీమె యిన్ని సంపద లుండినను సదామనసునందు విషాదముగనే యుండును. అందుకు, డాక్టరు కృష్ణాజీగారి అంగవైకల్యమే కారణమని చదువరు లిదివఱకే గ్రహించియుందురు. ఎల్లప్పుడును తనపతియొక్క హతాశస్థితి కనులయెదుట నుండుటవలన రఖమాబాయిగారు రేయుఁబగలును చింతామగ్నలయి యుందురు. గొప్పవిద్వాంసుఁడును, రసికుఁడును, గుణియు, తనహితకర్తయు, నయిన పెనిమిటి యింటఁ గూర్చుండుటయు, తాను ఉద్యోగము చేయుటయు, తన పేరే లోకులలోఁ బ్రసిద్ధిచి తన్నేలోకులు నుతించుటయు నీమె కెంతమాత్రమును నిష్టములేదు. ఆమె యప్పుడప్పు డిట్లనును. "పురుషులు ఇంటఁ

గూర్చుండి, స్త్రీ లుద్యోగములు చేయుట మిక్కిలి ఖేదకరము
ఈశ్వరుఁ డిట్టియోగము మాకుఁ దెచ్చినందున కెంతయుఁ
జింతిల్లవలసి యున్నది. పిల్లల నందఱి నెటులయిన సంరక్షించ
వలయునని యీపని చేయుటయే కాని యిందువలన మన
సునకు లేశమయిన సంతోషములేదు. ఈజగత్తునందు కాలము
నొకరీతిగఁ గడపవలయునని యీ యుద్యోగము చేయుచున్నాను
గాని వేఱుకాదు. నాకర్తవ్యము నేనుచేయుచున్నానే గానియెక్కువ
చేయుటలేదు." ఆమెకు పతియొక్క వికలాంగత్వమునుగుఱించి
తోఁచు మనోదుఃఖము, ఈమాటలవలన వెల్లడి యగుచున్నది.
పరపురుషులతోఁ గూర్చుండి సిగ్గువిడిచి యీమె యెన్నఁడును
మాటలాడదు. వారితో మాటలాడుపని వచ్చినయెడల లేచి
నిలువఁబడి, ప్రక్కకుజరిగి మాటలాడును!

లేడీసూపరింటెండెంటుపని నిర్వహించునంత విద్యగలిగి, సంసా
రభారమంతయు నొంటరిగ భరించునంత సామర్థ్యము గలిగి,
యింతవినయము, సదాచరణము, నిస్సీమ పతిభక్తియుఁ గలిగిన
పతివ్రతను చూచినచో నామెయందు పూజ్యభావ మెవ్వరికిఁ
గలుగకుండును? మిస్ లిటిల్ దొరసానిగారు ఉద్యోగము వదలి
వెళ్లునప్పుడు, ఆమె రఖమాబాయిగారిని ప్రేమపూర్వకముగాఁ
జూచి, పోయివత్తునని చెప్పెను. అప్పుడే, దొరసానిగారు "మీ
ఆనవాలుగ మీఫోటోగ్రాఫు (ప్రతిమ) దింపుకొనియెదను."
అని రఖమాబాయిగారిని అడిగెను. కాని తా నేమియు గొప్ప
దేశోపకారపుపని చేయనందునఁ దనప్రతిమ దింపించుకొనుటకుఁ
దన కిష్టము లేదని రఖమాబాయిగారు వినయముతో విన్నవించు

కొనిరి. ఆహా! ఏమి యీలీనత!! మిస్ లిటిల్ దొరసాని తన ప్రతిమ నొకదానిని రఖమాబాయి కిచ్చి, యింటికిఁబోయి ఆమెకు నామెయదుగనిదే, యొకసర్టిఫికట్టు (యోగ్యతాపత్రిక) వ్రాసి యింటికిఁ బంపెను. ఈపత్రికయందు రఖమాబాయిగారి సుగుణ సంపదలను మనఃపూర్వకముగా వర్ణించియున్నందునను, అంత కంటె నధికప్రేమతో నెవరును వర్ణింపఁజాల రనియు నాపత్రిక నిం దుదాహరించుచున్నాను:—

"చదువుచెప్పెడి స్త్రీలకుఁ జదువు చెప్పుటకయి స్థాపింపఁబడిన పాఠశాలయందు సౌ. రఖమాబాయి కేళోకరు, కొన్నిరోజుల నుండి, విద్య చెప్పుటయందుఁ బ్రవీణురాలయి యున్నది. స్త్రీలకు విద్య గరపుటయం దామె మహోత్సుకురాలయి యుండును; ఇట్టి యీమె యుత్తమోదాహరణమువలన స్త్రీవిద్య యధిక ముగా విస్తరించినది. ఇట్టి తెలివి గలిగినట్టియు, సహాయము చేయునట్టియు, అసిస్టంటు (సహాయకారిణి) దొరకినందుకు నేను ఆమెకుఁ గృతజ్ఞురాలనయి యున్నాను. ఈమె మహా సద్గుణవతి యయి పరోపకార విషయమయి సదా తత్పరురాలయి యుండును. ఈమెవద్ద నభ్యసించిన యుపాధ్యాయినులు కోలాపూరు సంస్థాన మునం దంతటను, నిండియున్నారు. ఈ యుపాధ్యాయినులలో ననేకులు ఎచ్చటెచ్చటికి వెళ్లిరో, అచ్చటచ్చట రఖమాబాయి గారివలెనే యాచరించి, జనులకు మేలుచేసి, అచ్చటివారి నంద ఱను సంతోషపెట్టుచున్నారు. రఖమాబాయిగారు కులీన స్త్రీ యనియును, సుశీలవతి యనియును, అనుభవికమాతా యని యును, ఉత్తమయుపాధ్యాయిని యనియును, ఇన్ని రీతుల నేను

యందు నాకుఁ బూజ్యభావము గలదు. ఈమె శ్రేయస్సును బొందు చున్నదని విని, నా కెల్లప్పుడును సంతోషమే యగును."

(దస్కతు) ఎచ్. లిటిల్,
ఆగస్టు ౨౦, ౧౮౯౫. లేడీసూపరింటెండెంట్, ఫీమెల్ ఎడ్యుకేషన్.

పరదేశవాసినియగు మిస్ లిటిల్‌గారిచే నింత స్తోత్రమును బడసిన సౌ. రఖమాబాయిగా రెంత సద్గుణవతి యైనది, యెంత విద్యావతియైనది, యెంత వినయశీలయైనది, చదువరులే యోచింపఁగలరు. స్త్రీవిద్యాస్వాతంత్ర్యము లక్కఱలేదని చెప్పెడివారి కీమె కుమార్తయై జన్మించినందున, భరతఖండములోని లలనల కందఱకు నీమె లలామభూతయని చెప్పవలసియున్నది.

ఓసహోదరీమణులారా! సౌ. రఖమాబాయిగారి చరిత్రము వలన మీ రనేకోపదేశములు గ్రహింపవచ్చును. 'కుమారీశతకము' 'మానినీశతకము' మొదలయిన గ్రంథములవలెనే యిది మీ కొకయుపదేశ శతకమే. మీ రందఱును సౌ. రఖమాబాయిగారి వలెఁ జేతనయినంతవఱకు విద్య నభ్యసింపుఁడు. విద్యవలన లాభము లనేకములు గలవని మీకుఁ దెలిసినవిషయమే. సౌ. రఖమాబాయిగారివలె మీ కందఱకును నుద్యోగము చేయవలసిన యావశ్యకము లేకపోయినను, గృహకృత్యములయందు, శిశుపోషణాదులయందుఁ మీవిద్య మీకుఁ జాల సహాయకారి కాఁగలదు. కనుక నెల్లమ్మగారియింటను పుల్లమ్మగారియింటను బ్రొద్దుపుచ్చు కొనక, తండ్రులవద్దనో, భర్తలవద్దనో, అన్నలవద్దనో, మఱఁదులవద్దనో, విద్యాధ్యయనము చేయుఁడు. విద్య నేర్చుకొని యంతమాత్రమునకే గర్వపడక, సౌ. రఖమాబాయివలె విద్యతోఁ గూడ

వినయాది సద్గుణములను స్వీకరింపుఁడి. సౌ. రఖమాబాయి గారివలెనే మీరు పతిభక్తియం దధిక తత్పరురాండ్రయి, విద్యారహితలయిన భార్యలకంటె విద్యాసహితలయిన భార్యలే, సంసార సుఖమును అధికముగా వృద్ధిఁజేసెదరని, సోదాహరణపూర్వకముగా సిద్ధాంతీకరించి, కొందఱ జనులయందుఁగల స్త్రీవిద్యాద్వేషమును తొలఁగించి, దేశహితములు సమకూర్పుఁడు. ఇట్లీమె పవిత్రమయిన చరిత్రములోనుండి మీ రనేకోపదేశములను గ్రహింపవచ్చును.

తుదకు సౌ. రఖమాబాయిగారు అనేక సంవత్సరములవఱకు బ్రతికి సౌభాగ్యము, సత్తె, మొదలయిన సకారముల నవిచ్ఛిన్నముగా ననుభవింతురు గాకయనియు, ఆమెవలన నీదేశమందంతటను స్త్రీవిద్యాభివృద్ధియై యీదేశము బాగుపడును గాకయనియు, ఈశ్వరుని అనన్యభావముతోఁ బ్రార్థించి యీచరిత్రమును, ముగించుచున్నాను.



# కర్మదేవి.

తే. గీ. ప్రాణిలోకంబు సంసార పతిత మగుట
వసుధపైఁ బుట్టి గిట్టనివారు గలరె
వారిజన్మంబు సఫల మెవ్వారివలన
వంశ మధికోన్నతి వహించి వన్నె కెక్కు.

మన భరతఖండమున నవతరించి, తమసత్కార్యములవలనను సద్గుణములవలనను దేశము నలంకరించిన స్త్రీరత్నములలో ననేకులకు రాజపుత్రస్థానమే జన్మభూమి యైయున్నది. రాజపుతానాయందలి క్షత్రియవీరులు తమశౌర్యమువలన స్వదేశమున కెటులు కీర్తికారణులైరో, అటులనె క్షత్రియస్త్రీలును పురుషులు సంపాదించుకీర్తిని వృద్ధిపఱిచినవారయిరని చెప్పుటకు నెంతమాత్రమును శంకింపఁబని లేదు. ఇటు వెనుక నాలుగువందల సంవత్సరములనుండియు రాజపుత్రస్థానముయొక్క స్వరూపముమాఱి, యది వీరపుత్రజనని యను నామమాత్రావశిష్టమయియున్నది. కాని యంతకుఁ బూర్వ మచటిరాజపుత్రులన్న, నన్నిదేశములవారికిని కాలాంతకులవలెఁ గానఁబడుచుండిరి. అటులనే యచటిరాజపుత్రస్త్రీ లన్న దృఢనిశ్చయ విభూషిత లనియు, సద్గుణసంపన్న లనియు, పరమపతివ్రత లనియు ప్రసిద్ధిఁగాంచిరి. ఇట్లు తమ యపూర్వ సద్గుణపుంజమువలన దేశమున కలంకారభూత లయిన యనేక రాజపుత్రస్త్రీలలో కర్మదేవి యొకతె. ఈపతివ్రతాతిలకము మార్వాడదేశములోని

‘జొరింత్’ అను సంస్థానమునం దుదయించెను. ఈమెజన్మకాలము ఐదవశతాబ్దప్రారంభ మని తోఁచుచున్నది. ఈమె మోహిల రాజమాణిక్యరాజు కూఁతురు. కర్మదేవి యత్యంతసురూపవంతురాలును, సుగుణసంపన్నురాలును, అయినందున బాల్యమునుండియుఁ దల్లిదండ్రు లామెను తమప్రాణములకంటె నధికముగాఁ బెంచుచుండిరి. పిమ్మట నామె పెరిఁగినకొలఁదియు వీరులచరిత్రములను వినుటయం దత్యంతాసక్తి గలిగి, జననీజనకుల నెప్పుడును ఆసంగతులనే యడుగుచుండెను. వారును తమముద్దుల కూఁతురిని సంతోషపెట్టుటకయి యాబిడ్డ కనేక ప్రాచీనశూరుల చరిత్రలనే చెప్పుచుండిరి. కాన కర్మదేవికి నితరసంభాషణ లేవియు రుచింప కుండెను. ఆమె యల్పవయస్కురా లయినను జ్ఞానముచేఁ గడువృద్ధురా లయినందున వృథాసంభాషణ, సోమరితనము, మొదలయినవానియం దత్యంతతిరస్కారము గల దయి ప్రాచీన యోధుల కథలను వినుచు వారినే దైవతుల్యులనుగా భావించి, మానసమునం దెల్లప్పుడును పూజింపుచుండెను. జశల్మీరుని భట్టీరాజ్యములోఁ జేరిన పూగల్ పరగణాధిపతి యగు రాణారణంగదేవుని పుత్రుఁడయిన సాధునామధేయుని యసమానపరాక్రమ మెల్లప్పుడు నామె కతిప్రియముగా నుండెను. ఆవీరునిచరిత్రము వినినపిదప మఱి యొకరిచరిత్రము వినుటకామెకు నిష్టమే లేదయ్యెను. ఆతేజోనిధి యనేక దేశములను జయించి శౌర్యమునం దభిమన్యుతుల్యుఁడని కీర్తిని సంపాదించెను. నాగూరు మొదలు సింధునదిపర్యంతము దండు వెడలి యనేకవీరుల ననేకసారుల నోడించెను. రాజు లంద ఱాయన కతిభీతు లగుచుండిరి. సాధు

దండు వెడలినప్పు డెల్లను కౌరింతనగరముమీఁదినుండియే పోవు చుండెను. కాన ఆనగరమునందుఁ గలవా రందఱును ఆయనసౌం దర్యమును, శౌర్యమును, సద్గుణములను పూర్తిగా గుర్తెఱిఁగి యుండిరి. కర్మదేవితండ్రి యగు మాణిక్యరాయలుసాధును మిక్కిలి మన్నించి యప్పుడప్పుడు తనగృహమునకుఁ దోడుకొని వచ్చి, తగిన మర్యాదలుచేయుచు వచ్చెను. తండ్రితో సాధు ప్రసంగించుసమయమున కర్మదేవి చాటుననుండి వారి ప్రసంగము మిక్కిలి యుత్సుకతతో వినుచుండెను. ఆప్రసంగము లామె కధి కోల్లాసమును, ఆనందమును కలిగించెను. క్షత్రియస్త్రీల మనస్సు లు క్షాత్ర తేజమునకు నివాసస్థలములు. రాజపుత్రస్త్రీల *జహార వ్రత మనుశబ్దము వినఁగానే యేయార్యునకు వారియెడ గౌరవ బుద్ధి గలుగకుండును? ప్రాచీనరాజపుత్ర స్త్రీలయం దెట్టి క్షాత్ర తేజముండెనో యట్టి తేజము కర్మదేవియందు నుండుటవలన, నామెకు వీరులను గుర్తించు సహజశక్తి గలిగెను. ఆమె సాధు పరాక్రమము విన్నకొలఁదిని, చూచినకొలఁదిని, ఆయనయం దధికప్రేమ కలదియై, బద్ధానురాగ యయ్యెను. ఇట్లుండ నొక దినము కర్మదేవి తనమేడగచ్చుపై నుండఁగా నామేడక్రిందుగా సాధుపోవుట తటస్థించెను. ఆసమయమునం దాయిరువురును ఒకరి నొకరు చూచిరి. సాధు తా నామెను చూచియు లోకుల కాసంగతి తెలియకుండుట కయి యచటినుండి త్వరగా వెడలి

---

* చిత్తూర్‌కోటపై అల్లాఉద్దీన్ ఖిలజీ యను తురుష్కుఁడు దండెత్తి వచ్చినప్పుడు అచ్చటి రాజపుత్రస్త్రీలు తమ పాతివ్రత్యసంరక్షణార్థ మయి యగ్నిలోఁ దుమికిరి. ఈయగ్నిప్రవేశము నే జహారవ్రత మనియెదరు.

పోయెను. కాని యాయన మనస్సంతయుఁ గర్మదేవినీమయమయి యుండెను. కర్మదేవియు నాటినుండి సాధునందు నధికాదరము కల దయి, ఆతనిఁ దప్ప మఱి యొకరిని వరింపనని నిశ్చయము చేసి కొనెను. ఇట్టి యపూర్వప్రేమ యామె తలిదండ్రుల కెంతమాత్రమును తెలియలేదు. కూఁతునకు యుక్తవయసు రాఁగా జననీజనకు లామెకు వరునిశోధింపుచుండిరి. ఇట్లు వెదకివెతకి ముందరాధిపతి రాణాచంద్ అను నృపతియొక్క చతుర్థపుత్రుఁడగు అరణ్యాకమలుఁ డనువాఁడు రూపవంతుఁడును, శౌర్యవంతుఁడును, ధనవంతుఁడును, ఐనందున కర్మదేవి నాతనికిచ్చి వివాహముచేయ నిశ్చయించిరి. ఉభయ పక్షములవారికిని సమ్మతమైనందున లగ్న నిశ్చయము చేయబడెను. కాని యాలగ్నదినము సమీపించినకొలఁదిని కర్మదేవికంతకంతనధికాధిక విచారముగలుగుచుండెను. ఆమె యంతకు ముందె తనమనసునందు సత్పురుషుఁడైనసాధును భర్తనుగా వరించెనుగాన నితరపురుషుల నెవ్వరిని వరియింపనొల్లదయ్యె. ముందరాధిపతికుమారుఁ డగు అరణ్యాకమలుఁడు, కర్మదేవి సౌందర్యమున కధికమోహితుఁడై తనవలెనే కర్మదేవియుఁ దనయందధికానురాగముగలదై వివాహదినము కొఱకెదురుచూచుచున్నదని తలఁచెను. కాని శుభ్రాకాశ మాస్మికముగా మేఘాచ్ఛాదితమై ప్రచండవర్షము కురియుననియు, మొదలేమియులేక యదాటునఁ బ్రచండమారుతము వచ్చి భూమిని కంపింపఁజేయు ననియు, ఆయన కెప్పుడును తోఁచదయ్యెను. ఆకాలుఁ డెప్పుడును ముందు రాఁబోవుసుఖమునెన్నుచు

జాగ్రత్ స్వప్నావస్థలయందును, మనోరాజ్యముల యందును విహరించుచుండెను !

కర్మదేవి తల్లిదండ్రులు తమకూఁతునకు యోగ్యవరుఁడు దొర కెనని యధికోత్సాహముతోఁ బెండ్లిపనులను జేయుచుండిరి. వివాహదినము సమీపించుచున్నందున కర్మదేవి కధికవ్యసనముగా నుండెను. తనమనోనిశ్చయము తల్లిదండ్రుల కెట్లులైనఁ దెలుప వలయునని నిశ్చయించుకొని కర్మదేవి తన కట్టిసమయమునందు సాయముచేయు ప్రాణసఖు లెవ్వరు గలరాయని యోచింపు చుండెను.

ఇట్టిసమయమున నొకనాటిరాత్రి పున్నమవెన్నెలగాయ నతి రమ్య మగుచల్లని గాలి వీచుచున్న మనోహర మగు సమయము నందు కర్మదేవి తనయంతఃపురములో గవాక్షము చెంత నేమో విశేషవ్యసనకర మగువిచారము చేయుచు నిలుచుండెను. ఆమె వెనుక నామె సఖియగు అమలవచ్చి నిలుచున్న సంగతియే యామెకుఁ దెలియకుండెను. ఇట్లు కొంతతడవు నిలుచుండి యా సఖి కర్మదేవికి నేదో యసహ్య మగుమనోవ్యధకలదని తెలిసి కొని ప్రాణమిత్రురా లగు అమల యదాటున "అక్కా ! నీవింత విచారమేల చేయుచున్నావు ?" అని ప్రశ్నచేసెను. ఆమాటకు కర్మదేవి జవాబు చెప్పుటకు సిగ్గుపడి యెట్టులనైన తప్పించుకొన వలయునని వేఱుప్రసంగమున కారంభించెను. కాని యమల కా మాటయం దెంతమాత్రమును ధ్యానములేక యది కర్మదేవి ప్రతి దినమువలె ప్రసన్నముఖిగా నుండక యామెముఖ మధికవిచా రముచేతఁ గళాహీనమై యున్నకారణ మేమోయని చింతింపు

చుండెను. ఇట్లు చింతించి యమల కర్మదేవికరములను తనకరము లచేఁ బట్టుకొని "ప్రాణసఖీ! నీవింత ఖిన్నురాలవై యుండుటకు నిమిత్తమేమి? త్వరలోనే నీ వివాహమై నీయఖండసౌఖ్యమునకుఁ బ్రారంభము కాఁగలదు, గాన నీవిప్పు డధిక సంతోషముతో నుండవలయును; గాని దుఃఖించుటకుఁ గారణమేమి! ఏకారణ మైన నున్నయెడల దాచక నాకు విశదపఱుపుము." ఇట్లు తన ప్రియసఖి యడుగుటవలన కర్మదేవికి నధికదుఃఖము గలిగెను. వివాహానంతరము పితృగృహము విడువవలయును గదా యని కర్మదేవి చింతిల్లుచున్నదని అమలకుఁ దోఁచెను. కాని తదనంతర మామె యపారదుఃఖమును గని భీతిల్లినదాయెను. ఆమె కర్మ దేవితో వినోదము చేయవలయునని యచటికి వచ్చిన దయ్యును తనసఖి మిక్కిలి దుఃఖములో నుండుట గని దీనముఖ ముతోఁ గర్మదేవి వైపుఁ జూచుచు నిలుచుండెను. అంతఁ గొంత సేపునకుఁ గడుపులోనుండి పొంగిపొరలి వచ్చుదుఃఖమును అతి ప్రయాసముతో నాపుకొని కర్మదేవి అమలతో నిట్లనియె. "సఖీ! నాదుఃఖకారణము విన్నయెడల నీకును విశేషదుఃఖము కలుగును. నీవు తత్క్షణమున నేపోయి నాప్రియజననీజనకులతో నిట్లనుము. 'నేనిదివఱకే వీరపురుషుఁ డగుసాధును నాహృదయమునందు నిలిపితిని గనుక నిఁక నితరపురుషునిదర్శన మైనఁ జేయను.'" అని చెప్పి యామె దుఃఖముతోఁ దనముఖము మఱియొకవైపునకుఁ ద్రిప్పుకొనెను. ఆమె దృఢప్రతిజ్ఞను విని అమల మిక్కిలి చింత నొంది అరణ్యాకమలునితోఁ డకు నిశ్చయింపఁబడిన వివాహము మర లుట దుస్తరమని తలఁచి మెల్లగాఁ గర్మదేవీ! అరణ్యాకమలుఁడు

సాధునకంటెఁ దక్కువవాఁడు కాఁడు. మఱియు మీవివాహ ముసు గుఱించి యిదివఱకే వాఁడు నిశ్చయము చేసియున్నారు. ఇట్లు సిద్ధమైన వివాహము పడఁగొట్టఁగూడదు. అరణ్యాకమలుఁడు కులమునందును, శీలమునందును, సంపదయందును సాధుతో సమానుఁ డనవచ్చునుగాన నీవతనినే వరియింపుము." ఆమా టలు విని కర్మదేవి మిక్కిలి గంభీరముగా నిట్లనియె. "ఈహృద యము ధనైశ్వర్యములను, కులశీలములను, కోరదు. ధైర్యశౌ ర్యాది క్షాత్రగుణములను విని యెవని నొకపర్యాయము వరిం చెనో అతఁడే యీశరీరమును కధిపతి. ఈమనశ్శరీరము లాత నికిఁ దప్ప పరుల కీజన్మమున లభించుట సంభవింపదు." ఇట్లతి దృఢనిశ్చయముతో నుచ్చరించినవాక్యములు విని యమల యాసంగతి కర్మదేవి తలిదండ్రులకుఁ దెలిపి, యామెకు హిత మాచరింపవలయునని యచ్చటినుండి వెడలెను. కర్మదేవి జననీజ నకు లమలవలన కూఁతురి యభిప్రాయ మెఱిఁగి, యేమియుఁ దోఁచక మిక్కిలి విచారపడసాగిరి. సర్వసిద్ధమైనవివాహ మెట్లు ఆపవలయునో వారికిఁ దోఁచకుండెను. సిద్ధమైన వివాహమునకు విఘ్నము కావించుట యనఁగా నొకగొప్పసంకటమును తెచ్చు కొనుటయే. అరణ్యకమలుఁడు సామాన్యుఁడు కానందున నిట్టి యవమానము ఆతనికిఁ గలిగినపక్షమున, వారి వంశీకులందఱును మిగుల నాగ్రహపడి దండెత్తివచ్చి మహానర్థము చేయ సమర్థులు. ఇట్టి వివాహభంగమువలనఁ దమకు నష్టము కలుగుటయేగాక తమముద్దుల కూఁతునకును క్రొత్తయల్లునకును గొప్పసంకటము ప్రాప్తించునని వారు చింతింపసాగిరి. కాని వారికి కర్మదేవియందు

నసామాన్యప్రీతి గలుగుటచే నెట్టి సంకటముల నైన లక్ష్యము చేయక కన్యకోరినవరునకే యామె నిచ్చి వివాహముచేయ నిశ్చయించిరి. ఇట్లు నిశ్చయించి వారప్పుడు వీరపురుషుఁడగు సాధును పిలువనంపి ఆయనతోఁ దమకొమార్తె వృత్తాంతమంతయుఁ జెప్పి వివాహమాడవలెనని వేఁడుకొనిరి. సాధు, అదివఱకే కర్మదేవి యందు బద్ధానురాగుఁడై యందున వివాహమునకు సమ్మతించెను. కొద్దిరోజులలోనే కర్మదేవికిని సాధునకును వివాహము చేయఁబడెను. ఆమె మాతాపితరులు తమపుత్రిక హాసముఖమునుఁగని ధన్యులైరి. కర్మదేవి వివాహవార్త స్వల్పకాలములోనే యరణ్యకమలునకుఁ దెలిసెను. ఇట్లు తనకు నిశ్చయింపఁబడిన కన్యను మఱియొకఁడు పెండ్లి చేసికొని తన కవమానము కలిగించినందున అరణ్యకమలుఁడు క్రోధాంధుఁ డాయెను. ఆతని మనస్సున క్రోధ విషాదము లధికముకాఁగా నాతఁడు "నన్ను నవమానపఱిచిన సాధును చంపినఁ గాని నేను క్షత్రియుఁడఁగాను" అని ప్రతిజ్ఞ చేసి సాధుపై దండు వెడలుటకై తన సేన సిద్ధము చేసెను. ఈసంగతి యంతలో దేశమంతటను వ్యాపింపఁ గర్మదేవి జననీజనకులు తాముముందువచ్చునని కొనిన సంకట మిప్పుడె ప్రాప్తమైనదని భయపడుచుండిరి. అంతఁ గొన్నిరోజులకు సాధు మామగారి సెలవు బొంది భార్యాసమేతుఁడై తన రాజ్యమునకు వెడలెను. అప్పు డాతని వెంట నాతని సంరక్షణార్థమై విశ్వాసార్హులగు పదునందల వీరభటులుండిరి. ఇంకను కొంత సేనఁ గొనిపొమ్మని మామగారు వేఁడుకొన ఆయన సమాధానమునకై సాధు ఇంకను ఏబదాఱు సైన్యమును వెంటఁగొనెను. అప్పు డశ్రుపూర్ణనేత్రములతోఁ

గర్మదేవి యందఱి సెలవుపొంది యత్తవారింటికిఁ బోవ బయలుదేఱెను. ఇట్లు వారు కొంతదూరము పోయినపిదప, త్రోవమధ్య నరణ్యాకమలుఁడు తనసేనతో వారి నడ్డగించెను. వాఁడిదివఱకిట్టి సమయముననే వేచి, పగసాధింప నెదురు చూచుచుండెను. అవమానమువలన వాఁడత్యంతకుపితుఁడై, "చంపుదు; లేక చత్తు"నని నిశ్చయము చేసికొనియున్నందున నచట నారెండు సేనలకును ఘోరసంగ్రామ మారంభమాయెను. ఆయుద్ధమునం దిరుగడలనుగల వీరు లనేకులు వీరస్వర్గమును స్వీకరించిరి. ఉభయసేనలను వెనుకదీయక ప్రాణములకాశింపక పోరుచుండెను. అప్పుడు తనసైన్యమునకు జయము కలుగునో లేదో, యని చింతించి అరణ్యాకమలుఁ డింకొకయుక్తి నాలోచించెను. అతఁ డప్పుడు సాధునకు "నీవు నిజమైన క్షత్రియుఁడవైన నాతో ద్వంద్వయుద్ధమునకు రమ్ము. అట్టిసమయమున నన్నోడ్చి నీవు విజయము పొందిన మిగుల ఘనతగలుగును" అని వర్తమాన మంపెను.

అప్పుడు సాధు ద్వంద్వయుద్ధమునకుఁ బోవుటకయి తనప్రియభార్యను అనుజ్ఞ అడుగఁగా నామె సామాన్యస్త్రీలవలె నధైర్యపడక మిగుల ధైర్యముతో భర్తకు నమస్కరించి, వీరపత్నికి నుచిత మగునటుల నిట్లనియె. "స్వామీ! పోయిరండు. వీర ధర్మమును వదలక పాలింపుఁడు. యుద్ధమునందు తమకు జయము కలిగెనేని మన మిహమందే యొకరినొకరి చూడఁగలము. అటులఁగాక మీకు యుద్ధమునందు మరణము ప్రాప్తించెనేని తమ్ము స్వర్గమునందుఁ గలిసికొనియెదను. కాని తమరు విచారప

డకుఁడు" ఇట్లు ధైర్యోత్పాదకము 'లగువచనములచే మిక్కిలి ధైర్యము గలిగినసాధు, అరణ్యాకమలుని యెదుట యుద్ధమునకు నిలువఁబడెను. ఎవఁడు తనయవమానమునకు కారకుఁడో, ఎవని పగ సాధింపఁ దాను ప్రతిజ్ఞచేసెనో, అట్టిశత్రుఁడు తనసమీప మున సంగ్రామసన్నద్ధుఁ డయియుండుటఁ గని ఆయరణ్యాకమలుని బాహువు లధికముగా స్ఫురింపసాగెను. సాధును చంపి మాతని రక్తమువలనఁ దనకోపాగ్ని నార్పవలయు ననియాతఁ డాతురుఁ డాయెను. ఇట్లిరువురిమనస్సులయందును క్రోధాగ్ని ప్రజ్వలింప ద్వంద్వయుద్ధ మారంభ మాయెను. అట్టిసమయ మున వా రిరువురును భీమశల్యులవలె సమానపరాక్రమము చూపి యొండొరులచేఁ దాడితు లయి భూమిపై మూర్ఛిల్లిరి. కాని సాధు, విశేషముగా గాయములుతగిలినందున, మూర్ఛనుండి లేవకయే మృతిఁ బొంది వీరస్వర్గము స్వీకరించెను. ఈసంగతి దూరమునుండి చూచుచున్న కర్మదేవి తనప్రాణవల్లభుఁ డట్లు గూలుటఁ గని లోపలినుండి వచ్చుదుఃఖవేగమును బహుప్రయా సముననాపి, తా నిఁక నీజగత్తునం దుండుట యుక్తము కాదని తలఁచి, పరలోకప్రయాణమునకు సిద్ధపడెను. మనసునఁ గోరిన భర్త లభించియుఁ స్వాధీన మయిన సౌభాగ్యము స్వల్పకాల మయినను అనుభవింపఁ దటస్థింపకపోయెనని యామె కాసమయ మునందుఁ గలిగిన యపారదుఃఖము, పరమునందు భర్తతో శీఘ్రముగఁ గూడెద నన్నయాశచే నడఁపఁబడెను. అప్పుడు కర్మదేవి తనసైనికులకు చితిఁ బేర్చ ననుజ్ఞ నిచ్చెను. ఆమె యాజ్ఞాప్రకారము భటులు క్షణములో సిద్ధము చేసిరి. అంత

నామె తనచెంతనున్నభటుని ఖడ్గమునుగొని, యామె యేమిచే యునో యని సైనికులు చూచునంతలో, తనయెడమచేతిని ఆకత్తితో నఱికి యొకభటునకిచ్చి వానితో నిట్లనియె. "దీని నీవు గొనిపోయి మా మామగారికి నిచ్చి యిట్లని విన్నవింపుము—"మీ కోడలిముఖ మీలోకమున నికఁ గనుట సంభవించదు. కాన, నామె తనమాఱుగా ఈచేయి తమకుఁ బంపినది. తమకొడుకును కోడలును, స్వర్గమునందు సుఖు లయియున్నారు." ఇట్లు చెప్పిన పిదప నామె తన సమీపమునఁగల భటుని జూచి తనరెండవ చేయి నఱుకుమని యుత్తరువిచ్చెను. వాఁ డందుకుఁ గొంత వఱకు సమ్మతింపక, తుదకు నామె కఠినమైన యాజ్ఞవలన విధిలేక రెండవచేతిని నఱకెను. అంత నామె తనపుట్టినింటినుండి వచ్చిన భటునిఁ బిలిచి "నీ వీహస్తము గొనిపోయి మాతండ్రిగారికిఁ జూపి మీకొమార్తెముఖ మికఁ జూచుట యసంభవముగాన, ఆమె తనహస్తముమీకడ కంపెను అనుము." అంత నావీరబాల భర్త ప్రేతమును చితిపై నుంచి తానును చితిపైఁ గూర్చుండి చితికి నిప్పు ముట్టించెను. అగ్నిహోత్రుఁ డామె దేహమును భస్మీభూతము చేసెను; గాని యామె కీర్తిని దశదిశలు వ్యాపింపఁ జేసెను. పుత్రశోకమువలన నత్యంతవ్యాకులుఁ డగు రణాంగ దేవుఁడు కోడలిహస్తమున కగ్నిసంస్కారముచేసి యాస్థలము నం దొకసరోవరము నిర్మించెను. ఆపవిత్రసరోవర మిప్పటికిని కర్మ సరోవరమని పిలువఁబడును. ఆసరోవరముచేఁ గర్మదేవియొక్క కీర్తి యజరామరమయి యున్నది. ఇట్టిస్త్రీరత్నములేగదా భూమికి రత్నగర్భ యని పేరు దేనేర్తురు.

# మైసూరు మహారాణి లక్ష్మమ్మాన్ని.

---

శా. ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాససంత్రస్తులై
యారంభించి పరిత్యజింతు రురువిఘ్నాయత్తులై మధ్యము
ల్ధీరు ల్విఘ్ననిహన్యమాను లగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధు ల్గావునన్. —భర్తృహరి.

మైసూరుదేశపుఁ జరిత్రమునందు నీమహారాణి మిక్కిలి ప్రసిద్ధిఁ గాంచినది. ౧౭౬౬వ సంవత్సరము డిశెంబరునెలయందుఁ బరలోకమున కేగిన మైసూరుమహారాజుగారి కీమె తాతమ్మ (పితామహునితల్లి) యని చెప్పెదరు. ఈమె మిగుల ధైర్యవతియు శౌర్యవతియు నయియుండెను. హైదరును తత్పుత్రుఁ డయిన టిప్పుసుల్తానును, మైసూరురాజ్యమును బలాత్కారముగా వశపఱచుకొనిన సమయమునం దీమె ధైర్యచాతుర్యాదిగుణములు వెల్లడించెను. ఈమె తనచాతుర్యధైర్యములవలన రాజ్యమును మరల సంపాదించుకొనెను. కాన నీమెచరిత్ర మత్యంతశ్రవణీయము. ఈమె కట్టిగోపాలరాజుఅర్సు గారికూఁతురు. ఈయన తిరిచునాపల్లి యుద్ధసమయమునందుఁ బ్రసిద్ధుఁడైనశూరుఁడు. ఈతఁడు మైసూరుమహారాజుగా రగునందరాజువద్ద నొకసేనానాయకుఁడుగా నుండెను. తిరిచునాపల్లిపై మహామదల్లీతో దండెత్తి వెళ్లియుండెను. లక్ష్మమ్మాన్నిగారిజన్మకాలము తెలియుమార్గమేదియు లేదు. కాని ౧౭౪౨వ సంవత్సరమునం దామె

వివాహము ఇమ్మాది కృష్ణరాజవడియారుగారితో నయ్యె నని మాత్రము తెలియుచున్నది. అప్పు డామె రాజుగారికి మూఁడవ రాణిగా నుండెను.

ఈరాజుగారి పెంపుడుతండ్రి యగునందరాజు పూర్వపు మైసూరురాజునకు మామగారు. అల్లునియందు రాజ్యతంత్రమును నడుపు నేర్పు లేనందున నందరాజుతానే రాజ్యమును నడుపుచుండెను. ఇట్లుండనందరాజుగారొక్క యాజ్ఞానువర్తియగుహైదరు తానే యారాజ్యమునకు రాజు కావలెనను హేతువుచే నందరాజు నొకమూలనునిచి, తానే యధికారారూఢుఁ డగుటకు యత్నింపసాగెను.

తదనంతరము, నందరాజుమరణసమయ మాసన్నము కాఁగా హైదరున కేవిధమయిన యధికారము నియ్యవలదని చెప్పిపోయెను. కాని యందువలన ఫల మేమియు కలిగినది కాదు. నందరాజుపత్ని యగుమహారాణిజమ్మాన్ని దేవి హైదరు సర్వాధికారి యగుట కిష్టము లేనిదై యందుకు విఘ్నము చేయ నెంచి హైదరువొద్ద నుండు ఖండేరావుసరదారుతో గుప్తముగా నాలోచన చేయఁదొడఁగెను. అమె ఇమ్మాది కృష్ణరాజ వడియారును పెంచుకొనెను. ఈకృష్ణరాజుగారిభార్యయే ప్రస్తుతకథానాయిక. ఈతఁడు సింహాసనమునకు ముఖ్యవారసుఁ డగుటచే జమ్మాన్ని రాణి తనకొమారుని పేర తాను రాజ్యము నడుప యత్నించెను. కాని మహాయోధుఁ డగుహైదరు ఈసంగతి యంతయు నెఱింగి యిందుకుఁ గారకుఁ డగు ఖండేరావును బంధించి పంజరములో నుంచెను. నానాటికి హైదరుని యధికార మధికము కాఁగా

౧౭౬౧వ సంవత్సరమున నాతఁడు సర్వాధికారియయి కృష్ణరాజు
నొకచదరంగములోని రాజువలెఁ జూడసాగెను. ఇమ్మాదికృష్ణ
రాజు ౧౭౬౬ వ సంవత్సరమున మృతుఁ డాయెను. ఆయనకు
మృత్యుసమయమున నందరాజచామరాజులను ఇరువురుపుత్రులు
గలరు. వారు రాజ్యపదవికి నర్హులయినను హైదరు ఎంతమాత్ర
మును వారియధికారము చెల్లనియ్యక తానే రాజ్యముఁ జేయు
చుండెను. నందరాజు మరాఠాసరదారుఁ డగు త్రియంబక
రావుతో గుప్తముగా రాజ్యమునుగుఱించిన యాలోచన చేయు
చున్నాఁ డన్నవార్త విని హైదరు వానిని గాలముపయి
నెక్కించి చంపెను. చామరాజు హైదరు బాధనలసనే ౧౭౭౬వ
సంవత్సరమున స్వర్గస్థుఁ డయ్యెను. ఇట్లు సింహాసనార్హు లగు
టకు దగినవారిరువురును మృత్యుముఖమునఁ బడినందునఁ దన
కిఁక నెదురువచ్చువారు లేరని హైదరు పరమానందభరితుఁ డయి
యుండెను. అదివర కంతఃపురమునందు నిరోధింపఁబడియున్న
మహారాణి లక్ష్మమ్మాన్నిపయి నొక్కసారిగా నపారమగుసముద్ర
ముప్పొంగి వచ్చినట్లాయెను. ప్రియభర్తయుఁ బ్రాణాధికు లగు
పుత్రులును హైదరుని బాధవలన నీలోకమును విడిచిరనియు దుష్టుఁ
డగుహైదరునిచేత నున్నాననియు విచారముతో నామె కృశింప
సాగెను. ఇట్లపారదుఃఖరాశియందు మునిఁగి యామె కొన్ని
మాసములవఱకితరవిషయము లేవియుఁ దోఁచక యూరకుండెను.
ఇట్లుండఁగాఁ బ్రాచీన మగుహిందూరాజ్య మన్యాయముగా
నశించిపోవుచున్న దనియు, మన మూరకుండిన నెడల, తురు
ష్కులు రాజ్యము నంతయు నాక్రమించెద రనియు, నామెకు శోక

నాఁడు ఘన మయినవిచారము గలిగెను. రాణిలక్ష్మమ్మాన్ని యొక యబలయయినను, ఆమెయందు స్వాభిమానమును తేజమధికముగా నుండెను. మైసూరు హిందూసింహాసనము నష్టమయి యవన రాజ్యము స్థాపింపఁబడు నన్నతలఁ పామె మనసునకు రాఁగా, అది వఱకు నణఁగియున్న స్వాభిమానప్రకాశ మామెయం దాకస్మిక ముగా నుదయించెను. అంత నామె తనదుఃఖమునంతను మిక్కిలి ధైర్యముతో నాపి హిందూరాజ్యరక్షణోపాయమును విచా రింపసాగెను. ఆమె యంతకుఁ బూర్వమంతయు నంతఃపురముననే యుండి రాజ్యముజోలికిఁ బోయినది కాదు. కాన సమయానుకూ లము లగురాజకార్యము లేవియో యామెకుఁ దెలియుట సంభ వించినది కాదు. కాని సంకటము ప్రాప్తికాఁగానే ధీరు లగు మానవులబుద్ధి యెట్లు ప్రజ్వలించునో యీ యామెచరిత్రమువలన నెఱుఁగవచ్చును. రాజ్యమునకుఁ బాలకుఁడు లేఁడని తోఁచిన వెంటనే యామె తనసహోదరికొమారుఁ డగు మాడూరు నరసరాజును గాని, తనమనుమఁ డగుసిద్ధరాజునుగాని తాను దత్తపుత్రునిగాఁ దీసికొనఁ గోరి యీసంగతి హైదరునకుఁ దెలిపెను. మహారాణి లక్ష్మమ్మాన్ని గుణవతియు చాతుర్యవతియుఁ దేజస్వినియు నగునని యందఱకు నదివఱకే తెలియునుగనుక హైదరు సర్వసత్తాధీశుఁ డయినను, ఆమెతో స్పష్టముగాఁ బోట్లాడుటకు సంశయించు చుండెను. అందువలన 'నీవు దత్తవిధానము చేసికొనవలద'ని రాణి గారితో ననుటకు వానికి వశముగా కుండెను. కనుక వాఁడు మిగుల యోచించి రాణిగారి కిట్లు వర్తమాన మంపెను. "మీకు దత్తుఁడు కావలసినయెడల మీరే స్వతంత్రించి బాలుని నేరుకొన నక్కఱ

లేదు. రాజ్యముఁ జేయుటకు సమర్థుఁ డగుబాలుని నేను పరీ క్షించి తమకుఁ జూపెదను.” అని చెప్పి వాఁ డనేకబాలకులను రప్పించి వారి నంగఱ నొకగదిలో నుంచెను. వారిసమీపమున వివిధము లయినభోజ్యపదార్థములను, ఆటవస్తువులను, అనేక విధాయుధములను, ఉనిచి మీకు నిష్ట మగువస్తువులను మీరు గొనుఁ డనియాబాలకులతోఁ జెప్పెను. అందుపయి వా రందఱు లోను అరికోటరాధిపుఁ డయిన దేవరాజుపుత్రుఁ డగు చామరా జను కుఱ్ఱవాఁ డొకఖడ్గమును, ఒక దర్పణమును, గొనెనఁట. అందుపయి నాకుఱ్ఱవాఁడే రాజ్యమున కర్హుఁడని హాయిదరు నిశ్చ యించెను మూఁడు సంవత్సరముల ప్రాయము గల యాబాల కుని నామమాత్రమునకు రాజును జేసి హాయిదరు రాజ్యలాభ మంతయుఁ దానే పొందుచుండెను. మహారాణిలక్షుమ్మాన్నిగారి కీకపట మంతయుఁ దెలిసియు హైదరుతోఁ బోరాడుటకు వీలులే కయుండెను. అప్పుడు వాఁడుప్రతాపమున లంకాధీశుఁ డగురావ ణునివలెఁ బ్రబలముగా నుండెను. కాన నచట నున్న పేరు లయిన సరదారులలో నెవరును, ఆమెకుసాయముఁ జేయుటకు సాహ సింపకపోయిరి. అందువలన హైదరుతో బహిరంగముగా విరోధము పెట్టుకొనుట దుస్తరమని తలఁచి యాచతురరాణి గుప్త రీతిగాఁ బరరాజులతో సంధిఁజేసి హాయిదరుని పదచ్యుతునిఁ జేయ నెంచెను. అందునకయి యామె అప్పుడు చెన్నపట్టణములో గవర్న రగుపింగాటుదొరగారితో గుప్తముగా పత్రవ్యవహారము జరుపసాగెను. మైసూరురాజ్యమును తురుష్కులచేతిలోనుండి రక్షించు నిమిత్త మింగ్లీషువారిసహాయముఁ గోరుటకయి యామె

తిరుమలరావు అను వకీలును చెన్నపట్టణమునకుఁ బంపెను. ఎల్లప్పుడు నంతఃపురమునం దుండిన యొక రాజయువతి హైదరుని యన్యాయమున కోర్వక వానిబందిఖానాలోనే యుండి వానికిఁ దెలియకుండ వానినే కూల్చుటకు నాంగ్లేయులసహాయము సంపాదించె నన్నసంగతి భవిష్యత్కాలమునందుఁ బుట్టఁబోవు చరిత్రకారులకు నత్యంతానం దాశ్చర్యములను బుట్టింపక మానదు. ఇట్టి మహాసంకటసమయమునందు రాణిగారు వ్రాసిన యుత్తరములే యామెకుఁ గల రాజ్యకార్యధురంధరత్వమును వెల్లడించుచున్నవి. ఆమె మొదటి యుత్తరమునందుఁ దిరుమలరావున కిట్లు వ్రాసెను. "నీ వెంతమాత్రమును నాలస్యముఁ జేయక వెంటనే బయలుదేరి చెన్నపట్టణమునకుఁ బోయి యచట లార్డు పింగాటు దొరగారిని దర్శించి, మరల మన రాజ్యము సంపాదించుటకు నుచితములగు మాటలను ఆయనతోఁ జర్చింపుము. వారి సైన్యపు కర్చుకొఱకు లక్షకోటి రూపాయలును, దరబారు ఖర్చుకొఱకు మూఁడులక్షల రూపాయిలును, ఇచ్చుటకు మేముసిద్ధముగా నున్నాము. లార్డు పింగాటు దొరగారికి మేము పరస్పరము వ్రాసిన యుత్తరమునందు నీవు మాపైపున సర్వముత్తరవాదివనియు, మా యానుసారముగా మాకొఱకు నింగ్లీషువారితో సంధి చేయుటకు నీకు స్వతంత్రత కలదనియును వ్రాసినాము. నీవేప్రకారముగనైనఁ బ్రయత్నముచేసి రాజ్యము మరల సంపాదించినయెడల నీకు రాజ్యముయొక్క యాదాయములో నూటికిఁ బదిప్రకారము బహుమతి యిచ్చి, నీ జీవితకాలమంతయును నిన్ను చాల గౌరవించెదము. ఇదియుఁగాక నీకు వంశపరంపరగా సంస్థానముయొక్క

దివానిగిరి యియ్యఁగలము" ఈపత్రికప్రకారము తిరుమలరావు చెన్నపట్టణము పోయి లార్డు పింగాటుదొరగారితో సలహా చేయు చుండెను. కాని యింతలో పింగాటుదొరగారివయి నేదో యొక కారణముచేఁ గంపెనీవారికిఁ గోపము కలిగినందునఁ దిరుమలరావు చేయుపనికి విఘ్నము కలిగి ఆయన తంజావూరునందుఁ గొన్ని దినములవఱకు ఊరక యుండవలసినవాఁ డాయెను.

ఇంతలో నిచట హైదరు మఱింత క్రూరతఁ జూపఁ జొడఁగెను. వాఁడు తన ప్రభావమువలన హిందూస్థానమునందలి బహు ప్రదేశములను వశపఱచుకొని, చెన్నపట్టణముపయి దండెత్తఁ బ్రయత్నించు చుండెను. చెన్నపట్టణపు గవర్నరగు లార్డు మ్యాకర్టను వంటి వానికి సహింపము హైదరు ప్రతాపసంధికము కానియ్య, జూడదనియు, వానినెట్లయిన చెరుపవలయుననియుఁ గోరెను, మైసూరురాణి స్వరాజ్యాభిలాష గలదియుఁ గార్యనిర్వాహకత యందు దక్షురాలును, అగునని లార్డుమ్యాకర్టన్ వినియుండెను. హాయిదరు వంటి బలవంతునితో స్వతంత్రముగాఁ బోరాడి గెలుచుటకష్టముగాన లక్షుమ్మాన్నిగారిని గలుపుకొని యామెతోఁ గూడి హైదరును గుప్తముగా నశింపఁ జేయవలయునని యాతఁడు ఆలోచించెను. ఇట్లు నిశ్చయించి లార్డుమ్యాకర్టన్‌గారు తంజావూరు సంస్థానమునకు రెసిడెంటుగానున్న సలివన్‌గారిని ఆపనికయి నియమించిరి. ఆయన రాణిగారిప్రధాని యగుతిరుమలరావు నారాయణరావుగారితో ౧౭౮౨ వ సంవత్సరము అక్టోబరు ౨౮ వ తేదిని సంధిచేసెను. ౧౭౮౨ వ సంవత్సరము నవంబరు ౧౮ వ తేదిని మద్రాసు గవర్నరుగా రందుకు సమ్మతిం

చిరి. ఇంగ్లీషువారి సహాయము లేనిది తనరాజ్యము దొరకుట
దుర్లభముగాన లక్ష్మమ్మాన్నిగారును ఆసంధికి సమ్మతించి దానిని
బలపఱచిరి. వెంటనే యింగ్లీషువారును యుద్ధమునకుఁ గావలసిన
సామగ్రి యంతయు సిద్ధపరచి తంజావూరు రాజును గాపాడినటులే
మైసూరు మహారాణిగారిని రక్షింపఁ దలఁచిరి. ఇట్టి యుప
కారము చేసినందుకుఁ గంపెనీవారికిఁ బ్రత్యుపకారముగా సంవత్స
రమునకు ౭౦ లక్షలరూపాయిలు కప్పముగను ౧౫ లక్షలు
చెల్లుదేశమును ఇచ్చెదమని రాణిగారు వ్రాసిరి. హయిదరుపయి
దండెత్తి యింగ్లీషువారిసైన్యము సమీపమునకు రాఁగానే శ్రీ
రంగపట్టణములోని రాణిపక్షమువా రందఱును హయిదరు సైన్య
ములపయిఁ దిరుగఁబడవలెననియు, వీరికి గ్రామములోని పోలీసు
వారు సహాయులుగానుండవలె ననియు, నిట్లు లోపలినుండియు
వెలుపలినుండియు హయిదరు సైన్యములను ముట్టడించవలె నని
యు, రాణిగారు మొదట నేర్పాటు చేసిరి. శామయ్యా యను
శూరుఁ డయినసరదారు డొకఁడు రాణిగారికి మిక్కిలి యను
కూలుఁ డయియుండెను. శ్రీరంగపట్టణములోఁ జరగవలసినకార్య
ములకు నన్నింటికిని రాణిగారి శామయ్యనే యధిపతిగా నియ
మించిరి. ౧౭౮౨ వ సంవత్సరము నవంబరులో రాణీగారిందు
విషయ మయి తిరుమలరావుగారి కిట్లు వ్రాసిరి. "శామయ్యయు
మఱి కొందఱు సరదారులును మనకు ననుకూలు లయిరి. కాన
నింగ్లీషుసైన్యము వచ్చినవెంటనే మేము విశేషప్రయాస మక్కఱ
లేకయె ధనాగారమును, కోటను వశపఱచుకొనఁగలము. కాఁబట్టి
మీరు గజులహట్టీకావేరీపురముపయిగా నింగ్లీషుసేన నతిత్వర

గాఁ బంపునది." ఇట్లు రాణి వ్రాసిన పిదప ఈసంగతి యంతయు నొక సేవకుఁడు స్వామిద్రోహుఁడయి హైదరునకుఁ దెలియఁ బఱచెను. హాయిదరుఁడాసంగతి విని మిగుల నలిగి ౧౭౬౩ వ సంవత్సరము జూలై ౨౯ వ తేదిని రాణి కనుకూలు లయినవారి నందఱను అనేక బాధలపఱచి కారాగృహబద్ధులం జేసెను. వారి లో ననేకులను యమసదనమునకుఁ బంపెను. ఇట్లు తన ప్రయత్నములకు నడుమ విఘ్నము కలిగినను, లక్ష్మమ్మాన్ని తనపూర్వ ప్రయత్నములను మానక లోలోపల కంపనీవారితో నుత్తర ప్రత్యుత్తరములు నడుపుచు హైదరు టిప్పూల, సంపూర్ణ వినాశ ప్రయత్నము గుప్తముగా నడుపుచునే యుండెను. ఆమె యబల యయ్యును తన ప్రయత్నముల కనేక విఘ్నము లడ్డపడుచున్నను, ధైర్యమును వదలకుండెనన్నసంగతి సామాన్యమయినది కాదు. పురుషులకయిన నిట్టిధైర్య ముండుట కష్టము. ఆసమయము నందు టిప్పు అనిన నింగ్లీషువారు సహితము వెఱఁగంది వానిని మైసూరిబెబ్బులి యని వాడు కొనుచుండిరి. ఇట్టి శూరుని నెటుల నోడించెదమో యని సంశయించు చుండిరి. అట్టి దుష్కరమయిన కాలమందును, ఆవృద్ధరాణి టిప్పూను నశింపఁ జేసి మైసూరును మరల సంపాదించెదనన్న ధైర్యమును, ఇచ్ఛను, స్వదేశాభిమానమును వదలకుండెను. ఆహా! ఇట్టి ధైర్యము దుర్లభముగదా? ౧౭౮౧ వ సంవత్సరమునం దామె జనరల్ మేడోస్ దొరగారికి వ్రాసిన పత్రిక లత్యుత్సాహపరిపూర్ణము లయి యున్నవి. అందుపయి నాసేనాధిపతి వ్రాసిన ప్రత్యుత్తరములుమాత్ర మంతగా నుత్సాహప్రదములు

గాకుండెను. మైసూరుచరిత్రమును సంపూర్ణముగా నెఱుఁగఁ
గోరెడివారికీయుత్తర ప్రత్యుత్తరములను నవశ్యముగాఁ జూడనల
యును. జనరల్ మేడోస్ దొరగారు [illegible] వ సంవత్సరమునందు
రాణిగారికి వ్రాసిన యొక యుత్తరమున నిట్లు వ్రాసిరఁట. "టిప్పూ
ఎన్నఁడు నశించునో, దేశ మెన్నఁడు ముక్తిఁ జెందునో యొక
పరమేశ్వరునకే తెలియును. (అనఁగా ఈసంగతి యిప్పుడు తగు
నటులఁ గానఁబడదు.) విజయము ప్రసాదించుట పరమేశ్వరాధీనమే.
మాకుఁ బరమేశ్వరుఁడు యథేష్టసామర్థ్యము లిచ్చినయెడల,
యోగ్యమని తోఁచినయెడల, మేము మహానందముతో, మైసూరు
రాజ్యము మీమకు సమర్పింపఁగలము. రాజ్యము మనదైన గెల్పిట్లు
పంచుకొనవలయునో యన్న సంగతిని గుఱించి యిప్పుడు మే
మేమియుఁ జెప్పఁజాలము. మహారాణీవారును, ప్రధానమును, మాకు
స్నేహితులుగాన వారి యాలోచనప్రకారము జరుగును. సంపూర్ణ
యుద్ధవ్యయములును, గెల్చినతరువాత సైనికులకు బహుమాన
ములును, ఇచ్చెదమని మీరు వ్రాసినారు. ఇది బహు మంచి
పని." సంపూర్ణసహాయము చేసినారన్న మాతతో మిత్రత్వమును
జేసికొనిన యింగ్లీషువారియొద్దనుండి యిట్టి పాడిమాటలతోఁ
గన్నులు తుడిచెడి ప్రత్యుత్తరములు వచ్చినప్పుడు రాణిగారి
కెంత మనోవ్యథ గలిగియుండునో చదువరులే యోచింపఁగలరు.
అయినను ధైర్యముయొక్క యపరావతారమైన యీమహారాణి
విగతప్రయత్నమైనది కాదు. చిన్నప్పటినుండియు రాణివాస
ములో నుండి యేమియు నెఱుఁగని రాజస్త్రీ శత్రువుచేతిలోఁ
జిక్కియు వానిని నాశము చేయుటకయి చేయుప్రయత్నములును,

అందుకు 'ఆగుము తొందరపడవలదు. శాంతింపుము' అని
కంపెనీవారు చెప్పెడిజవాబును, చదువుట కెంతయు వింతగా నున్న
దనుటకు సందేహము లేదు. రాణి లక్షుమ్మాన్నియందుఁ గల
స్వకార్యమునకయి సంతత ప్రయత్నేచ్ఛయు, "సత్యమేవజయతే"
యన్న వాక్యమునందు నామెకుఁ గల దృఢవిశ్వాసమును,
మఱి యనేక సద్గుణములును, ఆమె తిరుమలరావునకును,
లార్డు మార్నింగ్టన్ దొరగారికిని సంకటసమయమునందు
వ్రాసిన యుత్తరములవలన స్పష్టమగుచున్నవి. ఆయుత్త
రము లధికహృదయద్రావకములుగాను, కరుణారసపూర్ణములు
గాను, ఉన్నందున వానిలోని కొన్నిటి నిచట వ్రాసెదను.
ఆమె తనపరతంత్రతనుకును, దీనస్థితికని విసిగి తిరుమలరావున కిట్లు
వ్రాసెను. 'మేము మాదీనావస్థను గూర్చి పలుమారు మీకు ది
వాను కే తెలియున్నాము. మీరు మైసూరు విడిచి యిప్పటికిరువది
రెండుసంవత్సరములు కావచ్చినది. మేము ప్రతిదినమును ఈయ
వనరాక్షసుఁడు (హైదరు కుమారుఁడైన టిప్పు) పెట్టెడి యనేక
విధములయినబాధలను అనుభవించుచు నేయున్నాము. వాఁడు
మమ్ము సంతోసింపక యధికదుఃఖమున ముంచుచున్నాఁడు. వాఁడు
స్ఫోటకమునిమిష చెప్పి చామరాజు వడియారును గుప్తముగాఁ
జంపెను. మాకు నిశీరాచ్ఛాదనమునకు నొకవస్త్రమయిన
లేకుండ బాధపెట్టుచున్నాఁడు. మమ్మురాజమందిరమునం దుండ
నీయక యచటినుండి వెడలఁ గొట్టెను. మేమచటినుండి వచ్చిన
ప్పుడు అచట నుండుకావలివారు మమ్ము పరీక్షించినగాని యవ
మానించిరి. వారు మాదేహములయం దుండినగల నన్నిటిని

తీసికొని మాకుఁ గట్టుకొనుటకు ముతకవస్త్రము లిచ్చిరి. మాకు కాంతిరావుగారి పాతగృహమునం దొకవైపున నుండ స్థలమిచ్చిరి. మాచుట్టును పారా యుంచినారు. మాదాసీజను లందర మహమ్మదీయమతస్థులనుగాఁ జేసి వారి కతి నికృష్ట మయినపనులను చెప్పిరి. మఱి కొందఱను అతిదూష్య మగువేశ్యావృత్తి నవలంబింపఁ జేసిరి. మిగిలినవారిచే శౌచకూపములను గడిగించుచున్నారు. నిత్యమును మాకుఁ బిచ్చగాండ్ర కిచ్చుబత్తె మియ్యఁబడును. మేము కుండలలో వండుకొని పర్ణపుటములలో భోజనము చేయుచుందుము. టిప్పు త్వరలోనే మముఁ జంపుటకయి ప్రతిజ్ఞఁ జేసెనఁట. వాఁడెప్పుడు మాప్రాణములను గొనునో తెలియదు. మాకు మేలు చేయఁగోరి మీ రనేకవిధసంకటముల ననుభవించితిరి. మాకొఱకు మీరింగ్లీషువారితో స్నేహముఁ జేయ నెంచి జాన్సలివాన్ గారితోడను, ఇతర యింగ్లీషు సరదార్లతోడను, ప్రసంగించి వారు మాకు సహాయు లగునటులఁ జేసితిరి. ఇదియుఁగాక మాకొఱకు మీమిత్రులను, బంధువులను ఈయవనరాక్షసున కర్పింపవలసినవారయితిరి. ఇట్లు మీ రనేక నష్టములు కలుగుట తలఁచుకొనిన నాగుండె యదరిపోవుచున్నది. ఇంత నష్టమైనను మనప్రయత్నము కొనసాగి మారాజ్యమునకు స్వాతంత్ర్యము కలుగనందున నధికసంతాపకరముగా నున్నది. ఇంక త్వరలోనే మానాశ మగుననుటకు సంశయము లేదు. టిప్పువద్దికి నిపుడొక ఫ్రెంచివకీలు వచ్చియున్నాఁడు. మమ్ము (రాణిగారిని) జంపకుండిన టిప్పునకుఁ ద్వరలోనే నాశము కలుగునని వాఁడు బోధించెనఁట. అందుపై నన్నుశీఘ్ర

ముగాఁ జంప నిశ్చయించిరఁట. టిప్పువకు ఫ్రెంచివారికిని జరిగిన సంధికి నక లిందుతోఁ బంపినాను. మీా రది యింగ్లీషు గవర్నర్ జనరల్‌గారికిఁ జూపవలయును. ఫ్రెంచివా రిందుఁ బ్రవేశించు టకుఁ బూర్వమే యింగ్లీషువారు తమసైన్యము నిందుఁ బంపి యీాయవనరాక్షసుని నడఁచనియెడల కంపనీవారి రాజ్యమునకే మిగుల భయము కలుగఁగలదు. అప్పు డందఱిప్రాణములకును మోసము రాఁగలదు. ఇదివఱకు రెండుమూఁడుసారులు జరిగిన టుల మరల నింగ్లీషువారు విలంబము చేసినయెడల ఫ్రెంచివారు టిప్పుతోఁ గలసి భయంకరమైన యగ్నియుఁ బ్రచండమారుత మును గూడినట్టులయి సకలదేశములను బాడుచేసి ప్రజాసంహార మొనరింతురు. ఇంగ్లీషు గవర్నరుకు మావిజ్ఞాపనము గూర్చియు, మాప్రాణరక్షణమునుగూర్చియు, చింత లేకుండినను కంపనీవారి రాజ్యమును రక్షించుకొనుట కైనను సైన్యమును అతి త్వరిత ముగా నిందుఁ బంపవలయునని నీవు అతనితోఁ జెప్పుము. అంత వఱ కెట్లయిన మేము మాప్రాణములను రక్షించుకొనెదము.

రాజ్యము మాకు లభించిన పక్షమున హూణులకు నొక కోటిరూపాయ లియ్యఁగలము. వారు సలివ్హాన్ దొరగారితో నైన కరారునామా చెల్లింపవలయును. సలివ్హాన్ మొదలగు సరదార్ల కందఱకు నగ్రహారము లిచ్చెదము. ఈయవనరాక్ష సుఁడు అతిక్రూరుఁ డయినందువలనఁ బ్రజల కధికబాధ కలుగు చున్నది. అందువలన సేనలోని సైనికు లందఱును వానికి విరుద్ధముగానున్నారు. ఇట్టిసమయమున నింగ్లీషు సైన్యమునకు నిచటి సైనికు లధిక సహాయము చేయఁగలరు. ఇచట నున్న

వారందఱును వాని నాశమునే కోరుచున్నారు. ఇంగ్లీషుసైన్య మేవంకను వచ్చినను వారి భోజనపానాదులకు సామగ్రి కావలసినంత, యేమియు నాటంకములేక దొరకును. కాన మీరు మీ సామర్థ్యమునంతను వ్యయపఱచి యుద్ధప్రయత్నముఁ జేసిన యెడల శ్రీరంగనాథుఁడు తప్పక మీకు సహాయుఁ డౌనని నమ్మెదను."

ఆకాలమున మైసూరులోనుండు రాజకీయస్థితులన్నియు నీయుత్తరమువలనఁ గన్నుల యెదుటఁ గానఁబడుచున్నవి. అట్టి భయంకర సమయమునందు యవనరాక్షసుఁడగు టిప్పువకు విరుద్ధముగాఁ బ్రయత్నము చేయుట యెంతదుస్తరమై యుండునో చదువరు లీయుత్తరమువలననే యోచింపఁగలరు. ఇట్టిమహాసంకట సమయమునందు లక్ష్మమ్మాన్ని యెంతమాత్రమును చలింపక, నిస్తరంగ సముద్రమువలె శాంతిని నవలంబించియు, నచల పర్వతమువలె ధైర్యమును స్వీకరించియు నుండెనని యాచి మెట్టిధీరులును గద్గదకంఠులుగాక మానరు. స్త్రీల యచల ధైర్యమునకొక యత్యుత్కృష్టమైన యీ యుదాహరణము హిందూదేశ చరిత్రకారులు సువర్ణాక్షరములతో వ్రాసియుంచ వలసిన దనుటకు సందేహము లేదు.

తరువాత పూనాపేష్వాలును, హైదరాబాదు సైన్యమును, ఇంగ్లీషువారును గూడి ౧౭౯౯ వ సంవత్సరమున టిప్పుతోఁ జేసిన యుద్ధ మితిహాసముఁ జదివినవారి కందఱకును విదితమే. కాన నిందు నాయుద్ధమును వర్ణింపఁ బనిలేదు. శ్రీరంగపట్టణమున జరిగిన ఘోరసంగ్రామమునందు టిప్పు మేనెల ౪వ రోజున హతుఁడై

నందున, మైసూరు సింహాసనము బంధముక్త మయ్యెను. ఆ
యుద్ధమునందు లక్ష్మమ్మాని యింగ్లీషువారికి నధిక సహాయము చేసి
నందున వారికి నామెయందు నధిక గౌరవము గలిగెను. యుద్ధము
సమాప్తము కాఁగానే యాంగ్లేయు లామె నధికముగాఁ గొని
యాడి, మైసూరు రాజ్యమునం దామె చెప్పినచొప్పునఁ నేర్పాటు
లుచేసిరి. రాణి లక్ష్మమ్మానియుఁ దనబుద్ధికిఁ దోడువయోవృద్ధుఁ
డును, విచారజ్ఞుఁడును, నైన పూర్ణయ్య యను మంత్రిపుంగవుని
యాలోచన గ్రహించి, యింగ్లీషువారితోడ చేయవలసిన సంధిలోని
షరతులన్నియు నిర్ణయించెను. ఆమె యాలోచనప్రకారము
మైసూరురాజ్యము కృష్ణరాజవడియారునకు నియ్యఁబడెను. ఇట్లు
ప్రాచీనరాజ్యమును తన స్వబుద్ధిబలముచే మరల స్థాపించి యీ
స్వాభిమానవిభూతి గలదైన స్త్రీ కృతకృత్యురాలాయెను. తిరు
మలరావుగారికి దివాన్గిరి యియ్యవలయునని యామె కధికమైన
యిచ్ఛయుండెను. కాని యామెగారి యిచ్ఛలలో నదిమాత్రము
కొనసాగినదికాదు. రాజ్యతంత్రము లన్నియుఁ బురాతనప్ర
ముఖ్యుఁడగు పూర్ణయ్యగారే నడుపుచుండెను.

రాజ్యములోని వ్యవహారములన్నియు యథాప్రకారముగా
జరుగ నారంభమైనపిదప రాణీగారు పరమార్థవిచారమునందుఁ
గాలము గడుప నిశ్చయించిరి. పరమేశ్వరునియందు నామెకు
నధిక విశ్వాసమును, భక్తియుఁ గలిగియున్నందుననె యామె మహా
త్తరములైన సంకటములను భరించి సౌఖ్యోన్నతశిఖరమునకుఁ
ప్రవేశింపఁగలిగినది. అందువలననే యామె యెల్లప్పుడును భక్తి
రసపరిపూర్ణతచేఁ దన్మయతనొంది దీనదయాళుఁడగుపరమేశ్వరుని

ధ్యానించుచుండెను. ఇట్లు కొన్ని దినములు భక్తిలోఁగడపి యా యద్వితీయ స్త్రీ పరమపదము నొందెను. ఈమె యేసంవత్సరము నందు మృతిఁజెందినది స్పష్టముగాఁ దెలియలేదు. కాని ౧౮౧౦ వ సంవత్సరములోపల మృతిఁబొందె నని చెప్పవచ్చును. ఈమె భర్తయనంతరము ౪౫ సంవత్సరములు జీవించెను. ఇంతకాలములో నామె కనేకస్థిత్యంతరములు ప్రాప్తించెను. వాని నన్నిఁటిని నామె తనబుద్ధిబలముచే, ధైర్యగుణముచే నివారించి తుదకు స్వాతంత్ర్యసుఖమును అనుభవించెను. మైసూరు దేశముయొక్క యితిహాసము వ్రాసిన కర్నల్ విల్క్సు లక్ష్మ్మాన్ని నిగూర్చి ౧౮౦౧ సం॥లో నిట్లు వ్రాసియున్నాఁడు. "ఈవృద్ధరాణి లోకపూజ్యయు బహువిచారశీలయునై యున్నది. ఆమె చరిత్రమును, ఆమె యనుభవమును, ఆయనుభవములవలన నామెకుఁదోఁచిన సద్విచారములును, అత్యంతప్రశంసనీయములై యామె బుద్ధివైభవమునకు ద్యోతకములగు చున్నవి." మృత్యుసమయమునం దామెవయస్సు రమారమి యెనుబదిసంవత్సరము లుండెను. అంత వృద్ధావస్థయందును ఆమె యింద్రియపటుత్వము చెదరకుండెనఁట! ఆపద్దశయందు ధైర్యమును అవలంబించినటుల నీమహాసాధ్వి యధికారపు దినములలో శాంతియు, భూతదయయు నవలంబించెను. సేవకుల నెప్పుడు దయాదృష్టితోఁ జూచుట యామెకు లోకవ్యసనమైయుండెను. పేదల కీమె చేసిన యపరిమిత సహాయమునుబట్టి లోకు లీమెను మైసూరుప్రాంతమునందు నిప్పటికిని 'మహాశ్రీలక్ష్మ్మాన్ని' యను దురు. ఆహా! ఇట్టి స్త్రీరత్నము లేకదా భరతఖండమునకు లలామభూతలగుదురు.

# తోరూదత్తు.

క. సుకృతాత్ములు రససిద్ధులు
సుకవీంద్రులు విజయనిధులు సుమ్ము తదీయా
ధికకీర్తిశరీరంబులు
ప్రకటజరామరణజన్మభయరహితంబుల్.

పాశ్చాత్యవిద్య లగు గ్రీకు మొదలయినభాషలయందుఁ నసారపాండిత్యముఁ గలిగి, ఆయాభాషలయందుఁ గవిత్వము చెప్పియు, గ్రంథములు వ్రాసియుఁ, బ్రసిద్ధి కెక్కిన హిందూపురుషులే యరుదై యుండఁగా, నట్టిస్త్రీ లుండుట యసంభవమే యని చెప్పవచ్చును. కాని మన మసంభవము లనుకొనినసంగతులే ఈశ్వరుని దివ్యప్రభావమువలన సంభవములయి మనకు నాశ్చర్యమును, ఆనందమును, గలిగించుచున్నవి. ప్రస్తుతకథానాయిక యగు తోరూదత్తు నామాంతరము గల తెరులతాదత్తు విషయమీచిత్రములలో నొక విచిత్రమయి యున్నది. ఈమె జనకుని పేరు బాబూ గోవిందచంద్రదత్తు. దత్తుగారు క్రైస్తవధర్మమును స్వీకరించిన హిందువులు. ఈయన నివాసస్థలము హిందూదేశమునకుఁ బ్రస్తుతరాజధాని యయిన కలకత్తానగరము. ఆనగరమునందాయన న్యాయాధికారిగా నుండెను. స్త్రీవిద్యయం దీయనకు నధికప్రీతి యున్నందున నీతఁడు తనచే నయినంతవఱకు స్త్రీవిద్యాభివృద్ధికై పాటుపడుచుండెను. ఆయనయిచ్ఛపూర్తిచేయఁ గాఁబోలు నీశ్వరుఁ డతనికిఁ ద్వరలోనే యాఁడుసంతతి నిచ్చెను.

అందు నందఅకంటెను చిన్నకూఁతు రగుతరులత కలకత్తాలో ౧౮౫౬ వ సంవత్సరమునందు జన్మించెను. ఈమె బాల్య మంతయు నానగరములోనే గడిచెనని చెప్పవచ్చును. తరులత యందఱికన్న కడసారికూఁతు రగుటచే నామెను అందఱును "తోరు" అను ముద్దుపేరు పెట్టి పిలుచుచుండిరి.

తోరుదత్తు తండ్రి విద్యాభిమాని యయినందున నితర బంగాళ స్త్రీలకు విద్యార్జనమునందుఁ గలుగు నిబ్బంది లేమియు లేక విద్య నభ్యసించుటకు నితర బాలికలకు నలభ్యమగు సాధనము లెన్నియో యీయామెకు బాల్యమునుండి లభించెను. ఈమె తండ్రి యత్యుత్సాహముతో నీమెకును, పెద్దకూఁతు రగు అరు బాయికిని విద్య గరపెను. పిదప కుమారుఁ డగు అబాజీతో నీయాఁడుబిడ్డలకును ఇంగ్లీషు నేర్పుటకు బాబుశివచంద్ర బనర్జిగారిని గురువునుగా నియమించిరి. గురువగు బనర్జి తోరుయొక్క బుద్ధికుశలతఁ గనిపెట్టి విశేషశ్రద్ధతో నేర్ప నామె యింగ్లీషువిద్య యందు నధికప్రీతి గలిగినదై బహు శీఘ్రముగా విద్యార్జనము చేయుచుండెను. ఇట్లు విద్యార్జనముఁ జేయఁ గొంతకాలము లోనే యీయామెకును ఆమెయక్కకును ఇంగ్లీషుభాషలోని మహాకావ్యములయొక్క యర్థము స్వయముగా గ్రహించునంత శక్తి గలిగెను. "ఘనతవహించిన మిల్టను కవివరుని గ్రంథముల నీయక్క చెల్లెండ్రు పఠనగ్రంథములుగాఁ గైకొని, తమతో సమమైన యీడుగల యాంగ్లేయబాలికలకంటె నెక్కుడుగా నర్థమును గ్రహింపఁ గలిగి కవితాప్రవాహాదులను జూచి యత్యద్భుతముఁ బొందుచు వచ్చిరి." అని యొక చరిత్రకారుఁడు వీరినిగుఱించి

వ్రాసియున్నాఁడు. ఈజాన్ మిల్టనుకవి యింగ్లీషుకవులలో బహు గొప్పవాఁడఁట. ఆయనగ్రంథములు ప్రథమశాస్త్రపరీక్షకును బట్ట పరీక్షకును, మఱియితరమయిన గొప్పగొప్పపరీక్షలకును, బఠనీయ గ్రంథములుగా నుంచెదరఁట. గొప్పగొప్ప విద్యార్థులకును ఈయన గ్రంథములలోని యర్థము తెలియుట కష్టమఁట. వానిలోని యంతరార్థము తెలియుట యంతకంటె దుర్లభమఁట. సంస్కృతములోని మాఘనైషధ కావ్యములయొక్కయు ఆంధ్రములోని వసుచరిత్రముయొక్కయుఁ బాకముమీఁదనే యీకవియొక్క కావ్యములును దిగినవఁట. ఇట్లయ్యును ఈకవియొక్క కావ్యముల లోని రహస్యములు చిన్నతనమునందే కనిపెట్టిన తరులదాదత్తు యొక్క బుద్ధివైభవమును వైవిధ్య మనియే చెప్పవలసి యున్నది.

౧[illegible]వ సంవత్సరమునందుఁ బుత్రమరణదుఃఖితుఁ డగు గోవిందచంద్రదత్తుగారు, కన్యలే తమకుఁ బుత్రులని యెంచి వారివిద్యాభివృద్ధికయి వారిని యైరోపాఖండమునకుఁ గొని పోయెను. వారికి ఉన్నతవిద్య నేర్పఁదలఁచి, ప్రథమమునం దాయన ఫ్రాన్సుదేశమునకుఁ బోయి 'నీసు' నగరమునందు వసిం చెను. అచట నాసోదరీమణు లిరువురును తమబుద్ధిబలిమిచే విద్యార్థివేతనముల సంపాదించుకొనుచు, ఫ్రెంచువిద్వాంసుల నాశ్రయించి ఫ్రెంచుభాష నేర్చుకొనిరి. కొన్నిరోజులు వీరు ఫ్రాన్సుదేశమునకు రాజధానియయిన పారీసునగరములో నుండిరి. అచ్చట ఫ్రెంచువిద్య చక్కఁగా నేర్చుకొని యీముగ్గురును ఇటాలీదేశముఁ జూచి లలితకలావిద్యలకుఁ బుట్టినిల్లయిన ఇంగ్లాం డునకు వెళ్ళిరి. ౧౮౭౩వ సంవత్సరమువఱకు వారచట నుండిరి

వా రా కాలమునందును వ్యర్థముగాఁ గాలము గడపక యింగ్లీషు ఫ్రెంచుభాషలయం దసాధారణప్రవీణత సంపాదించిరి. వారు కేంబ్రిడ్జి పట్టణము (మనకాశీపట్టణమువలె నీ గ్రామ మింగ్లండు నందు నొకగొప్పవిద్యాపీఠము) నం దుండి బ్రేగ్నెల్ దొరసాని గారు ఫ్రెంచుభాషయందు నిచ్చిన యుపన్యాసములకుఁ దప్పక పోవుచుండిరి. తదనంతరమందు వా రిరువురును సెంటులియోనార్డ్సుపట్టణమునందు తమ ఫ్రెంచు విద్యను వృద్ధిపఱిచిరి. యూరపు ఖండమునం దున్న కాలమున తోరుదత్తు తననిత్యప్రవర్తన నిత్యము వ్రాయఁ దొడఁగెను. ఆపుస్తకమునందు ననేకసంగతు లామె మిగుల శ్రద్ధతో వ్రాయుచుండెను. నిత్యము జరిగినసంగతు లాపుస్తకమునందు నత్యంతశ్రద్ధతో నతివివరముగా వ్రాయఁ బడినవి. అందు నామె యనేక సంగతులను గుఱించి తనసొంత యభిప్రాయము వ్రాసియున్నది. ఆయభిప్రాయము లెంతయో రమ్యముగా నున్నవఁట.

ఈచిన్న కుటుంబము ఫ్రాన్సు దేశమునకంటె నింగ్లీషు దేశమునసే విశేషదినములుండుట తటస్థించినను, తోరుదత్తుకు ఫ్రాన్సు దేశమునందే విశేష గౌరవము కలిగియుండెను. జన్మభూమి యయిన హిందూ దేశముపయి నామె కెంతప్రీతి యుండెనో యంతప్రీతి ఫ్రాన్సు దేశముమీఁద నుండెను. ౧౮౭౦ వ సంవత్సరమున ఫ్రాన్సు దేశమునకును, జర్మనీ దేశమునకును జరిగిన ఘోరరణమునందు ఫ్రాన్సునకుఁ బరాభవము కలిగినప్పుడు చూడ నోపక తోరుదత్తు తననిత్యప్రవర్తన గ్రంథమునందు నిట్లు వ్రాసెను. "నేను వెనుక దినచర్య వ్రాసి యెన్నియోదినములు

గడిచెను. అయ్యో! ఈయవకాశమునందు ఫ్రాన్సు దేశమున నెన్ని యోమార్పులు గలిగినవి. పారీసునగరమునందు మేమున్న స్వల్పకాల మాపట్టణ మెంతయో రమణీయముగా నుండెను. అచటి రాజమార్గము లత్యంత రమ్యములుగా నుండెను. ఆ దేశములోని సైన్యము లన్నియు నత్యంత సువ్యవస్థతో నుంచఁబడెను. అట్టి వైభవసంపన్న మగుపట్టణము నేఁ డిట్లు హీనదశకు వచ్చుటఁ గన నా కత్యంత దుఃఖకరముగా నున్నది. పృథ్విలోని సర్వపట్టణములలో నధిక మయినదని ప్రసిద్ధిఁ జెందిన పట్టణమున కిట్టి దీనావస్థ గలుగుటఁ గని యెవరికి హృదయము కరఁగ కుండును? ఫ్రాన్సు దేశీయులకును జర్మనీ దేశీయులకును యుద్ధమారంభమైన నాఁటనుండియు నామనసంతయు ఫ్రాన్సు దేశజయమునే కోరుచుండెను. తుదకిట్లుగాక ఫ్రాన్సు దేశమునకే పరాభవము కలుగుట మిగుల వ్యసనకరము" ఈవాక్యములవలననే యామెకు ఫ్రాన్సు దేశమునందుఁ గలగౌరవాతిశయము వెల్లడి యగుచున్నది. ఆ దేశమునందుఁ దనకుఁ గలగౌరవమును తోరూదత్తు ఇంగ్లీషునందు స్వయముగా నొకపద్యకావ్యము రచించి వెల్లడించెను.

౧౮౭౦వ సంవత్సరమున కొమార్తెలను దీసికొని గోవిందచంద్రదత్తుగారు తిరిగి కలకత్తా ప్రవేశించిరి. ఇంటికి వచ్చిన పిదప తోరూదత్తు ఇంగ్లీషు ఫ్రెంచుభాషలయందు నధిక పరిశ్రమ చేయుచు, తండ్రిగారియొద్ద సంస్కృతమును నేర్చుకొన నారంభించెను. ఈసమయమునందే యామెకు పద్యగద్యకావ్యములు వ్రాయుటకు విశేషస్ఫూర్తి కలిగెను. అందుపై నామెతండ్రి కవిత్వము చేయుటకై కవిత్వస్ఫూర్తిని వృద్ధిపఱచుటకై కొమా

ర్తైను సదా ప్రోత్సాహపరచుచుండెను. అందువలనఁ దనకుఁ గవిత్వశక్తి లభించి దృఢపడినదని తోరూదత్తెల్లప్పుడును తండ్రిగారియెడ మిగుల కృతజ్ఞురాలయియుండెను. ఇటులఁ సదా తండ్రి తనపుత్రీపుత్త్రులను జ్ఞానవంతులఁ జేయవలసినవిధి. ఇటులఁ సదా పుత్రీపుత్త్రులు తమమాతాపితలయెడఁ గడుఁగృతజ్ఞులయి యుండవలసినవిధి.

ఇట్లు గోవిందచంద్రదత్తు తనకొమార్తెలకు విద్యాబుద్ధులు చెప్పించి పుత్రులవలెనే పెంచుట జూచి కొందఱాశ్చర్యపడుదు రేమో. కాని యట్లు ఆశ్చర్యపడుటకుఁ గారణము లేదు. పుత్త్రికలను పుత్త్రులవలెఁ జూచుటయే శాస్త్రధర్మము. కన్యా వివాహ సమయమునందుఁ దండ్రి 'పుత్త్రివత్పాలితామయా' 'పుత్త్రునివలె నాచేఁ బెంచఁబడిన కన్య' యని చెప్పుట సర్వప్రసిద్ధ మేకదా. ఇదియుఁగాక మునిశ్రేష్ఠుఁడైన మనువు పుత్త్రీపుత్త్రులు సమానమని స్పష్టముగా వ్రాసియున్నాఁడు.

యథా వాత్మా తథాపుత్రః పుత్రేణ దుహితా సమా.

"తనతో సమానుఁడు పుత్త్రుఁడు, పుత్రునితో సమానము కూఁతురు."

శాస్త్రము లిట్టుల నుద్ఘోషించుచుండఁగా మన దేశమునందు బాలికలను బాలురకంటె నతినీచముగాఁ జూచుటఁ జూడ మిక్కిలి ఖేదకరముగా నుండకమానదు. ఆఁడుపిల్ల పుట్టిననాటి నుండియుఁ దలిదండ్రులకు మిక్కిలి ఖేదకరముగా నుండకమానదు. ఆఁడుపిల్ల పుట్టిననాటనుండియుఁ దలిదండ్రులు మిక్కిలి ఖేద ముతో నుండెదరు. పెద్ద పెరిగినకొలఁది పుత్త్రికలను పుత్త్రులవలెఁ జూడక యెటులనైనఁ బెంచవలయునని యెంచుదురు. ఇట్లనుట

వలన నాఁడుపిల్లలను దయతోఁ బెంచువారే యీ దేశమునందు లేరని నాతాత్పర్యము కాదు. అట్టి సజ్జనులుగూడ నున్నారు. కాని, యీ దేశములోని యాఁడుపిల్లలలో నూటికి తొంబదితొమ్మండ్రుబాలికలు నేను చెప్పినప్రకార మత్యంతాలక్ష్యముతోఁ బెంచఁబడుచున్నా రనుటకు సందేహము లేదు. ఆంధ్రమహారాష్ట్ర దేశముల బాలికలస్థితి యంతశోచనీయముగా లేదు. కాని బంగాళా పశ్చిమోత్తరపరగణాలు మొదలయిన దేశములలో నాఁడుపిల్లలు కలుగుట కుటుంబమునకు నొక గొప్పసంకటము ప్రాప్తించుటయే యని యెంచెదరు. ఇట్లు మన దేశమునందు బాలికలకు నత్యంత దురవస్థ ప్రాప్తించుటకుఁ గారణము, స్త్రీలన్నిసంగతుల యందును పురుషులకంటెఁ దక్కువ వారని మన దేశమునందుఁ గల వాడుకయే. ఈవాడుకకుఁ గారణము, స్త్రీల యజ్ఞానదశ. కాన, స్త్రీవిద్యాభివృద్ధియైనఁ గాని బాలికలకు నిట్టి యవస్థ తప్పదు గనుక దేశాభిమానులగు సహోదర సహోదరీమణులారా! మీరు దత్తుగారివలె మీ బాలకులను బాలికలను సమానప్రీతితోఁ జూచుచు బాలికలకు బాలురకువలె నింగ్లీషు గ్రంథములు చెప్పించకపోయినను, మీమాతృభాషయైనఁ జెప్పి దేశక్షేమమునకుఁ దోడగుదురని నమ్ముచున్నాను.

బంగాళాస్త్రీ పరకీయభాషయందు నుత్తమకవిత్వముఁ జెప్పి ప్రసిద్ధిగాంచునని యాసమయమునం దెవ్వరును స్వప్నమందైనను అనుకొనినవారు కారు. అట్లగుట సాధ్యమని చెప్పిన నెవ్వరును నమ్మకుండిరి. మన దేశపుస్త్రీ లనేకశతాబ్దములనుండి యజ్ఞానాంధకారమునకుఁ బుట్టినిల్లు చేయఁబడినందున, హిందూ

దేశమునందలి యొక యబల యీపద్యముల వ్రాసెనని యెవ్వరును తలఁపరైరి. తోరూదత్తు ప్రథమమున నొకఫ్రెంచుకవిని గూర్చి యొక వ్యాసమువ్రాసి యొకమాసపత్రికలోఁ బ్రసిద్ధపఱిచెను. ఆపత్రిక యందు నామె ఫ్రెంచుభాషయందలి యనేక పద్యముల నింగ్లీషునందు భాషాంతరీకరించి యచ్చు వేయించుచుండెను. ఆకాలమునం దాపత్రికను జదివినవారి కామె వ్రాసిన వ్యాసములును పద్యములును బహు ఆనందముఁ గలిగించుచుండెను.

ఇంతలో ౧౮౭౭వ సంవత్సరమునం దీమె యక్కగారగు ఆరూబాయి క్షయరోగమువలనఁ బరలోకవాసిని యయ్యెను. ఆరూబాయి కవిత్వకల్పనలయందుఁ జెల్లెలికంటె దక్కువ నేర్పరియైనను, బంగాళీ, యింగ్లీషు, ఫ్రెంచుభాషలయందలి పాండిత్యమునందు తోరూతో సమానముగా నుండెను. ఈ యువతీయు బహు సాధువృత్తియైయుండెను. ఆమెకు నేకాంతవాసమునం దుండుటయే యధికసౌఖ్యకరమై యుండెను. ఆరూబాయికిఁ దన పేరు ప్రసిద్ధి యగుట యెంతమాత్రమును ఇష్టము లేకుండెను. కాని యామె తనచెల్లెలి కవిత్వస్ఫూర్తినిఁ గని సంతోషించుచుండెను. ఈమె పటములను వ్రాయుటయందు మిగుల ప్రవీణురాలుగా నుండెను. ఈయక్కచెలియం డ్రిద్దఱలో తోరూదత్తు గ్రంథములను రచించునట్లులను, ఆరూబాయి యాగ్రంథములకు ననుకూలము లయిన పటములను వ్రాయునట్లులను, నియమించుకొనిరి. కాని, యయ్యంతయు నారూబాయి మరణముతో నడఁగెను. ఈయక్కచెలియం డ్రిద్దరును గాయనమునం దసమాన

ప్రజ్ఞగలవారై యనేక వాద్యములను బహు కుశలతతో వాయిం
చుచుండిరి. వీరు తమవిద్యాభ్యాసమును చేయుచు సాధారణ
కుటుంబపుస్త్రీలవలెనే తమగృహకృత్యములను చక్కఁబెట్టుచుం
డిరి. 'ఆఁడుది చదివిచెడె' నన్నమూర్ఖపులోకోక్తి యబద్ధమనియు
'చదువక మగవాఁడు చెడె' నన్నలోకోక్తివలెనే 'చదువక
యాఁడుదిచెడె' నన్నలోకోక్తియే నిజమని యీయక్కచెల్లెండ్రు
ఉదాహరణపూర్వకముగా స్థాపించి రనుటకు సందేహము లేదు.

తోరూదత్తు అన్నిపనులయందును చురుకుఁదనముఁ జూపు
చుండెను. ఆమెకుఁ బ్రతిపనియందును గల బుద్ధికుశలతఁ జూచి
యామెతండ్రి మిక్కిలి యద్భుతము నొందుచుండెను. ఆమె
జ్ఞాపకశక్తి బహు యద్భుతము. ఆమె రచించిన పద్యము లన్ని
యు, నామెకుఁ బాఠముగా నుండెనఁట. సంస్కృత, బంగాళ,
ఇంగ్లీషు, ఫ్రెంచు, భాషలలోని మహాకవీశ్వరులపద్యము లనేకము
లామెకుఁ గరతలామలకములై యుండెనఁట. ఆమె తాను చది
విన గ్రంథముల నన్నిఁటిని తిరిగి యొకసారి మననము చేయుచుం
డెను. ఒకానొకచోటఁ దనకర్థము తెలియకుండిన మరలమరలఁ
జదివి, యందలి యర్థమును గనుఁగొనినఁగాని ముందు చదువునది
కాదు. ఇటుల నామె మానసోన్నతియందు మిగుల తత్పరు
రాలై యుండెను. తోరూదత్తు తనయక్క గతించినపిదపను
ధైర్యము విడువక తనప్రయత్నమును మాన కుండెను. ఈమె
రచించిన 'పద్యసముదాయము'ను ప్రథమగ్రంథము ౧౮౭౬లో
వెలువడెను. దానియందు ఫ్రెంచుకవీశ్వరుల కావ్యములనుండి

యింగ్లీషుభాషకు భాషాంతరీకరింపఁబడిన పద్యరూపముననున్న చిన్నచిన్న కథలుండెను.

అందు పీఠికస్థానమున నొకపద్యము వ్రాసి యీగ్రంథము తనతల్లికిఁ గృతియిచ్చినటులఁ జెప్పెను. ఇందుచే నీమె మాతృభక్తి వెల్లడి యగుచున్నది. ఈగ్రంథము మొట్టమొదట బంగాళా దేశమునందలి భవానీపురమునందు నచ్చువేయఁబడెను. కాగితములు బహు సన్ననివిగాను, అచ్చు అంటిముంటనగలుగాను, ఈపుస్తకము గుజిలీ పుస్తకముగా నచ్చువేయఁబడెను. లోకములోఁ బైసౌందర్యముఁ జూచి భ్రమించు వాఁడుకగలదు. కాన నదిమంచిగ్రంథమేయైనను దాని బహిరంగము చూచుట కింపుగా లేనందున నందలి పద్యరత్నములను చదువుట కాకాలమునం దెవరికిని బుద్ధిపుట్టదయ్యెను. అందువలననే యీకవయిత్రీపుస్తకము మనదేశమునందా కాలమున మెప్పువడయకుండెను. ఇట్లు బయిటిదంభమునకే ప్రాపకువారనేకు లుండినను, ఈజగత్తునందు సత్యశోధకులును, సద్గుణపరీక్షకులును నూటికి కోటికి నైన నొక్కరు గానఁబడకపోరు. ఇట్టి రసికు లుండుటవలననే కవిత్వాదివిద్యలు వృద్ధిఁబొందుచున్నవి. తోరుభాగ్యమువలన నిట్టి రసికుఁ డొకఁడు, ఇంగ్లీషుదేశమునం దుండెను. దైవవశాత్తుగ నీపుస్తక మాయనచేతఁబడుట సంభవించెను. ఈగుణగ్రహణపారీణుని పేరు ప్రొఫెసర్ ఎడ్మండ్ గాస్. ఆపుస్తకముఁ జదివి యతఁడు ఇంగ్లీషుదేశమునందలి "ఎగ్జామినర్" అను వార్తాపత్రికయందు దాని నిట్లు ప్రశంసించెను. "ప్రొ. మింటోదొరగారు 'ఎగ్జామినర్' అను వార్తాపత్రికాధిపతిగానున్న సమయమునం

యొకదినము నేను వారి కార్యస్థానమునకుఁ బోవుట సంభవించెను. అపు డాయన తనయొద్దకు నభిప్రాయమునకై వచ్చిన పైని హిందూస్థానముద్రగల, యొకపుస్తకము నాచేతికిచ్చెను. ఆపుస్తకము చూచుట కసహ్యముగా నగుపడుచుండెను. అది భవానీపురమునందలి సప్తాహికసంవాదమను ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది. ఇది రెండువందలపుటములుగల పుస్తకము. దీనియందు నుపోద్ఘాతము మొదలైన వెంతమాత్రమును లేవు. దానిఁ జూచినతోడనే చిత్తుకాగితముల బుట్టలోఁ బాఱవేయవలయునని తోఁచును. అందలి, సగము అంతయంటని యక్షరములఁ గనిన దానిలో సూక్ష్మకవిత్వము కలదని తోఁచకుండుట యొక వింతకాదు. కాని, పుస్తకము విచ్చి దానియందలి పద్యమొకటి చదివినతోడనే నాకుఁ గలిగిన యానందాశ్చర్యములు వర్ణింపశక్యముకాదు.'' తోరూదత్తు రచించినగ్రంథములన్నిఁటిలో నిది ప్రథమప్రయత్నమే యైనందున ఈకావ్యము తదనంతర మామెచే రచియింపఁబడిన కావ్యములంత రసవంతమైనది గాక యుండుట సహజము. అయిన నట్టిగ్రంథమే పాశ్చాత్యపండితులచేఁ గొనియాడఁబడినప్పుడు ఆమెచే రచింపఁబడిన యితరకావ్యము లెంతరసవంతములై యుండునో చదువరులే యూహించుకొనఁగలరు.

తోరూదత్తునకుఁగల యింగ్లీషుఫ్రెంచు భాషాజ్ఞానము ఈమెకంటె నధికవయస్కురాండ్రగు ఇంగ్లీషుఫ్రెంచు స్త్రీలలోనే కానవచ్చుటయే దుర్లభము. ఈరెండుభాషలును తోరూదత్తునకుఁ బరభాషలేయైనను వానియం దామె స్వాభావికమైనే కవిత్వము

చేయుటఁ గని లోకు లాశ్చర్యపడుచుండిరి. ఈమె కవిత్వ ములో విశేషభాగము భాషాంతరీభూత మైనను, అందు కవిత్వ మునకుఁ గావలసినలక్షణము లన్నియు ననఁగా శబ్దసౌష్ఠవము, అర్థగాంభీర్యము, రసపుష్టి మొదలైన గుణము లున్నందునఁ జదువరుల కామెకావ్యములు భాషాంతరీకృతములుగాఁ దోఁచక స్వతంత్రరచనగానే తోఁచుచుండెను. తోరూదత్తు 'ప్రాచీన హిందూస్థానములోని పాటలు' అను కావ్యమొకటి రచించెను. ఆకావ్యమునకు ప్రొ. గ్యాస్ దొరగారొక పీఠికవ్రాసిరి. అందు నాతఁ డు "పందొమ్మిదవశతాబ్దములోని కవులచరిత్రమును వ్రాయు నప్పుడు తోరూదత్తుచరిత్రమును వ్రాయవలసియుండును" అని వ్రాసియున్నాఁడు. ఆంగ్లేయునిచే నిట్లు స్తుతివడసిన నారీరత్నమును స్తుతించుటకు నే నెంతదానను ?

ప్రథమగ్రంథ మచ్చుపడిన కొద్దిదినములకే తోరూబాయికి వ్యాధిసంభవించెను. అందువలన నామె, తండ్రిబలవంతముచే సంస్కృతాధ్యయనమును మహాకష్టముతో వదలివేసెను. రోగ ము, నడుమనడుమ తగ్గినట్లు కనఁబడుచుండినను దినదిన మామె సత్తువ తగ్గుచుండెను. ఆమెకు బలము క్షయించినకొలఁదిని కవిత్వ ధోరణి యధికమయ్యెను. తానీప్రపంచమునందుండుట కొద్దిదిన ములవఱకేయనితోఁచినకొలఁదిని కావ్యములువ్రాసియజరామరణ కీర్తిని సంపాదించవలయునను ఇచ్ఛ యామె కెక్కువగాఁ గలుగు చుండెను. ఆసమయమునందు క్లార్కీసాబదేరను ఫ్రెంచు స్త్రీచే రచింపఁబడిన గ్రంథమొకటి యామె చదువుట తటస్థించెను. దాని నింగ్లీషున భాషాంతరీకరింపవలయునని యామెకు దృఢ

తరమైనయిచ్ఛ కలిగెను. అంత నామెభాషాంతరీకరణమునకు ననుజ్ఞ యిమ్మనిపుస్తకకర్త్రికిను త్తరము వ్రాసెను. అందుకునా గ్రంథకర్త్రి యనుజ్ఞ నిచ్చెను. అప్పటినుండి వారికి నత్యంత స్నేహము గలిగినం దున, తోరూ ఆగ్రంథకర్త్రికిఁ గృతజ్ఞతాపూర్వకముగాఁ దన పటమును, సంస్కృతమునుండి తాను ఫ్రెంచులోనికి భాషాంతరీ కరించిన సరసపద్యములను బంపెను. ఆపద్యముల నాదొరసాని యెంతయో మెచ్చెనఁట! గాని యీదేశముయొక్కయు, విశేష ముగా నీ దేశములోని స్త్రీలయొక్కయు దౌర్భాగ్యవశమున విద్యావతియగు తోరూదత్తు ఫ్రెంచు గ్రంథకర్త్రియొక్క గ్రంథ మును భాషాంతరీకరింపకయే ౧౮౭౭న సంవత్సరమున నశ్వర మగు ప్రపంచమును వదలి శాశ్వతమగు పరలోకమున కరిగెను. ఈమె యంత్యసమయమునందుఁ జెప్పినవాక్యములవలన నామె శుద్ధాంతఃకరణము వ్యక్తమగుచున్నది. ఆసమయస్థితి నాయమ తండ్రిగా రిట్లువ్రాసిరి. ఆమె తనయంత్యదినములు సమీపింపఁగా తనకు మందిచ్చు డాక్టరుతో నిట్లనియె. 'శారీరకబాధను నేను సహింపఁజాలకున్నాను. కాని నాయాత్మకు నాయాస మెంత మాత్రమును లేదు. పరమేశ్వరునియందు నాకు దృఢమైన నమ్మకముగలదు.' ఈవాక్యములవలన నీమెకుఁ గల యనుపమేయ దైవభక్తి తెలియుచున్నది.

కొడుకుకొమార్తెల మరణముచే నదివఱకే దుఃఖితుఁ డయిన గోవిందచంద్రుఁడు తరులతామరణముచే నత్యంతవిహ్వలుఁ డయ్యెను. దుఃఖము కొంతశమించిన వెనుక గోవిందచంద్రదత్తు గారు తనప్రియపుత్రిక విద్యాభ్యాసముఁ జేయుగదిలోనికి నరిగి

చూడఁగా నాతనికి తోరు బాయి వ్రాసియుంచినకాగితములు కొన్ని దొరకెను. అందుపై నాతఁడు తోరు కృతగ్రంథము లన్నియు నచ్చువేయించ నిశ్చయించెను. ప్రథమమున తోరుబాయిచే వ్రాయఁబడినగ్రంథము రెండవకూర్పునందు దళసరి కాగితములపై సుందర మయినయక్షరములతో నచ్చువేయఁబడెను. దానితో కొకచిన్నయుపోద్ఘాతమును తోరుదత్తుచరిత్రము ఆతోబువారుల పటములును జేర్పఁబడెను. కావున పూర్వము పల్చని కాగితములపై ననహ్యముగాఁ దోఁచినగ్రంథమే యిప్పుడు పెక్కు చదువరులకు నత్యంత ప్రాజ్యమయ్యెను. దత్తుగారికి దొరకిన కాగితములలో పునపురాణకథల ననుసరించియు, వేదాంతకథలననుసరించియు, పూరాణభాషయందు రచించినకొన్ని చిన్నచిన్న కావ్యములుండెను. నవకావ్యముల రత్నముల మాలగ్రుచ్చవలయునని తోరుదత్తు సంకల్పించియుండెను. కాని వానియందు నేడుకావ్యములే వ్రాయఁబడెను. మిగిలిన రెండుకావ్యములకొఱకు విష్ణుపురాణమునుండి కొన్నికథలను భాషాంతరీకరింప నిశ్చయించెను. సంకల్పప్రకారము మామె యదివఱకే 'కలకత్తా రివ్యూ' 'బెంగాల్ మాగ్యజైన్' అను మాసపత్రికలయందుఁ గొన్ని కావ్యములను ప్రచురపఱచెను. ఈతొమ్మిదికావ్యము లొకపుస్తకముగా నచ్చువేయఁబడెను.

చావుముందర తోరుదత్తు "కుమారీ డార్వేరను ఫ్రెంచుస్త్రీ ఆత్మవృత్త" మను ఒకకథను వ్రాయఁబూనెను. పరదేశీయులను గూర్చి యిట్టికథలు వ్రాయవలెనన్న వారి యాచారవిచారములును, వారి దేశచరిత్రము మొదలయినవియు బాగుగాఁ

దెలియవలయును. తోరూదత్తా దేశముననుండిన స్వల్పకాలము లోనే యీసంగతుల నన్నిటిని తెలిసికొనెను. ఈకల్పనాకథా గ్రంథ మెంత యుత్తమమయినది యని చెప్పుటకువీలులేదు. కాని తోరూదత్తు జీవించి యాగ్రంథమును మరల దిద్ది యచ్చు వేయించి యుండినపక్షమున నింకనెన్న నుత్తమముగా నుండి యుండవచ్చునని చెప్పుటకు సందియములేదు. ఈగ్రంథమును బార్తెరను ఒకఫ్రెంచుస్త్రీ దిద్ది యుపోద్ఘాతము వ్రాసి ప్రచురపఱచెను.

కవయిత్రి యనియు, గ్రంథకర్త్రి యనియు మిగుల ప్రఖ్యాతిం బొందిన పేరులను యల్పకాలములోనే వాడిపోవుట యీదేశము యొక్క దౌర్భాగ్యమే యని చెప్పవలసియున్నది. అయినను ఒకకవి

చ. మనుజుని జీవితంపుం బరిమాణము నేండ్లచేతంగాక చే
సిన ఘనకార్యసంచయముచేత గణింపంగం జెల్లు నెప్పుడున్.

అని చెప్పినందున ఘనకావ్యనిర్మాణమును ఘనకార్యసంచయముచే, తోరూదత్తు 'జీవితంపుం బరిమాణము' అత్యల్పమయ్యెను, ఆమె దీర్ఘాయుష్మతియే—మృతకవియే—యని చెప్పవచ్చును.

# తారాబాయి

క. విదళింపను జుంకు సింగపుఁ
గొదమయు మదమలినగండకుంజరములపై
నిది బలశాలికి నైజము
గద ? తేజోనిధికి వయసు కారణ మగునే ?

ఈమె క్షత్రియవంశమునం దుద్భవించి తనయందలి యనేక సద్గుణములకుఁ దోడు శౌర్యమును సహితము ధరియించి మిక్కిలి వన్నెకెక్కెను. ఈమెకాలము గనుఁగొనుటకుఁ బ్రస్తుతమేమియు సాధనము లగుపడనందున విధిలేక యాప్రయత్నమును మాని యామెపవిత్రచరిత్ర మిం దుదాహరించెదను.

పూర్వము మ్లేచ్ఛరాజులకాలమునందు మనదేశమునందలి సంస్థానికులును, రాజులును, మిగుల కష్టదశయం దుండిరి. తురకలు చేయు నన్యాయమున కోర్వఁజాలక ప్రజలును మిగుల హీనస్థితియందు బాధపడుచుండిరి. అట్టిసమయమునందు రాజపుతానాలో, వేదనగరమను చిన్నసంస్థాన మొకటి యుండెను. సుర్థారనాథారావను నాయన అచటి ప్రభువుగా నుండెను. ఈయన పూర్వము మహాబలశౌర్యములు కలిగి శత్రువుల నోడించినవాఁడైనను పిదప మిగుల వృద్ధుఁ డగుటవలన వైరివీరుల నెదుర్చుటకు శక్తుఁడు గాకుండెను. ఇట్లుండ దిల్లాయను తురుష్కుఁ డొకఁ డాయనపై దండెత్తివచ్చెను. ఆమ్లేచ్ఛునితోడఁ బోరుటకు శక్తిలేక యారాజు రాజ్యము వానికి విడిచి తనముద్దుల

కూఁతురగు తారాబాయిని దోడ్కొని తక్షశిలా అనఁగా తకపూ
రనుస్థలమునకరిగి యచట వాసము చేయుచుండెను. ఆయనకీ
కొమార్తెతప్ప మఱి సంతానముకాని దగ్గఱియాప్తులుకాని లేకుం
డిరి. ఈకన్యకు బాల్యదశయందే మాతృవియోగము సంభవిం
చెను. కాన తండ్రి యామెను ప్రాణపదమునుగాఁ బెంచుచుం
డెను. అచట సూరథాన్‌రాయులు కన్యాసహితముగా నుండుట
విని యాతని పగతుఁడగు నామ్లేచ్ఛుఁడాతని నటనుండియుఁ బాఱఁ
దోలెను. కాన నతిప్రియమయిన తోదాపట్టణమును విడిచి
యతఁడు అబూయను పర్వతాగ్రమున వసియింపవలసినవాఁ
డాయెను. ఆసమయమునందు ప్రతిరాజునకుఁ దనరాజ్యము రక్షిం
చుకొనుట యత్యావశ్యకమై యున్నందున సూరథాన్‌రాయు
లడిగినను రాజులెవ్వరును అతనికిఁ దోడుపడరైరి.

సూరథాన్‌రాయులకీకన్యదప్ప పుత్రులు లేనందున నాకన్య
చేతనే తన పగతీర్పింప నెంచి యాతఁడాచిన్నదానికిఁ బుత్రునికిం
బోలె యుద్ధవిద్య నేర్పుచుండెను. ఆకన్యయు నాపర్వతప్రాంత
మునందుఁ దండ్రితోడనుండి యాతనికి సేవచేయుచు నాతఁడు
నేర్పిన రణవిద్య శ్రద్ధతో నేర్చుకొనుచుండెను. తారాబాయికిఁ
గొంచెము జ్ఞానము తెలిసినప్పటినుండియుఁ దండ్రి తనకు శస్త్ర
విద్యను నేర్పుటకుఁ గారణ మేమో తెలిసికొని యామె యధి
కోత్సాహముతో శస్త్రాస్త్రవిద్య నభ్యసించి యందుఁ బ్రవీణ
యయ్యెను. బాల్యదశనుండియు యుద్ధవిద్య నేర్చుకొనుటవలన
నామె శరీరము మిగుల దృఢమైనదియుఁ జపలతగలదియు నయ్యెను.
అభ్యాసమునను తండ్రి యుపదేశమునను దేహమువలెనే

యామెమనసుగూడ మిగుల కఠినమై వజ్రసమమయి యుండెను. ఆ బాల శుక్లపక్షచంద్రునివలెది నభివృద్ధిఁ బొందిన కొలఁదిని తండ్రికిఁ గలిగిన యవమానమున కెంతయుఁ గుందుచు నతని కట్టి యవమానముఁ గలుగఁ జేసినవానిఁ జంపి పగ తీర్చుకొనుటకు సమయము నెదురు చూచుచుండెను. ఆమె విద్యయందును శౌర్యము నందును నేప్రకార మసమానురాలో రూపమునందును అట్లే యనుపమేయమై యుండెను. తారాబాయి వివాహయోగ్య కాఁగా నామె సౌందర్యఖ్యాతివిని యామెను వరించి రాజపుత్రు లనేకులు వర్తమానము లంపసాగిరి. ప్రథమమునందు మేవాడ రాజపుత్రుఁడగు జయమల్లుఁడు తన కామె నిమ్మని కోరెను. కాని తండ్రిపగవాని నడఁపక వివాహమాడనని తారా బాయి నిశ్చయించుకొనినందున నారాజపుత్రునకు "ఎవఁడు నా జనకునిపగతునిఁ జంపునో వాఁడే నాభర్తయగుట కర్హుఁడు" అని యామె వర్తమాన మంపెను.

సూరథాన్‌రాయలు మేవాడరాణాగారి మాండలికుఁ డగుటచే నాతఁడు (మేవాడరాజు) తనకొమార్తె నడుగుట సన్మానప్రదముగనే సూరథానునకుఁ దోఁచెను. కాని కూఁతురి ప్రతిజ్ఞ నెఱవేర్చినమొదల నామె నతనికి నియ్యవలయునని యుండెను. జయమల్లుఁడు శౌర్యహీనుఁడును గర్విష్ఠుఁడునై నందున పంతము నెఱవేర్చుటకుఁ బూర్వమే వివాహము కావలయునని కోరెను. కాని యందుకు పితాపుత్రిక లిరువురును సమ్మతింపకుండిరి. బలిష్ఠుఁడగు పురుషునిం బొడిచి గెలిచినంగాని తన కకన్యారత్నము దొరకదని తెలిసికొని యారాజపుత్రుఁ డాశారహితుఁ

డావీరబాల నిట్లని నిందింపఁ దొడఁగెను. "నీతండ్రివలెనే నీవును దరిద్రలక్షణురాలవు. నేఁడు నావంటి గొప్పరాజపుత్రునిఁ దిరస్కరించితివి. కాన నీయింటనుండు నొక హీనసేవకునకంటె నన్యులు నిన్నెవరు వరింపఁగాలరని నమ్ముము." సూరథాన్‌రాయులంతటి స్వాభిమాని క్షిప్త నీచవాక్యములు విని యూరకుండ మనసెట్లొప్పును? తత్క్షణమే యాతఁడు చేతిఖడ్గముతో నారాజపుత్రునిఁ జంపెను. ఈవర్తమాన మానతనితండ్రియగు రాయమల్లునకుఁ దెలియఁగా నాతఁడెంతమాత్రము చింతింపక "మానిర్మలమైన వంశమును జెఱుపనున్న నాదుష్టునికిఁ దగినశిక్ష గలిగె" నని నుడివెను. అట్లు దుష్టుని శిక్షించినందునకై సూరథాన్‌రాయులను మిగుల పొగడెను.

రాయమల్లునకు పృథ్వీరాజను మఱియొకకుమారుఁడుండెను. తండ్రి యాపుత్రుని నేలనో ద్వేషించి పూర్వము విడనాడెను. కాని పెద్దకుమారుఁడే ప్రకార మడుగంటిన పిదప పృథ్వీరాజును రప్పించి యువరాజును గావించెను. పృథ్వీరాజు మిగుల సద్గుణవంతుఁడును న్యాయప్రియుఁడును నైనందువలన ప్రజ లాతనిరాకకు మిగుల సంతసించిరి. పృథ్వీరాజు రాజ్యపదవి నొందినపిదప తారాబాయి సద్గుణములును సాహసావస్థాదులను విని యెన శౌర్యముఁ గనపఱచి యామెను వివాహమాడ దలంచి సూరథాన్‌రాయుల శత్రునిపై దండెత్తిపోవ నిశ్చయించెను. ఆవార్తవిని తారాబాయి మిగుల సంతోషముతోఁ దానును నాతనితో యుద్ధయాత్రకు నెడలెను. పృథ్వీరాజు ఏడెనిమిదివేల క్రొత్తసైన్యమును సిద్ధపఱచి అఫగణదేశస్థులను గెలుచుటకై

ఖోదానగరముపైకి దండు వెడలెను. ఆసమయమునందుఁ దారాబాయి పురుషవేషధారిణియై గుఱ్ఱము నెక్కి ప్రత్యక్ష మహిషాసురమర్దని యన నా యవనుని నంతమొందింపఁ బ్రయాణమయ్యెను!

వీరందఱు ఖోదానగరమును సమీపించిన దినమునఁ దురకల కధికోత్సాహకరంబగు మొహరముపండుగయొక్క తుదిదినమయి నందువలన నానగరవాసులగు తురకలందఱు పీర్లను గుమ్మటములలోనుంచి యూరేగింపుచు నానందమహోత్సవములో నిమగ్నులై యుండిరి. ఆమహోత్సవావలోకన తత్పరుఁడయి యచటి ప్రభువగు లిల్లా తనమేడపై దివ్యవస్త్రభూషణముల నలంకరించుకొనుచుండెను. అట్టి సమయమునందు దమసైన్యమునంతను నగరద్వారమున నునిచి పృథ్వీరాజును, తారాబాయియు మఱియొకభృత్యుఁడును, ఉత్సవముఁ గనవచ్చినవారివలె నామూకలోఁ జేరి పోవుచుండిరి. ఇట్లు జరుగునపుడు తారాబాయి తనజనకుని శత్రువు నెఱింగి గుఱివెట్టియొక్క బాణమాతనికిఁ దగులునట్లు వేసెను. మూకలోనుండి వచ్చిన యీ బాణమా యవనుని ఱొమ్మునందవిలి వానిని యమసదనమునకనిచెను. తనవారమే యవనులా నగరద్వారమున నొకమత్తగజమును గావలియుంచి తమప్రభువుప్రాణముల నపహరించిన యోధుని వెతుకఁ జొచ్చిరి. కాని వారి కెచ్చటను వాఁడు పట్టుపడినవాఁడుకాఁడు.

తారాబాయిపగతునిఁ దెగవేసినపిదప నాముగ్గురును గ్రామమావలనున్న తమసైనికులఁ గలియఁబోవుచుండిరి. ఇట్లు పోవువారికి సింహద్వారమువద్ద మత్తగజమును కొంతసైన్యమును

అగుపడి వారి నడ్డగించెను. దానిఁగని వారుప్రథమమునం దించుక జంకిరికాని వీరుఁడగు పృథివీరాజు తారాబాయియు మరల ధైర్య మవలంబించిరి. ఆసమయమునం దామత్తగజము సమీపింపఁగా తారాబాయి తనచేతనున్న ఖడ్గముతో నాయేనుఁగుతొండ మును నఱికెను. అంత నా నాగము ప్రచురధ్వని సేయుచు నావలి కరుగఁగా నాముప్వురుయోధులును నచటిస్వల్పసేనను సరకుఁ గొనక నగరము వెల్వడిరి.

తామిటులు తమయోధులఁ గలసికొనిన పిదప పృథివీరాజు తోదానగరసైన్యముల నెదుర్కొని పోరుఁడని తనసైనికుల కాజ్ఞా పించెను. రాజాజ్ఞయైన తత్క్షణమే యీవీరభటు లాపట్టణమును ముట్టడించి యచటిసేనలను నలుమొగంబులఁ దాఁకి త్రోలిరి. ఆయుద్ధమునం బఠానీల సేనలలో మూఁడునంతులవఱకుఁ బగఱచే జచ్చిరి. తదనంతరమునందు పృథివీరాజును తారా బాయియు మహోత్సవముతో నగరము ప్రవేశించిరి. తమకు జయము దొరికినపిదప తమసైనికులు మ్లేచ్ఛులను పట్టుకొని బాధించుటఁ గని తారాబాయి అట్లు చేయవలదని స్వసైన్య ముల కాజ్ఞాపించెను.

ఇట్లు సూరథాన్‌రాయులకు రాజ్యము దొరకినపిదప తారా బాయి పృథివీరాజును వరించెను. సూరథాన్‌రాయులుకూఁతురి వివాహానంతరము తనరాజ్య మల్లున కిచ్చి తాను భగవత్స్మరణ చేసికొనుచు నిశ్చితుండయ్యెను. తారాబాయియు నామెభర్తయు బహుప్రజానురాగము కలవారై ప్రజలను కన్నబిడ్డలవలెఁ బ్రోచు

చుండిరి. వారిట్లు రెండు సంవత్సరములు సుఖముగా నుండఁగా
వారి కొకసంకటము ప్రాప్తించెను.

పృథివీరాజు బావయగు ప్రభురాయుఁడనువాఁ డధిక దుష్టుఁడై
తనభార్య నధికబాధ పెట్టుచుండెను. పృథివీరాజు తనసహో
దరికిఁ గలుగు బాధలఁగని యూరకుండఁజాలక మంచిమాటలతో
బావకు బుద్ధిచెప్పెను. ఆదుష్టున కావాక్యములు పామునకుఁ
బాలుపోసినట్లయి యాతఁడు తనభార్యను విశేషముగా బాధింపఁ
దొడఁగెను. దానింగని పృథివీరాజు ప్రభురాయులకుఁ గఠినోక్తు
లతో జాబువ్రాసెను. అప్పటినుండి యాదుష్టుఁడు పృథివీ
రాజుపై మిగుల కోపించియు కుత్సితము బయలుపడనీక పైకి
మిగుల మిత్రత్వముతో నగుపడుచుండెను. ఇట్లుండ నొకనాఁ
డొకదినము పృథివీరాజును తనగృహమునకు విందునకుఁ బిలిచి
యాతనికి విషాన్నము పెట్టించెను. కపట మెఱుఁగని పృథివీరాజు
భోజనముచేసి మరల తన నగరునకు వచ్చుచుండెను. ఇంతలో
నాతనికి విష మెక్కినందున నాత్రోవలోనే యాయన మూర్ఛి
తుఁడాయెను. ఈవర్తమానము తారాబాయికిఁ దెలియఁగా
నామె యాసన్నమరణుఁడగు భర్తకడ కేగి యాతనికిఁ దగు
చికిత్సలు చేయుచుండెను. కాని యందువలన నింతమాత్రమును
గుణముకాక తుద కాయన స్వర్గస్థుఁ డాయెను. అంతటితో
తారాబాయి జీవనచరిత్రముగిసెను. రాజపుత్ర కులాచారమగు
అనుగమనముచేసి తారాబాయి పరమపదమున కేగెను.

# విద్యాసాగరజనని భగవతీదేవి.

తే. ఒకపరోపకారంబు చేయుటయె కాదె
యిలపయిని జన్మమెత్తినఫలము మనకుఁ;
గాన మనమేలు మాడక యైనఁ దరుణి!
పరుల కుపకార మొనరింపవలయుఁ జూవె.—వీరేశలింగకవి.

పేదలయొక్కయు దుఃఖితులయొక్కయు బంధుఁడును, వంగదేశముయొక్క సత్పుత్రుఁడును, భారతవర్షమును ఆకాశమునకుఁ దేజోమయమగు నక్షత్రమును, విధవాబంధుఁడునునగు ఈశ్వరచంద్రవిద్యాసాగరుని తల్లియగు భగవతీదేవిచరితము సకల జనులకు ననుకరణీయము. ఏసద్గుణములవలన విద్యాసాగరుఁడు ప్రాతఃస్మరణీయుఁ డాయెనో యాసద్గుణములకు మూలకారణ మాతని తల్లియేయని బహుజనులకుఁ దెలియదు. ఎట్టి విత్తో యట్టి ఫలమే కలుగు ననుట భగవతీదేవి విద్యాసాగరుల చరిత్రముల వలనఁ దెలియును. దయ, ధర్మము, క్షమ మొదలయిన సద్గుణములు భగవతీదేవివలననే విద్యాసాగరునికిఁ బట్టుపడెను. కావున విద్యాసాగరుఁడు తనతల్లిని సాక్షాదన్నపూర్ణనుగా భావించి పూజించుచుండెను.

ఈమె [illegible]వ బంగాళీ సంవత్సరము ఫాల్గునమాసమునందు బంగాళదేశమునందలి యొకపల్లెయందు బ్రాహ్మణవంశమున నవతరించెను. ఈమెతండ్రి పేరు రామకాంత చట్టోపాధ్యాయుఁడు. తల్లి గంగాదేవి. రామకాంతుఁడు చిన్నతనమునుండియు

దైవభక్తిగలిగి విరక్తుఁడయ్యెను. ఆతఁడు విశేషముగా నెవ్వరి తోను మాటలాడక అరణ్యమున కరిగి, యేకాంతముగ జపము చేసికొనుచుండెడివాఁడు. ఆయన బొత్తుగ సంసారమునందు విరక్తుఁడగుట విని గంగాదేవితండ్రి యగువిద్యావాగీశుఁడు తన పుత్రికను సంతానసహితముగా పాతూలగ్రామమునకు గొని చనెను. నాఁటినుండియు గంగాదేవి తనయిరువురుకూఁతులతో పుట్టినింటనే యుండెను. పంచానన విద్యావాగీశునకుఁ నిరువురు కన్యకలును, నలుగురుకొమాళ్లును ఉండిరి. వారిలోఁ జ్యేష్ఠకొడుకు పేరు రామమోహనవిద్యాభూషణుఁడును, రెండవవాని పేరు రామధన తర్కవాగీశుఁడును, మూఁడవవానినామము గురు ప్రసాదశిరోమణియును, నాల్గవవాని పేరు విశ్వేశ్వరన్యాయాలంకా రుఁడును. ఈకుటుంబము విద్య, దయ, ధర్మము, అతిథిసత్కా రము మొదలయిన సద్గుణములచే విశేషఖ్యాతి వహించెను. విద్యాసాగరుఁడు తనజీవనచరిత్రమునం దీపరివారమునుగూర్చి యిట్లు వ్రాసెను. "అతిథిసేవయందును అభ్యాగతుని సన్మానిం చుటయందును నీకుటుంబమునకుఁ గలశ్రద్ధ మిగుల ప్రశస్యము. అట్టిశ్రద్ధ మఱియెుకచోటఁ గానుపించదు. ఆపరివారమునం దీస ద్గుణములు లేనివా రొకరును కానరాకుండిరి. రాధామోహన విద్యాభూషణుని వాకిటికి వచ్చి యన్నముసిరి యడుగక వెడలి పోయిన యతిథి యొకఁడును కానరాఁడయ్యె. ఆయింట నుండు వాలురు వృద్ధులు నందఱును ఇట్టిసద్గుణములు గలవారే". ఇట్టి పరివారములోఁ బెరిగినందుననే భగవతీదేవికి నట్టిసద్గుణములు పట్టువడెను. అందువలననే యదినలుకు దురదృష్టవంతు లాలగు

వంగజనని తేజోమయమగు నక్షత్రమువంటి విద్యాసాగరుఁ డను న్యాయరత్నమును గాంచ సమర్థురా లాయెను. తమసంతానమునకు సద్గుణములు నేర్పుటకయి కుటుంబ మెటు లుండవలయునో నేర్చుకొనఁ దలఁచినవారికి పాతూలగ్రామమునందలి విద్యావాగీశునిపరివారమే చాలినంత దృష్టాంతము. భగవతీదేవి యొక్కయు విద్యాసాగరునియొక్కయు చరితములందుఁ బ్రకాశించు దయ, ధర్మము మొదలగు సద్గుణములకు విద్యావాగీశుని కుటుంబమే మూలము. [illegible] సంవత్సరమున బనిమాలాపురమునందలి రామజయబంద్యోపాధ్యాయుని పుత్రుఁ డగు ఠాకుర్ దాసుని భగవతీదేవి వివాహమయ్యెను. ఈదంపతులకే ప్రాతఃసంస్మరణీయుఁ డగు ఈశ్వరచంద్రవిద్యాసాగరుఁడు జన్మించెను.

ఠాకుర్ దాసుని బాల్యమునందే యాతనితండ్రి సంసారమునందు విరక్తుఁ డయి స్వదేశపరిత్యాగము చేసి తీర్థయాత్రలు చేయుచుండెను. కాన ఠాకుర్ దాసుని తల్లియగు దుర్గాదేవి తన పుట్టినింటికి కరుగవలసినదాయెను. అచ్చట నామెదుఃఖ మెంత మాత్రము తగ్గక, మీఁదుమిక్కిలి యన్నలయొక్కయు, వదినెలయొక్కయు బాధవిశేషమయ్యెను. కావున నామె యాగ్రామముననే యొకకుటీరము నిర్మించుకొని యొకవిధముగా కాలము గడపుచుండెను. ఆమె రాత్రియందేయు నారవడుకుటవలన వచ్చినదానితో నెట్లో తానును కొమారుఁడును భోజనము చేయుచుండిరి. బుద్ధిమంతుఁ డగుఠాకుర్ దాసు, తల్లికష్టము చూడలేక కలకత్తాకరిగి యతికష్టముతో విద్య నభ్యసించెను. ఆయన త్వరగా స్వల్పవిద్య నేర్చి యల్ప వేతనము గలయుద్యోగమును సంపా

దించెను. ఆదినములలో భోజనసామగ్రి చవుకగా దొరకుటవలన స్వల్పవేతనము గలయుద్యోగము దొరకినను ప్రజ లానందించుచుండిరి. ఠాకుర్‌దాసునకు ౮ రూపాయిలవేతనము గలపని దొరకుట విని దుర్గాదేవి తనపర్ణకుటీరములో నానందోత్సవము చేసెను. వారిహితకాంక్షులందఱు నాసమయమున మిగులసంతసించిరి. తదనంతరము కొన్నిదినములకు రామజయుఁడు (విద్యాసాగరుని తాత వచ్చి) భార్య కష్టములనువిని మిగుల చింతనొంది పుత్రునిఁ గనుఁగొని యాతనివివాహముఁ జేసి మరల తీర్థాటనమున కరిగెను; గాని యాతఁడు పూర్వమువలె విశేషదినములు తీర్థాటనము చేయుచునుండక త్వరలోనే యింటికి వచ్చెను. ఆయన వచ్చినందున కిట్లొక కారణమును చెప్పెదరు. ఒకదిన మాతఁడు కేదారపర్వతమున విహరించుచుండఁగా నొకమహాపురుషుఁ డాయన స్వప్నమున నగపడి యిట్లనెను. "ఓ రామజయుఁడా! నీ వేల నీకుటుంబమును విడిచి తిరిగెదవు? త్వరగా నీవు నీయింటి కరుగుము. మీవంశమున నొకమహాపురుషుఁడు పుట్టఁగలఁడు. వానిదయాదానవిద్యాదిగుణములచే మీవంశము కీర్తిఁగాంచును. పరమేశ్వరునికి మీయందు విశేషదయగలదు." ఈస్వప్నముఁ జూచి రామజయుఁడు వీరసింహాగ్రామమునకు వచ్చి [illegible]మున ప్పటికి ఠాకుర్‌దాసు కలకత్తాలో నుద్యోగము చేయుచుండెను. అతనిభార్య యగుభగవతీదేవి గర్భవతియయి యున్మాదము గలిగి యింటియొద్దనే యుండెను. రామజయుఁడు కోడలి పిచ్చి పోవుట కనేకౌషధములును, మంత్రతంత్రములును చేసి చూచెను గాని యందువలన నాపిచ్చి కుదురకుండెను. కాన [illegible] కొం

జ్యోతిష్కుని బిలిచి యడుగఁగా నాజ్యోతిష్కుఁడు భగవతీదేవి యొక్క జాతకమును ఆమె యవయవములును జూచి యిట్లు చెప్పెనఁట. "ఈమె గర్భమునం దొకమహాపురుషుఁడు గలఁడు. ఆయన ప్రభావమువలననే యీామె కిట్టియున్మాదావస్థ గలిగెను. ప్రసవానంతర మీామె బాగగును. ఇప్పు డౌషధోపచారములు చేయుటవలన నేమియుఁ బ్రయోజనము లేదు." ౧౭౪౨ వ సంవత్సరము ఆశ్వయుజమాసమునందు సాక్షాత్ దయయొక్కయవతారముఁ డగు ఈశ్వరచంద్రుఁడు జనించెను. నీళా డిన పిదప భగవతీదేవికిఁ గలయున్మాదము పోయెను.

భగవతీదేవి విశేషరూపవతి గాకున్నను ఆమెముఖమునందలి తేజము విశేషహృద్యముగా నుండెను. వంగదేశమునందలి యాధునిక ప్రఖ్యాతకవి యగురవీంద్రనాథుఁడు భగవతీదేవి గూర్చి యిట్లు వ్రాసెను—"భగవతీదేవి ముఖమునందలి గాంభీర్యము, నుదారతయు నెంతయు వెలుఁగుచునుచు వ్యక్తికలుగఁజేయు. ఆమెబుద్ధియొక్క ప్రసారమును దెలుపుచున్నతలపాటము, దూరదర్శులును స్నేహవర్షులునునగు ఆయతనేత్రములు, సరలనాసిక, దయాపూర్ణమైన యోష్ఠాధరము, దృఢతాపూర్ణమైనచుబుకము—ఇట్టియన్నియవయవములు పొంకముగఁగలిగి మహిమమయమైనయీామె ముఖసౌందర్యము గాంచువారిహృదయమున కధికముగాఁ బూజ్యభావమును బుట్టించును. ఇందువలన (భగవతీదేవి ముఖమునందు దైవికకళ గలిగినందున) నే విద్యాసాగరుఁడు ఇతర పౌరాణికదేవతలనేరినిఁ బూజింపక తనతల్లినే దేవతయని పూజించుటకుఁ గారణముకూడ వ్యక్తమగుచున్నది."

పేదలదుఃఖములఁ గనిన భగవతీ దేవికి మిగుల జాలిపుట్టి కన్నుల నీరు గారుచుండెను. ఆఁకొన్నవారికి నన్నమిడుటయు, రోగుల కౌషధోపచారము లొనర్చుటయు, తృష్ణాతురుల కుదకదానము చేయుటయు, చలికి బాధపడువారికి వస్త్రము లొసంగుటయు లోనుగాఁగలవి భగవతీదేవియొక్క నిత్యవ్రతములు. ఎవ్వరి కేని రోగమువచ్చినయెడల భగవతీదేవి చేత నౌషధములు తీసికొని వారిసేవచేయుటకు సిద్ధముగానుండెను. ఎవ్వరేని అర్థాభావము వలన బాధపడుచుండిన నో భగవతీదేవి తనచేతఁ గలది కొంగునఁ గట్టుకొని వారికి గుప్తముగా సహాయపడుటకు చనును; ఎవ్వరేని చలివలన బాధపడుచుండిన నో భగవతీదేవి తనవెచ్చనివస్త్ర వారి కిచ్చును! ఆమె బ్రాహ్మణకులమునందు జన్మించినదై నను నీచకులములమలమూత్రములు తీసి వారి కుపచారములు చేయు టలో నెన్నఁడును అసహ్యపడినది కాదు. ఇదిగదా నిజమయిన భూతదయ.

ఒకానొక సమయమునందు విద్యాసాగరుఁ డింటివారు కప్పు కొనుటకుఁ గొన్నిఉన్నివస్త్రముల నింటికిఁ బంపెను. అవి యింటికి రాఁగాఁ జూచి నమపొరుగువారలు చలిచే బాధపడుచుండుటఁ గని భగవతీదేవి వానిని పొరుగువారల కిచ్చి కొడుకున కట్లు వ్రాసెను. "ఈశ్వరా! నీవు పంపినబట్టలు మనపొరుగువారలు చలిచే బాధపడుచుండఁగా వారి కిచ్చితిని. కాన మనయింటికొ అకు వేరేబట్టలు పంపవలయును." తల్లియొక్కభూతదయను సంతసించి విద్యాసాగరుఁడు 'మనయింటికొఱకును బీదవారికొఱ కును మరియెన్నిబట్టలు కావలయునో వ్రాసినయెడలఁ బంపెద'

నని తల్లికివ్రాసెను. తల్లి యెట్టిదో కుమారుఁడును నట్టివాఁడే యగునుగదా?

విద్యాసాగరుని సహోదరుఁడగు దీనబంధు న్యాయరత్నమును మిగుల నుదారుఁడుగానే యుండెను. ఆయన వస్త్రహీనులను జూచినచో తనపై వస్త్రమునైనను వారికిచ్చుచుండెను. పరుల దుఃఖమును గనిన నాతఁ డాదుఃఖము తనకే కలిగినట్లు విచారపడును. ఒకదినము దీనబంధుఁడు వీధిలో నొంటరిగా నిలిచి యుండఁగా నొకబీదస్త్రీ చింపిరిబట్టను గట్టుకొని పోవుచుండెను. దానిఁగని దీనబంధుఁడు పైనున్న చిన్నవస్త్రమును తాను కట్టుకొనిన కట్టుబట్టను దాని కిచ్చివచ్చి తల్లి కావృత్తాంతము నంతను చెప్పెను. అందు కామె మిగుల సంతసించి "నాయనా! నీవు బహుమంచిపని చేసితివి. నే నొకదినమురాత్రి నాలువడి కిన సెకు దోవతియగు" అని చెప్పెను. అట్టిబీదతనమునందును వారిల్లు అతిథి అభ్యాగతులకును దుఃఖులకును సుఖప్రదముగనుండెను. పిదప విద్యాసాగరుని బుద్ధికౌశలముచే నాకాంక్షల ఘునస్ఫూ నెంతోపరోపకారము చేసియుండునో చదువరులే గ్రహింపఁగలరు.

పండిత ఈశ్వరచంద్ర విద్యాసాగరులవారు వితంతూద్వాహములనుగుఱించి యత్నముచేయుట భగవతీదేవిగారి ప్రేరణచేత నని చెప్పెదరు. ఈయంశమునుగుఱించి జనానాపత్రికయం దిట్లు వ్రాయఁబడియున్నది:—

"విద్యాసాగరుఁడు మహోన్నతపదవియం దుండి, తనసత్పాత్ర దానమువలన వంగదేశమున నొకకష్టము రాకుండఁ గాపా

డుచున్నసమయమునం దొకనాఁడు శ్రీభగవతీదేవిని సందర్శించు
టకయి యొకబాలవితంతువు వచ్చియుండెను. ఆమె శ్రీభగవతీ
దేవిని దర్శించి సంభాషణవశమునఁ దననిర్బంధవైధవ్యదశను
గూర్చి దుఃఖముతో నించుక ముచ్చటించెను. ఆర్తత్రాణపరా
యణత్వమును వహించిన భగవతీదేవి యామెకష్టమును వినఁ
గానే పట్టఁజాలని దుఃఖముతోఁ దన కుమారునివద్దకుఁ
బాఱివచ్చి "కుమారా! నీవు సమస్తశాస్త్రములను జదివితివిగ
దా; ఆపన్నులయిన బాలవితంతువులను సంరక్షించుశాస్త్రమే
దియును నీకుఁ గానుపింపలేదా?" అని యడిగెను.

"విద్యాసాగరునికిఁ దనతల్లియం దతిగౌరవము గలదు.
అతఁడు తన చిన్నతనమునందును జిన్ననాఁడు తన కామె కలి
పిన సద్గుణపుంజమువలన సందియుండెను. దుఃఖముతో నట్లు
తనతల్లి చెప్పినమాటలను వినఁగానే విద్యాసాగరుఁడు తిరిగి
శాస్త్రములను జదువుట కారంభించి తుట్టతుదకుఁ బరాశరస్మృ
తియందు, స్త్రీపునర్వివాహములు తప్పక జరుపఁబడవలెనని
విధించు నీక్రింది వాక్యమును గాంచెను."

"నష్టే మృతే ప్రవ్రజితే క్లీబేచ పతితేపతౌ
పంచస్వాపత్సు నారీణాం పతి రన్యోవిధీయతే."

"తనకుమారుఁడు స్త్రీపునర్వివాహములను జేయ నారంభిం
చినతరువాత నాతనికి బహువిధములఁ ధైర్యము నొసంగుచు
కుమారా నీ వవలంబించినమార్గమును విడువక పూనిన యీమ
హాకార్యమును నిర్వహింపుము. నీ కెన్నికష్టములు వచ్చినను
మే మెప్పుడును నిన్ను విడువక నీకు సహాయులమై యుండెద

దము. ఒకవేళ మేము నిన్ను విడిచిపెట్టినను నీవు నిరుత్సాహుఁడవు గాకుమా" యని యాతనికి బోధించుచు శ్రీభగవతీదేవి బాలవితంతువులపాలిటికి సత్యమయిన రక్షకురాలయి నిలిచెను.

పునర్వివాహము చేసికొనిన వధూవరులను ఆకాలమునందు వారియాప్తులు తిరస్కారముగఁ జూచి మిగుల బాధపెట్టుచుండిరి. ఆ యువతులను దనయొద్దకిఁ బిలిచి భగవతీదేవి వారికి ననేకబుద్ధులఁ గఱపి బుజ్జగించి వారినిఁ దనపొత్తునఁ గూర్చుండఁబెట్టుకొని భోజనము చేసి యాప్తుల తిరస్కారమువలన ఖిన్నులైన వారిని సంతోషపెట్టుచుండెను. ఇంటికి వచ్చిన అతిథిని తాను సన్మానించి పంపనిదినము భగవతీదేవికి మిగుల దుఃఖదినముగా నుండెను. తనశరీర మస్వస్థముగా నున్నను అతిథి కన్నము పెట్టించిగాని యామె నిద్రించునది కాదు.

సివిలియన్ హారిసన్ దొరగారొకదినము వీరియింటికి విందారగింప వచ్చెను. అప్పుడు భగవతీదేవి తానే పాకముచేసి వడ్డించెను. భోజనానంతరము వారందఱు మాటలాడుచుండ నా దొర భగవతీదేవినిఁ జూచి 'మీయొద్ద చాలధనమున్నదా' యనియడిగెను. అందు కామె కార్నెలియావలె తనకొమారులఁ జూపి వీరే నాధనమని చెప్పెను. ఆమెనుగని యా దొర విద్యాసాగరునితో 'ఈ సాధ్వివలననే నీవింతసద్గుణవంతుఁడవ వైతివ'నిపలికెను. భగవతీదేవియొక్క సుగుణసంపదలఁ గని యామెయందు భక్తిప్రాజ్యభావము గలిగి యా యాంగ్లేయుఁ డామెకు హిందూరీతిని ననుసరించి సాష్టాంగముగా నమస్కరించెను.

స్త్రీలయినను, పురుషులయినను, శ్రీమంతులయినను, బీదల

యినను, కులీనులయినను, కులహీనులయినను, విద్వాంసులయి నను, మూర్ఖులయినను, భేదభావములేక భగవతీదేవి యందఱను సమానముగాఁ జూచుచుండెను. ఈసమభావముచేతనే యామె సకలజనులచే సకలదిక్కులఁ బూజింపఁబడుచుండెను.

భగవతీదేవిగారి దయకు మితిలేకయుండెను. పరులదుఃఖముం గనిన నామెహృదయము కరఁగిపోవుచుండెను. ఆమె యతిథులకు, నభ్యాగతులకు, విద్యార్థులకు, రోగులకు సహాయము చేయుచు వీరసింహ మనుపల్లెలోనే వాసము చేయుచుండెను. ఒక సమయమునందు విద్యాసాగరు లామెను కలకత్తాకు దీసికొని వచ్చిరి. కలకత్తాలో వీరసింహములోఁ జేసినట్లు పరోపకారము చేయుటకు వీలులేదని చూచి యామె కుమారునితోఁ బలికినపలుకులు వినిన పాషాణహృదయులుగూడ దయామయులగుట వింతకాదు. ఆమె కుమారునితో నిట్లనెను. "నేను వీరసింహమునకుఁ బోకుండిన మనయింట నారగించి విద్య నభ్యసించు విద్యార్థుల కెవరు భోజనము పెట్టఁగలరు? ఎండవానలలో నడచి యలసి వచ్చిన యతిథులకు నాశ్రయ మొసఁగువా రెవరు? నిరాశ్రయమగు కుటుంబమునకు నాశ్రయమొసంగు వారెవరు? ఇట్లచ్చట ననాథులు కష్టపడుచుండఁగా నే నిచ్చట నెట్లు సుఖముగా నుండఁగలను? నన్ను త్వరగా వీరసింహమునకుఁ బంపుము." విద్యాసాగరు లామె యభిప్రాయమును గనిపెట్టి దీనరక్షణార్థమై యామెను వీరసింహమునకుఁ బంపిరి. మఱియొకసారి యామెను ఈశ్వరచంద్రులు దమయొద్దకిఁ దోడ్కొనివచ్చుటకు యత్నించిరి. కాని పరోపకారార్థమై యామె యాపల్లెను విడిచినదికాదు.

స్వర్ణాలంకారములయందు భగవతీదేవి కెంతమాత్రము నిష్టము లేకయుండెను. "నగలు పెట్టుకొనిన నేమిప్రయోజనము? ఒకదినము దొంగలు తీసికొనిపోగలరు కాని యాధనముతోనే సహాయహీనకుటుంబములకు, దరిద్రులగు విద్యార్థులకు, సహాయముచేసిన నెంతయో యానందము కలుగును!" ఇట్లు భగవతీదేవి లోకుల కుపదేశించుచుండెను. ఒకసారి విద్యాసాగరుఁడు తల్లితోఁ నిట్లనియె "అమ్మా దేవి పూజచేయుటమేలా? లేక యాధనముతోనే పరోపకారము చేయుటమేలా?" అందు నాపరోపకారపరాయణ "అదేధనముతో దుఃఖితులదుఃఖము నివారణమయ్యెడియెడలఁ బూజసేయుటకంటె దుఃఖితుల కిచ్చుటయే మేలు" అనెను. ఆహా! భూతదయ యనిన నిట్టిదియే కదా! ఈమె వార్ధక్యకాలమునందు కాశీవాసము చేసి యచ్చటనే కాలధర్మము నొందెను.



# అసామాన్య.

"ఉపకారిషు యః సాధుః సాధుత్వే తస్య కో గుణః
అపకారిషు యః సాధుః ససాధుస్సద్భి రుచ్యతే "*

ఈపరోపకారపరాయణురాలు, సురాజుద్దౌలా రాజ్యముఁ జేయుసమయమున ముర్షిదాబాదు లోనుండెను. ఈదుష్టప్రకృతి గల నవాబుయొక్క గుణములు చదువరులిదివఱకే రాణీభవాని చరిత్రమునందుఁ జదివియున్నారు. కాన నాతనివిషయమై నేనిందు విస్తరింప నక్కఱలేదు. పూర్వపు నవాబగు ఈయన తాత మనుమని మిక్కిలి గారాబము చేసినందువలనను దుష్టస్నేహితుల సహవాసమువలనను దుర్వ్యసనపరుఁడై సురాజుద్దౌలా పెరిగి రాజ్యభారము వహించునప్పటికి నొకమహానరరాక్షసుఁ డాయెను! ఈదుష్టుఁడు సింహాసనాసీనుఁ డైనఁ బ్రజ లెట్లు బ్రతుకుదురా యని లోకు లదివఱ కధికభీతమనస్కులై యుండిరి. వారనుకొనిన భవిష్య మసత్యముగాక సత్యమైనందువలన అన్యాయము, దుర్నీతి మొదలగు దుర్గుణముల నాయధముఁడు గ్రహించెను. ఆతఁడు రాజ్యమునకు రాఁగానే నిరపరాధులసమూహములు కారాగృహముల పాలయ్యెను. రాజమందిర సమీపమునుండి గాని, మఱి యేరాజమార్గమునుండిగాని నడచుట నిష్కారణముగా గొప్పసంకటముఁ దెచ్చుకొనుటయై యుండెను. సురాజ

* క ఉపకారికి నుపకారము* విపరీతము గాదు సేయ వివరింపంగా
నపకారికి నుపకారము* నెప మెన్నక సేయువాఁడు నేర్పరి సుమతీ.

నము చేయకుండుట, దూ్యతవిరుద్ధవాక్యముల నుచ్చరించుట, వ్యభిచారమును తిరస్కరించుట, ధర్మోపదేశము జేయుట, దుర్జనులను నిందించుట, మొదలగునవి యన్నియుఁ బంచమహాపాతకములుగా నెన్నఁబడుచుండెను. తండ్రి, యన్న, భర్త మొదలగువారు చూచుచుండఁగ బిడ్డ, చెల్లెలు, భార్య మొదలగు వారి కత్యంతమానహాని సంభవించుచుండెను. సురాజుద్దౌలా రాజ్యమునందలియేస్త్రీని నేవేళ రాజభటులు గొనిపోవుదురోయని స్త్రీలందఱును, వెలుపలి కెన్నఁడును రాకయిండ్లలోనేయెల్లప్పుడును దాఁగియుండు చుండిరి. వంగదేశమునందు నితరదేశములకంటె ఘోషా (రాణివాసము) యధికమగుట కిదియేకారణము. దుష్టులగు మ్లేచ్ఛులభయముచే నట్లు వంగస్త్రీలు రెండుమూడు శతాబ్దములవఱకును ఉండుటవలనఁ గొన్నిదినముల కది స్త్రీలకు ముఖ్యధర్మమని వారికిఁ దోఁచెను. పిమ్మట నీఘోషాపద్ధతియే సభ్యస్త్రీల కుచితమనియు నది లేనిస్త్రీలు నీతిమాలినవారనియు వారు సిద్ధాంతీకరించిరి. ఇతరదేశములం దిట్టిరాజదౌర్జన్యా త్యాచారము లేనందున, మహారాష్ట్రదేశమునందును, తెనుఁగు దేశమునందును, ద్రావిడదేశమునందును, మఱి యనేకదేశము లందును నిట్టి ఘోషాపద్ధతి లేదు. వంగదేశీయులు ఘోషా యుత్పత్తికారణమును దెలిసికొని న్యాయపరిపాలకులగు ఆంగ్లేయుల ప్రభుత్వమునందుఁ దురకలచేఁగాని మఱి యెవరివలనఁగాని స్త్రీలకట్టిబాధయుఁగలుగదుగాన ననేకశతాబ్దములనుండి యున్న కారాగృహావాసమునుండి తమ స్త్రీలను విడిపించెదరని నమ్ము

చున్నాను. ఇట్లు కొంతకాలము జరిగిన వెనుక నవాబుగారిదృష్టి తనయొద్ద నున్నయధికారుల యంతఃపురముపైఁబడెను! ఏయధికారియింటనైన నధిక సౌందర్యవతి గలదని తెలిసిన నవాబాయధికారితోఁ దన కాస్త్రీనిఁ దెచ్చి యిమ్మనియడుగును. వాఁడట్లు లేనియెడల ననేకప్రయత్నముల నాయధికారిని బాధించి వాని యంతఃపురమునుండి యాస్త్రీని బలవంతముగాఁ గొనివచ్చుచుండెను!

ఇట్టి ప్రళయసమయమున ముర్షిదాబాదులో జగత్ సేటను ఇంటిపేరుగల మహాధనసంపన్నులగు సాహుకారు లుండిరి. వీరికిఁ గల యమితధనమువలన వీరు కుబేరులనఁబడుచుండిరి. నాగపూరు రాజగు భోన్స్లేగా, బంగాళాదేశముపై దండెత్తిపోయినప్పు డీజగత్సేటుల గృహమును కొల్లగొట్టి కోట్లకొలఁది ధనమును దీసికొనిపోయెను. ఇట్లసంఖ్య ధనరాసులు వారు గొనిపోయినను జగత్సేటు "మరాఠావారు నాయొకపాయిలోనుండి యొకకాని డబ్బు గొనిపోయిరి." అని యనెనఁట! ఇట్లావంశమువా రపరిమితధనవంతు లయినందున బంగాళాదేశమునందంతటను జనులు వారిని మన్నించుచుండిరి. ఆసమయమునందు మతబ్ చందు అను సాహుకారు జగత్సేటువంశమున ముఖ్యుఁడుగా నుండెను. ఈయన మిక్కిలి బుద్ధిమంతుఁడును, రాజకార్యకుశలుఁడును, అయినందున నవాబు దర్బారునందు ఆతని కధికమర్యాదలు జరుగుచుండెను. కాన నధికారులంద ఱతనికి వెఱచుచుండిరి. ఆతని యొద్దనుండి నవాబున కెల్లప్పుడును ధనసహాయముకావలసి యున్నందున సురాజాజగత్సేటును అందఱికంటె నధికముగా

మన్నించుచుండెను. ఈమతలబ్ చంధు జగత్సేటున కత్యంత లావ
ణ్యవతియు, గుణవతియునగుకూఁతురు గలదు. ఆమె యసమాన
రూపమును గని తండ్రి యాచిన్నదాని పేరు 'అసామాన్య' యని
పెట్టెను. ఆమెకుఁ దండ్రి యత్యంత వైభవముతో వివాహమహో
త్సవము జరిపెను. వివాహమైన స్త్రీ యత్యంతపవిత్రురాలనియు
దానిని దాఁకుట యత్యంతపాప మనియుఁ దురకల ధర్మశాస్త్ర
మునందుఁ జెప్పఁబడినను, సురాజుద్దౌలా, యసామాన్యయొక్క
సౌందర్యఖ్యాతిని వినఁగానే, మోహపరవశతచేఁ బిచ్చివాఁడా
యెను. కాని యామె జగత్సేటు కూఁతురైనందున నాసంగతి
యెవరికిఁ జెప్పుటకు వీలులేకుండెను. అదేలయన రాజ్యమునందుఁ
గల ప్రజ లందఱును జగత్సేటున కనుకూలురయినందునఁ దన
దుర్నీతి తెలిసినయెడల లోకు లందఱును దనకు విరుద్ధు లగుదు
రని సురాజున కత్యంతభయము కలిగియుండెను. ఇట్లత్యంతభీతిచే
గొన్నిదినము లరుగ నాతని కామాగ్ని యంతకంత కధికము
కాఁగా, వాఁడొకదినము రాత్రి స్త్రీవేషము వేసికొని, యొకా
నొకసామాన్యస్త్రీవలెనే జగత్సేటుమందిరముఁ బ్రవేశించి యసా
మాన్య వశించునట్టి యంతఃపురములోనికి వెళ్లెను! అనటికిఁ
బోయి యసామాన్య వాస్తవముగా నసమాన సౌందర్యవతి
యగుటఁ గని యాదుష్టుఁడు భ్రమిష్ఠునివలెఁ, దానప్పుడుదాల్చిన
వేషమునకు భంగము కలుగునని యైనఁ దలఁపక, అత్యంతపవి
త్రురా లగుపతివ్రత నంటఁబోయెను. అది గని యసామాన్య
భీతిచేఁ గేక వేయ నవాబచటనుండి పాఱిపోవ యత్నించెను.
అంత నామెభర్తయు నింటఁ గల యితరజనులును వచ్చినంచి

స్త్రీవేషధరుఁ డగు సురాజుద్దౌలాను గుర్తించి యామెభర్త వానికిఁ దనపాదరక్షచేఁ జక్కఁగా బుద్ధిచెప్పి, నవాబుగానఁ గరుణించి ప్రాణములతో విడిచెను.

ఇట్లుతాఁ దలఁచినకార్యసిద్ధి గాకపోఁగా, మీఁదు మిక్కిలి యవమానమగుటకు రోయుచుఁ దన్నిట్లవమానపఱచినవాని పగ తీర్చుకొను దినమును నిరీక్షించుచుండెను.

తదనంతర మొకనాఁడు అసామాన్యపెనిమిటి రాజమందిర సమీపమునుండి పరుగుటఁ గని నవాబు వానిఁ బట్టి తెప్పించి తల తీయించెను. అట్లతని శిరచ్ఛేదము చేసి యాతల నొకవెండి పళ్లెరమునం దుంచి యసామాన్య యొద్దకఁ బంపెను. ప్రాణపతి యొక్క శిరమును జూచి యసామాన్య యెట్టిదుఃఖములో మునిఁగెనో చదువరులే యూహించుకొనఁ గలరు. ఆదుఃఖాతిరేకము వలన నాటినుండి యామెకు మతిభ్రమ కలిగెను. ఆపిచ్చిలో నొకప్పుడు దుఃఖించుచు, మఱియొకప్పుడు నవ్వుచు, ఇంకొకప్పుడు గంతులువేయుచుఁ గాలము గడుపుచుండెను!

ఇట్లపరిమిత ఘోరకృత్యములు చేయుటవలన వంగదేశము నందుఁ గల సంస్థానికులును, సరదారులును, విసిగి సురాజునకు విరుద్ధులయిరి. స్వజాతీయుఁడగు సైన్యాధిపతిని రాజ్యముపై నునిచి, పూర్వపు నవాబు మక్కాకు వెడలినప్పటినుండియు, నవాబులందఱును సరదార్ల చేతులలోని కీలుబొమ్మలై యుండిరనుటకు సందియము లేదు. ఈసరదారు లందఱొకప్పుడు సభచేసి సురాజుద్దౌలాను ఇంగ్లీషువారి సహాయముచే బదభ్రష్టునిఁ జేయ నిశ్చయించిరి. ఈసంగతి సవిస్తరముగా రాణీభవాని గారి

చరిత్రమునందు వివరింపఁబడెను. ఆటుపిమ్మట ౧౭౫౭వ సంవత్స
రమునం దైనప్లాసీయుద్ధమందు నింగ్లీషుసైన్యాధిపతి యగుక్లైవను
నతఁడు సురాజు నోడించెను. అప్పుడు సురాజు యుద్ధభూమి
విడిచి యొక లొట్టిపిట్ట నెక్కి ముర్షిదాబాదు వైపునకుఁ బాఱి
పోయెను. కాని యతని పరాభవ మచటివారి కంతకుముందే
తెలిసినందున, నచటనుండ వీలులేక యచటినుండి మఱియొక
వైపునకుఁ బోయియుండు రాజామహల్ యనుగ్రామమునందు
నతఁడు శత్రువులచేతఁ జిక్కెను. మీరుజాఫర్ పుత్రుఁ డగుమిరాన్
యొక్క యాజ్ఞప్రకారము మహామదీబేగనుతురుష్కుఁ డాయన
శిరము ద్రుంచెను. బంగాళదేశపు నవాబున కిట్టియవస్థ ప్రాప్తిం
చుటకు నాతని దుష్టత్వమే కారణమని వేరుగాఁ జెప్పనక్కఱ
లేదుగదా? అవినీతి, క్రూరత్వము, పరపీడనము, చేయువారి కెన్న
టికిని నిట్టిశిక్ష గాకమానదు. ఇందునగుఱించి యొకకవి యిట్లు
వ్రాయుచున్నాఁడు.

గీ. క్రూరులై పరుల కకారణంబుగ నెద్ది
హాని జేయఁ జూచునట్టివారు
తీరని కష్టగంపఁ బెచ్చుకొనుచుఁ దామె
దుఃఖపడుదు రాత్మదోషమునకు.

కాఁబట్టి మనుష్యు లెప్పుడును, పరుల కపకారముఁ జేయక
స్వశక్త్యనుసారముగా నుపకారమే చేయుచుండవలయును. ఈసం
గతి నాసహోదరీమణు లెప్పుడును మఱవకుండవలెనని వేఁడు
చున్నాను. ఇట్లు చేయుటవలన మన కంతయును సుఖప్రదమే యగును.
శత్రువులు మన కెవ్వరును లేకుందురు. సురాజు సకలప్రజలకు

ననేకపీడలు గావించినందువలన సంకటసమయమునందు మిత్రులు సహితము వానిశత్రులైరి. వాఁడేపరోపకారుఁడై యుండినయెడల విధివశముచే నొకసంకటము వచ్చినను, వాని కనేకులు సహాయులై యుందురు. ఈసురాజుచరితమువలన నింకొకయుపదేశమును గ్రహింపఁదగియున్నది. అది యేదనఁగా నైశ్వర్యము గలిగినప్పు డత్యంతగర్వముచేఁ గన్నుమిన్ను గానక యితరుల నతితుచ్ఛముగా నెంచి వారిని బాధించినయెడల విపద్దశయందుఁ జగత్తంతయుఁ దనకుఁ బ్రతికూలమగును. కాన నీయుపదేశము గ్రహించి ద్రవ్యవంతురాండ్రగు మాయక్కలందఱును గర్వమును జేరనీక బీదవారియందు దయ మానెదరని నమ్ముచున్నాను.

పతి గతించిన నాటనుండియు ననమాన రెండుమూఁడు సంవత్సరములవఱకును మతిభ్రమ కలిగియే యుండెను. ఆమె కాభ్రమ వదలవలయునని యామెతండ్రి యనేకవైద్యులచే ననేకవిధోపాయములు చేయించెను. కాని వానివలన నెంతమాత్రమును గుణము లేకపోయెను. ఆసమయమునందే సురాజుద్రోహి శిరచ్ఛేదమగుట సంభవించెను. కాన కొందఱు ఘనవైద్యు లామెకుఁ బతి మరణమువలన భ్రమ గలిగినదిగాన తనపతినిఁ జంపినవాఁడు తెగినసంగతి యామెకుఁ దెలిపి, వానితల యామెకుఁ జూపిన నామెపిచ్చి వదలునని చెప్పిరి. అందుపై నామాటను పరీక్షించుకొఱకు సురాజు శిరస్సొక బల్లెమునకుఁ గుచ్చి ప్రజలకుఁ జూపుచున్నస్థలమునకు సమీపమునందున్న మేడమీఁదినుండియామెకు దానిని జూపిరి. ఆశిరస్సును గని యత్యంతదయతో నామె

సమీపమున నున్నవారిని గని 'పాప మీదురదృష్టవంతుఁ డెవఁడు?' అని యడుగఁగా వారు 'అమ్మా! తమభర్తను అతి క్రూరుఁడై వధించిన దుష్టుఁడు వీఁడే. వీనిశత్రువులు వీనికిఁ దగిన శిక్షనే చేసిరి' అని చెప్పిరి. అందుపై నామె మిక్కిలి జాలిపడి 'అయ్యో పాపము వీని కిట్టిదురవస్థ ప్రాప్తించినదా?' యని యిఁక నన్నింటికిఁ గొనిపొండు' అని చెప్పెను. అటుపిమ్మట నామెను వారింటికిఁ గొనిపోయిరి. అప్పు డామెపిచ్చి పోయి నామెకు జరిగినసంగతి తెలియఁగా, నామె సురాజుద్దౌలా సంగతి యంతయు సవిస్తరముగా నడిగి తెలిసికొని, వాని దురదృష్టవంతు డగుభార్య సంగతియును తెలిసికొనెను. అకస్మాత్తుగా నామెయొక్క భ్రమ వదలుటఁ గని యాత్రజనుల కపరిమితాశ్చర్యమును, ఆనందమును గలిగెను. కాని యాదినాట నుండియు నప్పుడప్పుడు 'పరమేశ్వరుఁడు నేను చేయువలసినకార్యమును తానే చేయవేర్చెను: గాన పరమేశ్వరుఁడు చేయవలసిన కార్యమును నేనే చేయవలయునను యీశ్వరసంకల్పమై యుండును. అట్లయిన నేనాకార్యమును చేసెదను'' అని యనుచుండెను. ఈవాక్యములకు నర్థమేమని యామె ననేకు లనేకవిధముల నడిగి చూచిరి. కాని యామె వారికిఁ దెలిసినఁ గార్యము కొనసాగనీయరనియును, నవ్వుదురనియు దలఁచి యామె యెవరికిని చెప్పకుండెను. ఇట్లుండి నింట నెవ్వరికిని జెప్పక యొకనాటి రాత్రి అసామాన్య యిల్లు వెడలెను! ఇట్లామె బయలుదేతి భయము విడిచి యొంటరిగా నాగాబంగోల యనుగ్రామమునకుఁ బ్రయాణమైపోయెను. సురాజుద్దౌలా శిరమును ఖండించిన

నాటనుండియు నామె యంతరంగము దివ్యవిచారములతో నిండి యుండెను. "నాపెనిమిటిని జంపినవాని పగతీర్చుకొనుట నాపని. వాని నవమానించుట, పదభ్రష్టునిఁ జేయుట, వానితలఁ దీయుట, మొదలయినపను లన్నియు నావై యుండఁగాఁ బరమేశ్వరుఁడు నాకొఱ కాపను లన్నియుఁ దానే చేసెను. దయాళుఁడును, సంపూర్ణ కరుణాయుక్తుఁడును, అగు పరమేశ్వరుఁడు సురాజుపై దయగలిగి, వాని యపరాధములను క్షమింప వలయును. వాని యం దనుగ్రహించి వాని నత్యంత సుఖునిగాఁ జేయవలయును. కానియాపను లన్నియు నీశ్వరుఁడు చేయనందున వానిని నాకొఱ కే యుంచినాఁడను నాకు సందేహము లేదుగాన నీపనులన్నియు నేనే చేయవలయును." అను విచార మామె యంతఃకరణము నం దెల్లప్పుడు భ్రమణము చేయుచుండెను! సురాజు గతించినం దున వానిని క్షమించుటగాని వానిని సుఖునిఁ జేయుటగాని య సంభవముగాన నిరపరాధిని యగు వానిభార్య సహాయము చేయువారులేక, బాగాబంగోలాయం దితరులకుఁ దెలియకుండ నత్యంత సంకటమున నున్నదని యామెకుఁ దెలిసెను. ఆమెకు సహాయముచేయుట యనఁగా నప్పటి నవాబగు మీరుజాఫరుగారికి యు, వానికి సహాయులైయున్న యాంగ్లేయులకును యుఁ బ్రబల కోపమునకుఁ బాత్రురా లగుటయే. అసామాన్యసాంద్రి యగు జగత్సేటును, నదితురు లనేకులును, సురాజు సంబంధు లవ్వ రగు పడినను వారినిఁ జంపవలయునను ఉద్దేశము గలిగి యుండిరి. కాని మిత్రులవలెనే శత్రులయందును ఉపకారము చేయుమహా త్ముల యంతఃకరణము లత్యద్భుతములు! అసామాన్య తాను

సురాజుభార్యకు నుపకారము చేయఁదలఁచెనుగాన నెంతమంది యెన్నివిధముల నడిగినను పైని చెప్పఁబడినకారణమువలన తనకార్యమునకు భంగము కలుగునని యెంచి యెవ్వరికిని జెప్పక యిల్లుబయలు దేఱెను! అమె యట్లు బయలుదేఱి బాగాబంగోలాకు వచ్చి చేరఁగా నచట నామెకు సురాజుభార్యను గుఱించి యిట్టివర్తమానము తెలిసెను.

సురాజు బలహీనుఁడయి, రాజ్యచ్యుతుఁడై ముర్షిదాబాదును విడి ప్రాణములను రక్షించుకొను నిమిత్తము పాఱిపోవునప్పుడు, ఆయనకుఁగల యసంఖ్యసేవకులలో నొకరును సహాయులై ఆయనకుఁ దోడు నడువకుండిరి! ప్రతి దుష్కార్యమునందును అతనిఁ ప్రోత్సాహపఱచి మాప్రాణములైన నీకిచ్చెదమని చెప్పిన మిత్రులలో నొకరును ఆపత్సంకటసమయమునందు సహాయులుగాకుండిరి. అతడు కారాగృహబద్ధుఁడై యున్నపు డాయన యవలోకమున కత్యంతము భీతిల్లి గంగెద్దులవలె నానావిధాస్యముల కన్నిఁటికి నౌ నౌ ననుచు, తన కనుసన్న కార్యములఁజునవానిని సహితము చేయుచు నుండువారిలో నొక్కరును సంకటసమయమున నతని గొంద్దనుండక పలాయితులైరి. ప్రత్యేక మాతనిబంధు లగువారు సహితము మావిపద్దశయం దాతనికి సహాయులు కాకుండిరి! మనుష్యమాత్రుల కెవరికైనను నిట్టికాలమువచ్చిన నీప్రకారమే మిత్రు లందఱును తొలఁగుదురు. ఇందును గూర్చి యొకకవి యిట్లు వ్రాసియున్నాఁడు.

క. కమలములు నీటఁ బాసిన
కమలాప్తుని రశ్మిసోఁకి*కమలిన భంగిన్
దమతమ నెలవులు దప్పినఁ
దమమిత్రులు శత్రులగుట*తథ్యము సుమతీ.

ఇట్లధికారహీనుఁడును, ధనహీనుఁడునైన సురాజుద్దౌలా నందఱును విడిచిరి. కాని యాతఁడెచటికి నరిగిన నచటికి నతనిని వెంబడించియుండుట కాసమయమునం దొకప్రాణిమాత్ర ముండెను. ఆప్రాణి యెవరనఁగా నాతనిపట్టపురాణియగు మెహాన్నెసా బేగమ్. సురాజ యామెను 'గుల్' అనఁగా గులాబుపుష్పమని పిలుచుచుండెను. సురాజెప్పుడును పరదారాసక్తుఁడై యీయామెను ప్రేమతోఁ జూచినవాఁడు కాఁడు. తన్నట్లు పతి త్యజించినను ఆపత్సమయమునం దాయనను దాను విడువలేక, యీకులకాంత తనవిభునకు సహాయురాలై నడిచెను! అట్టి సాధ్వి ధన్యురాలని యెవరు పొగడకుందురు? "సంసారే స్మిన్ సద్విజో వా గురురిత్యేషా మనీషా మమ" అని శ్రీమచ్ఛంకరస్వాములవారు చండాలుని విషయమునఁ జెప్పినట్టులనె యీపరమపతివ్రత యవనకులమున జన్మించినను తనయుదాత్తగుణములచే హిందూసుందరులకును, స్త్రీవర్గమున కంతకును గురుతుల్యురా లగుచున్నది. కాన నామెయుదాహరణము ప్రతికులవధువు గ్రహింపవలయును. ద్రవ్యహీనుఁడగు భర్తను స్త్రీలు తిరస్కరించుదురనియు, వానిని హీనముగాఁ జూతురనియు, పెనిమిటిని త్యజించుదురనియు, ననేక యారోపణములు స్త్రీలపై స్త్రీద్వేష్టలు మోపుచు

న్నారు. వారికి సహాయుఁడగు కవి యొకఁ డీప్రకారము వ్రాసి యున్నాఁడు:—

క. కులసతి రోయును జుట్టం
బులు వాయుదు రొరులు కష్టపుంబలుకుల ని
మ్ముల నాడఁ దొడఁగుచుందురు
కలియుగమున ద్రవ్యహీనుఁ గల కాలంబున్.

ఈపద్యమునందుఁ గల యితరుల విషయమై వ్రాయుట నా పని కాదు. కాని కులసతివిషయమున కవి వ్రాసినవాక్య మసత్య మని నొక్కి వక్కాణింపకుండఁ జాలను. ఈకవిశ్రేష్ఠున కీయవన నాస్త్వచరిత మించుక చెవినిఁబడియుండిన యెడలఁ దనయసత్యము నకు లజ్జితుఁడై యావాక్యము నాపద్యమునుండి తీసివేసియుండు ననుటకు సందియము లేదు. కులసతి తనపతికి సంకటసమయమున సహాయురాలు గాకుండినఁ గులసతికిని వేశ్యకును గల తారతమ్య మేమి? ఇతర దేశముల విషయమయి నాకంతగాఁ దెలియదుగాని మన హిందూస్థానమునం దెప్పుడును పతి దరిద్రుఁడని "కులసతి రోయును" అనువాక్య మబద్ధమనుట కంతమాత్రమును సంశయము లేదు. ఒక పేదతనమే యననేల? ఇంటఁ గడుపునిండ తిండిలేకుండఁగా దుష్టుఁడగు భర్తచే నిత్యమును వీపుపగులున ట్లకారణముగా దెబ్బలఁదినుచు, నింటనెల్లప్పుడు అత్తయాఁడు బిడ్డలచే నతిహేయమగు కోడంట్రిక మనుభవించువారి ననేకులను మనకన్నులారఁ జూచుచున్నాము. బాధలనుభవించుచుఁ బతి యందు నధికభక్తిఁగలిగి ఆయన కనేకవిధములఁ బరిచర్యలను జేయుచు భర్తను రక్షించు నిమిత్తము ప్రతిదినము వ్రతములు చేయుచు, ముడుపులుగట్టుచు నెట్టి ఘోరసంకటమునందైన

నాతనికి సహాయురాండ్రై యుండు యువతీరత్నంబు లీదేశము
నం దసంఖ్యలుగా మనము చూచుచున్నాము. హిందూస్థాన
మునందలి పురుషులు తమస్త్రీల ననేకబాధలం బెట్టుచుండు
దురు, స్త్రీలు వాని నన్నింటిని సహించి వారి కతిభక్తితో
నుపచారములు చేయుటయందును, జగత్తునం దంతటను బహు
దినములనుండి ప్రఖ్యాతిగాంచిరని చెప్పిన నాపైనసత్యారోపణము
రాదని నమ్మెదను. భర్త ధనహీనుం డని భార్య యాతనిని విడి
చినట్టి యుదాహరణము ఈదేశమునందు వెయ్యికుటుంబము
లలో నొకటి దొరుకునో లేదో సంశయింపవలసియున్నది.
అట్లు దొరికినను అత్యంత కనిష్ఠజాతియందును, అత్యంతాజ్ఞాను
లుగా నుండి మూర్ఖతయే ప్రధానముగా నుండిన వారిలోను.
విద్యాగంధ మెఱుంగక నీతియన్న వాక్యమునైన నెఱుంగనివా
రిలో నొకప్పుడీప్రకారమగునేమో. ఇంతమాత్రముచేత "కుల
సతిపోయును" అను సిద్ధాంత మేతద్దేశాస్త్రమువలనను సిద్ధ
పడనేరదు. స్త్రీలపైం గొందఱారోపించిన యారోపణ యస
త్యమని సిద్ధాంతము చేయుటకుం గొంత విషయాంతరమాయెను.
ఇందుకై చదువరులు నన్ను మన్నింపవలెనని వేఁడెదను.

ఇట్లు 'గుల్' సేనపతివెంట నరిగినప్పుడామెకుం బదునెనిమిది
సంవత్సరముల ప్రాయముండెను. అట్టి యల్పవయసునందు నిండు
గర్భిణిగా నుండియు, రాళ్లనక, ముళ్లనక యెండవానలకు సహించి
యాతనివెంటం బరుగిడుచు బాగాబంగోలాకుం జేరి యచటం బ్ర
సూతయాయెను. అందువలనం గొన్నిదినము లచట నుండవలసి
నవారైరి. పిమ్మట నచటనే సురాజు శత్రులచేతిలోంబడి చంపం

బడెనని యిదివఱకే తెలిపియున్నాను. పతిమరణానంతర మా
సాధ్వి యదృష్టహీనురాలగు కూఁతురిని రక్షించుచు నచట
నుండు బీదవారి గుడిసెలలోఁ గాలము గడుపుచుండెను! ఈస
మాచారము అనామాన్యకుఁ దెలియఁగా నామె 'గుల్' అచట
నున్నదనినమాటకు సంతోషించి యాబీదవారి యిండ్లచట నని
శోధింపసాగెను. ఒక స్త్రీ తనకొఱకు వెతకుచున్నదని 'గుల్'
బేగమునకుఁ దెలియఁగా, నా స్త్రీ శత్రుపక్షమునుండి వచ్చినదై
యుండునని యామె మిక్కిలి భయపడెను. ఆమెకుఁ దనప్రాణ
ములకొఱ కంత భయము లేకున్నను, తనముగా న్మించిన
పసిబిడ్డప్రాణముల కెక్కుడ భయముగలుగునోయని భీతిల్లెను. ఇట్లు
భీతిల్లి యామె యంతలో నూరకుండక, యింట తనకు జరిగిన
యన్యాయమంతయు, ఢిల్లీ కేగి బాదుషాకు నివేదించి గతవైభవ
మును తన కొమార్తె కిచ్చునటుల చేయవలయునని యామె యా
క్షణముననే బిడ్డ నెత్తుకొని ఢిల్లీమార్గమున నడువసాగెను! ఆవర్త
మాన మనామాన్యకుఁ దెలిసి మిక్కిలి విచారించి, యామె దృఢ
నిశ్చయవంతురాలైనందున నాపని సంతోషితో విడువక ఆ బేగము నడ
చినదారినే తానును నడువ నారంభించెను. కాగా బంగ్లాకుఁ
దనకొఱకు వచ్చినస్త్రీ తన్ను వెంబడించినదని 'గుల్' బేగము
విని మఱింత భీతురాలై యతి త్వరగా నడువసాగెను. అనామాన్య
యదివఱకు నడిచి యలసియున్నందున నతిత్వరగా నడువఁజాలక
తిన్నఁగా నడుచుచుండెను. ఆమె, తాను బేగమున కపకారిణిని
కానినియు, సహాయము చేయుటకే వచ్చితినిగాన భయపడవల్ల
దనియు, దోవనడుచువారిచే ననేకవర్తమానములు 'పంపెను

గాని 'గుల్' బేగ మామాటలయందు విశ్వాసముంచక ముం
దున కతిత్వరగా నడుచుచుండెను. ఇట్లొకరు భయముచేతను,
మఱియొకరు ఉపకారబుద్ధిచేతను, ఒకరెండుమకాములు హెచ్చు
తగ్గుగా, నీయూరినుండి యాయూరికి నాపల్లెనుండి మఱియొక
పల్లెకు నరుగుచుండిరి. తనకు మంచిమాటలుపలుకుచు, తన వెంట
విడువక యొకస్త్రీ వచ్చుచున్నదని విని బేగమునకు మఱింత
సంశయము కలిగి, భయమువలన ఢిల్లీమార్గమువదలి పసిబిడ్డను
రక్షించుకొను నిమిత్తము ఆమె అడ్డదారిని బడి పరుగెత్తసా
గెను. ఇట్లామె యెంతటికిఁ బోయినను లోకుల నడిగి తెలిసికొ
నుచు అసామాన్య యామె వెనుకనే పోవుచుండెను. ఇట్లాయిరువు
రొకసంవత్సరమువఱకుఁ దిరుగుచుండిరి. కాని యొకరిదర్శన
మొకరికిఁ దటస్థించినదికాదు! సంవత్సర మైనవెనుక నొకదిన
మసామాన్య బేగమునకుఁ గొంచెము దూరమువఱకు వచ్చిచే
రెను. ఆదిన మత్యంతభయంకర మైనది. ఆకాశమంతయు మేఘ
ములచే వ్యాపింపఁబడి యురుములతోను మెఱుపులతోను భయం
కర మైనవాన కురియ నారంభించెను. ఇట్లు పిడుగులు పడుచున్న
భయంకర మైనవానలో నసామాన్యయొక్క ధ్వనిని 'గుల్'
బేగము బిడ్డను పిలనకుఁ గట్టుకొని పరుగెత్తసాగెను. ఆమె
వెనుకనే యసామాన్య "భయపడవలసినపని లేద" ని మొత్తుకొ
ట్టుచుఁ బరుగెత్తసాగెను. కాని యాగాలివానలో నామెధ్వని
యా బేగమున కెంతమాత్రమును వినఁబడినది కాదు. ఆమె
యట్లు పోయిపోయి, మహావేగముతో రెండుగట్లనుండి సముద్ర
మువలెఁ బొంగి పాఱుచున్న గంగానదియొద్దకి వచ్చెను. అచట

నుండి పోవుమార్గముఁ గానక యామె యచటనున్న నావికులను
తన్నావలిగట్టునకుఁ దవ్వరగాఁ జేర్పుఁడని వేఁడుకొనసాగెను.
గంగయందట్టితుఫాను సమయమున నావవేయు వీలుగాదని
యచటినావికు లందఱును చెప్పఁగా నత్యంత భయాకులమైన
బేగము, తనచేతనున్న రత్నఖచితమైన యుంగరమును వారికి
నియ్యఁబోయెను. మిక్కిలి వెలగలయుంగరము దొరకు నన్న
యాసచే వారిలో నొకఁడు నావ నడుప నుద్యుక్తుఁ డాయెను.
వారు పడవ నెక్కి కొంతదూరమువరకుఁబోయిరి. కాని నదీవేగ
మతిశయమైనందున నచట నావయోడ మునిఁగెను. అట్టిసమయ
మున నసామాన్య గంగయొడ్డునకువచ్చెను. నావ మునుఁగుటఁ
గనినంతనే నావలోనివారిని రక్షింపవలెనని యామె గంగామహా
నదిలో దుమికెను. ఆమె యట్లు దుమికి తనశక్తికొలఁది నీఁదుచు
మధ్యమధ్య ప్రవాహవేగమువలనఁ గ్రమమైన మార్గమునుండి
తొలఁగుచు మునుఁగుచుఁ దేలుచు నావమునిఁగినచోటికిఁ బోయి
చేరెను. ఇట్లెంతటి ధైర్యముతో దృఢనిశ్చయులైనవారు
చేయఁబూనినకార్యము లెవ్విగాకయుండును ? అప్రకార మామె
యచటికిఁబోయి నీట మునిఁగిన 'గుల్' బేగము జడఁబట్టి యీ
వలకు లాగెను. ఆమెవీఁపున గట్టిగాఁ గట్టఁబడిన పసిపిల్లయుం
దల్లితో నీవలికి వచ్చెను. ఇంతలోఁ దుఫాను కొంత తగ్గినందున
నామె మిక్కిలి ప్రయాసముతో వారి నీవలకుఁ దెచ్చి యొడ్డు
మీఁద సమీపమునందున్నగుడిసెకుఁ గొనిపోయి, అచటివారి

నడిగి పొడిగడ్డి, నిప్పు మొదలయినవి దెచ్చి వారి కుష్ఠోపచార
ములు చేయసాగెను. కాని బేగమును, ఈనశ్వర మయినట్టియు,
దుఃఖభూయిష్ఠ మయినట్టియు ప్రపంచసుఖమునుండి గంగాదేవి
యదివఱకే ముక్తురాలినిగాఁ జేసెను; గాన నామె దీర్ఘనిద్ర
నుండి లేవనేలేదు. కాని యాశిశువు కొంతసేపటికి స్మృతికి
వచ్చెను. అసామాన్య బేగమునకు నచటనే దహనవిధులు చేయించి
తా నాశిశువును ఇంటికిఁ గొని చని తాఁ గన్నకూఁతురివలె సం
రక్షించెను. నేటివఱకు బంగాళాదేశమునందు అసామాన్యను
దేవిగా భావించి యాబిడ్డ నెత్తుకొనినటుల నామె విగ్రహమును
చేసి పూజించువాడుక గలదఁట.

ఈప్రకార మసామాన్య తనదృఢనిశ్చయమువలన శత్రువుల
యందును మిత్రభావముంచి, యొరుల కసాధ్య మైనసత్కృత్య
మొనరించి తనపేరు సార్థక మగునట్టులుగాఁ జేసెను. అదే
ప్రకారమా సచ్చరితము చదివిన యువతులును తమచేతనైనంత
వఱకుఁ బరులకు నుపకారము చేయుచుండవలయును. పరులు
మీపై నన్యాయముగా నాగ్రహపడినను మీరు వారి నత్యంత
ప్రేమతోఁ జూచిన యెడల మీరందఱకును పూజ్యురాండ్రయి
యీశ్వరుని ప్రేమచే నసామాన్య లగుదురు.

---

# ఖనా.

'విద్యచే శాశ్వతంబగు వినుతి కల్గు.'

పూర్వకాలమునందు, ఖనా యను స్త్రీ జ్యోతిశ్శాస్త్రమునం దధిక ప్రవీణురాలై యుండెను. ఆమె చేసినకవిత్వ మాబాల వృద్ధుల కధికప్రియముగా నుండెననియు ఖ్యాతిగలదు. కాని మన దేశమునందుఁ జరిత్రములు వ్రాయువాడుక లేనందున నామె చరిత్రము సవిస్తరముగా నెచ్చటను దొరకలేదు. ఇంకను కెంతో యుండి తెల్లవలసియున్నది. ఈమె తలిదండ్రు లెవ్వరో తెలియదు. కాని యామె జననీజనకులు బాల్యమునందే మృతి నొందినందువలన నీమె నెవఁడో యనార్యుఁడు పెంచుకొని యతఁడే యామెకు జ్యోతిషవిద్య నేర్పెనని యొకవింతకథఁ జెప్పెదరు. ప్రాచీనకాలమునం దార్యులకంటె ననార్యులే జ్యోతిషము నందు విశేషపాండిత్యము గలిగియుండిరని యందురు. ఖనా కుశాగ్రబుద్ధి గలదైనందున నితరబాలికలవలె నాటలతోఁ గాలము గడపక తన పెంపుడు తండ్రియొద్ద స్వల్పకాలములోనే సంపూర్ణ జ్యోతిశ్శాస్త్రము నభ్యసించెనఁట! ఆపెంపుడు తండ్రి యీయామెబుద్ధి కెంతయు మెచ్చి తనకు వచ్చినవిద్య యంతయు నామెకు సాంగో

పాంగముగా నేర్పెను. ఇట్లు పురుషులకుసహితము దుర్లభ మయిన గణితజ్యోతిషము నీమెకుఁ గరతలామలకము లయ్యెను.

ఖనా వసియించెడి గ్రామమునందే మిహిరుఁ డను బ్రాహ్మణ చిన్నవాఁ డొకఁ డనార్యునిచేఁ బెంపఁబడెను. పెంపుడుతండ్రి యయిన యనార్యుఁడు మిహిరునిఁ బుత్రవాత్సల్యముతోఁ బెంచి పెద్దవానిఁ జేసి జ్యోతిషమునం దపారపండితునిగాఁ జేసెనఁట. తదనంతరమునందు ఖనా మిహిరు లిరువురును యుక్తవయస్కులై తమ పెంపుడుతండ్రుల యనుమతి వడసి వివాహముఁ జేసికొని సంసారభారమును మోయుచుండిరి.

ఖనాయొక్క తలిదండ్రు లెవ్వరైనది తెలియకపోయినను, మిహిరునివంశము మన మెఱుఁగవచ్చును. లోకప్రసిద్ధు డగువిక్ర మాదిత్యుని సభయందుండు నవరత్నములలో నొకఁ డగువరా హుఁడను కేమిహిరుఁడు పుత్రుఁడఁట. వరాహుఁడు జ్యోతిషమునం దధికప్రవీణుఁడయి జ్యోతిషగ్రంథములు కొన్నిరచించెను. ఆయన మిహిరుఁడు పుట్టఁగానే జాతకము వేసిచూచి యందులో సంఖ్యలు తప్పుటవలన, నూటయేండ్లు నాయుర్దాయ మున్నను తండ్రి కొకపుత్రుకుఁ బదిసంవత్సరములే జీవితమని వచ్చెనఁట. అందుకు వరాహుఁడు మిక్కిలి చింతిల్లి పిల్లవాఁడు పదిసంవత్సరములు పెరిగి మృతినొందిన విశేషదుఃఖమగుఁ గాన నిప్పుడే వీని నెక్కడనైన విడిచిన బాగుండునని యోచించి, కట్టెదోనెలో బాలుని నునిచి నీటి ప్రవాహములో విడిచెనఁట. తదనంతర మాబాలుఁ డొక

యనార్యునకు దొరకఁగా వాఁడు సాఁకి విద్యనేర్పినసంగతి యిది వఱకే వ్రాసినాను.

వివాహానంతరము ఖనా మిహిరుల కిరువురకును ఆర్యులలోనికి వెళ్ళవలయునను వాంఛ గలిగి తమపాలనకర్తల యనుజ్ఞనడిగిరి. అందుకు వారు సమ్మతించి వారినంపి వచ్చుటకయి వెంట నొక యనార్యదాసినిఁ బంపి దానిచేతికిఁ గొన్ని జ్యోతిషగ్రంథముల నిచ్చిరి. ఆర్యు లుండుప్రాంతము యొక్క పొలిమేరదాఁటి వారి దేశమునకు వెళ్ళునపుడు, ఆస్త్రీ జ్యోతిషమునందు ఖనాకును మిహిరునకును గలప్రజ్ఞను బరీక్షింపఁ దొడఁగెను. వారు జ్యోతిషమునందు పండితులని తెలిసిన నాపుస్తకముల మరల స్వదేశమునకుఁ దీసికొని రమ్మనియు, లేనియెడల పుస్తకములు వారికినిచ్చి రమ్మనియు ననార్యులు చెప్పిరఁట. కాన వారినిఁ బరీక్షించుటకయి యాదాసి యచట నీనుటకు సిద్ధముగానున్న యొక గోవును మిహిరునకుఁ జూపి 'ఈయావునకు నెఱ్ఱదూడ పుట్టునా, తెల్లదూడ పుట్టునా' యని యడిగెను. మిహిరుఁడు 'తెల్లదూడ పుట్టు'నని ప్రత్యుత్తరమిచ్చెను. అంతట నాయావు ఈనఁగా నెఱ్ఱదూడ పుట్టెను. అందుపై నాదాసి మిహిరునకు జ్యోతిషజ్ఞానము పూర్ణముగా లేదని యెంచి యాపుస్తకముల నాతని కిచ్చి తన స్వదేశమునకు మరలిపోయెనఁట. అంత మిహిరుఁడు తా నిన్ని దినములనుండి శ్రమపడి యభ్యసించిన విద్యయందు తాను ప్రవీణుఁడు కానందునకు నెంతయుఁ జింతిల్లి, యింత కష్టపడిన దాని

విద్య యింక నీపుస్తకములవలన నేమి గాఁగలదని కోపముతో నాపుస్తకములను ఏటిలోఁ బాఱవేసెను. అప్పుడు ఖనా సమీపముననే యున్నదిగాన పరుగెత్తుకొని వెళ్లి యాపుస్తకములలో నొంటినిమాత్రము నదీప్రవాహములోనుండి యీవలికిఁ దీసెను. కడమపుస్తకము లామెకు దొరకక ప్రవాహములలో కొట్టుకొని పోయెను. తదనంతర మాదంపతులు తిన్నఁగా విక్రమాదిత్యుఁడు వేటకు వచ్చియున్నస్థలమునకు సమీప గ్రామముఁ జేరిరి. అచట విక్రమాదిత్యుఁడు విద్వాంసులను మన్నించునని విని మిహిరుఁడు రాజుసందర్శనముఁ జేసి తనవిద్యావిశేషమును గొంత కనుపరచఁగా రాజు సంతోషించి యాయనను దన సభాస్థానపండితునిగా నేర్పరచి తనగ్రామమునకుఁ దోడుకొనిపోయి వరాహుని బిలిపించి యీదంపతుల నతనికిఁ జూపి 'వీరిని నీయింటనునుచుమని' చెప్పెను. అందుపై వరాహుఁడు వారినిఁ దనయింట నుంచుకొనెను. అంతఁ గొంతకాలమునకు వరాహునకుఁ దాను పాఱవేసిన తనకొమారుఁడీమిహిరుఁడే యని తెలిసి పితాపుత్రులిరువురకును అపరిమితానందము కలిగెను. తదనంతర మెప్పుడును వరాహుఁడు, మిహిరుఁడు, ఖనా తమలోఁ దాముజ్యోతిషమునుగుఱించి యనేకప్రసంగములు చేయుచు జ్యోతిశ్శాస్త్రములోని క్రొత్తక్రొత్తసంగతులను గనిపెట్టసాగిరి. మిహిరుఁడు తండ్రితో సమానవిద్యావిశేషములు గలవాఁడుగాన విక్రమార్కుని సభయందును, దేశమునందంతటను ఆయనకీర్తిని గొనియాడని

వారు లేకయుండిరి. ఖనాయింటియొద్దనే యుండి రాజసభ కేన్నఁ డును పోకపోయినను ఆమెయందుండు సుగుణసంపదయును, విద్యా పరిమళమును, దిగంతములయం దంతటను వ్యాపించెను. వరా హుని కోడలును మిహిరునిభార్యయు నగు ఖనా ఖగోళవిద్యయం దధిక ప్రవీణురాలని యందఱును జెప్పుకొనుచుండిరి.

ఇట్లుండ నొకనాఁడు విక్రముఁడు వరాహునిఁ బిలిచి యాకా శమునందుఁ గలనక్షత్రసంఖ్య చెప్పుమనెనఁట! అందున కాయన గ్రంథములను శోధించియు నక్షత్రసంఖ్య కనుఁగొనఁజాలక ఆకా శమునందుఁ గల నక్షత్రములను లెక్కించుటకు వీలు లేనందున మిక్కిలి చింతనొంది యాసంగతి కొమారునకుఁ దెలిపెను. కొమారుఁడును దనశక్తి నంతను వినియోగపఱచి యాలోచెనుగాని యాయుక్తియు నక్షత్రసంఖ్య దెల్పుట కెంతమాత్రమును పనిపడినదికాదు! ఇట్లు పితాపుత్రు లిరువురును నిరుపాయులై రాజసభలోఁ దమకు నవమానము కలుగునని చింతాక్రాంతులై యుండఁ వారినిఁ జూచి, ఖనా, విచారహేతు వడిగెను. ఆమె యందుకుఁ గారణము తెలిసికొని దీని కింత విచారమేల యని. వారికిఁ గొంతధైర్యముఁ జెప్పి తా నొకగడియసేపు గణితము చేసి నక్షత్రసంఖ్యఁ గనిపెట్టి వారికిఁ జూపెను. అందుపై వారు ప్రముదితులై భోజనములుచేసి రాజసభకుఁబోయి యానక్షత్ర సంఖ్యను దానిఁ గనుఁగొనినరీతియుఁ జూపఁగా సభికు లందఱును. అధికాశ్చర్యమగ్నమానసులైరి. అంత వరాహుఁ డామహా

కార్యము తనప్రజ్ఞవలనఁ దెలియలేదనియుఁ దనకోడలే విద్యాధి
కురాలై నందున నీసంఖ్య సులభముగాఁ గనిపెట్టెననియుఁ జెప్పెను.
ఆమాట విని యచటనున్నవా రందఱును ఆవిదుషిని వేనోళ్ళఁ
గొనియాడిరి. విక్రమాదిత్యుఁడు మిగుల సంతసించి "నాసభ
యందు నవరత్నములతో రేపటినుండి యామె దశమరత్నముగా
నుండును. కాన రేపటినుండి యామెను అవశ్యముగా సభకుఁ
దోడ్కొనిరమ్మని" యానతిచ్చెను! రాజాజ్ఞ వినినతోడనే వరా
హుని కత్యంతభీతి కలిగెను. ఎందుకన స్త్రీలను రాజసభలలోనికిఁ
దీసికొనిపోవుట యెంతయు నవమానకరమనియు, లోకనిందాస్ప
దమనియు వరాహుని యభిప్రాయమఁట. కోడలిని రాజసభకుఁ
దీసికొని పోకుండిన రా జత్యంతాగ్రహపడునని తలఁచి వరా
హుఁడు ఇందుకు మూలకారణురా లయిన ఖానానుచంపివేసిన
బాగుండునని నిశ్చయించెనఁట! వరాహుఁ డాసంగతిఁ గొమా
రునకుఁ దెల్పి నీభార్య నాలుక కోయుమని యాజ్ఞాపించెనఁట!
కాని సద్గుణమణియగు ప్రియభార్య నంతక్రూరత వహించి చం
పుటకు మిహిరున కింతమాత్రమును మన సొప్పకుండెనఁట!
ఈసంగతియంతయు ఖానాకుఁ దెలిసి, మామగారియాజ్ఞను ఉల్లం
ఘించక శిరసావహించి తన నాలుకనుగోసి ఖండింపుఁడని భర్తను
భక్తితో వేఁడుకొనెనఁట! అందుపై నాతఁడు మనసు దృఢపర
చుకొని ప్రియభార్యయొక్క జిహ్వను ఖడ్గముతోఁ గోసెనఁట.
అందుపై నామె త్వరలోనె యిహలోకము విడిచెనఁట. కొంద

టీకథనే యిట్లు చెప్పుదురు:—విక్రమార్కుని యాజ్ఞ ప్రకారము ఖనా యాతని సభలోని పదియవ రత్నమయ్యెను. తరువాతఁ గొన్నిరోజులకుఁ గాలధర్మము నొందెను. ఇట్లు చెప్పువారీమె స్వాభావికముగా మానవు లందఱు మృతిఁ జెందునట్లుగానే మృతిఁజెందినదనియు బరులచేఁ జంపఁబడలేదనియుఁ జెప్పెదరు. మొదటి కథకంటె నీ రెండవకథయే విశేష సంభవనీయముగా నున్నది. విక్రమునికాలమునందు స్త్రీలకు రాణివాసము లేక యుండెనని యనేక ప్రమాణములవలనఁ గానఁబడుచున్నది. ఇది యుంగాక యంతరాణివాసముండినయెడల రాజు ఖనాను రాజ సభకుఁ దీసికొనిరమ్మని యేల చెప్పియుండును ? తనప్రియభార్యను నిష్కారణముగా మిహిరుఁడు చంపెనన్న క్రూరపుమాట నమ్మ దగినదికాదు. కనుక రెండవకథయె యుక్తియుక్తముగా నున్నది.

ఈ వరిశోమునం దనేకాసంభవములైన సంగతు లచ్చటచ్చటఁ గానుపించు చున్నవి. వానిని విడిచినను పూర్వకాలమునం దొక స్త్రీ, పురుషులకుఁగూడ నసాధ్యమగు జ్యోతిర్విద్య నభ్యసించి ప్రవీణత నొందియుండెననియు, ఆమెకు జ్యోతిషముయొక్క యంగములైన [illegible]స్కంధమునందును గణితస్కంధమునందును, అసమానప్రజ్ఞ గలిగియుండినదనియు స్పష్టముగాఁ దెలియుచు న్నది. ఖనాయొక్క బుద్ధి యిట్టి గహనవిషయమునం దింతసులభముగాఁ బ్రవేశించుటఁ జూడఁగా, స్త్రీలబుద్ధి పురుషుల బుద్ధికంటె మందమనియు, నాఁడువారిమెదడు (మస్తిష్కము) మగవారి

మెదడున కంటె బలహీనమనియుఁ దక్కువ తూఁగుననియు,
నందువలన పురుషులకుఁ దెలిసినంతటిజ్ఞాన మతివలకుఁ దెలియుట
సంభవింపదనియుఁ జెప్పువారిమాట లన్నియుఁ బక్షపాతవచన
ములని నిర్వివాదముగాఁ జెప్పవచ్చును. స్త్రీలు నైసర్గికమూర్ఖు
రాండ్రని చెప్పుటకంటె నేటివఱకు స్త్రీలకు బాల్యమునుండియు
విద్యాగంధము నించుక సోఁకనియ్యనందున వారు మూర్ఖురాం
డ్రుగాఁ గానుపించెదరని చెప్పవచ్చును. బాల్యమునందు బాలు
రును బాలికలును సమానబుద్ధివైభవములు గలిగియే యుందు
రని మనకందఱకును దెలిసినమాటయే. బాలురకంటె బాలిక
లెప్పుడును బుద్ధిహీనలుగా నుండరు. బాల్యమునందాఁడుపిల్ల
యెట్టి బుద్ధివైభవము గలదైనను తలిదండ్రులు దాని నంతమా
త్రమును విద్యనేర్పక జ్ఞానాభివృద్ధికిం దగినయుపాయము నేవియుఁ
జేయనందున నది వివేకహీనురాలగుచున్నది. బాలుఁడు చిన్న
తనమునం దెంతమందబుద్ధియైనను వాని కైదేండ్లు రాఁగానే తలి
దండ్రులు విద్య నేర్పి వానికిఁగల మాంద్యమును వదలించి,
జ్ఞానాభివృద్ధికొఱకనేకశాస్త్రములను జదివింతురు. కాన వాఁడు
మిక్కిలి ప్రజ్ఞావంతుఁడై ప్రసిద్ధుఁడగును. చిన్ననాఁడు వానికంటె
విశేషప్రజ్ఞగల వానియక్కమాత్రము విద్యాగంధ మేమియు
లేనందున మహామూర్ఖశిరోమణియై యుండును. ఇట్లు తలి
దండ్రులపక్షపాతముచేఁ బురుషసంతతిలోను స్త్రీసంతతిలోను జ్ఞాన
మును గుఱించి మహాదంతరముపడినదేగాని స్త్రీలస్వాభావిక

మౌర్ఖ్యమువలనఁగాదు. కాన స్త్రీలకును పక్షపాతరహితులై పురుషులు విశేషవిద్య నేర్పినచో స్త్రీలును అసామాన్యబుద్ధి చాతుర్యములను జూపి పురుషుల కనేకవిషయములలో సాయముచేసి యర్ధాంగులన్న నామమును సార్థకపఱుతురని నొక్కి వక్కాణించుటకు సందేహము లేదు.

---

# మీ రా బా యి.

---

క. స్మృతిసౌఖ్య క్షాంతి శ్రీ
ధృతికీర్తులు గలుగు*దు ర్మతియు గ్రోధము లు
ద్ధతయును మాత్సర్యములే
వతిపుణ్యత విష్ణుభక్తు*లైన జనులకున్. శాంతిపర్వము.

నేటివఱకు కీమాలయందుఁ గూర్పఁబడిన నారీమణులలోఁ బలువురు రాజ్యకార్య ధురంధరత్వమునందును, కొందఱు పాతివ్రత్యమునందును, కొందఱు విద్యావినయాది సద్గుణములయందును, కొందఱు దానధర్మాదులయందును బ్రసిద్ధిని గాంచిరి. అనఁగా వీరందఱును ఐహికసంబంధ మగుజనసంగతులయందే మనకు వంద్యులయిరి. ఈచరిత్రనాయిక యిట్టివిషయములలో బ్రసిద్ధిఁగాంచలేదు. ఈమె తత్త్వజ్ఞురాలనియు, భక్తాగ్రేసర చక్రవర్తిని యనియుఁ బ్రశంసింపఁబడు వనితారత్నము. హిందూదేశమునందేమి యితరదేశములయందేమి జన్మించి భగవద్భక్తిచే నజరామరు లయినసాధువుల ధర్మమతము లెట్టివైనను వారందఱును పక్షపాతరహితు లగుజనులకుఁ బూజనీయులే యగుచున్నారు. వారియాచారములు మనయాచారములకన్న భిన్నములైనను వారికిఁ గల నిష్కళంకమయిన యీశ్వరభక్తివలననే

వారు మనలకు వందనీయులగుదురు. కాన విష్ణు భక్తిపరాయణ యగు ప్రస్తుత కథా నాయికయొక్క చరిత్రము సకల మత మతాంతరులకును గ్రాహ్యమేయని చెప్పవలెను.

ఉత్తరమున హిమాచలము, దక్షిణమున వింధ్యాద్రి, తూర్పున గంగ, పశ్చిమమున సింధువు సరిహద్దులుగాఁ గల ప్రదేశము నందెటు చూచినను, త్రోవనడుచు పాంథులును, ఇల్లిల్లు తిరిగి తిరిపె మెత్తుకొను భిక్షుకులును, గొడ్లను గాయు గొల్లపిల్లలును, రాజ సభలయందు సంగీతము పాడు గానవిద్యానిపుణులును మీరా నామాంకితముగల పదములఁ బాడుచుందురు. వారిలో నెవరినైన 'మీరా' యెవరనియడిగిన వారత్యంత పూజ్యభావముతో నామెకు మ్రొక్కి "మీరా యొక యపూర్వ స్త్రీరత్నము" అని చెప్పుదురు. ఈప్రకార మాప్రాంతమునందంతట నాబాలవృద్ధుల కందఱకును వందనీయురాలై మీరాబాయి ప్రసిద్ధిఁ గాంచెను.

మారవాడ దేశమునందు మేరతనివాసులగు రాథోర్ రాజపుత్రులవంశము గొప్పదని యెన్నఁబడును. ఆవంశములోని వాఁడగు జయమల్లుఁడను నొకసరదారునకు విక్రమశకము ౧౪౫౮ వ సంవత్సరములో నీకన్యారత్నము జన్మించెను. మీరాబాయి తండ్రియగు జయమల్లుఁడు మిక్కిలి దయాపరుఁడై పేదసాదలను రక్షించుచు వీలుగానున్నసమయమున భగవత్కీర్తనము నందుఁ గాలముఁ గడపుచుండెను. ఆయన సహవాసమువలన మీరాబాయికిని భక్తి పుట్టువడెను. తండ్రి యామెకుఁ జిన్నతన

మునకె విద్య చెప్పించినందున నామె భాగవతము, విష్ణుపురాణము, రామాయణము మొదలగు భక్తిరసప్రధానములగు గ్రంథములనె యెల్లప్పుడును చదువుచుండెను.

విద్యావతియు, సద్గుణవతియు, నసమానరూపసంపన్నయు నగు మీరాబాయి యుక్తవయస్కురాలు కాఁగా ఆమెను ఉదయపురాధీశ్వరుఁడగు కుంభరాణా కిచ్చివివాహము చేసిరి. వివాహానంతరము దంపతు లిరువురును సమానవిద్యాగుణరూపములు గలవా రయినందునఁ బరస్పరానురాగము గలిగియుండిరి. ఆదంపతు లిరువురును ఒకరి సహాయముచే నొకరు కవిత్వముఁ జెప్పుటయందు ప్రవీణులైరి. కాని రాణాచేయు కవిత్వమంతయు నైహికవిషయముగాను, మీరాబాయి చెప్పు పద్యము లన్నియుఁ బరమార్థవిషయములుగాను ఉండెను. అంతఁ గొంతకాల మరిగినపిదపఁ దండ్రి మరణానంతరము కుంభరాణా రాజాయెను. రాణాగారికి రాజ్యాధికారము దొరికినది మొదలు మీరాబాయికి మునుపటికంటెను స్వతంత్రతవిశేషముగా దొరకెను. కాన నామె భక్తియనుమతి వహించి నిత్యమును ఈశ్వరుని ప్రార్థన, స్తుతి, పూజనము మొదలయినకార్యములయందే చాలకాలము గడుపుచుండెను. ఆమె తనసఖుల కెప్పుడును సర్వవ్యాపియగు విష్ణునిగుణములనే చెప్పుచు భక్తులయెడ ఆయన కనఁబఱచిన యధికాదరములను చదివి వానిపై తాననేకపద్యములను పాటలను రచించి చదివి యానందపరవశురాలగుచుండె

ను. ఆమె సఖులును తమరాణిగారు చెప్పు భగవద్గుణకీర్తన
ముల వినియుండుటవలనే తాము ను భగవద్భక్తి పరవశు లగు
చుండిరి. ఆహా! రాజ్యవైభవము గలిగియు నందు నిచ్ఛలేక
యిట్లు పరమార్థచింతయందే పరమానందమును బొందుచు
తనసఖులను సహితము మల్లె భక్తురాండ్రను జేయువా రీలోక
మున దుర్లభులుగదా?

ఇట్టిపరమభక్తురాలు ఉదయపురపుకోటలో బంధింపఁబడి
రాణివాస మనుకారాగృహావాసమునం దెటుల నుండఁగలదు?
ఆమె యాగ్రామములో రాజగృహమున కావలనుండు కృష్ణ
మందిరమునకు నిత్యమును బోవఁ జొచ్చెను. అచ్చట నామె
తాను పరమేశ్వరునిగా భావించిన కృష్ణవిగ్రహమును భక్తియుక్త
ముగాఁ బూజించి తనసుస్వరములతో భక్తిరసపూరితము లగుపద
ములఁ బాడి యానందాతిరేకమువలన నాట్యముఁ జేయుచుం
డెను. ఇట్టినిష్కళంకభక్తిచే నామెకీర్తి క్రమక్రమముగా నెల్లె
డలఁ బ్రసరించి యామందిరమునకు ననేకు లామెను జూచుటకై
రాసాగిరి. కోటానుకోట్ల నధికముగా దేశములనుండి సాధువులు
మూఁకలుకట్టి యామె దర్శనమునకు వచ్చుచుండిరి. వారిలో
యోగులును, తత్త్వవిచారపరులును, భక్తిపరాయణులును
అనేకు లున్నందువలన వారిసాంగత్యముచే నామెకు స్వాభావిక
ముగా నున్నభక్తి యంతకంత కధికమగుచుండెను.

ఇట్లు మీరాబాయిఖ్యాతి యనేక దేశములలో నిండి

యాపెచే రచియింపఁబడిన పద్యములను కీర్తనలను ప్రతిగ్రామములో జనులు భక్తితోఁ బాడసాగిరి. అప్పుడు ఢల్లీ పాదుషాగా నున్న అక్బరు మీరాబాయియొక్క కీర్తి విని యాభక్తురాలిని జూడవలెనన్న యిచ్ఛ గలవాఁడయ్యెను. కాని ఉదయపురాధీశ్వరుఁడు తన కదివఱకు లోఁబడినవాఁడు కానందునను, స్త్రీలు తురకల కనులఁబడుట గొప్పయవమానకర మయినసంగతియని రాజపుత్రులకు దృఢాభిప్రాయ మున్నట్టు తెలిసినవాఁడు గనుకను, అంతకుఁ బూర్వము తురుష్కుఁ డొకఁడు రాజపుత్రిని జూడఁ గోరినంతమాత్రమునఁ జిత్తూరు రాజపుత్రికలందఱును తమదేహముల నగ్నిహోత్రమున దగ్ధించుట నదివఱకే విని యున్నవాఁడు గనుకను అక్బరు, రాజవేషముతో మీరాబాయినిఁ జూచుట యసంభవమని తలఁచెను. అంత నాతఁడు తనసభలోని తానసేనుఁడను ప్రఖ్యాతగానవిద్యాపరునిఁ బిలిపించి యుపాయమడిగెను. అతని యాలోచనప్రకారము అక్బరును తానసేనుఁడును సాధారణ హిందూబైరాగులవేషములు వేసికొని గూఢముగా నుదయపురముఁ జొచ్చి మీరాబాయి పూజచేయుచున్న మందిరముఁ బ్రవేశించిరి. అంత నాపాదుషా మీరాబాయి భక్తిజ్ఞానములఁ గని యానందమగ్నుఁడయి యామెవలన తాను పరమార్థోపదేశముఁ బొందవలయునని తలఁచి పవిత్రురాలగు మీరాబాయికి సాష్టాంగనమస్కారముఁ జేసెను. అందుపై మీరాబాయి 'నీవు నాకేల నమస్కరించెదవు. పరమేశ్వరునకు నమస్కరింపుము.

నావలన నీ కేమి కావలయునో చెప్పుము" అని యడిగెను. అందు కాపాదుషా "నాకుఁ బరమార్థసాధన ముపదేశింపు మనఁగా నామె "సదా పరమేశ్వరభక్తియే పరమార్థసాధన" మని యుపదేశించెను. ఉపదేశమును గ్రహించిన పిదప నాతఁడు తనయొద్ద దాఁచియుంచిన రత్నమాల గురుదక్షిణగా నామెకు నియ్యఁ బోయెను. ఆమాలను జూచి మీరాబాయి "ఇట్టియపూర్వ మైనరత్నమాల బైరాగివగు నీ కెక్కడినుండి వచ్చెను" అని యడిగెను. అందు కాయన 'తా నొకరాజువద్ద నేదో యపూర్వ కార్యముచేసి యాతనిని మెప్పించినందున తన కారాజిచ్చె'నని చెప్పెను. మీరాబాయి యారత్నహారము తన కక్కరలేదని దిట్టముగాఁ జెప్పినందున నామాయబైరాగి యారత్నహారము మందిరములోని స్వామిమెడలోవేసి చనెను. కాని యాహారమే మీరాబాయి సంసారసుఖమునంతను నిర్మూలము చేయుటకుఁ గారణ మాయెను. అట్లాయన వెళ్లిన మఱుసటిదినమే మిగుల విలువగల యారత్నహారము సంగతి గ్రామమంతటను వ్యాపించి రాజునకుం దెలిసెను. వెంటనే రాజు దాని దెప్పించి రత్నపరీక్షకులచే దానివిలువ పదిలక్షలని తెలిసికొనెను. ఆరత్నపరీక్షకులలో నొకఁడు తానాహారము ఢిల్లీపాదుషాయగు అక్బరున కమ్మితి ననియుఁ జెప్పఁగా విని హారము నిచ్చి పోయినవా డెవడై యుండునా యని విచారింపసాగెను. విచారింపఁగా విచారింపఁగా ఆవచ్చినవాఁడు ఢిల్లీపతియగు పాదుషాయే యనియు,

ఆయన తనపత్ని పాదములఁ దాకి యామెతో సంభాషించెననియు రాణాకుఁ దెలిసెను. అందుపై రాజత్యుగ్రుఁడై తన సుశీల యగు పత్నిని దుస్సీలనుగా నెంచి యామె తమరజపూతకులమునకుఁ గళంకముఁ దెచ్చెనని యెంచి యట్టిదుష్టురాలిని జీవముతో నుంచుట తన కపఖ్యాతికరమని తలఁచెను! తోడనే రాజామెను చంపుటకు నుత్తరు విచ్చెను, కాని యామెను జంపునట్టి ఘోర కార్యముఁ జేయుటకు నెవ్వరును సమ్మతించరైరి. కనుకఁ దన్నుఁ దానే చంపుకొనవలసినది యనఁగా నాత్మహత్యఁ జేసికొనవలసిన దని మీరాబాయికి నుత్తరము వ్రాసి దానిపై రాణాగారు తన చేతిముద్రను వేసి యామెకుఁ బంపెను. మీరాబాయి దేవ మందిరమునుండి యింటికి వచ్చునపు డొకయమాత్యుఁ డాయుత్తర మామె కిచ్చెను. ఆమెదానిఁ జదివి భీతిల్లక భర్తదర్శన మొకసారి తనకు నగునాయని యామంత్రి నడిగెను. మీరాముఖముఁ జూడనని రాణాగారు శపథము వహించినందున రాజదర్శనము కానేరదని యామంత్రివరుఁడు చెప్పెను. అందుపై నామె "నీవు వెళ్లి మీభార్య మీయాజ్ఞను శిరసావహించెనని రాజుతోఁ జెప్పు" మనెను కాని యామె యుత్తరములోని సంగతి సఖుం కెంతమాత్రమును జెప్పినదికాదు. ఆమె రాజమందిరముఁ బ్రవేశించి యెప్పటివలెనె యీశ్వరభజనయందుఁ గాలముఁ గడపెను! నాటిరాత్రి యందఱును నిద్రించినపిదప మీరాబాయి రాణివేషమును విడిచి బీదస్త్రీల కుచితమైన వస్త్రములను ధరిం

యిల్లువిడిచి భగవంతుని స్మరింపుచు నొక నదీతీరమునకు వెళ్ళె
ను. అచట నామె పతియాజ్ఞఁదలఁచి నిండి పాఱుచున్ననదిలో
దుమికెను! అంత నామెకు దేహస్మృతి తప్పెనుగాని మధ్యమధ్యం
దనప్రాణ మింకను దేహమును విడువలేదనిమాత్ర మామెకు
దెలియుచుండెను. అట్టియర్ధస్మృతిలో నామె కొకదివ్యతేజము
కనుపడెనఁట. ఆ తేజమిటులఁ బలికినట్లు మీరాబాయికిఁ దోఁచెను.
"ఓమీరా! నీవు నీభర్తయాజ్ఞఁ జెల్లించి యాత్మహత్యఁ జేసికొని
కృతార్థురాలవైతివి, కాని నీకు నింకను ఆయువు చాలనున్నది.
నీవింకను బ్రపంచముపైఁ జేయవలసినకార్యము లనేకము
లున్నవి. కాన నీకర్తవ్యములఁ జేయుకొనుటకులెమ్ము." ఈవాక్య
ముల విని యామె కన్నులు విప్పి చూచునప్పటికి నదీ తీరమున
తానున్నట్లామెకుఁ దెలిసెను. అప్పుడు తెల్లవారి సూర్యో
దయ మగుచుండెను. అంత నామెలేచి యచట నలువంకలఁ
బరికించి యెవ్వరినిఁగానక కొంతసేపటివఱ కేమియుఁ దోఁచక
యూరకుండెను. కాని మరల తెలివిఁ దెచ్చుకొని యీశ్వరభజన
చేయుచుఁ గొంతదూర మరిగి యచట గొల్లపిల్లలను గని "అన్న
లారా! బృందావనమార్గముఁ జూపెదరా?" యని యడుగఁగా
వారామెకుఁ ద్రోవఁజూపిరి. ఆగోపాలకుల కామెభక్తిచేతను,
వినయవాక్కులచేతను ఆమెయెడఁ బూజ్యభావము గలిగినందున
వారు "అమ్మా నీకేమి కావలెను" అని యడిగిరి. ఆమె యాఁ
కొని యున్నదుటఁగని యామెకుఁ బాలు త్రాగనిచ్చిరి. వారిలో-

గొందఱు బాలకు లామెకుఁ ద్రోవఁజూపుచు నామె వెంటఁ జనిరి. అప్పు డామె వారు చూపినమార్గమునఁ బోవుచుండఁగా మార్గమునఁ గల పల్లెలయందలి ప్రజ లామెభక్తికి నచ్చెరువందుచు నామెకు శిష్యులై గుంపుగుంపులుగా నామెతో నడువసాగిరి. వారికి రావలదని వారింపుచు వా రిచ్చువస్తువులను గైకొనక యాఁకలి సమయమునఁ గొంచెమాహారముఁ గొనుచు నామె, బృందావనమెప్పుడు వచ్చునోయని చింతింపుచు, యహోరాత్రములును నడుచుచుండెను. ఇట్లామె వలదన్నను భజన చేయుచు వెంటవచ్చు జనసమూహముతో నామె బృందావనపురము సమీపింపఁగా నచటిప్రజ లామె కైలాసమునుండి గణములతో నిటకు వచ్చిన కాళికాదేవియని తలఁచిరఁట! ఆమె యచటికి వెళ్లి నపిడప జీవగోసాయియను గొప్పసాధువచట నుండు నని వినెను. ఆజీవగోసాయి పరమభక్తుఁడును జ్ఞానియునై తన శిష్యుల కందఱకును "మీకు జ్ఞానము కావలెనన్న ధనమును స్త్రీనిఁ బరిత్యజించుటయెగాక వానిఁ గన్నులతోనైనఁ జూడఁ గూడదు" అని బోధించి తానును స్త్రీముఖముఁ జూడనని యొకవ్రత మవలంబించెను. ఈసంగతియంతయు విని మీరాబాయి యాగోసాయి కిట్టి యర్థము గల వర్తమాన మంపెను. "బృందావనమునందు శ్రీకృష్ణుఁ డొక్కఁడే పురుషుఁ డనియు భక్తులందఱును ఆయనను, పతిని ననన్యభక్తితో సేవించెడి పత్నివలె, సేవింతురుగాన నట్టి భక్తులందఱును పురుషులయినను స్త్రీ

లయినను స్త్రీలేయనియు జెప్పెదను. ఇట్లందఱు భక్తులును సమాను లయినప్పుడు మేము పురుషులమని గర్వించుట హాస్యాస్పదము. మీకుఁ బురుషులమనిన గర్వము గలదేని మీరు భక్తుల్గు కానేరరు. భక్తులే యయినపక్షమున భక్తురాండ్రను జూచుట కేమి యభ్యంతరమో సెలవిండు.” ఈయుపదేశ మయిన వార్తనువిని జీవగోసాయి తెలివిఁ దెచ్చుకొని తనవ్రతమును విడిచి మీరాబాయి సన్నిధికి వచ్చి యామెకు సాష్టాంగ నమస్కారముఁ జేసెను. నాటినుండియు నాతఁడు తనకుఁ దెలియని పరమార్థవిషయములు మీరాబాయిని అడిగి తెలిసికొనుచుండెను. మీరాబాయి జీవగోసాయికి తానే శిష్యురాలనని యందఱకును చెప్పుచుండెను. కాని లోకులంత యామెకే జీవగోసాయి శిష్యురాయెనని నమ్ముచుండివారు. మీరాబాయి యచట శ్రీకృష్ణాలయములోనే వాసముచేయుచు స్వామిపైననేక కీర్తనలను రచించి పాడుచుండెను. ఆభక్తిరసపరిపూర్ణము లగు కీర్తనలు వినుటకు దేశదేశములనుండి యాత్రకు వచ్చువారివలె ప్రజలు వచ్చుచుండిరి. ఇట్లు కొంతకాల మరుగ నామెకీర్తిహిందూస్థానదేశమునందంతటను వ్యాపించెను. ఉదయపురమునందునుఆమెకీర్తి వ్యాపించెనని వేరుగఁ జెప్పవలెనా? గ్రామమునందెచటికివెళ్లినను తనభార్య రచితము లగుపద్యములను పాటలను ప్రతిమనుష్యుని నోటినుండియు కుంభరాణా వినుచుండెను. ఆ బాలవృద్ధుల కందఱకు నామెయందుఁ బూజ్యభావము గలిగి యా

మెను దైవమువలె భజించుచుండిరి. నిర్దోషిణి యగు తనభార్య నన్యాయముగా వెడలఁగొట్టినందుకు రాణా నందఱు దూషింపసాగిరి. జగద్వంద్యయగు తనభార్యయెడలఁ దాను గొప్పఁ పరాధంబుఁ జేసితినని యప్పుడు రాణాకుఁదోఁచెను. అప్పు డాయన బయలుదేఱి బృందావనమునకు వెళ్లి మారువేషముతో మీరాబాయికి సాష్టాంగనమస్కారము చేసి నాకొకవర మిమ్మని యడిగెను. అప్పుడు మీరాబాయి "నీకు కావలయుపదార్థములు గొప్పవా రియ్యఁగలరు గాని నావంటి బీదవారి నాశ్రయించిన ఫల మేమి" అని యుత్తర మిచ్చెను. అందుకు రాజు "యాచకుఁడు సామర్థ్యము గలయజమానునిఁ జూచియే యాచించు" నని బదులు చెప్పెను. అందుపైని 'నీవేమి కోరెద'వని యామె యడుగఁగా 'నన్ను క్షమింపు' మని కుంభరాణా నిజస్వరూపమును జూపెను. అప్పుడు మీరాబాయి యత్యానందమువలనఁ గొంతసేపు దేహము తెలియకయుండి పిదపఁ దెలివితెచ్చుకొని యామె భర్తపదములకు నమస్కరించి 'స్వామీ! దాసురాలు తమకు నేటికి జ్ఞప్తికి వచ్చినందునఁగదా నేఁడు నేను ధన్యురాల నైతిని' అని గద్గదకంఠయై పలికెను. తదనంతరము రాణా మీరాబాయిని స్వరాజ్యమునకుఁ దీసికొనిపోయి ప్రజలనందఱిని ఆనందింపఁ జేసెను. నాఁటినుండియు నాదంపతుల యనురాగ మెన్నఁడును తగ్గక దినదినప్రవృద్ధమానమే యగుచుండెను. అప్పటినుండియు మీరాబాయి యాఱుమాసములు బృందావనమందును ఆఱు

మాసములు ఉదయపురమునను వాసముచేయుచుండెను. ఇట్టి భక్తశిఖామణి యయిన మీరాబాయి కొన్నిరోజులు దైవభక్తియందును పతిభక్తియందును కాలముగడపి పరమపదము పొందెను.

Madras: The Guardian Press, Mount Road

# అబలాసచ్చరిత్రరత్నమాల

## ద్వితీయ సంపుటము

ఇది

శ్రీమతి భండారు అచ్చమాంబ ప్రణీతము

మూడవకూర్పు మూడువేయి

వేదానంద కంపెనీ, ముద్రాక్షరశాల

౧౩, ఆయిల్ మాంగర్ వీధి

మద్రాసు

౧౯౧౭



వెల రు. ౧-౪-౦

# విషయసూచిక



# పీ ఠి క

కీర్తిశేషురాలైన శ్రీమతి. బండారు అచ్చమాంబగారు రచించిన అబలాసచ్చరిత్ర రత్నమాలలో కొన్ని చరిత్రములు ఇదివరలో నేను ఎచ్. వి. కృష్ణలో భాగస్థుడుగా నుండగా మొదటి సంపుటముగా ప్రకటించితిని. ఇట నే వర్ణింప నవసరముకాని కొన్ని కారణములచే రెండవ సంపుటము నింత కాలము దనుకను ప్రకటింపజాలనైతిని. ఆంధ్రలోక మీ రెండవ సంపుటమునకై యెదురు చూచుచున్నదని నే నెరుగని వాడనుకాను కావున నిప్పుడు యుద్ధ సమయమేయైనను గ్రంథములకు వలయు సర్వోపకరణములు మిక్కిలి ధర హెచ్చి యున్నను సాహసించి పనిబూని నేటి కీ గ్రంథమును వెలియిడ గలిగితిని. అవ్యాజభ్రాతృ వాత్సల్యమున నాకిట్టిప్రకటనా స్వాతంత్ర్యము ననుగ్రహించియుండు మాకొమర్రాజు లక్ష్మణరావు ఎం. ఏ. గారికి హృదయపూర్వక కృతజ్ఞతను తెలియజేయు చున్నాడ. ఇంకను అచ్చమాంబగారు వ్రాసిన చరిత్రములు బాగుగా తెలియని సతీమణుల వృత్తాంతములును వారు రెండవ భాగముగా తలపెట్టి కొంతవరకు సాగించిన పురాణ కాలపు స్త్రీలచరిత్రములును ప్రకటితములు కావలసియున్నవి. దీనినిమూడవసంపుటముగా ప్రకటింపనున్నాను. ఈ రెండవసం

పుటముద్రణమున అచ్చుచిత్తుల దిద్దుటలోను మరి యితర విధము నునాకత్యంత సహాయకుడైన బైసాని. నరసింహేశ్వర గుప్త గారికి నాయభినందనము లర్పించుచున్నాను. ఆంధ్రలోక మెప్పటి వలె నాప్రయత్నముసెడల నభిమానము జూపినను కృతజ్ఞు నోనర్చుగాకయని ప్రార్థించుచున్నాను.

3, న్యూబంగిళావీధి,
చింతాదిపేట.

ఇట్లు బుధవిధేయుడు,
గా-హరిసర్వోత్తమరావు.



# అబలాసచ్చరిత్రరత్నమాల.

## రెండవ భాగము.

## రాణీసంయుక్త.



౧౨౫౦ వ శకాబ్దమునందు రాథోడ్ వంశీయుఁ డగుజయచంద్రుఁడు కనౌజ (కాన్యకుబ్జ) రాజ్యమును, చవ్హాణవంశోద్ధారకుఁడగు పృథివీరాజు ఢిల్లీరాజ్యమును పాలించుచుండిరి. ఈయసామాన్యపరాక్రమవంతు లిరువురిలో సంయుక్త జయచంద్రునకుఁ గూతురును పృథివీరాజునకు భార్యయు నయ్యెను. కాన నా రెండువంశములును నామెవలనఁ బవిత్రము లయ్యె ననుటకు సందేహము లేదు.

జయచంద్రునకు సంయుక్త యొక్కతయే కూఁతు రగుట వలన జయచంద్రుఁడు సంయుక్త నెక్కువ గారాబముతోఁ బెంచెను. సంయుక్త స్వభావమువల్లనే సద్గుణవతిగానఁ బెరిఁగినకొలఁదిని ననేకవిద్యల నేర్చి మిగుల నుతి కెక్కెను. ఆమె సద్గుణములును లావణ్యమును గనిన ప్రజ లందఱుఁ దమజన్మము సార్థక మయ్యెనని తలఁచి సంతసించుచుండిరి. ఇట్లీమె కొన్నిదినములు బాల్యావస్థయందుఁ గడపి యౌవనావస్థం దాల్చెను.

ఇట్లు యుక్తవయస్కురా లగుబిడ్డకుఁ దగినవరుఁ డెవఁడా యని జయచంద్రుఁడు చింతింపసాగెను. సంయుక్త రూపలావణ్యములకీర్తి సకలదిక్కులను వ్యాపిం నందున ననేకరాజపుత్రు

లామెను దమ కిమ్మని కోరుచు వర్తమానము లంపిరి. ఢిల్లీపతి యగు పృథివీరాజా యామె రూపగుణములను విని యామెను నెటు లయినఁ జేపట్ట నిశ్చయించెను. సంయుక్తయు ననేకపర్యాయములు పృథివీరాజు పరాక్రమములను విని రూపము చూచి యున్నందువలన నాతని నే వరించెదనని మనంబున నిశ్చయించుకొని యెను. జయచంద్రుఁడు తనకూఁతునకుఁ దగినవరుఁడు దొరకవలయునని స్వయంవరము చేయనెంచెను. పుత్త్రికవివాహము నకుఁ బూర్వము రాజసూయము చేయ నిశ్చయించి సకలదిక్కుల రాజులకును వర్తమానము లంపెను. జయచంద్రుఁడు పరాక్రమవంతుఁ డగుట వలన నితరమాండలికరాజు లంద ఱాయన పిలిచినదినమునకు వచ్చి కనోజనగరము నలంకరించిరి. పృథివీరాజు మాత్రము జయచంద్రునితోఁ గల పూర్వవైరమువలన నా యుత్సవమునకు రాకుండెను. అందునకు జయచంద్రుఁడు మిగుల కోపించి యాతనితోఁ గలవైరమువలన, పృథివీరాజు ప్రతిమ నొకదానినిఁ జేయించి యాప్రతిమను ద్వారపాలకుని స్థలమునం దుంచి, తనపగ సాధించెను. యజ్ఞము విధిప్రకారము జరిగినపిదప స్వయంవరోత్సవ మారంభమయ్యెను. అప్పు డనేక దేశాధీశు లొకచోట నానందముగాఁ గూడినందున కనోజపట్టణము మిగుల నందముగాఁ గానిపించెను.

రాజాజ్ఞప్రకారము మంత్రులు మండపము నలంకరించి రాజుల నందఱిని వారి వారికిఁ దగుస్థానములఁ గూర్చుండఁబెట్టిరి. అటుపిమ్మట సంయుక్త చేతఁ బుష్పమాలను ధరియించి సఖీసహితయయి యామండపమునకు వచ్చెను. రాజకన్య సభకు రాఁగానే రాజపుత్రు లందఱి చూపులు నామెవైపునకే మరలెను. ప్రతి

భూపతియు నామెతనను వరియింపవలెనని కోరుచు[illegible] సంయు
క్త మిగుల గంభీరదృష్టితో రాజలోకమునంత నొక్కసారి కల
యఁ జూచెను. తన కిష్టుఁ డగుపృథివీరా జచటికి రాలేదనియు
ఆయనను బరిహసించుట కాయన ప్రతిమ నొకదానిని జేసి ద్వా
రమునం దుంచి రనియు నామె కంతకుఁ బూర్వమే తెలిసియుం
డెను. అందువలన నాబాల యొకగడియవఱకే యోచించి తుదకు
దృఢనిశ్చయురాలయి తిన్నఁగా నడిచి ఢిల్లీశ్వరప్రతిమను సమీ
పించి యామూర్తికంఠమునందుఁ బుష్పహారమును వేసెను. దా
ని గనినతోడనే సభయం దంతట నొకచేకల్లోల మయ్యెను.
జయచంద్రుఁ డిట్టియవమానమును సహింపఁజాలక కోపావేశ
పరవశుడై ''దుష్టురాలగు దీనిని గారాగృహమునం దుంచుఁ''
డని యాజ్ఞాపించెను. అంతె రాజు లందఱు నిరాశను బొంది త
మతమనగరములకుఁ జనిరి. ఇదియే యీదేశమున జరిగిన కడపటి
స్వయంవరము.

ఈసంగతి యంతయు విని పృథివీరాజు పరమానందభరితుఁ
డయ్యెను, జయచంద్రుఁడు తనను బఱచిన యవమానమును సం
యుక్త తనయందుఁ గనఁబఱచిన ప్రేమయు నేకీభవించి తన్నుఁ
దురపెట్టఁ బృథివీరాజు జయచంద్రునిపై యుద్ధయాత్ర వెడలెను.
ఇట్లాయన శూరులగు యోధులతోఁ గనోజపట్టణము సమీప
మున విడిసెను. అచట నున్న కాలముననే యొకరాత్రి మిగుల
రహస్యముగాఁ బృథివీరాజు సంయుక్తను గలిసి గాంధర్వవిధిచే
నామెను వరియించెను.

వీరివివాహవార్త యొకరిద్దఱు దాసీలకుఁ దప్ప నితరుల కెం
తమాత్రముఁ దెలియదు. పృథివీరాజు వచ్చి తనగ్రామముపై ల

విడియుట విని యాతనినిఁ బట్టి తెండని జయచంద్రుఁడు మూఁడు వేలసైన్యము నంపెను. కహారకంఠీరుఁ డనువాని ముందిడుకొని శత్రుసైన్యములు తమపైపునకు వచ్చుటఁ గని పృథివీరాజును వారితోఁ బోరుటకు సిద్ధముగా నుండెను. తదనంతర మారెండుసైన్యంబు లొండొంటిం దాఁకి మిగుల ఘోరంబుగాఁ బోరసాగెను. అందుఁ బృథివీరాజు సేనానియగు ఆతతాయియని జయచంద్రుని సైన్యాధిపతియగు కహారకంఠీరునకును ద్వంద్వయుద్ధంబు ప్రాప్తించెను. ఆశూరు లిరువురును సింహనాదములు చేయుచు నొండురులతో నెక్కుడు పంతంబులు పలుకుచు నొకరినొకరు నొప్పించుచుండిరి. అంతఁ గొంత సేపటికి భటుల యొక్కయు, గుఱ్ఱములయొక్కయు, ఏనుఁగులయొక్కయు, దేహములనిండ కారురక్తము ప్రవాహమయి పాఱఁదొడఁగెను. అట్టిసమయమున కహారకంఠీరుని రోషావేశ మధిక మయినందున నాతఁడు తనరథంబుడిగ్గి ఆతతాయిని తనఖడ్గమునకు బలియిచ్చి పృథివీరాజు కంఠముఁ దెగ వేయ నుంకించెను. కహారకంఠీరుని శౌర్యమున కోడి పృథివీరాజు బలంబులు చెదరి పాఱసాగెను. అట్టిసమయంబునం దాకస్మికముగా నొక శౌర్యనిధి యచటికివచ్చి పృథివీరాజు కంఠముపైఁ బడ నున్నఖడ్గమును దునియలుచేసి యాతనిఁ గాపాడెను. ఈపరాక్రమవంతుఁ డెవఁడో యొక రాజపుత్రుఁడని చదువరులు భ్రమపడవలదు. అట్లు తన సాహసమువలనఁ బృథివీరాజును గాపాడినది యాతనిపత్నియు జయచంద్రునికూఁతురు నగు సంయుక్తయే. ఆమె తనభర్తను గలసి యాతనితో వెళ్ళవలయునని బహుప్రయాసముతోఁ గారాగృహము వెడలి యతియోగ్యమైన సమయమున నాస్థలము

ప్రవేశించెను. తానెన్నఁడును సంగ్రామముఁ జూడనిదైనను ఆమె జంకక సమయసూచకత గలదియై తానును యుద్ధముచేసి తనభర్తప్రాణములఁ గాపాడెను.

సంయుక్తవచ్చినపిదప పృథివీరాజుబలములు మరల చేరుకొని జయచంద్రుని సేనల నోడించెను. తదనంతరము పృథివీరాజు భార్యాసహితుఁడయి ఢిల్లీనగరమున కరిగెను. ఈదంపతు లిరువురును గొంతకాలమువఱకు పరస్పరానురాగము కలవారయి ప్రజలను తమబిడ్డలవలెఁ బాలించుచుండిరి.

ఇచ్చట జయచంద్రుఁడు పృథివీరాజు తనసైన్యము నోడించి తనకూతుఁను గొనిపోవుటవలన సంతప్తహృదయుఁడయి పగ తీర్చుకొన సమయము వేచియుండెను. ఇట్లీ దేశపురాజులలో నన్యోన్యద్వేషములుకలిగినసమయమున 'శాహబుద్దీన్ మహమ్మద్ గోరీ' యనుమహామ్మదీయుఁడుహిందూదేశముపై దండువెడలెను. వాఁడిచటికి వచ్చి దేశమంతను మిగుల నాశము చేయసాగెను. అనేక దేవాలయములఁ బడఁగొట్టియు జనులనన్యాయముగాఁ జంపియు స్త్రీలపాతివ్రత్యములఁ జెఱచి వారిని తనదాసులను చేసికొనియు మహాక్రూరత్వమును జూపఁ దొడఁగెను. వానిపాదము సోఁకినచోటెల్లను నాశమొందుచుండెను. కాన నట్టివాని నోడించి పతివ్రతల పాతివ్రత్యమును, మతమందిరములను గాపాడనెంచి పృథివీరాజు గోరీని శిక్షింపవెడలెను. అప్పుడు జయచంద్రుఁ డొకఁడు దక్క నితరరాజులందఱు నాతనికిఁ దోడుపడిరి. కోపమే ప్రధానముగాఁ గల జయచంద్రుఁడు దేశక్షేమమును గోరి పృథివీరాజునకుఁ దోడుపడకున్నను దేశీయుల దురదృష్ట

మింకను ముదరనందున నప్పటికిమాత్రము గోరీకి సాహాయుఁడు గాకుండెను.

పృథివీరాజు మహాశౌర్యముతోఁ దిలావడీయను ఎడారి యందుఁ గోరీసైన్యముల పలుమాఱు నోడించెను. పృథివీరాజు పరాక్రమమున కోర్వఁజాలక తుదకుగోరీ బహుకష్టముతో పలాయితుఁ డయ్యెను. పృథ్వీరాజును విజయానందముతో నితర సామంతులతోఁ దననగరుఁ బ్రవేశించెను.

పృథివీరాజున కయినజయమువలన జయచంద్రున కధికవ్యసనము గలిగి యాతని మనం బెప్పుడును వృథివీరాజు చెఱుపునే కోరుచుండెను. అందువలన నాతఁ డట్టి నీచోపాయమువలననయి ననుఁ బృథివీరాజునకుఁ జెఱుపు జేయ నిశ్చయించెను. అందువలన నాతఁడు తనదూతనంపి పాఱిపోవుచున్న గోరీని మరల మన దేశమునకుఁ గొనివచ్చెను. ఇట్లురప్పించి యాకుత్సితుఁడు తానతనికిఁ దోడుపడుటయే గాక యితరరాజుల ననేకులను నీకుఁ దోడు తెత్తునని నమ్మికఁ దోఁపఁబలికి యాతనిని మరల పృథివీరాజుపైకి యుద్ధమునకుఁ బురికొల్పెను.

జయచంద్రుని సహాయమువడసి మిగుల ధైర్యముతో గోరీ మరల ఢిల్లీనగరముపై దండువెడలెను. జయచంద్రుఁడు తానన్నప్రకార మితరరాజుల ననేకులను దనవెంటఁదీసికొని యాతురుష్కునికిఁ దోడుపడెను. ఇట్లుచేసి పృథివీరాజుల కిఁక జయము దొరకదని యాదీర్ఘక్రోధి సంతసించుచుండెను. దుర్జనులు తమ కార్య మీడేరుటవలన, దేశమునకంతకును నష్టము కలుగునని తెలిసినను వెనుక దీయరుకదా?

కాలిందీనదీతీరమునందు జయచంద్రుఁడు తనసేనలతో దిగి యొకదినము తనశిబిరంబులోఁ గూర్చుండి రాజ్యోపస్థితిసిఁ దలఁచుకొని సంతోషించుచుండెను. ఇంతలో నొకసేవకుఁడు తమవైరిసైన్యములోనుండి యొకరాయబారి తమతో మాట లాడ వచ్చెననియుఁ దమసెలవయినయెడల నాతని నిటకుఁ దోడ్కొని వత్తుననియుఁ జెప్పెను. అందు కాతఁ డాపరిచారకుని తో నీ వావల నేయుండి యాతనిని నావద్దికిఁ బంపుమని చెప్పి తాను తనఖడ్గము చేతఁగొని కూర్చుండెను.

అంతఁ గొంతసేపఁటికి నొకతరుణుఁ డచటికివచ్చి జయ చంద్రునిపాదముల కెరగెను ఆవచ్చినయోధుఁడు పురుషుఁడు గాక మనకథానాయికయగు సంయుక్తయే. కాన జయచంద్రుఁ డు తనకొమార్తెను గుర్తించి నీ వేమికోరెదవని యడిగినతోడ నే యామె యిట్లనెను. "నాయనా! నేను తమయనుజ్ఞను బొంది మనదేశమునకు శత్రువగుగోరీని జంపఁగోరివచ్చితిని. ఈసమయ మునందుఁ బెద్దల యాశీర్వచనముఁబడసిచనిన తప్పక జయము కలుగును." జయచంద్రుఁడు కూఁతుమాటలు విని కొంతతడ వే మియుఁ దోఁచకుండి పిదప "నోసిస్వేచ్ఛాచారిణీ! ముందుజరుగఁ బోవు ప్రజాక్షేమమున కంతకును నీవేకదా మూలమయిన దానవు. పొమ్ము నీ విచటికి వచ్చి నాక్రోధమును హెచ్చిం చితివేగాని వేరులాభము లేదు" అని కోపముతో ననెను. అందు పై సంయుక్త మిగులవినయముతో "నో నాయనా ! మీరు జన్మభూమిపై ఇంచుక దృష్టిసారింపుఁడు. నిరాశ్రితులాంధ్రగు ననేకస్త్రీలమానమును గాపాడుఁడు. మనమెంతో భక్తితోఁ గొలుచు విగ్రహములు నాశమునకుఁ దోడుపడకుఁడు. మన

స్వాతంత్ర్యసుఖమును చెఱుపఁ బ్రయత్నించినయెడల పిదప విశే
షదుఃఖము కలుగును." అని విన్నవించుకొనెను. ఇంతలో జయ
చంద్రుఁడు రోషారుణలోచనుఁడయి "నోరుమూసుకొని వెళ్ళు,
నావద్ద నీవంటి దుష్టస్త్రీలు మాటలాడఁదగరు." అని ధిక్కరిం
చెను. "అటులైన నాప్రార్థన యంతయు వృథయైనా?"
యని యాకాంతాలలామ రౌద్రరూపము వహించి తండ్రి వంక
జూచి యిట్లనియె. "పూర్వులార్జించిన సత్కీర్తిని నాశము
చేసి మీదుష్కీర్తిని శాశ్వతపఱుచుటకుఁ బూర్వమే నీకుమా
ర్తైనయిన నన్నీ యపకీర్తి వినకుండ నేల చంపవైతివి? నీవు
నాతండ్రివిగాన నేనింతగాఁ జెప్పవచ్చితిని కాని నీ యభిప్రాయ
మెఱిఁగిన పిదప స్వదేశద్రోహికూఁతుఁ రనిపించుకొని బ్రతుకుట
కంటెఁ జావు మేలని తోఁచుచున్నది."

ఆఁడుసింగమువలె గర్జించి మాటాడుకూఁతున కేమియుఁ
జెప్పఁ జాలక జయచంద్రుఁడు మెల్లఁగా నావలకరిగి యశ్వము
నెక్కి యాతురకసైన్యములోని కేఁగెను. ఇచట సంయుక్త
తండ్రి లోపలకువచ్చునని కొంతసే పెదురుచూచి యాతఁడు
వచ్చుజాడగానక నిరాశతో మరలి నిజపతిచెంత కేఁగెను. ఈత
డవ తమవైపున నల్పసైన్యమును పగఱవైపున నమితసైన్యము
ను గలదుగాన తన కపజయమే యగునని పృథివీరాజెఱిఁగి యా
సంగతి సంయుక్తకుఁ దెలిపెను. ఆదంపతు లిరువురును ఇను
మంతయు ధైర్యము విడువక నొకరికొకరు తగునీతుల నుపదే
శించుచు నుత్సాహయుతులై యుండిరి. వారిరువురి యాలోచ
నప్రకారము యుక్తమనితోఁచఁగా నామెఢిల్లీకి బ్రయాణమ
య్యెను. గమనసమయమునం దామె గర్తకు నమస్కరించి

"ప్రాణేశ్వరా! తమరుక్షత్రియులుగాన మీశస్త్రాస్త్రములను కాపాడుకొని యుద్ధమునకు సిద్ధమగుఁడు, క్షత్రియులు తమదేశ ముయొక్కయు వంశముయొక్కయు ప్రతిష్ఠలకొఱకు ప్రాణము లను విడిచిన నది మృతియనంబడదు. మనుజుఁడు జన్మించినందు కు ఫలముగా సత్కృత్యములఁజేసి సత్కీర్తినిబొంది యమరుఁ డు కావలయును. తమకు జయము దొరకిన మరల మన మిరు వురును సుఖమనుభవింతుము. లేనిపక్షమున నేనును తమతో స్వర్గసుఖ మనుభవించుటకు శీఘ్రముగ నేవత్తును." అని ధీరోక్తు లు పలికెను. అందుకుఁ బృథివీరాజు తనభార్యను కౌఁగిలించు కొని "తీమణీ! నాదేహములోఁ బ్రాణము లుండునంతవఱకు నేను శత్రునకు వెన్నియ్యనని దృఢముగానమ్ముము. నాసైనికులు ను కీర్తికాములేగాన వా రెప్పుడును పరాజయముఁ బొంది మరల తమముఖము లితరులకుఁ జూప నిశ్చయింపరని నేను నమ్మెద" నని చెప్పెను. ఆవాక్యములు విని సంయుక్త "స్వా మీ! ఢిల్లిలోని స్త్రీలు తమ్ముఁ దాము రక్షించుకొనుటకు నస మర్థురాండ్రుగాన నే నిపు డచటికి కరిగి వారి కందఱకును ధైర్య ము చెప్పెదను. నే నిచటనే యుండిన నాకాంత లేమియుఁదోఁచక యుండెదరు. ఏది యెట్లయినను మిమ్మును గెలిచి యామ్లేచ్ఛుఁడు ఢిల్లికిఁ వచ్చినా వానికి రాజపూత స్త్రీ యొకతయయిన జీవము తో దొరకనేరదు." అని యామె ఢిల్లీకిఁ బోయెను. అచట నామె మిగుల నియమముతోఁ బరమేశ్వరుని తనభర్తకు విజయ ము నిమ్మని ప్రార్థన సేయుచుండెను. ఆమెయుపదేశము విని యానగరమునందలి యువతులందఱామెవలెనే ఢిల్లీశ్వరునకు

విజయము కలుగవలయునని పరమేశ్వరు నసేకవిధముల వేడు కొనుచుండిరి.

తుద కొకదినమున నాసైన్యములు రెండును నొండొంటిఁ దాఁక నాయుభయ సైన్యములలోని వీరులును దమతమ సంగ్రామకౌశలములు మీఱ ఘోరంబుగాఁ బోరఁ దొడంగిరి. వా రట్లు పోరుటచే నాకాశమంతయు ధూళిగ్రమ్మి సూర్యుని మఱుఁగు పఱిచెను. అంతఁ గొంతవడికి నాధూళి యడఁగి రక్తనదులుఁ బాఱఁజొచ్చెను. పీనుఁగులవెంట లనేకములు పడెను. ఇట్టి రణరంగమునందు పృథివీరాజునకు నపజయము కలిగెను. కాని యాతని సైనికులలోఁ శత్రునకుశరణు చొచ్చినవాఁడేని యుద్ధభూమినుండి పాఱిపోయినవాఁడేని కానరాకుండెను. పృథివీరాజుకుగూడ నాయుద్ధమునందే మడిసెనని కొందఱు చెప్పుదరు. గోరీవిజయుఁడయి పృథివీరాజును చెఱఁబట్టి గ్రుడ్లు తీసివేసి యాతనిపాదములకు మిక్కిలి బరువు లయినలోహపుబేడీలను వేసి కారాగృహమునందుంచెననియు, నీసంగతి యంతయు విని పృథివీరాజుమంత్రియు, నతనిచరిత్ర లేఖకుఁడను, మహాకవి యునగు చాందభట్టు గోరీయాస్థానమున కరిగికొన్నిదినము లచటనుండి యాతనికృపకుఁ బాత్రుఁడై పృథివీరాజును చూచుట కనుజ్ఞవడసెననియు, అట్లు సెలవంది కారాగృహమున కరిగిపృథివీరాజును పలుకరింపఁగా నాతఁడు కన్నులు లేకున్నను మాటను గుర్తించి యాభట్టును కౌగిలించుకొనెననియు, అచట వారిరువురు నొకయుక్తివలన నాతురష్కునిఁ జంప నిశ్చయించుకొనిరనియు, అందుపై చాందుభట్టు గోరీయొద్దికివెళ్లి ప్రసంగరీత్యా పృథివీరాజుయొక్క బాణనైపుణ్యమును వర్ణించుచు నాతఁ డిపు

డు కన్నులు లేకున్నను శబ్దమునుజూడపట్టి సూటిగా బాణము వేయు వని చెప్పఁగా గోరీ యావిచిత్రమును గనుటకై యొకసభ చేసి యాసభకు పృథివీరాజును బిలిపించియతనికి నతనివిల్లు బాణము లిచ్చి చమత్కారమే మయినఁ జూపుమని యజ్ఞాపించెననియు, అమాటసూటినిబట్టి బృథివీరాజాతనిపై బాణమువేయ నాతఁడు (గోరి) మృతినొందెననియు, తదనంతరము చాందుభట్టు పృథివీరాజు లిరువురును దురకలచేఁ బడక యాసభయందే యొకరినొకరు పొడుచుకొని. జీవములను విడిచిరనియు మఱికొందఱు చెప్పెదరు. పైనిజెప్పఁబడిన శరసంధానమహోత్సవ మంతయు మనదేశముననే జరిగినదని యొకరును, తురకదేశమున జరిగెనని యింకొకరును వక్కాణించెదరు. వీనిలో నేదినిజమో మనము చెప్పఁజాలము.

గోరీకి జయముకలిగి వాఁడు ఢిల్లీకి వచ్చుచున్న వాఁ డనిన వార్త వినఁగా పట్టణములోని స్త్రీలందఱితో సంయుక్త యగ్ని ప్రవేశము చేసెను. గోరీ ఢిల్లీకివచ్చి చూచు నప్పటికి గ్రామమంతట భస్మరాసు లవిచ్ఛిన్నముగాఁ గానవచ్చుచుండెను.



